# నేటి హైదరాబాదు-
# మన కర్తవ్యం



బద్దం యల్లా రెడ్డి
దేవులపల్లి వెంకటేశ్వరరావు



ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ

ప్రచురణ నెం. 84 అక్టోబరు 1944



# విషయ సూచిక



వె. 1/12-

# పరిచయం

హైదరాబాదు సంస్థానంలో ఆహారపరిస్థితి నానాటికి క్లిష్టతర మవుతూ ఉంది. దీన్ని పరిష్కరించడానికి నిలవ వ్యాపారస్థులనుండి ధాన్యాన్ని బయటికితీయాలి; రైతులవద్దనుండి ధాన్యాన్ని సక్రమపద్ధతులపై సేకరించాలి; రైతులను ప్రోత్సహించి వారితో అధికాహారోత్పత్తిని సాగించాలి; పట్టణాలలో రేషనింగుపెట్టాలి. ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న ప్రజా మంత్రివర్గమే, పై కార్యక్రమాన్ని చక్కగాసాగించి ప్రజలను రక్షించగలుగుతుంది. హిందూముస్లిము ఐక్యతను సాధించితేనే పై ప్రజామంత్రివర్గం లభ్యమవుతుంది.

హైదరాబాదు సంస్థానప్రజలను ప్రస్తుత క్లిష్టపరిస్థితులనుండి కాపాడి ప్రజా స్వామ్యంవైపుకు ముందుకు గొంపోవడానికి, ప్రజా మంత్రివర్గం ఎలా అవుసరమో, దాన్ని సాధించడానికి హిందూముస్లిం ఐక్యతను బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించడం ఎలా అవుసరమో, తెలియజేయడమే ఈ పుస్తకంయొక్క ప్రధానోద్దేశం. ప్రజా మంత్రివర్గాన్ని గూర్చి 7వ అధ్యాయంలో వివరించబడింది. దానితోపాటు జాతీయవాదులు, ఆర్యసమాజీయులు, హిందూమహాసభవారు, ఇత్తెహాదుల్ ముసిల్మీనువారి యొక్క రాజకీయ నినాదాలనుగూర్చి గూడ వివరించబడింది.

హైదరాబాదుసంస్థానంలో హిందూముస్లిము కలహాలు సంస్థానంయొక్క అభివృద్ధికి ప్రధాన ఆటంకం. హిందూముస్లిము ఐక్యతకు మార్గం తెలుసుకోవాలంటే, అసలు ఈకలహాలు ఎలా వచ్చాయో, ఎలా విజృంభించాయో తెలుసుకోవాలి. అందుచే 2, 3, 4, 6 అధ్యాయాలలో హైదరాబాదు సంస్థానంలోని రాజకీయ ఉద్యమాల చరిత్ర క్లుప్తంగా వ్రాయబడింది.

5 వ అధ్యాయంలో ప్రభుత్వం ప్రకటించిన రాజకీయసంస్కరణల స్కీముగూర్చి వివరించబడింది. ప్రభుత్వం పై రాజ్యాంగసంస్కరణల స్కీముకు క్రమక్రమంగా అమలుజరుపుతోంది. అందుచే రాజ్యాంగ సంస్కరణలస్కీము ఎలా ప్రస్తుత పరిస్థితులలో పనికిరాదో చూపడానికి, ఆ స్కీముగూర్చి వివరంగా వ్రాయబడింది.

హైదరాబాదు సంస్థానంయొక్క ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను గూర్చి 1 వ అధ్యాయంలో క్లుప్తంగా వ్రాయబడింది. ఇది హైదరాబాదు పరిస్థితులు తెలియనివారు పుస్తకాన్ని అవగాహన చేసుకోడానికి ఉపకరిస్తుంది. హైదరాబాదు సంస్థానంలోని 70 లక్షల ఆంధ్రులను గూర్చి, బ్రిటిషుఇండియాలోని ఆంధ్రసోదరులకు తెలపడంకోసం ఇక్కడ సామాన్యంగా వాడబడే ఉర్దూపదాలకు ప్రక్కనే తెలుగుపదాలుగూడ వ్రాయబడినవి. చదువరులకు సులభంగా ఉండుటకు, హైదరాబాదుసంస్థాన పటాలు రెండు వేయబడినవి. మొదటిదానిలో జిల్లాలు, తాలూకాలు, ముఖ్యపట్టణాలు, చూపించబడినవి. రెండవదానిలో ఖాల్సా, సర్ఫెఖాస్, పాయెగా, జాగీరుప్రాంతాలు ప్రత్యేకంగా చూపబడినవి. ఈ పటంలోనే సంస్థానంలోని ఆంధ్ర, మహారాష్ట్ర, కన్నడ ప్రాంతాలుగూడ అందాజాగా చూపబడినవి.

సరియైన సమయంలో మహారాష్ట్ర, కర్ణాటకపరిషత్తులకు సంబంధించిన విషయాలు సేకరించలేకపోవుటచే, వాటినిగూర్చి రాజకీయచరిత్రలో ఇమిడ్చి వ్రాయలేకపోయినందుకు చదువరులు మమ్ములను మన్నింతురని ఆశిస్తున్నాం. పై రెండుసంస్థల క్లుప్తచరిత్రలు పుస్తకం చివరిభాగంలో అనుబంధాలుగా ముద్రించబడినవి. వివిధ వ్యక్తులయొక్క లేక ఆ ప్రజా సంస్థలయొక్క ఉద్దేశాలను సరిగా వ్రాయలేదనే విమర్శనకు తావులేకుండా చేయడానికి, ఉపన్యాసాలు తీర్మానాలలోని భాగాలను సాధ్యమైనంత దీర్ఘంగా ఎత్తి వ్రాయబడినవి. ఇందుకు చదువరులు మమ్ములను మన్నింతురుగాక!

ఈపుస్తకంలో వివిధ ప్రజాసంస్థలు వ్యక్తులయొక్క అభిప్రాయాలనుగూర్చి విమర్శించడం జరిగింది. ఈ విమర్శన పూర్తియైన రాజకీయ దృష్టిలోనే జరిగింది. కనుక ఆయాసంస్థలకు సంబంధించనివారందరూ, మేము మీ ముందుపెట్టిన పాలసీ, కార్యక్రమము మన సంస్థానప్రజల కష్టాలను తొలగించడానికి తోడ్పడుతుందా లేదా అనే దృష్టితోనే ఈ పుస్తకాన్ని చదువుతారని ఆశిస్తున్నాము.

ఇట్లు,
గ్రంథకర్తలు.

# 1. హైదరాబాదు సంస్థాన ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితి

హైదరాబాదు సంస్థానం అన్ని స్వదేశసంస్థానాలలోనూ, వైశాల్యం జనసంఖ్య ఆదాయం మొదలైన విషయాలలో పెద్దది. వైశాల్యం 82,698 చదరపుమైళ్లు. జనసంఖ్య 1931 లెక్కలనాటికి 1,44,36,148. సంస్థానాన్ని భాషల ప్రకారం మూడు ప్రాంతాలుగా విభజించవచ్చు. ఆంధ్రభాష మాట్లాడే తెలింగానా, మహారాష్ట్రభాషమాట్లాడే మరాఠీవాడా, కన్నడభాష మాట్లాడే ప్రాంతము. షుమారుగాచూస్తే ఇప్పుడు ఉన్న 17 జిల్లాలలో, తెలింగానాలో 9 జిల్లాలువస్తాయి; వరంగల్లు, నల్లగొండ, కరీమునగరం, అతరాఫ్‌బల్దా, ఆదిలాబాదు, నిజామాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, జాగాతు (ఒకే తాలూకా). మహారాష్ట్ర ప్రాంతంలో ఔరంగాబాద్, పర్భనీ, నాందేడ్, భీడ్, ఉస్మానాబాదు, బివరులో సగం. కర్ణాటక ప్రాంతంలో బివరులో సగం, గుల్బర్గా, రాయచూరు.

| | | |
|---|---|---|
| తెలుగు | మాట్లాడేవారు | 69,72,534 |
| మహారాష్ట్రం | ,, | 37,86,838 |
| కన్నడం | ,, | 16,20,094 |
| ఉర్దూ | ,, | 15,07,272 |

మిగతా 6 లక్షల మంది కోయ, గోడు, చెంచు, మొదలైన అటవీ భాష మాట్లాడేవారు.

మతంప్రకారం జనాభాను షుమారుగా ఈక్రిందివిధంగా విభజించవచ్చు.

| | |
|---|---|
| హిందువులు | 1,22,00,000 |
| ముస్లిములు | 15,34,666 |
| క్రిస్టియనులు | 1,51,382 |
| సిక్కులు | 5,178 |
| అటవిజాతులు | 5,44,789 |

## భూమిశిస్తు విధానం

భూమిశిస్తు విధానం ప్రకారం సంస్థానాన్ని ముఖ్యం రెండు భాగాలుగా విభజింపవచ్చును. దివాని లేక ఖాల్సా భూములు, జాగీర్లు పాయాగా వగైరా భూములు. మొత్తం సంస్థాన వైశాల్యంలో 100 కి 58½ ఖాల్సా భూములు 41½ ఇతర భూములు ఉంటాయి. సంస్థానంలో ఉన్న మొత్తం 22,500 గ్రామాలలో, 16500 ఖాల్సాగ్రామాలు. మిగతా 6000 ఇతర గ్రామాలు.

ఖాల్సాభూములలో ఇతర పరిపాలనతోబాటు శిస్తు వసూలుగూడ సంస్థాన ప్రభుత్వోద్యోగులే నేరుగా చేస్తారు.

## మిగతా భూములు

వీనిలో శిస్తువసూలు ప్రభుత్వోద్యోగులు నేరుగా శిస్తు వసూలు చేయరు. జాగీరుదార్లు, పాయగాదార్లు, మక్తేదార్లు మొదలైన వారికిౘంద రెవెన్యూ ఉద్యోగులు శిస్తువసూలు చేస్తారు. సాంప్రదాయసిద్ధంగా వస్తున్న పరిస్థితులనుబట్టి పైవారిలో కొందరు, సంస్థాన ప్రభుత్వానికి పన్ను చెల్లిస్తారు: కొందరు చెల్లించరు. ఈ భూములలో అనేక భేదాలున్నవి. క్రిందవానిని వివరించుతాను.

## సర్ఫెఖాసు

ఇది ప్రభువుగారి సొంతఖర్చులకై ప్రత్యేకించబడిన భాగము. పూర్వం ప్రభువుల ఖర్చులు సంస్థాన ఖజానాలో నుండే తీసుకోబడుతుండేది. కాని నబాబునాసిరుద్దౌలా బహద్దురుగారి కాలంలో ఈ పద్ధతి ప్రవేశపెట్టబడింది.

దీనిలో సంస్థాన మంతటా మొత్తం 8014 చ. మైళ్ళ వైశాల్యంగల 18 తాలూకాలు ఉన్నవి. అందులో 7 తాలూకాలుగల అత్రాఫ్‌బల్దా జిల్లా సంస్థాన ప్రభుత్వంతో సంబంధంలేకుండా, నేరుగా ప్రభువుగారిక్రింద సర్ఫెఖాసు ఇలాకా తాలూకాదారుచేత పరిపాలింపబడును. సర్ఫెఖాస్ సమస్యలన్నీ ప్రభువుగారిచే నియమింపబడిన ఒక కమిటీచే పరిష్కరింపబడును. మిగతా 11 తాలూకాలు ఆయా జిల్లాల ప్రభుత్వ మాల్గుజారీశాఖ (రెవెన్యూ శాఖ) ద్వారా పరిపాలింపబడి, ఖర్చులుపోను మిగతాసొమ్ము సర్ఫెఖాసు ఇలాకాకు జమకట్టబడుతుంది. దివానీ ఇలాకాలోవలెనే మాల్గుజారీ, అదా

లతు (న్యాయ) శాఖలున్నవి: సర్ఫెఖాసు మీద వచ్చే ఆదాయంకాక ప్రభుత్వ ఖజానానుండి. సాలీనా 50 లక్షల రూపాయలు ప్రభువుగారికి ఇవ్వబడును.

పాయెగాలు, చిన్న సంస్థానాలు, జాగీరులు మక్తాలు మొత్తం సంస్థానంలో 1167 ఉన్నవి. వీనిలో పరిస్థితులు చాల అధ్వాన్నంగా ఉంటాయి. గొల్లలమీద, మాలమాదుగులమీద, పెండ్లిండ్లమీద, బజార్ల మీద, సాలీలమీద అనేక అక్రిమమైన పన్నులు ఇంకనూ వసూలుచేయ బడుతున్నాయి. ప్రభుత్వం చేసిన చట్టాలు చాల జాగీర్లలో అమలుజరు గుటలేదు. జాగీర్లు పాయెగా మక్తాల ప్రజలస్థితి యెలావుంటుందో, ఈ పోలికలతో తెలుసుకోవచ్చును. బ్రిటిషు ఇండియాకు, స్వదేశ సంస్థానా లకు యెంత తేడావుంటుందో, ఖాల్సాలకు జాగీర్లు పాయెగా వగైరాలకు మధ్య అంత తేడావుంటుంది. ఇంతేగాక వీనిలో కొన్నింటిలో యింకా అగ్రిహారాలు ఈనాము మక్తా గ్రామాలు ఉంటాయి. వీనిలోని ప్రజల స్థితి చెప్పనే అవుసరంలేదు.

కొన్ని జాగీర్లు పాయెగాలకు కోర్టులు, పోలీసు సబుజై ళ్ళుగూడ ఉన్నవి. నిర్బంధవిధానానికి సంబంధించిన పై అంగాలుగూడ జాగీరు దార్లకుంటే, ఇంక ప్రజలస్థితి యెలావుంటుందో చెప్పడానికి వీలులేదు. ఇటువంటి జాగీర్లు పాయెగాలు మొత్తం వైశాల్యం 12000 చదరపుమైళ్లు. వీనిలో 23 లక్షలమంది జనాభావున్నారు.

## పాయెగాలు

పూర్వము నిజాం ప్రభుత్వమునకు యుద్ధములందు సహాయము చేయుటకై కొంత సైన్యమును ఎల్లప్పుడును సిద్ధముగానుంచుటకు కొంద రేర్పాటుచేయబడిరి. అట్టి ప్రతివాడును ఆ సైన్యమునకు బత్తెము, జీతం, బట్టలు, ఆయుధములు, మున్నగునవి తానే భరించుకొనవలెను ఈ కార్య నిర్వహణమునకై వారికి కొన్ని జాగీరులిచ్చిరి. అట్టి జాగీర్లనే పాయెగా లందురు. మన రాష్ట్రములోని పాయెగాలే సంస్థానములన్నిటిలో పెద్దవి. ఆ పాయెగాల వివరములు ప్రత్యేకముగా ముందు వ్రాయబడును. ఈ పాయెగాలు నవాబులకే యియ్యబడినవి. హిందువులకు యియ్యబడలేదు. విశేషముగా ప్రభు బంధువర్గమువారికే యియ్యబడి యిప్పటికటులే జరు గుచు వచ్చుచున్నవి.

## జాగీర్లు

పూర్వము ప్రభుభక్తి చూపినందున, లేక గొప్ప ఉద్యోగములుచేసినందున, లేక యుద్ధములో ప్రాణాలిచ్చినందున, లేక మత విషయములో గురువులైనందున, హిందూరాజులును, తర్వాత ముసల్మాను ప్రభువులును అనేకులకు జాగీరుల నిచ్చియుండిరి. అట్టివానిలో పెద్ద పెద్ద జాగీరులను సంస్థానములనియు, చిన్నవాటిని జాగీరులని చెప్పుదురు.

జాగీరులవంటివే ప్రభువులచేత యియ్యపడిన ఇనాములలో అనేక దర్జాలు కలవు. మక్తాలు, ఇనాములు, మున్నగువాని భేదములనుగురించి ముందు తెలుపుదుము.

## మక్తాలు, బంజర్లు

అడవిప్రాంతంలో భూమిని బాగుచేయించి, గ్రామాలు కట్టించి, భూమిని సాగులోనికి తెచ్చినందుకు ఆ గ్రామాలు ప్రభుత్వంచే వారికి ఇవ్వబడినవి. వీనినే మక్తాలందురు. వీనిలో అనేక భేదములున్నవి.

## అగ్రహారం

హిందూరాజులు జాగీరుదార్లు తమ గురువులైన బ్రాహ్మణులకు యిచ్చిన గ్రామాలనే అగ్రహారాలు అందురు.

## మాషదార్లు

వీరినే దేశపాండ్య దేశముఖులందురు. ఇప్పుడు జీతాలుయిచ్చిన ఉద్యోగులద్వారా పన్ను వసూలు చేయబడుతుంది. పూర్వం దేశపాండ్యలు దేశముఖులు పన్ను వసూలుజేసి, అందులో కొంతభాగాన్ని ప్రభుత్వానికిచ్చేవారు. మొదటి సాలారుజంగు గారి కాలంలో ఈపద్ధతి రద్దుచేయబడి, ప్రస్తుత పద్ధతి ప్రవేశపెట్టబడింది. పన్నులో 100 కి కొంత వేరుజేసి, దానిలోనుండి వారివారి హోదాలననుసరించి డబ్బు యియ్యబడుతోంది. వీనినే రుసుములు అంటారు. దేశముఖులలో చాలమంది బీదలుగూడ ఉన్నారు. వీరు రైతులవలె జీవితం సాగిస్తూ, రైతుల కష్టాలు వీరుగూడ పడుతున్నారు. దేశముఖ దేశపాండ్యాలలో కొందరు వేల యకరాల సొంతభూమి కలవారుగూడ ఉన్నారు. వారు పన్ను వసూలుజేసేరోజుల్లో సారవంతమైన భూమిని అనేక "మాయోపాయాలు, దౌర్జన్యాల"ద్వారా ఆక్రమించుకున్నారు. పన్ను వసూలుచేసే హక్కుపోయినా, గ్రామాల్లో

ఇటువంటి పెద్ద దేశముఖుల పెత్తనం చాలచోట్ల అలాగేవుంది. ఇప్పుడు వీరితోపాటు కొంతమంది వతన్‌దార్లుగూడ చాల భూములు సంపాదించి యిట్టి దోపిడీపద్ధతులను అవలంబించుతున్నారు. వీరంతా గ్రామ ప్రజలను అనేకవిధాల పీడించుకతింటారు. వీరి సొంత భూములు రైతులకు కౌలుకిచ్చి, అనేక విధాల దోపిడిని సాగిస్తూవుంటారు. వీరు ప్రస్తుతం గ్రామాలలో అభివృద్ధికి పెద్ద ఆటంకం.

## పంటలు - వ్యవసాయ పరిస్థితులు

నైజాం సంస్థానంలో ముఖ్యమైన పంటలు జొన్న, సజ్జ, గోధుమ, వరి, వేరుశనగ, ప్రత్తి. మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతములలో తెలింగానావలె అంత హెచ్చుగా వరి పంట పండదు తెలింగానాలోకంటె జొన్న యెక్కువగా పండుతుంది. అక్కడ ప్రత్తి యెక్కువగా పండిస్తారు. మహారాష్ట్ర ప్రాంతంలో గోధుమలుగూడ పండిస్తారు.

హైదరాబాదు సంస్థానంలో అనేక నీటివనరులున్నవి. తెలింగానాలో నిజాం సాగర్ పాలేరువైరా లాంటి ప్రాజెక్టులను కొన్నింటిని కట్టించింది. రైతులు చాల బీదవారగుటచేతనూ, ధనికరైతులకు వేలయకరాలు ఉండుట చేతను, భూమిని సరిగా మరమ్మతుచేసి, తగిన ఫలసాయం తీయలేకుండా ఉన్నారు. రైతుల బీదతనంవల్ల అజ్ఞానంవల్ల, నూతన వ్యవసాయపద్ధతులను అవలంబించలేకుండా ఉన్నారు. నైజాములో ఎంతో వేరుశనగపిండి, ఆముదపుపిండి తయారుచేయబడుతున్నా, అది బ్రిటిషు ఇండియాకు ఎగుమతి చేయబడుతోంది అక్కడ రైతులకు ఈ పిండినికొని భూమిని బలపరచే శక్తిగాని, ఈ ఎరువులను వాడాలనిగాని చాలమందికి తెలియదు. డెల్టా ప్రాంతాలలోవలె అక్కడ రైతులు మంచిబలమైన ఎడ్లను ఉపయోగించే స్థితిలో లేరు. చిన్నఎడ్లతో, చిన్నమోటతో వరిభూమిని సాగుచేయడం చాల ఎక్కువగా ఉంది. మంచి మోటనూతులను కట్టించుకునే శక్తిగూడ రైతులకు లేదు ఆధునికపద్ధతైన బకెట్లమోట యెచ్చటైనా కనపడదు. భూమి మెరకపల్లాలుగా ఉండుటవలన, వర్షానికి సారవంతమైన పైపొరమట్టి కొట్టుకుపోయి, భూమి నానాటికి సారవిహీనమవుతోంది. భూమిని చదునుచేయించే శక్తి రైతులకు లేదు. రైతులయొక్క దుర్భర దారిద్ర్యానికి కారణం ఏమిటి?

మొదటిది : జాగీరుదార్లు, మక్తాదార్లు, అగ్రహారందార్లు వగైరా. వీరిక్రింద సంస్థానంలో 100 కి 40 వంతుల భూమి ఉంది. వీరి అక్రమ పన్నులు నిర్బంధవిధానంక్రింద రైతు కృంగిపోతున్నాడు.

రెండవది : ప్రభుత్వ ఉద్యోగులలో ఉన్న లంచగొండితనం.

మూడవది : వడ్డీవ్యాపారం. ఇది చాలాదారుణంగా ఉంది. జాగీరుదార్ల అక్రమపన్నులు, లంచగొండితనంవల్ల పోగామిగిలిన ఆదాయమంతా వడ్డీవ్యాపారస్తుడు కాజేస్తాడు. కళ్ళంలోని పంట ముందుగా వడ్డీ వ్యాపారస్తుని ఇంటికి తోలుతాడు. అక్కడనుండి అప్పు తీసుకొని, శిస్తులు వగైరాలు కడతాడు. అక్కడనుండి మళ్ళా పంటవచ్చేవరకూ నాగుకు గింజలు తీసుకొంటాడు. పంటనుండి పంటవచ్చేవరకూ షుమారు 6 నెలల కాలానికి, బస్తాకు తూమెడు నాగు ఇయ్యాలి. ఈ దుర్భర వడ్డీ చెల్లించలేక కొంతకాలానికి తనభూమిని వడ్డీవ్యాపారస్తునికి ఇచ్చివేసి, దేశం వదలిపెట్టి మరొకచోటుకు బ్రతుకుదెరువుకు పోవడమో, ఆ భూమి కౌలుకు తీసుకొనడమో జరుగుతుంది. కౌలుదార్లస్థితి మరీదుర్భరం. ఈ విధంగా రైతు పూర్తిగా వడ్డీవ్యాపారస్తునికి పూర్తిగా బానిస అయి ఉండాలిసివస్తోంది. క్రమక్రమంగా భూమిదున్నే రైతుల చేతుల్లోనుండి, పనిచేయని వడ్డీవ్యాపారుల చేతుల్లోకి పోతోంది. అప్పుడే చాలవరకు పోయిందిగూడా.

నాల్గవది : హెచ్చుశిస్తు. ఖాల్సాప్రాంతంలో సైతం తరీ (మాగాని) భూమికి యకరానికి రు 23 వరకూ గూడ పన్ను ఉంది. ఖుష్కీ (మెట్ట) భూమికి గూడ పన్నులు చాల హెచ్చుగా ఉన్నవి.

ఐదవది : విజ్ఞాం లేకపోవడం. బీదతనమే దీనికికారణం. విజ్ఞానం లేకపోవడంవల్ల గూడనూతన పద్ధతులు అవలంబించలేక పోతున్నాడు. తనకు భుక్తికేలేనప్పుడు రైతు తన పిల్లలకు చదువు ఎక్కడ చెప్పించగలడు.

విద్యవిషయంలో హైదరాబాదు సంస్థానం మిగతా చాల సంస్థానాలకన్న బ్రిటిషు ఇండియాకన్న చాల వెనుకబడిఉంది. ప్రభుత్వం అత్యధిక సంఖ్యాకుల మాతృభాషలలో విద్యగరపకుండ, చిన్న తరగతులనుండీగూడ ఉర్దూభాషలో విద్యగరపడం, మాతృభాషలకు ప్రోత్సాహ మియ్యకపోవడంవల్లగూడ విద్యావిధానానికి దెబ్బతగులుతోంది.

చదువు వచ్చినవారిసంఖ్య :

| | పురుషులు 100 కి | స్త్రీలు 100 కి |
|---|---|---|
| కొచ్చిన్ | 46.0 | 22.0 |
| తిరువాన్కూరు | 40 8 | 16.8 |
| బరోడా | 33 1 | 7.9 |
| మైసూరు | 17.4 | 3.3 |
| హైదరాబాదు | 8 5 | 1.2 |
| కాష్మీరు | 7.0 | 0.6 |

బీదతనంవల్ల రైతు వ్యవసాయంలో నూతన పద్ధతులను ప్రవేశ పెట్టి, ఎక్కువ అర్జించి, తన జీవితపరిమాణాన్ని పెంచుకోలేకుండా ఉన్నాడు. అంతేగాక నానాటికి తగ్గిపోతోంది కూడా. అందుచేత జబ్బులకు అంటు జాడ్యాలకు బలిఅయిపోవడం జరుగుతోంది. రైతు బీదతనం పోయి పంటలు ఎక్కువ పండాలంటే, జాగీరుదార్ల అక్రమ శిస్తులను నిర్బంధ విధానాన్ని రూపుమాపాలి; శిస్తు తగ్గించాలి; వడ్డీ వ్యాపారాన్ని హద్దులో ఉంచాలి. ప్రభుత్వమే కోఆపరేటివు క్రెడిట్ సొసైటీలద్వారా అప్పులు ఇప్పించాలి; లంచగొండితనాన్ని రూపుమాపాలి; అందుకు ప్రజా విశ్వాసం గల మంత్రివర్గాన్ని నియమించాలి. ప్రభుత్వ యంత్రంలో పెద్ద మార్పు తీసుకురావాలి; విద్యావిధానాన్ని అభివృద్ధిచేసి, నిరక్షరాస్యతను రూపుమాపాలి:

## పరిశ్రమలు, కార్మికులు

హైదరాబాదు సంస్థానంలో పరిశ్రమలు క్రమక్రమంగా అభివృద్ధి అవుతూన్నవి. వరంగల్లు జిల్లాలో కొత్తగూడెంలో యూరోపియనుల బొగ్గుగనులున్నవి. అక్కడ సుమారు 10000 మంది కార్మికులు పని చేస్తున్నారు. పెదపల్లిలోగూడ బొగ్గుగనులున్నవి.

వరంగల్లు నాందేడు, గుల్బర్గా, ఔరంగాబాదు, సికింద్రాబాదులలో బట్టలమిల్లులున్నవి. షుమారు మొత్తం 14000 మంది కార్మికులు వానిలో పనిచేస్తున్నారు.

నిజామాబాదులో పంచదార ఫ్యాక్టరీ ఉంది. ఆదిలాబాదు జిల్లా సిరిపూరులో కాగితపు ఫ్యాక్టరీ ఉంది.

రైల్వేలో షుమారు 20000 మంది కార్మికులు ఉన్నారు. సికిందారాబాదులో లాలాగూడెంలో 4000 కార్మికులుగల ఒక పెద్ద వర్కుషాపుఉంది.

పరిశ్రమలు అభివృద్ధి అవుతున్నాయిగాని, కార్మికులస్థితి చాల హీనంగావుంది. కార్మికసంఘాలను చట్టరీత్యా గుర్తించడానికి, ట్రేడు యూనియన్ ఆక్టు చేయబడలేదు. కార్మికసంఘాలు పెట్టుకోవడమే చాల కష్టంగావుంది. కార్మికసంఘాలు లేకపోవడంవలన, పేమెంటు ఆఫ్ వేజెస్ ఆక్టు, మెటర్నిటీ బెనిఫిట్ ఆక్టులనుగూడ కార్మికులు ఉపయోగించుకోలేకుండా ఉన్నారు. కార్మికులు సగం బానిసలుగా ఉన్నారు.

## రాజకీయ పరిస్థితులు

పరిపాలన సాగించడానికి బాబే హుకూమత్ ఉంది. ఇది ప్రభువు గారిచే నియమింపబడి, ఆయనకు బాధ్యతవహించి ఉంటుంది.

దీనికి సలహా యివ్వడానికి 22 మందిగల ఒక నామమాత్రమైన శాసనసభవుంది. దీనిలో యెన్నుకోబడిన సభ్యులు 4 గురు మాత్రమే. మిగతావారు నామినేటు చేయబడిన ప్రభుత్వోద్యోగులు, యితరులు, యెన్నుకోబడిన సభ్యులలో యిద్దరు వకీళ్ళచేత. యిద్దరు జాగీరుదార్ల చేత యెన్నుకోబడతారు. ప్రజాసామాన్యానికి రైతులు కూలీలు కార్మికులు ఇతర కష్టజీవులకు అసలే ప్రాతినిధ్యంలేదు. ఈ శాసనసభకు చాల స్వల్ప హక్కులు మాత్రమేవున్నవి. ముఖ్యమైన విషయాలలో చర్చించే హక్కు గూడ లేదు. ప్రభుత్వం అనుమతిబొందిన బిల్లులనే చర్చించాలి.

జిల్లాబోర్డులు, మున్సిపలు కమిటీలు, తాలూకాబోర్డులు ఉన్నవి. గ్రామ పంచాయితీలు లేవు. ఈ స్థానిక సంస్థలలో అందరూ ప్రభుత్వం చేత నామినేటుచేయబడిన ఉద్యోగులు యితరులే. వీటికి రెవెన్యూ ఉద్యోగులే అధ్యక్షులుగా ఉంటారు.

## పౌరసత్వ హక్కులు

ప్రభుత్వం అనుమతిలేనిదే యే రాజకీయ సభలు, మీటింగులు పెట్టడానికి వీలులేదు. మత సంబంధమైన, సాంఘిక సంబంధమైన సభలు ప్రభుత్వానికి తెలియపరచి పెట్టుకోవచ్చును. కాని చాలచోట్ల రాజకీయసభలనే నెపంతో ఇవిగూడ ఆపబడుతూ ఉన్నవి.

పత్రికలనుగూర్చి రెగ్యులేషన్లు చాల కఠినంగావున్నవి. ప్రభుత్వం తన మీద యేమాత్రమైన విమర్శనగూడ సహించదు.

ప్రభుత్వం అనుమతిలేనిదే ప్రాథమిక పాఠశాలలుతప్ప యితర ప్రైవేటు స్కూళ్లుగూడ పెట్టుకోగూడదు.

మన హైదరాబాదు సమస్యలను పై రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని పరిశీలించాలి.

# 2. రాజకీయ చరిత్ర

1260 ఫసలీవరకూ నైజాం సంస్థానంలో కర్త్రీలేని రాజరికవిధానమే అమలు జరుగుతూ వచ్చింది. ప్రభువుగారే సర్వాధికారి. ప్రభుత్వ విధానం సాగటానికి నిర్ణీతమైన లిఖితపూర్వకమైన చట్టాలు ఏవీలేవు. ప్రభువుగారే అప్పుడప్పుడూ ఫర్మానులు ఇస్తూ ఉండేవాడు. ఒకమంత్రి ఉండేవాడు. ఈయన ప్రభుత్వంయొక్క దైనందిన కార్యక్రమం చూస్తూ ఉండేవాడు. నామమాత్రమైన శాసనసభలు సైతం లేవు. స్థానిక స్వపరిపాలకసంస్థలు (పంచాయితీలు, జిల్లాబోర్డులు, మున్సిపాలిటీలు, కో-ఆపరేటివులు వగైరా) అసలే లేవు. వీటిమాట అటుంచి ఇప్పటివలె న్యాయస్థానములు, పోలీసు. మాల్గుజారీ (రెవెన్యూ) మొదలైన ప్రభుత్వ డిపార్టుమెంటులు లేవు. దేశపాండ్యాలు, దేశముఖులు, తాలూకాదార్లు అనువారికి భూమిపన్ను వసూలుకు గుత్తకియ్యబడుచుండెను. వారు వారి ఇష్టం వచ్చినంత పన్నును వసూలుజేసి, దానిలో గుత్తకు తీసుకున్నభాగం ప్రభుత్వానికి చెల్లించి, మిగతాదంతా తమ విలాసాలకు ఉపయోగించుకునేవారు. వీరే తాము గుత్తా తీసుకున్నప్రాంతంలో సర్వాధికారులు. ప్రభుత్వానికి పన్నులు రాబట్టే దృష్టితప్ప, మరేదియూలేదు. గ్రామాల్లో ప్రజలకు వచ్చే కలహాలను తీర్చడానికి, పెద్దలతోగూడిన పంచాయితీలు ఉండేవి. దొంగలు బందిపోట్లనుండి గ్రామప్రజలు తమగ్రామాలను రక్షించుకొనేవారు. దేశముఖులు, దేశపాండ్యాలు కొంతమంది నౌకర్లను మేపేవారు. వీరిని దౌర్జన్యంగా ప్రజలనుండి పన్నులు వసూలుచేయడానికి ఉపయోగించేవారు. (మొదటి సాలారుజంగు 1260 ఫసలీలో ప్రధానమంత్రి అయ్యాడు. ఇతడు దేశపాండ్యాలు, దేశముఖులు. తాలూకాదార్లను తొలగించి, ప్రస్తుత ప్రభుత్వ డిపార్టుమెంటులను ఏర్పరచి, ప్రభుత్వాధికారాన్ని కేంద్రీకరించాడు.) ఆ రోజుల్లో రాజాంగవిధానం ఎలా ఉండేదో సూరవరం ప్రతాపరెడ్డిగారు తాము రచించిన "నిజాంరాష్ట్ర పరిపాలనం అనేగ్రంథంలో ఈ విధంగా వ్రాశారు.

"ఈ రాష్ట్రములో పూర్వం హిందూరాజు లుండినప్పుడు సాధారణముగా పంటలో ఆరవభాగం పన్ను తీసుకొనుచుండిరి. మహారాష్ట్రు

(2)

కాలములో " చౌత్ " అనగా నాల్గవభాగం వసూలు చేయుచుండిరి. దేశ ముఖ్, దేశపాండ్యాల పద్ధతి బహుకాలమునుండి యీ దేశములో నేర్పాటుగా నుండెను. ఈ పద్ధతినే గోలకొండ నవాబులు జారీ ఉంచిరి. ప్రతి గ్రామమునకు ఒకపటేలు, ఒకపట్వారి, కొన్నిగ్రామాల పటేండ్లపై పెద్ద దేశముఖులున్ను, అదేవిధంగా కొన్నిగ్రామాల పట్వారీలపై పెద్ద దేశ పాండ్యాయు మరల ఈ దేశముఖులపై సర్ దేశముఖున్ను, దేశపాండ్యాలపై సర్ దేశపాండ్యాయున్ను ఏర్పాటు అయియుండిరి.

(కర్నాటకులు, రాష్ట్రకూటులు, రాజ్యముచేసిన కాలములో ఇదేపని చేయువారిని గౌడు, నాడగౌడు, సర్నాడగౌడు అని పిలుచుచుండిరి.)

ఈ దేశముఖులు, దేశపాండ్యాలు భూమిపన్ను వసూలుచేయుటకు జిమ్మేదారులుగా నుండిరి, గోలకొండ నవాబుల యనంతరము ఆసఫ్‌జాహీ వంశస్థుల కాలములో దేశమును కొన్నిభాగములుగా విభజించిరి. మొదటి నిజామగు నిజాముల్ ముల్కు ఆసపుజా కాలములో ఈ రాష్ట్రము 6 సుబాలుగా 93 సర్కారులుగా, 1236 మహాలులుగా విభజింపబడెను. తర్వాత కాలములో " సర్కారు " అను భాగములోనే పర్గణాలు ఏర్పాటు చేయబడెను. ప్రతి పర్గణాను తాలూకాదారు అనువానికో లేక గుత్తేదారునికో ఏడాదికో, మూడేండ్లకో, ఏదోయొక నియమిత కాలమునకుగాను గుత్తా కిచ్చుచుండిరి. ఆ గుత్తాకన్న ఎంత ఎక్కువ వసూలైన అదంతయు గుత్తే దారుదే. ఈ గుత్తేదారులైన తాలూకాదారులు మరల తమ గుత్తాలో దేశ ముఖులను దేశపాండ్యాలను భాగస్తులనుగా చేసికొని వారిద్వారా పన్నులను వసూలు చేయుచుండిరి. పన్నులు భూమిపై వసూలుచేయకుండిరి. ఆ కాల ములో భూమి కొలతలు లేవు. కాండ్లపైన ఎద్దులపైన పన్ను వసూలు చేయుచుండిరి.

1849 క్రీ. శ. లో బ్రాడ్లీ అనునతడిట్లు వ్రాసెను :—

" పైఠన్‌లోని మూడుపర్గణాల కొకే దేశముఖు కలడు. అతనికి మొత్తం పన్నులో నూటికి 24 ప్రకారంయిత్తురు. దేశపాండ్యాకు నూటికి 24 ప్రకారం. సర్ దేశపాండ్యాపని దేశపాండ్యాల కాగితాలపై దస్కతులు పెట్టి తనక్కీ చేయుట, అతనికి నూటికి 1 రూపాయి ప్రకారమిత్తురు."

సాధారణముగా రెండెద్దుల సేద్యగానినుండి 5 నుండి 10 రూపా యీల వరకు, 4 ఎద్దుల వానినుండి 10 నుండి 25 వరకు ఇదే దర్జాలో వసూలు చేయుచుండిరి.

ఈ పన్నేకాక ఆ కాలములో నానావిధములగు పన్నులుండెడివి. అందుకొన్ని :—

1. ధన్‌గర్‌పట్టి — (గొల్లవాండ్లపై)
2. ధేడ్‌పట్టి — (మాలమాదుగులపై)
3. షాదీపట్టి — (పెండ్లిండ్లమీద)
4. చర్సపట్టి — తోళ్ళమీద
5. భోయీపట్టి — భోయీలమీద
6. హాట్‌బాజారీ — మార్కెట్లమీద
7. కలాల్‌పట్టి — కల్లుదుకాణాలమీద
8. జులాహాపట్టి — సాలెవాండ్లపై
9. ధారాపట్టి — లోకల్‌ఫండు వంటిది.
10. రాహ్దారీ — త్రోవపట్టి
11. గనీంబాబ్ — శత్రువులనుండి రక్షించినందులకు పన్ను
12. పరాలపట్టి — గడ్డి సప్లయికిగాను
13. బట్‌సబ్జీ — కూరగాయ లమ్ముకొన్నందుకు
14. బాన్స్‌ఫరోషీ — బొంగులు అమ్ముకొన్నందుకు
15. మజ్కూరీపట్టి — కూలీలమీద
16 రెడ్డిరుసుము — రెడ్డిగారికి చెల్లించవలెను.
17. దఫన్ - పీనుగుల పూడ్చినందుకు చెల్లించవలసినది
18. తైలీ పాన్‌పట్టి — నూనె, తమలపాకులవారిచ్చుకొనవసిన పన్ను
19. మచ్లీపట్టి — బేస్తవారిమీద
20. కుంభార్‌పట్టి — కుమ్మరివారిమీద
21. భైంస్‌పట్టి — దున్నపోతులుంచుకొన్నందుకు
22. ఆదంపట్టి — హిందూ శిల్పకారులమీద
23. మొహతర్పా — ఇంటిపన్ను (సాధారణముగా మగ్గములపై వసూలు)
24. సఫర్‌పట్టి — జమీందారుగారి దొరాకుగాను అగు ఖర్చులకై వసూలు.

ఇంకను ఇట్టివనేకములగు పన్నులుండెను. ఇప్పుడిందులో నించుమించు నూటికి 90 పాళ్లు తీసివేయబడినవి.

క్రీ. శ. 1867 లో సర్ సాలారుజంగు మంత్రి భూమిపన్నులలో గొప్ప మార్పులుగావించెను. కౌలుగుత్తా పద్ధతి తీసివేసి, భూముల కొలిపించి బందోబస్తుచేయించి పన్నులు ఏర్పాటుచేసెను. ఈ పద్ధతి వలన ఇదివరలో లాభముపొందుచుండిన గుత్తేదారులగు తాలుక్దారులు కొందరు తిరుగుబాటుచేసి చాల అల్లరులుచేసిరి. ఒకటి రెండు సందర్భములలో బ్రిటిషుసైన్య సహాయముతో తిరుగుబాటుల నణచవలసి వచ్చెను.

ఇప్పుడు కొన్ని సంస్థానములలోను, జాగీరులలోను తప్ప తక్కిన రాష్ట్రమందంతటను బందోబస్తు అయి భూములపై నిర్ణయమగు పన్నును తీసుకొనుచున్నారు.

## కాబినెటు కౌన్సిల్, లెజిస్లేటివు కౌన్సిల్ స్థాపన

మొదటి సాలారుజంగు మంత్రి ప్రభుత్వానికి వివిధడిపార్టుమెంటులను ఏర్పరచి ఒక క్రమపద్ధతికి తెచ్చాడు. కాని నిజాంరాష్ట్ర పరిపాలన సాగించడానికి మూలంగా ఉండే చట్టమేదీలేదు. నవాబు, మీరుమహబూబు అలీఖాన్‌గారి కాలంలో, 1302 ఫసలీలో, ఖానూన్‌చాముబారిక్ అనేశాసనం ప్రభువుగారిచే చేయబడింది. ఇప్పటికీ రాజ్యపరిపాలనకు అదే పునాది.

పైశాసనం ప్రకారం కాబినెట్ కౌన్సిలు (Cabinet council) అనే కార్యనిర్వాహకశాఖ, లెజిస్లేటివుకౌన్సిలు (Lagislative Council) అనే శాసనసభా ఏర్పరుపబడినది.

పరిపాలన భారమంతా ఒక్క ప్రధానమంత్రి చూడటంచేత, ప్రభుత్వ కేంద్రం సరిగా పనిచేయడంలేదు. అందుచే కేంద్రం బలహీనంగాఉంది. కేంద్రాన్ని బలపరచడంకోసం, ప్రధానమంత్రికి సహాయంగా కొందరు ఉపమంత్రులు నియమింపబడ్డారు. ఇంకా కొంతమంది సలహాదార్లను చేర్చి, కాబినెటుకౌన్సిలు ఏర్పరచబడింది. ఇది పరిపాలనకు సంబంధించిన ముఖ్యమైన విషయములనన్నిటినీ ముందు చర్చించి నిర్ణయాలుచేసి, ప్రభువుగారి ఆమోదానికి పంపుతూఉండేది. రాజుగారు ఆమోదించినవాటినే ప్రధానమంత్రి అమలుజరుపుతూ ఉండేవాడు. కాని ఈ కౌన్సిలుసభ్యులు వివిధ ప్రభుత్వశాఖలకు బాధ్యతవహించి, వాటిని అమలుజరిపేవారుగాదు. అందుచేత అది సంప్రతించేసంఘంగా మాత్రమేఉండేది. కనుక ముఖ్యవిషయాల మీద నిర్ణయాలు చేయడంలో, ఈకౌన్సిలువల్ల పూర్వంకన్న కొంతమార్పు వచ్చినా, వాటిని అమలుజరపడంలో మాత్రం అంతగా మార్పురాలేదు

ఇక లెజిస్లేటివుకౌన్సిలు విషయం చూదాం. 1303 ఫసలీలో ఇది ఏర్పరుపబడెను. దీనిలో సభ్యులు.

(1) మీర్ మజ్లిస్ (హైకోర్టు ప్రధానన్యాయమూర్తి) (2) ఒక హైకోర్టురుకున్ (ఉపన్యాయమూర్తి) (3) నాజిం మాల్గుజారి (రెవెన్యూశాఖ డైరెక్టరు) (4) నాజిం విద్యాశాఖ (5) నాజిం జిల్లాపోలీసు (6) మోతెమన్ ఫైనాన్సు (ఆర్థికశాఖ కార్యదర్శి)

ఈ శాసనసభలో అందరూ ప్రభుత్వోద్యోగులే. ప్రజలకు సంబంధించిన ప్రతినిధి ఒక్కడుగూడ లేడు. పూర్వం ప్రధానమంత్రి సలహాతో, ప్రభువుగారే ఫర్మానాలు జారీచేసేవారు. ఇప్పుడు ఈ శాసనసభ సలహాతో చేస్తాడు. దీనివల్ల ప్రజలకు ఏమీ మేలుగలుగలేదు.

తర్వాత 1309, 1315 ఫసలీలలో శాసనసభా ప్రాతినిధ్యం విషయంలో కొన్ని మార్పులు చేయబడినవి దీనివల్ల శాసనసభ్యుల సంఖ్య 22 వరకూ పెంచబడింది.

సభ్యుల వివరం :

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | | 1 |
| ఉపాధ్యక్షులు | | 1 |
| ప్రభుత్వ సభ్యులు | | 12 |
| అనధికారసభ్యులలో జాగీర్దారుల పక్షమున | 2 | 6 |
| ,, ,, వకీళ్ళపక్షమున | 2 | |
| ,, ,, పాయగా సంస్థానముల పక్షమునుండి పంపబడిన సభ్యుడు | 1 | |
| మంత్రిగారు నియమించిన సభ్యుడు | 1 | |
| అనధికారసభ్యులు తమపద్దతు పూర్తి ఆగుటచే వెళ్ళిపోవునప్పుడు వారిలోనుండి మంత్రిచే నియమింపబడినవారు | | 2 |
| మొత్తం | | 22 |

పై మెంబర్ల వివరములింకను నిట్లున్నవి :

అధికార సభ్యులలో :

1. మీర్ మజ్లిస్ (ప్రధాన న్యాయమూర్తి)

2. న్యాయశాఖ కార్యదర్శి
3. ముషీరెఖానూన్ (Legal adviser)

వీరు ఉండితీరవలెను.

అనధికార సభ్యులలో :

జాగీర్దారులలో 6000 రూపాయీలు లేక అంతకుపైగా సాలీనా ఆదాయముగలవారే తమలో ఇద్దరిసభ్యుల నెన్నుకొని పంపవలెను.

వకీళ్ళలో హైకోర్టువకీళ్ళే తమలో ఇద్దరిని ఎన్నుకొని పంపవలెను.

కనుక మొత్తముపై విచారించి చూచిన నిజముగా అనధికారులును స్వతంత్రులును అనదగిన మెంబర్లు ఇద్దరే. (ఇద్దరు వకీళ్ళు)

సభ్యుల ఎన్నికలు రెండేండ్లకొకమారు జరుగును. ముషీరెఖానూన్ గారు శాసనసభా కార్యదర్శి. సభలెప్పుడు జరుగునది, ఎన్నడు జరుగునది, ఎన్నిమార్లు జరుగునది అంతయు మంత్రిగారి యిష్టము. సభకు 5 మెంబర్ల కన్న తక్కువ మెంబర్లు వచ్చిన సభాకార్యములు జరుపకూడదు. ఒకవేళ 5 కన్న హెచ్చువచ్చినను అధ్యక్షుల యిష్టములేకున్న సభను ఆపివేయ వచ్చును.

పైన వ్రాయబడినది చూస్తే, జాగీర్లు పాయెగాలు మొదలైన పెద్ద జమీందారీల అధిపతులకు, హైకోర్టువకీళ్ళకు, పెద్ద వర్తకులకు ప్రాతినిధ్య మిచ్చి, వారి అండను ప్రభుత్వానికి సంపాదించడానికే, ఇది ఉద్దేశించ బడింది. ప్రజాసామాన్యమాట అటుంచి, చిన్న జమీందార్లు, చిన్న వకీళ్లు మొదలైన వారికి సైతం ప్రాతినిధ్యమేలేదు.

ఇక శాసనసభయొక్క హక్కులనిగూర్చి విచారించుదాం. ప్రభుత్వ ఆదాయం, సైన్యం, ప్రభుగారిచే జారీచేయబడిన ఫర్మానాలను గురించి ప్రధానమంత్రి అనుమతిలేనిదే శాసనములను ప్రవేశపెట్టగూడదు. ఇస్లాం, హిందూ న్యాయశాస్త్రాలకు సంబంధించిన శాసనములను అనుమతిలేకుండా పెట్టవచ్చును. కాని శాసనసభ ఆమోదింపబడిన శాసనములు ప్రభువుగారి అనుజ్ఞ బడిసిన తర్వాతనే శాసనములుగా అవును. శాసనసభలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వోద్యోగులున్నప్పటికీ, మిగతావారిలో సైతం ప్రజల దోపిడీచేయు జాగీరుదార్లు ప్రభుత్వంచే నామినేటు చేయబడిన సభ్యులు అధిక సంఖ్యాకులు అయినప్పటికీ, ప్రభుత్వం శాసనసభను నమ్మదు. శాసనసభ ఒక అలంకారవస్తువు మాత్రమే దీనితో పోల్చిచూస్తే, బ్రిటిషు ఇండియాలోని రాష్ట్ర శాసనసభలు నిజమైన ప్రజాస్వామ్యానికి చాలదూరంలో

ఉన్నా, చాల నయం - వీటిలో కొంతవరకు ప్రజాప్రాతినిధ్యంఉంది. శిస్తు చెల్లించే పట్టాదార్లకు వారి భార్యలకు చదువుకున్నవారికి అందరికీ ఓటింగు హక్కువుంది. ఈవిధంగా 100 కి 14 మందికి ఓట్లు ఉన్నాయి. గవర్నరుచే నామినేటెడ్ సభ్యులు చాల కొద్దిమంది మాత్రమే. మెజారిటీపార్టీ నాయకుడు మంత్రివర్గాన్ని ఏర్పరుచుతాడు. ఈమంత్రులు వివిధ డిపార్టుమెంటులకు బాధ్యతవహిస్తారు. శాసనసభలో ప్యాసుఅయిన తీర్మానాలు గవర్నరుయొక్క అనుమతిపొందిన తర్వాతనే చట్టాలు అయ్యేమాట విజమే అయినా, చాల చట్టాలను ప్రజాఉద్యమ బలంవల్ల గవర్నరు అంగీకరించక తప్పిందిగాదు. అంతేగాక మంత్రులయొక్క దైనందిన పనిలో గవర్నరు జోక్యం గల్గించుకోడానికి అవకాశమున్నా, ప్రజాఉద్యమ బలంవల్ల చాలవరకు జోక్యం కలిగించుకోకుండా ఉండాలిసి వచ్చింది.

## మొదటి ప్రపంచయుద్ధం - ప్రజా ఉద్యమ పుట్టుక

ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన దేశాల్లో ఆధునిక పరిశ్రమలు ముందు అభివృద్ధి అయినవి, జర్మనీ, ఆస్ట్రియా దేశాల్లో తరువాత అభివృద్ధి అయినవి. అందుచే ఇంగ్లండు, ఫ్రాన్సు పెట్టుబడిదారివర్గాలు ఇండియా, బర్మా, ఆఫ్రికా మొదలైన పారిశ్రామికంగా వెనుకబడివున్న దేశాలను ఆక్రమించుకున్నాయి జర్మనీ, ఆస్ట్రియా దేశాల పెట్టుబడిదారి వర్గాలు మేలుకొనేటప్పటికే, వెనుకబడివున్న దేశాల పంపిణీ చాలవరకు అయిపోయింది. జర్మనీ ఆఫ్రికాలో కొద్ది భూభాగంమాత్రం ఆక్రమించుకొని, సామ్రాజ్యాన్ని యేర్పరచింది. చాలకాలం క్రిందటనే ఆస్ట్రియా రాజులు యిప్పటి జెకోస్లొవేకియా, యుగోస్లావియాలో చాలభాగం హంగరీని ఆక్రమించి సామ్రాజ్యాన్ని యేర్పరచారు. కాని ఆస్ట్రియను పెట్టుబడిదారి వర్గానికి యిది చాలలేదు. 1914 కు ప్రపంచంలోని వెనుకబడిఉన్న దేశాలను ముందుకువచ్చిన పెట్టుబడిదారివర్గాలు పంచుకోవడం పూర్తి అయింది. అందువల్ల విదేశ పెట్టుబడిదారివర్గమైనా సామ్రాజ్యాన్ని విస్తరించుకోదలుచుకొంటే, యుద్ధంచేయాలిసిన అవసరం యేర్పడింది. అందువల్ల ప్రపంచంలో వెనుకబడిఉన్న దేశాలను చాలవరకు ఆక్రమించుకున్న బ్రిటను, ఫ్రాన్సులను, తమ పరిశ్రమలకు మార్కెట్లుగా ఉపయోగపడటానికి అవసరమైనంత సామ్రాజ్యంలేని ఆస్ట్రియా, జర్మనీలకూ, మధ్య 1914 లో ప్రపంచ యుద్ధం ఆరంభమయింది. యూరపులోని

మిగతా దేశాల పాలకవర్గాలు వాటివాటి అవుసరాలనుబట్టి ఇరుపక్షాలను చేరినవి.

ఇటువంటి అధర్మయుద్ధంలోకి సామ్రాజ్యవాదులు తమ దేశాలలోని ప్రజలను, తమసామ్రాజ్యాలలోని బానిసప్రజలను బలవంతంగా యీడ్చారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు, దరిద్రదేవత పుట్టినిల్లయిన భారతదేశ ప్రజలను, యుద్ధచందాలు వసూలుచేసియూ, బలవంతంగా సైన్యంలో చేర్చుకొనియూ, ప్రజాసామాన్యాన్ని అనేకవిధాల పీడించారు. యుద్ధబరువు భారతదేశంమీద యెక్కువగాపడడంతో, జీవితావసర వస్తువులధరలు విపరీతంగాపెరిగిపోయాయి. షావుకార్లు విపరీతంగా లాభాలుగుంజారు. మన దేశానికి మూలాధారమైన వ్యవసాయం దెబ్బతిన్నది పంటలు తగ్గిపోయాయి. అందుచే ప్రజలకు చాలినంత తిండి లేకపోయింది. తిండి లేక బలహీనమైన ప్రజలమీద ఇన్ఫ్లుయాంజా అంటురోగం చెలరేగింది. ఈ వ్యాధివలన మొత్తం 1 కోటి 40 లక్షలమంది చనిపోయారు.

ఇందువల్ల ప్రజల్లో ప్రభుత్వంయెడల తీవ్రమైన అసంతృప్తి ప్రబలింది. కాని ప్రజలయొక్క ఈ కష్టాలను బాపడానికి ప్రయత్నిస్తూ, స్వాతంత్ర్య సంపాదకు ప్రజాసామాన్యాన్ని సమీకరించాలిసిన కాంగ్రెసు నాయకులు, బ్రిటిషు సామ్రాజ్యవాదులకు అడుగులకు మడుగులొత్తారు. ప్రభుత్వానికి పూర్తి సాయంచేశారు. అందుచే విప్లవ భావాలు చెలరేగుతున్న యువకులకు, కాంగ్రెసు నాయకుల ఈ మితవాద ధోరణి అసహ్యతను గల్గించింది. అందుచే వీరు గదరు, అనుశీలన్, యుగాంతర్, మొదలైన టెర్రరిస్టుపార్టీలలో చేరారు. అప్పటివరకు ప్రభుత్వ నిర్బంధవిధానం వల్ల నిర్జీవంగా పడిఉన్న టెర్రరిస్టు పార్టీలు విజృంభించాయి. ప్రభుత్వోద్యోగులను చంపడం, ప్రభుత్వ భావనాలమీద బాంబులువేయడం, మొదలైన అరాజకచర్యలు చాల యెక్కువ అయినాయి. ఈ టెర్రరిస్టు యువకులు భారత సైన్యాలతో సంబంధం పెట్టుకొని, అనేకచోట్ల తిరుగుబాట్లు తీసుకువచ్చారు. ప్రజలతో సంబంధంలేని యీ టెర్రరిస్టు ఉద్యమం జయంపొందలేదు. అనేక వందలమంది యువకులు యీ వుద్యమంలో ప్రాణత్యాగం చేశారు.

ఒకవైపు ఈ టెర్రరిస్టు ఉద్యమం సాగుతూఉంటే, రెండవవైపున తిలకు 1916లో కాంగ్రెసులో ఉన్న కొద్దిమంది అతివాదులను ప్రోగుజేసి, హోమురూలు లీగు అనేదాన్ని స్థాపించాడు. బాధ్యతాయుత పరిపాలన

యిస్తేనే యుద్ధంలో సహాయంజేస్తామంటూ ఆందోళన లేవదీశాడు. ఈ దశలో 1917 మార్చిలో రష్యా మహావిప్లవం జరిగింది. జారురాజుయొక్క నిరంకుశప్రభుత్వం ప్రజలచే కూల్చివేయబడింది. తరువాత నవంబరు 7 న పెట్టుబడిదార్లు, జమీందార్లు, కలిసి ఏర్పరచిన ప్రభుత్వంగూడ, బోల్షివిక పార్టీ (రష్యాకమ్యూనిస్టుపార్టీ) నాయకత్వం క్రింద కూల్చివేయబడింది. కార్మిక కర్షకుల, ఇతర కష్టజీవుల ప్రభుత్వం ఏర్పరుపబడింది. ఈ రష్యా విప్లవం యొక్క ప్రభావం ప్రపంచ ప్రజలతోపాటు భారతప్రజలమీదగూడ పడింది. భారతప్రజల స్వాతంత్ర్యకాంక్షను తీవ్రతరంచేసింది. ఈ పరిస్థితుల్లో బ్రిటిషుసామ్రాజ్యవాదులు భారతదేశంమీద తమ పెత్తనం పోతుందని భయపడ్డారు.

ప్రజాసామాన్య వత్తిడివల్ల బ్రిటిషు సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తుచున్న మితవాదులు సైతం అతివాదులతో కలవాలిసివచ్చింది. 1916 లక్నో కాంగ్రెసులో మితవాదులు అతివాదుల మధ్య ఐక్యతవచ్చింది. ఇంతేగాక యుద్ధంలో వచ్చిన కష్టాలవల్ల మహమ్మదీయ ప్రజాసామాన్యములో గూడ, ప్రభుత్వం యెడల తీవ్రఅసంతృప్తి ఏర్పడింది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు టర్కీమీద దాడి జరపడంగూడ ఇందుకు తోడ్పడింది. దీని ఫలితంగా 1916 లో కాంగ్రెసుకు ముస్లింలీగుకు మధ్య రాజీకుదిరింది. అందుచే మితవాదులను ఈ ప్రజాఉద్యమాన్నుంచి చీల్చడంకోసం, 1917లో జారుప్రభుత్వం పడిపోయిన 5 నెలలకే, అప్పటి ఇండియా కార్యదర్శి అయిన మాంటెగ్యూ ఒక ప్రకటనజేశాడు. దానిలో "బ్రిటిషు సామ్రాజ్యంలో భాగంగా, ఇండియాకు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సంక్రమింపజేయడానికిగాను, స్వయంపరిపాలన సంస్థలను అభివృద్ధిచేయుట" తమ ఆశయమని ప్రకటింపబడింది. ఒకవైపున ఈవాగ్దానం చేస్తూ, రెండవవైపున "టెర్రరిస్టు చర్యలను అణచడానికి" అనే నెపంతో ప్రజా ఉద్యమాన్ని అణచడానికి కొన్ని చట్టాలను చేయబూనుకుంది. అందుకు "రౌలట్ కమిటీని ఏర్పరచింది. ఈ కమిటీ సూచనల ననుసరించి అతి కఠినమైన రౌలటు చట్టాలను ప్రభుత్వం 1919 మార్చిలో అమలులో పెట్టింది. దీనికి వ్యతిరేకంగా ఫిబ్రవరిలోనే సత్యాగ్రహం సాగించడానికి సత్యాగ్రహ కమిటీని ఏర్పరచాడు. ఈ చట్టాలకు అసమ్మతి తెలపడం కోసం హర్తాలుచేయమని ఏప్రిల్ 6 న గాంధీజీ ప్రకటించాడు. దేశమంతటా రౌలటు చట్టాలకు వ్యతిరేకంగా సమ్మెలు, హర్తాళులు జరిగాయి

ఏప్రిల్ 13 న అమృతసరులో జలియన్‌వాలాబాగ్‌లో పెద్దసభ జరిగింది. ఆసభలోని నిరాయుధులైన ప్రజలమీద జనరలు డయ్యరు 1600 తుపాకి గుండ్లను పేల్పించాడు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 379 మంది చని పోయారనీ,1200 మంది గాయపడ్డారనీ ప్రకటించబడింది. ఇటువంటి ఘాతుక చర్యకు పంజాబు, యావత్‌భారత దేశం ఒకటిగా నిలచి, అసమ్మ తిని తెలిపింది. పంజాబులో మార్షల్‌లా (సైనికశాసనం) ప్రవేశపెట్టబడింది.

## హైదరాబాదు సంస్థానంలో

బ్రిటిషుఇండియాలోని ఈ విప్లవపరిస్థితులవల్ల, బ్రిటిషుప్రభుత్వం ఉంటుందా లేక ఊడుతుందా, అనే పరిస్థితులువచ్చాయి. బ్రిటిషుప్రభుత్వా నికే మొసలంవస్తే, దానిమీద ఆధారపడే స్వదేశ సంస్థానాధీశులమాట వేరే చెప్పవలెనా ? బ్రిటిషు ఇండియాలోని ఈ ప్రజాఉద్యమం యొక్క ప్రభావం హైదరాబాదు సంస్థానంలోని ప్రజలమీద గూడ పడింది. అక్కడ గూడ స్వతంత్రభావాలు మొలకలెత్త సాగినాయి. అందుచే పాలకవర్గం తన అధి కారాన్ని నిలుపుకోడానికి కొన్ని మార్పులను తీసుకువచ్చారు. అందులో మొదటిది 19 దై, 1329 ఫసలీన (1919 నవంబరు) బాబేహుకూమతును ఏర్పరచుట. అప్పటికి షుమారు 5 సంవత్సరాలనుండీ మంత్రి లేకుండా వ్యవహారములన్నీ ప్రభువుగారు స్వయంగా చూచుకొనుచుండిరి. మంత్రికి సహాయంగా సలహాసంఘంగా కాబినెట్ కౌన్సలు అనే సంస్థమాత్రముండేది. మంత్రి ఒక్కడే అన్ని డిపార్టుమెంటుల పనులనూ చూచుచుండుటవలన, క్రింది ఆఫీసులమీద సరియైన తనిఖీఉండేదిగాదు. అందుచే ప్రభుత్వం కేంద్రీకృతంగా లేక, క్రింది ఉద్యోగులు స్వతంత్రంగా ఇష్టంవచ్చిన పను లను చేయడానికి అవకాశం ఉండేది. అంతేగాక ప్రభుత్వ డిపార్టుమెంటు లలో ఒకదానికి మరొకదానికి సంబంధం అంతగా ఉండేదిగాదు. అందు వల్ల ప్రభుత్వం చాల బలహీనంగా ఉండేది. ఏమాత్రపు ప్రజావుద్యమం వచ్చినా, దాన్ని అణచగలిగినస్థితిలో లేదు. అందుచేత కాబినెట్ కౌన్సి లును రద్దుచేసి, దానిస్థానే నిర్ణయాలు తీసుకోడానికి వాటిని అమలుజరప డానికి సమిష్టిబాధ్యత గలిగిన బాబేహుకూమత్ (executive council) ఏర్పరచబడింది. దీనిలోని ఇతరసభ్యులు ప్రభుత్వ డిపార్టుమెంటులను తమమధ్య విభజించుకొని, వాటి నిత్యవ్యవహారాలకు బాధ్యత వహించు తారు. దీనికి అధ్యక్షుడు ప్రధానమంత్రి. దీనిలో మెజారిటీనిబట్టి నిర్ణయాలు

ఆమోదించబడును. ఒకవేళ ప్రధానమంత్రి యొక్క అభిప్రాయమునకు మెజారిటీ లేనిచో, రాజుగారి అభిప్రాయానికి పంపవచ్చును. అంతవరకూ తీర్మానం అమలు జరుపకుండ ఆపవచ్చును. బాబేహుకూమత్ ఏర్పరచడం వల్ల ప్రభుత్వాన్నెదుర్కొన్న సమస్యలను పరిష్కరించడానికి, వివిధ డిపార్టుమెంటులు గట్టిగా పనిచేయడానికి, అవకాశమేర్పడింది.

ప్రభుత్వ యంత్రాన్ని బలపరచడంతోపాటు, స్వాతంత్రభావాలు రగుల్కొంటున్న విద్యాధికులను సంతృప్తి పరచడంకోసం, ఒక ఎత్తు ఎత్తబడింది. అప్పటి శాసనసభను సంస్కరించుటకు ఒక స్కీమును తయారుచేయడానికి, బాబేహుకూమత్‌కు అప్పటి అధ్యక్షుడైన సర్ ఆలీ ఇమామ్‌గారికి అధికారమిస్తూ ఒక ఫర్మాన్ జారీచేయబడింది. ఆ స్కీము ఈ క్రిందివానిని గూర్చి విచారించాలని గూడ ప్రకటింపబడింది.

(1) శాసనసభలోని ఎన్నుకొనబడు సభ్యులసంఖ్యను బాగుగా హెచ్చించుట.

(2) ప్రత్యక్షమగు ఎన్నికలపద్ధతిని ప్రవేశపెట్టుట.

(3) కొన్ని ప్రత్యేక తెగలకు ప్రత్యేక ప్రాతినిధ్యము ఇచ్చుట.

(4) అల్పసంఖ్యాకులగువారి హక్కులను రక్షించుట.

(5) వోట్లిచ్చుటకు సంబంధించిన రూల్సు ఏర్పరచుట.

(6) శాసనసభలో అధికారులగు సభ్యులసంఖ్యను నిర్ణయించుట.

(7) శాసనసభయొక్కయూ, సభ్యులయొక్కయూ, అధికారాలు, కర్తవ్యాలను నిర్ణయించుట.

పై ఫర్మాను ప్రకారం రిపోర్టును తయారుచేయడానికి, పూర్వపు హైకోర్టు న్యాయమూర్తి యైన రాయ్ బాలముకుందు అను అతడు నియమింపబడెను. అతడు ఒకటిన్నర సంవత్సరాలు కృషిజేసి ఒక రిపోర్టు తయారుజేశాడు. శాసనసభ్యుల సంఖ్య 104 వరకూ పెంచాలనీ, వీరిలో సగంమంది ప్రభుత్వంచే నామినేటు చేయబడినవారుగనూ, సగంమంది సాధారణ నియోజకవర్గాలద్వారాను ప్రత్యేక నియోజకవర్గాలద్వారాను ప్రజలచే ఎన్నుకోబడినవారుగనూ ఉండాలనీ, ఈయన సూచించాడు. బ్రిటిషు ఇండియాలో 1909 సం॥లో ప్రవేశపెట్టబడిన మింటో-మార్లే సంస్కరణలలో రాష్ట్రశాసనసభల కియ్యబడిన అధికారాలను, ఈ శాసనసభ కలిగి ఉండాలని గూడ సూచించాడు.

## మింటో - మార్లే సంస్కరణలు

1905 లో జారు ప్రభుత్వం జపానుచేతుల్లో ఓడిపోయింది. ఆధునిక యుగంలో యూరోపియను రాజ్యంమీద ఆసియాఖండంలోని దేశం గెలవడం ఇదే మొదటిసారి. ఇది ఆసియాఖండ వాసులైన భారతీయుల మీద మంచి ప్రభావం గలుగజేసింది. దీనితోబాటు 1905 రష్యా విప్లవం గూడ ప్రజల నుద్రేకపరచింది. ఆరోజుల్లో బెంగాలు భారతరాజకీయాలకు కేంద్రం. అందుచే అప్పటి వైస్రాయియైన లార్డు కర్జన్ బెంగాలును విభజించాడు. దీనికి వ్యతిరేకంగా భారతదేశమంతటా అసమ్మతి ప్రదర్శనాలు జరుపబడ్డాయి. కాంగ్రెసు 1905 ఆగస్టులో విదేశవస్తు బహిష్కారోద్యమాన్ని ఆరంభించింది. ఈ ఉద్యమాన్నుండి మితవాదులను చీల్చడానికి, ప్రభుత్వం మింటోమార్లే సంస్కరణలను ప్రవేశపెట్టింది. దాని ప్రకారం 1892 ఇండియా కౌన్సిల్ యాక్టుప్రకారం స్థాపింపబడిన రాష్ట్రీయ శాసనసభల్లోను కేంద్రశాసనసభల్లోను ఎన్నుకోబడిన సభ్యుల సంఖ్యను మాత్రం హెచ్చించారు. ఈశాసనసభలకు సైతం ప్రజలకు ప్రత్యక్షంగా ఎన్నుకోడానికి అవకాశంలేదు. మున్సిపాలిటీలు వ్యాపారసంస్థలు మొదలైనవి రాష్ట్రశాసనసభలకు సభ్యులను ఎన్నుకొంటాయి. రాష్ట్రశాసనసభలు కేంద్రశాసనసభలకు సభ్యులను ఎన్నుకొంటాయి. రాష్ట్రాలలోనూ కేంద్రంలోనూ పరిపాలన సాగించడానికి గవర్నర్లయొక్క వైస్రాయియొక్క కౌన్సిళ్లు ఉంటాయి. ఇవి శాసనసభలకు ఏమాత్రమూ బాధ్యతసహించవు. వీటిలో ఒకరిద్దరు భారతీయులుమాత్రం గవర్నర్లు వైస్రాయిచేత నియమింపబడేవారు. ఈ శాసనసభల తీర్మానాలు సలహాలుమాత్రమే. ఈశాసనసభలకు ఐ. సి. యస్. మొదలైన ఉన్నతోద్యోగుల జీతాలనుగూర్చి సైతం తీర్మానాలుచేయడానికి వీలులేదు. ప్రభుత్వోద్యోగులయొక్క చర్యలను గూర్చి ప్రశ్నలను శాసనసభలో గవర్నరు పర్మిషన్‌లేనిది అడగడానికి వీలులేదు.

బ్రిటిషు ప్రభుత్వమే ఈ సంస్కరణలు ప్రజలను మోసగించడానికి పనికిరావని, ప్రజలకు ఇంకా హక్కులు ఉండే నూతన సంస్కరణలు ప్రవేశపెట్ట జూస్తూంది. ఇట్టి పరిస్థితుల్లో నైజాం ప్రభుత్వం మింటో—మార్లే సంస్కరణల ననుసరించి శాసనసభను విస్తరింప బూనుకొంది.

## గాంధీజీ తటపటాయింపు

రౌలటుచట్టాలకు వ్యతిరేకంగా తానిచ్చిన పిలుపుకు యావద్భారత దేశంలో జరిగిన ఘటనలను చూచి గాంధీజీ భయపడ్డాడు. ఉద్యమం తాననుకున్న అహింసహద్దులను దాటిపోతుందని భయపడ్డాడు. దేశం అహింసకు తయారుగాలేదని చెప్పి, రౌలటుచట్టాలకు వ్యతిరేకంగా ఆరంభించిన ఉద్యమాన్ని ఆపివేశాడు. తాను "హిమాలయపర్వతమంత పెద్ద పొరబాటును" చేశానన్నాడు. మాంటాగ్యూ-చెలమ్సుఫర్డు సంస్కరణలను జయప్రదమొనర్చేటందుకు గాను ప్రశాంతంగా కూర్చొని పని చేస్తానని ప్రకటించాడు. 1917 లో చేసిన ప్రకటన ననుసరించి, మాంటాగ్యూ రిపోర్టు 1918 ఆఖరుకు వెలువడింది. ఈ రిపోర్టు ననుసరించి సంస్కరణల స్కీము 1919 ఆఖరుకు చట్టంగా చేయబడింది. ఇది 1920 లో అమలులోకి తేబడింది. ఈ సంస్కరణలప్రకారం, ప్రభుత్వానికి పన్ను చెల్లించేవారికి ఓటింగుహక్కు వచ్చింది. పన్ను చెల్లించేవారందరూ రాష్ట్ర శాసనసభలకు, కేంద్రశాసనసభకు సరాసరి ప్రతినిధులను ఎన్నుకొంటారు. రాష్ట్రశాసనసభలచే ఎన్నుకోబడిన మంత్రివర్గముంటుంది. ఈ మంత్రి వర్గానికి ప్రజోపయోగకరమైన డిపార్టుమెంటులు (విద్య, ఆరోగ్యం, స్థానిక స్వపరిపాలన) అప్పగించబడినాయి. బడ్జటులో వీటికి ప్రత్యేకించే డబ్బుమాత్రం చాలస్వల్పం, వీటిమీద గూడ అంత్యనిర్ణయం గవర్నరుదే. మిగతాడిపార్టుమెంటులన్నీ గవర్నరుక్రింద ఉంటాయి. కేంద్రశాసనసభకు మాత్రం మంత్రివర్గాన్ని ఎన్నుకొనే హక్కులేదు. మింటో-మూర్లే సంస్కరణలకు వీటికి ఉన్న ముఖ్యమైన భేదమేమంటే, రాష్ట్రశాసనసభలచే ఎక్కుకోబడే మంత్రులకు కొన్ని డిపార్టుమెంటులైనా అప్పగించబడినాయి. ప్రజాప్రతినిధులకు శాసనాలుచేసే అధికారమేగాక, వాటిలో కొన్నిటిని అమలుజరిపే అధికారంగూడ వచ్చింది. కాని అన్నిటిమీద సర్వాధికారి గవర్నరే. శాసనసభలు చేసిన శాసనాలు గవర్నరు అంగీకరించుతాడా లేదా అనేది ప్రజాఉద్యమబలంమీద ఆధారపడి ఉంది.

ప్రజాఉద్యమం నానాటికీ ముందుకు బోతూ ఉంటే, గాంధీజీ ఇట్టి సంస్కరణలను అమలుజరుపుతానన్నాడు. కాని ప్రజా ఉద్యమం ఇందుకు అవకాశమియ్యలేదు. 1920 మొదటి ఆరునెలలలోనే 200 సమ్మెలలో 15 లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు. యుద్ధకాలంలో మహమ్మదీయులలో రగుల్కొన్న సామ్రాజ్యవాద వ్యతిరేకత ఇంకా వ్యాపించింది. ఇది

చివరకు ఖిలాఫతు ఉద్యమంగా పరిణితి జెందింది. 1914 యుద్ధానికి పూర్వం, ఇప్పటి పాలస్టయిన్, ట్రాన్స్‌జార్డోనియా, సిరియా, ఇరాక్ మొదలైన అరబ్బుదేశాలు, గ్రీస్‌లోని థ్రేస్ టర్కీ-సామ్రాజ్యంలో ఉండేవి. టర్కీ చక్రవర్తిచే పరిపాలింపబడేది. ఈ చక్రవర్తి మహమ్మదీయు లంద రికీ మతాధికారి గూడాను. అందుచే ఇతనిని ఖలీఫా అంటారు. టర్కీ ఆ యుద్ధంలో జర్మనీతో కలిసి, బ్రిటను, ఫ్రాన్సులకు వ్యతిరేకంగా పోరా డింది అందుచే టర్కీ-సామ్రాజ్యంలోని అరబ్బుదేశాలకు స్వాతంత్ర మిస్తామని ఆశపెట్టి, బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు టర్కీని ఓడించ దానికి అరబ్బుప్రజల సహాయం తీసుకున్నారు. కాని యుద్ధం అయిన తర్వాత ఈ దేశాలకు సంరక్షితరాజ్యాలని (Mandates) పేరుపెట్టి, పంచుకున్నారు. థ్రేస్‌ను గ్రీస్‌దేశాని కిచ్చివేశారు. మిత్రరాజ్యాల కమిటీ నొకదానిని పెట్టి, టర్కీ-సుల్తాన్ దానికి లొంగి ఉండే కీలుబొమ్మలాగా చేశారు. టర్కీ-సుల్తాన్ ఆధిపత్యం క్రింద పై మహమ్మదీయదేశాలన్నిటినీ ఉంచి, తిరిగి ఖిలాఫతును (Caliphate) పునరుద్ధరించమని, భారత మహమ్మదీయులు కోరారు. ఈ ఉద్యమాన్నే ఖిలాఫతు ఉద్యమం అని అంటారు. టర్కీలో కెమాల్‌పాషా నాయకత్వంక్రింద ప్రజాస్వామ్య శక్తులు ఐక్యమయి, బ్రిటిషువారి కీలుబొమ్మగా ఉన్న టర్కీ-సుల్తానును పడగొట్టి, స్వతంత్ర ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి ప్రయ త్నించుతూ ఉన్నాయి. ముస్లిము దేశాలకు బానిసత్వ చిహ్నమైన టర్కీ-సామ్రాజ్యం కూలిపోయింది. అరబ్బుదేశాలు బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యా లలో చేరినాయి. ఇట్టి పరిస్థితులలో ఖిలాఫతును పునరుద్ధరించమని కోరడ మంటే, టర్కీలోని ప్రజాస్వామ్య శక్తులకు హానిచేయడమన్నమాట. అరబ్బుదేశాలను బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల బానిసత్వాన్ని వదలి, టర్కీ-సామ్రాజ్యపు పూ్యడలు బానిసత్వాన్ని స్వీకరించమనడ మన్నమాట. ఖిలాఫతు నాయకుల దృష్టి ఏదైనా, భారతమహమ్మదీయుల అభిప్రాయం ఏమంటే, మధ్య ఆసియాలోని మహమ్మదీయులకు బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యవాదులు అన్యాయం చేశారని మాత్రమే. బ్రిటిషు సామ్రాజ్య వాదులు భారతీయులకు చేస్తున్న అన్యాయం యడల, భారతమహమ్మదీ యులకున్న అసంతృప్తికి ఇది తోడయింది. మహమ్మదీయ ప్రజా సామాన్యం రాజకీయంగా వెనుకబడి ఉండుటచే, ఈ సామ్రాజ్యవాద వ్యతి రేకత, ఖిలాఫతులాంటి మతోద్యమంగా బయటపడింది.

1920 జనవరిలో కాంగ్రెసు, ఖిలాఫతు ఉద్యమాలకు ఐక్యత కుదిరెను. 1857 తర్వాత హిందువులు, మహమ్మదీయులు స్వాతంత్ర్య పోరాటంలో ఐక్యమయి పనిచేసిన దిదేసమయం. సెప్టెంబరులో జరిగిన కలకత్తా ప్రత్యేక కాంగ్రెసులో అహింసాత్మక ఆసహాయోద్యమ తీర్మానం ఆమోదించబడింది. మితవాదులు కాంగ్రెసును వదలిపెట్టిపోయి, లిబరలు ఫెడరేషనును యేర్పరచుకొన్నారు. నవంబరులో జరిగిన నూతన శాసన సభల ఎన్నికల బహిష్కరణ జయప్రదమయింది. 100 కి 25 జట్లుగూడ పోలుగాలేదు. విద్యార్థులు కాలేజీలను బహిష్కరించి బయటికివచ్చి, ఉద్యమంలో పాల్గొన్నారు. కొంతమంది లాయర్లు, ప్రభుత్వోద్యోగులు తమ వృత్తులను వదలివేశారు. హిందువులు మసీదులలో ఉపన్యసించారు. హిందూ - ముస్లిం ఐక్యత అంత గాఢంగా యేర్పడింది.

30 వేలమంది జైళ్ళలో పెట్టబడ్డారు. గాంధీజీని అరెస్టుచేయడానికి ప్రభుత్వం భయపడి, బయటనే ఉంచింది. శాసనోల్లంఘనం ఆపితే, రాజకీయ ఖైదీలను వదలిపెడతానంటూ రాయబారాలు సాగించింది. ఉద్యమంలో ఆఖరిమెట్టయిన పన్నుల నిరాకరణకోసం ప్రజలు యెదురుచూస్తున్నారు. ఉద్యమంయొక్క ఈ స్థాయినిచూచి, పన్నుల నిరాకరణ ప్రారంభించడానికి గాంధీజీ భయపడ్డాడు. గుంటూరుజిల్లాలో అఖిల భారత కాంగ్రెసు వర్కింగుకమిటీ అనుమతిలేకుండానే పన్నుల నిరాకరణ ప్రారంభమయితే, దాన్ని గాంధీజీ ఆపివేశాడు. గుజరాతులో బార్డోలీ తాలూకాలో ఒకచోటమాత్రం పన్నుల నిరాకరణ ఆరంభించారు. కాని యింతలో సంయుక్తరాష్ట్రాల్లో చౌరీచౌరా అనే గ్రామంలో పోలీసుల దౌర్జన్యాలను సహించలేక, ప్రజలు 20 మంది పోలీసులను తగులబెట్టి చంపారు. దీనితో 1922 ఫిబ్రవరి 12 వతేదీన బార్డోలీలో వర్కింగుకమిటీ సమావేశమై, ఊరేగింపులను బహిరంగసభలను ఆపివేయవలెననీ, విద్యావ్యాప్తి మొదలైన నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించమని తీర్మానించింది. దీనితో దేశంలో స్వాతంత్ర్యప్రియులలో పెద్ద అసంతృప్తి కలిగింది. కాని వర్కింగుకమిటీ ఆజ్ఞను శిరసావహించారు. ప్రజావుద్యమం ఈవిధంగా విచ్ఛిన్నం చేయబడింది. దేశంలో నిస్పృహ వ్యాపించింది. ఇంక ఫరవాలేదని ప్రభుత్వం మార్చి 10 వతేదీన గాంధీజీని అరెస్టుజేసి 6 ఏండ్ల శిక్షను విధించింది.

## హైదరాబాదులో వుద్యమం

1921 - 22 లలో బ్రిటిషు ఇండియాలో జరిగిన ఈ ప్రజావుద్యమ ప్రభావం హైదరాబాదు రాష్ట్రంమీదగూడ పడింది. ఇక్కడగూడ విద్యాధికులు ప్రజాస్వామ్య హక్కులకోసం ఆందోళనసాగించ మొదలుపెట్టారు. 1331 ఫసలీ (1921) లో హైదరాబాదు స్టేటు రిఫారమ్సు అసోసియేషను అను సంస్థయొకటి రాజ్యాంగసంస్కరణలను సాధించేఉద్దేశంతో స్థాపింపబడింది. రాజ్యాంగ సంస్కరణలకోసం ఆందోళనచేయడానికి ఈ సంఘం ఒక మహాసభను జరుపడానికి ప్రయత్నించింది. ప్రభుత్వం అందుకు అనుమతి యియ్యలేదు. అంతేగాక, రాజకీయ మీటింగులుగాని, రాజకీయాలకు దారిదీసే యే యితర మీటింగులుగాని జరుపగూడదని ఫర్మాను జారీ చేయబడింది. దీనివల్ల రాజకీయ మీటింగులేగాక, యే యితర అభివృద్ధి దాయకమైన విషయానికి సంబధించిన మీటింగైనా నిరోధింపబడింది. ఈవిధంగా పౌరసత్వ హక్కులు పూర్తిగా అరికట్టబడినాయి.

బ్రిటిషు ఇండియాలో ప్రజాఉద్యమం చాల తీవ్రంగా ఉన్నప్పుడు, విద్యాధికులను సంతృప్తిపరచడానికి నైజాంరాష్ట్రప్రభుత్వం 1929 ఫసలీలో (1919) సంస్కరణలనుగూర్చి రిపోర్టు తయారుచేయడానికి, హైకోర్టు జడ్జీ రాయ్‌బాలముకుందును నిర్ణయించింది. ఇతడు తయారుచేసిన రిపోర్టును ప్రభుత్వం మూలబెట్టింది. ఈవిషయంలో నైజాం సంస్థాన ప్రభుత్వం బ్రిటిషు సామ్రాజ్యవాదుల రాజనీతినే అనుసరించింది. ప్రజాఉద్యమంబ ముమ్మరంగా ఉన్నప్పుడు, దాన్ని చీల్చడంకోసం ప్రజల్లో ఆశ పురికొల్పడానికి సంస్కరణలు ప్రవేశపెడతామని ఒక బ్రహ్మాండమైన ప్రకటన చేయడం జరుగుతుంది అందుకు ఒక విచారణ కమిటీ వేయబడుతుంది. ప్రజాఉద్యమంలో చీలికలు కలుగజేయడానికి ప్రభుత్వ జోహుకుందార్లకు పోరాటం లేకుండానే హక్కులు వస్తాయని ప్రచారానికి ఆయుధం దొరుకుతుంది. మితవాదులు తటతటాయిస్తారు. తీవ్రవాదులు ప్రభుత్వంయొక్క కుతంత్రాన్ని బట్టబయలుజేస్తారు. ప్రభుత్వం ఒకవైపున సంస్కరణలు ప్రవేశపెడతామని ప్రకటనజేస్తూ, ప్రజాఉద్యమంలోని కలవరాన్ని ఉపయోగించుకొని మరొకవైపున తీవ్రనిర్బంధ విధానం ప్రవేశపెట్టి, ప్రజా ఉద్యమాన్ని అణచివేస్తుంది. ఇంతలో రిపోర్టు పూర్తిఅవుతుంది. ప్రకటనలో చూపిన ఆశలు, రిపోర్టులో కొంతవరకు చల్లార్చబడతాయి. అటు తర్వాత రిపోర్టు బిల్లుగా తయారయి శాసనంగా తయారయ్యేటప్పటికి మరికొంత

కాలం గడుస్తుంది. రిపోర్టులోని మరికొన్ని ప్రజానుకూల విషయాలు ఎగిరిపోతాయి. ప్రజలహక్కులు నామమాత్రంగా అంగీకరించబడిన ఈ సారంలేని సంస్కరణలు ప్రవేశపెట్టబడతాయి. ప్రజాఉద్యమం తల యెత్తిన ప్రతిసారి జరిగే తంతుఇది. మన దేశచరిత్ర దీనినే రుజువు చేస్తుంది. 1905 లో బెంగాలు విభజనమీద విదేశవస్తు బహిష్కరణోద్యమం వచ్చినప్పుడు, 1909 లో మింటో - మార్లే సంస్కరణలు ప్రవేశపెట్టబడినాయి. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత వచ్చిన ప్రజా ఉద్యమాన్ని చీల్చడానికి 1917 లో మాంటెగ్యూ ప్రకటన, 1918 లో రిపోర్టు తయారవడం, 1919 లో శాసనం చేయబడటం, 1920 లో వాటిని అమలులోపెట్ట ప్రయత్నించడం, జరిగింది. 1930-32 శాసనోల్లంఘ నోద్యమాన్ని చీల్చడానికి, 1928 లో సైమన్ కమిటీ నియామకం, రెండు రౌండ్ టేబుల్ కాన్ఫరెన్సులుజరిగాయి. చివరకు 1935లో చట్టంచేయ బడింది. బ్రిటిషుసామ్రాజ్యవాదుల ఈఎత్తుగడలనే, నైజాం ప్రభుత్వంగూడ అనుసరించింది. కాని ఒకభేధంమాత్రముంది. బ్రిటిషు ఇండియాలో ప్రజాఉద్యమం బలంగా ఉండుటచే, ప్రజలను మభ్యపరచడానికి ఏవో కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టాల్సి వచ్చింది, కాని హైదరాబాదుసంస్థానంలో ఉద్యమం విద్యాధికులనుదాటి ప్రజలలోకి పోనందున, తాత్కాలికంగా ముఖం తప్పించడానికి కమిటీని వేయడం, ఆకమిటీ తయారుచేసిన రిపోర్టును చివరకు ప్రకటించకుండాకూడ మూలపెట్టడం, హైద్రాబాదు ప్రభుత్వం చేస్తూవుంది. రాయ్ బాలముకుందుగారి రిపోర్టుకు ఇదేగతి పట్టింది.

తరువాత 1921-22 శాసనోల్లంఘనోద్యమ ప్రభావంవల్ల, హైదరాబాదు సంస్థానంలో ప్రజాఉద్యమం మొలకలెత్తింది. విద్యాధికులు "స్టేటు రిఫారమ్సు అసోసియేషన్"నుస్థాపించి ప్రజల్లో ఆందోళన మొదలుపెట్టారు. మరల వీరికి ఆశగొల్పడానికి, రాయ్ బాలముకుందుగారి రిపోర్టు ననుసరించి ఒక స్కీమును తయారుచేయమని 1922 లో ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీలో సభ్యులు నవాబ్ సర్ నిజామత్ జంగ్ బహద్దుర్, నవాబ్ తిలావత్ జంగ్ బహద్దురు, నవాబ్ సర్ హైదరు నవాజుజంగ్ (సర్ అక్బరు హైదరీ) రాజాబహద్దరు కృష్ణమాచారి గారలు. ఈ కమిటీవారుగూడ తమ నివేదికను పంపారు. ఇంతలో 1922 ఫిబ్రవరిలో బ్రిటిషుఇండియాలోని ఉద్యమం ఆపివేయబడింది. ఇంక ప్రమాదం

లేవని నైజాంప్రభుత్వం ఈ రిపోర్టును గూడ ప్రకటించకుండానే మూల పడవేసింది.

అందువల్ల 1333 ఫసలీ 1923లో "స్టేటురిఫారమ్సుఅసోసియేషను" అప్పటి లెజిస్లేటివుకౌన్సిలును విస్తరించడానికి ఒక స్కీమును తయారుజేసి ప్రభుత్వానికి పంపింది. అందుకు బాబేహుకూమత్ అధ్యక్షునివద్దకు రాయబారం వెళ్ళడానికి కూడ నిశ్చయించింది. దీనికి బదులుగా రాజకీయ సభలను నిషేధించుతూ చేయబడిన ఫర్మానుకన్న ఇంకా కఠినమైన 53 వ గస్తీ జారీచేయబడింది. దీనివల్ల అన్ని బహిరంగసభలు గూడ జరపడానికి ఆటంకంగల్గింది ఈ గస్తీప్రకారం విద్య, సాంఘికం మతసంబంధమైన ఎట్టి బహిరంగసభలకైనాసరే, ప్రభుత్వానికి 10 రోజులు ముందుగా తెలిపి అనుజ్ఞను పొందాలి. దీనిప్రకారమే చివరకు గ్రంధాలయముల వార్షికోత్సవములు, వర్తకసంఘముల సభలను, సంఘసంస్కారసభలను, మొదలైనవాటిని గూడ జరుగకుండా, అనేకచోట్ల ఆటంకపరచబడినవి. ఈగస్తీవల్ల ప్రజల్లో చాలఅసంతృప్తివచ్చింది. గస్తీనిరద్దుచేయుకమిటీ ఒకటిఏర్పడింది. ఈకమిటీతరపున రామచంద్రనాయకుగారి నాయకత్వంక్రింద ఒక రాయబారవర్గం ప్రభుత్వంతో మాట్లాడటానికి పంపబడింది. ఫలితం కలగలేదు. అందుచే హైదరాబాదుజిల్లా కాంగ్రెసుకమిటీ ఈ సమస్యను తీసుకొని, ప్రభుత్వానికి మరొకడెప్యుటేషనుపంపింది. కాని ఏమీ లాభంలేకపోయింది. ఈపాటికే బ్రిటిషు ఇండియాలో గూడ ఉద్యమం అణగిపోయింది. ఇక్కడ గూడ అంతటితో 53 వ గస్తీ వ్యతిరేకోద్యమం చల్లారిపోయింది.

కాని మనం బ్రిటిషు ఇండియాలో రాజకీయోద్యమానికి, హైదరాబాదు సంస్థానంలోని రాజకీయోద్యమానికి మధ్యఉన్న భేదాన్ని చూడాలి. 1920 - 22 ఉద్యమంలో ప్రజలతో ఎట్టిసంబంధముంచుకోకుండా, కోర్కెలను తీర్చమని ప్రభుత్వానికి పిటీషన్లు మాత్రం పెట్టే, సప్రూ జయకర్ లాంటి మితవాదులు కాంగ్రెసునుంచి వెళ్ళిపోయారు. పూర్తిగా ప్రజాసామాన్యాన్ని సమీకరించకపోయినప్పటికీ, ప్రజలను అహింస హద్దులలో బెట్టి ఉద్యమాన్ని సంకుచితపరచినప్పటికీ, ప్రభుత్వంమీద వత్తిడి తేవడానికి ప్రజలలో ఆందోళనచేసే గాంధీవాదుల చేతుల్లోకి ప్రజాఉద్యమం పోయింది. కాని హైదరాబాదు సంస్థానంలో సంస్కరణలకోసం జరిగిన ఆందోళనగాని, 53 వ గస్తీకి వ్యతిరేకంగా జరిగిన ఆందోళనగాని, కొద్దిమంది విద్యాధికులను మించి, ప్రజల్లోకి పోలేదు. వీరు ప్రజల్లోకి పోయే

వారు గాదు. బ్రిటిషు ఇండియాలోని మితవాదులవలె నిజాం సంస్థాన ప్రభుత్వానికి అర్జీలు, రాయబారాలు పంపడంతో ముగించేవారు. అందుచేత ఈ ఉద్యమం ప్రజలలో జొరబడలేదు. 1920 - 22 ఉద్యమాన్ని గాంధీజీ విచ్ఛిన్నం చేసినా, ప్రభుత్వం కౄరంగా అణచివేసినా, దీనివల్ల ప్రజల్లో రాజకీయచైతన్యం ఎక్కువ అయింది. స్వాతంత్ర్యకాంక్ష ఎక్కువ అయింది. ముందు ఉద్యమాభివృద్ధికి విప్లవసాంప్రదాయాలు ఏర్పడినాయి. కాని హైదరాబాదు సంస్థానంలో 1922 - 23 లో జరిగిన రాజకీయాందో ళన విద్యార్థులను మించిపోవకపోడంచేత, బ్రిటిషు ఇండియాలోలాంటి రాజకీయచైతన్యం ప్రజలలో కలుగలేదు. విప్లవసాంప్రదాయాలు ఏర్పడ లేదు. ఇప్పుడు హైదరాబాదులో విద్యార్థులకు సైతం ఇటువంటి ఆందో ళన జరిగిందనే తెలియదు.

# 3. ఆంధ్రమహాసభ పుట్టుక

1922 ఫిబ్రవరిలోనే శాసనోల్లంఘ నోద్యమం ఆపివేయబడింది. కాని హైదరాబాదు సంస్థానంలో విద్యార్థులు మాత్రం 1923 లో గూడ రాజ్యాంగ సంస్కరణలకోసం, 53వ గష్తికి వ్యతిరేకంగాను కొంతఆందో ళన చేశారు. ఈ ఆందోళనగూడ ప్రభుత్వం వద్దకు రాయబారాలతోనే ముగిసిందిగాని, ప్రజాసామాన్యాన్ని సంఘటించడం జరగలేదు. అయినను విద్యార్థులలో గలిగిన ప్రజాతంత్ర భావాలు సంస్కరణవాద ధోరణిలో ముందుకు సాగాయి. ఈభావాలతోపాటు మొదటిసారిగా తమజాతి నాగరి కత యెడల అభిమానం మొలకలెత్తింది. మొదటిసారిగా తమజాతి అంటే చైతన్యం పుట్టింది.

1560 లో తళ్ళికోట యుద్ధంలో విజయనగరసామ్రాజ్యం విచ్ఛిన్న మయిన తర్వాతనుంచీ, మహమ్మదీయ రాజులక్రిందనో, లేక బ్రిటిషు సామ్రాజ్యవాదులక్రిందనో ఆంధ్రులు పరాధీనులయి ఉన్నారు. తమపూర్వ చరిత్రను మరచిపోయారు. తమ ప్రాచీన నాగరికత సాంప్రదాయాలను గూడ కొంతవరకు మరచిపోయారు. హైదరాబాదు సంస్థానంలో దేశ భాషలకు ప్రోత్సాహ మియ్యకుండా ప్రభుత్వం ఉర్దూనే ప్రజలమీద రుద్దుటవలన, విద్యార్థులు కొంతవరకు తెలుగుభాషనుగూడ మరచిపో యారు. బ్రిటిషు ఇండియాలోఉండే ఆంధ్రులకు తమజాతి చైతన్యం,

తమ భాష-నాగరికత-సాంప్రదాయాల యెడల అభిమానం, 1905 బెంగాలు విభజనకు వ్యతిరేకంగా భారతదేశమంతటా చెలరేగిన స్వదేశీఉద్యమంతో మొలకలెత్తినవి. తర్వాతనుంచి ప్రత్యేకాంధ్రరాష్ట్రంకోసం ఆంధ్రులలో ఆందోళన సాగుతూనే ఉంది. కాని హైదరాబాదు సంస్థానంలో ప్రజలు ఆర్థికంగా వెనుకబడి ఉండుటవల్ల, 1920-22 లో బ్రిటిష్ఇండియాలో జరిగిన బ్రహ్మాండమైన సత్యాగ్రహోద్యమం వరకూ, ఏరాజకీయోద్యమం రాలేదు. అందుచేత తమ జాతి చైతన్యం అప్పటివరకూ కలుగలేదు. 1920 లో హైదరాబాదు నగరంలో శ్రీ మాడపాటి హనుమంతరావుగారి నాయకత్వంక్రింద, ఆంధ్రులలో ఆంధ్రదేశము యెడల అభిమానాన్ని కలుగజేయటానికి, ఆంధ్ర భాష - నాగరికతల నభివృద్ధి జేయటానికి, "హైదరాబాదు ఆంధ్రజనసంఘం" అను పేరుతో ఒక సంస్థ స్థాపించ బడింది. తర్వాత వివిధజిల్లాలలో గ్రంథాలయాలు, వర్తకసంఘాలు మొదలైనవి స్థాపించబడినవి. వీటన్నిటి కార్యక్రమాన్ని సమన్వయ పరచుటకు 1923లో, ఆంధ్రులలో విద్యాధికులు కొందరు మాడపాటి హనుమంతరావు గారి నాయకత్వంక్రింద, హైదరాబాదులో సమావేశమయి ఒకే కేంద్ర సంస్థను నిర్మించపూనుకున్నారు. సంఘంపేరు, నిబంధనావళిని తయారు చేయడానికి నిర్ణయించబడింది. 27-6-32 ఫసలీన (1-4-43) వివిధ ప్రాంతాల ప్రతినిధులు సమావేశమయి, సంఘంపేరు "నిజాంరాష్ట్ర ఆంధ్రజన కేంద్రసంఘము" అని పెట్టడానికి అంగీకరించారు. నిబంధనావళిగూడ అంగీకరింపబడినది. "నిజాంరాష్ట్ర మండలి ఆంధ్రులయందు పరస్పర సానుభూతిని కల్గించి, వారి అభివృద్ధికై ప్రయత్నించుట" యీ సంఘంయొక్క వుద్దేశ్యము

"ఆంధ్రము మాతృభాషగా గలిగినవారైననూ, ఆంధ్రదేశమందు స్థిర నివాసము గలిగియుండి ఆంధ్రులమని చెప్పుకొనేవారైననూ ఆంధ్రులని పిలువబడుదురు" అని అంధ్రుడు అనే పదానికి నిర్వచనం ఇయ్య బడింది. నిజాంరాష్ట్రంలో ఉంటూ తెలుగుభాష మాట్లాడేవారికి, తెలంగానా ప్రాంతంలో నివసిస్తూ అంధ్రుడని చెప్పుకొనేవారికి దీనిలో స్థానంవుంది.

ఈ కేంద్ర సంఘంయొక్క ప్రథమ సమావేశం 20 షహరేవరు 1332 ఫసలీ (1923) లో జరిగింది. "నిజాంరాష్ట్ర అంధ్రజన సంఘం" అనుపేర గ్రామ సంఘాలు యేర్పరచడానికి, జిల్లాసంఘాలు యేర్పరచ డానికి నిర్ణయించబడింది. స్థానిక సంఘముల కార్యక్రమం :

(అ) గ్రంథాలయములను, పఠన మందిరాలను, పాఠశాలలను స్థాపించుట.

(ఆ) విద్యార్థులకు సహాయము, ప్రోత్సాహము యిచ్చుట.

(ఇ) విద్వాంసులను గౌరవించుట, సన్మానించుట.

(ఈ) తాళపత్ర గ్రంథములను, శాసనముల ప్రతులను సంపాదించుట; పరిశోధించుట.

(ఉ) కరపత్రములు. లఘు పుస్తకములు (చిన్ని పుస్తకాలు), ఉపన్యాసాలు—వీనిమూలాన విజ్ఞానాన్ని వ్యాపింపజేయుట.

(ఊ) ఆంధ్రభాషా ప్రచారానికై వలయు ప్రయత్నాలను సల్పుట.

(ఎ) వ్యాయామములను, కళలను ప్రోత్సహించుట.

(ఏ) అనాధలగువారికి అత్యవసరమగు సహాయం చేయుట.

ఈ పై కార్యక్రమంచూస్తే, ఈ సంస్థ రాజకీయాలతో సంబంధం లేని ఆంధ్ర నాగరికతను - ముఖ్యంగా భాషను - అభివృద్ధిజేసే వైజ్ఞానిక (Cultural) సంస్థ అని బోధపడుతుంది. దీనికి చివరకు సంఘ సంస్కరణలతో (వితంతు వివాహాలు, బాల్యవివాహాల నిరోధన వగైరా) గూడ సంబంధంలేదు. ప్రజలయొక్క ఆర్థిక కష్టాలనుగూర్చిన కార్యక్రమం అసలేలేదు. ఈ కార్యక్రమమంతా విద్యవచ్చినవారికి సంబంధించినదే. అందుచేత యీ సంస్థకు అప్పుడు కాయకష్టపడే రైతులు-కూలీలు-కార్మికులతో సంబంధంలేదు. అందుచే ఇది విద్యాధికులసంస్థగానే ఆరంభమైంది. గ్రంథాలయాలను స్థాపించడం, ఆంధ్ర రాజ్యాలకు సంబంధించిన నాణెములు, శాసనాలు, సంపాదించి వాటిని పరిశోధించడం, (ఆంధ్రుల ప్రాచీన నాగరికతకు పుట్టినిల్లు హైదరాబాదు సంస్థానమే) తాటియాకుల పుస్తకాలను సంపాదించడం, మొదలైన పనులను స్థానిక సంఘాలు, జిల్లా సంఘాలు, కేంద్రసంఘం చేస్తూవుండేవి.

"నిజాంరాష్ట్ర ఆంధ్రులు", "నిజాంరాష్ట్ర ఆంధ్రుల అభివృద్ధి మార్గాలు", "నిజాంరాష్ట్ర జనపరిగణము" అనే మూడు చిన్నపుస్తకాలు కేంద్ర సంఘం తరపున ప్రచురించబడినాయి. వీటివల్ల ఆంధ్రులు యెంత మంది యే యే జిల్లాలలో ఉన్నారో, వారు ఏ యే వృత్తులు అవలంబించుతున్నారో మొదలైన వివరాలు తెలుస్తాయి. వీటివల్ల ఆంధ్రజాతి చైతన్యం వృద్ధి అయిందని చెప్పవచ్చును.

వర్తకులకు కరోడ్గిరీ (కస్టమ్సు) ఉద్యోగులవల్ల అనేక బాధలు ఉండేవి. అంతేగాక గ్రామాలకు చిన్నిపట్టణాలకు ప్రభుత్వోద్యోగులు దౌరాకుబోయినప్పుడు వర్తకులవద్దనుండి డబ్బు చెల్లించకుండా సరుకులు తీసికోవడం మొదలైన కష్టాలు ఉండేవి. వీటిని పోగొట్టడానికి ఆంధ్ర జన కేంద్రసంఘం వర్తక సంఘాలనుగూడపెట్టి కొంత ఆందోళనచేసింది. ఈవిధంగా వర్తకులను తనవైపుకు ఆకర్షించింది.

ఈకాలంలోనే "నీలగిరి, తెలుగుపత్రిక, ఆంధ్రాభ్యుదయము, శైవ ప్రచారిణి, సుజాత, గోలకొండ" మొదలైన తెలుగు వార మాసపత్రికలు బయలుదేరినాయి. వీటికి ఆంధ్రజన కేంద్రసంఘం ఎంతో ప్రోత్సాహ మిచ్చింది. కేంద్రసంఘం ప్రథమాంధ్రమహాసభ 1930 లో జరిగేవరకూ ఇదే కార్యక్రమాన్ని అవలంబించింది. ఈదశలో కేంద్రసంఘం సాధిం చిన ముఖ్యమైన విజయమేమంటే, తమ నాగరికతను, భాషను చాలవరకు మరచిపోయిన విద్యాధికులను మేల్కొలిపింది. వారిలో ఆంధ్రజాతీయతను రేకెత్తించింది. నిజాంరాష్ట్రంలో ఆంధ్రులు స్వాతంత్ర్యం వైపుకు సాగిరావ డానికి ఇది మొదటిమెట్టుగా ఆయింది.

## హిందూమహమ్మదీయ కలహాలు

సామ్రాజ్యవాదులుగాని, ప్రజలను అణచిఉంచే మరే ఇతర పరిపాల కులుగాని, తమకు ఎంత మిలిటరీబలమున్నా, పశుబలంతో మాత్రమే తమ పెత్తనాన్ని కాపాడుకోలేరు ప్రజల్లో చీలికలు గల్గించి, వారిలో ఒక భాగాన్ని తమకు అండగా ఉంచుకొంటారు. అందుకు ప్రజల్లో అణగి ఉన్న మత, కులజాతి, విద్వేషాలను రెచ్చకొడతారు. ప్రజల్లో రాజకీయ చైతన్యం (తమ ప్రయోజనాలకు నిజమైన శత్రువులెవరో, మిత్రులెవరో తెలుసుకోగలిగిన జ్ఞానం) లేనపుడు, తాత్కాలికంగా పాలకుల ఎత్తుగడలు జయప్రదమవుతాయి.

బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఈ ఎత్తుగడలనే మనదేశంలో ఎంతో కాలంనుండి ఉపయోగించి, నేటికీ తమపెత్తనాన్ని కాపాడుకుంటున్నారు. మనదేశంలోఉన్నమతాలవారిలో హిందువులు, మహమ్మదీయులుముఖ్యులు, వీరిమధ్య కలహాలు పెడితేనేగాని, ఇక్కడ బ్రిటిషుసామ్రాజ్యవాదం నిలవ డానికి నీడవుండదు. అందులోనూ 1920-22 సత్యాగ్రహోద్యమంలో హిందువులు, మహమ్మదీయులు ఐక్యంగాపాల్గొన్నారు. బ్రిటిషుసామ్రాజ్య

వాదానికి భారతదేశంలో అంత్యదశ వచ్చిందా అనిపించింది. ఈ పరిస్థితుల్లో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, హిందూ మహమ్మదీయ కలహాలను రెచ్చగొట్టడానికి ప్రయత్నించారు. మొట్టమొదట 1921 లో మలబారులో హిందూ మహమ్మదీయ కలహాలు బయలుదేరాయి. మలబారు మహమ్మదీయులైన మాప్లాలు స్వాతంత్ర్యోద్యమానికి గాంధీజీ పెట్టిన సంకుచిత హద్దులలో ఉండలేకపోయారు. అందుచే వారు సాయుధతిరుగుబాటు చేశారు. దీనితోపాటు హిందూ జనసామాన్యం ముందుకు రాలేకపోయింది. ప్రభుత్వం ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని, హిందువులమీద మహమ్మదీయులలో అనుమానాలు పుట్టించింది. దీనితోపాటు కొంతమంది ముల్లాలను (మహమ్మదీయ మతగురువులు), పూజార్లను ఏజంట్లుగా ఉపయోగించి, మతోద్రేకాన్నిగూడ రెచ్చగొట్టినది. హిందూ మహమ్మదీయ కొట్లాటలు ఆరంభమయ్యాయి. ప్రజల్లోని ఈచీలికను ఉపయోగించుకొని, మాప్లాతిరుగుబాటును అతిక్రూరంగా అణచివేసింది. ఈఎత్తుగడ ఇక్కడ జయంపొందడంతో, ప్రతిచోట దానిని ఉపయోగించ మొదలుపెట్టింది. ఆసంవత్సరంలోనే బొంబాయి మద్రాసు నగరాలలో హిందూ మహమ్మదీయ కలహాలు తీవ్రంగా జరిగాయి. 1922 ఫిబ్రవరిలో గాంధీజీ సత్యాగ్రహోద్యమాన్ని ఆపివేశాడు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా హిందూ మహమ్మదీయ ప్రజాసామాన్యంలో ఉద్భవించిన ఈ స్వాతంత్రకాంక్షకు ఈవిధంగా గాంధీజీ అడ్డుకట్ట వేశాడు. ఆ స్వాతంత్రకాంక్ష ఆ అడ్డుకట్టను దాటలేకపోయింది. కనుక మరొకచోటున తెగగొట్టుకొని ప్రవహిస్తుంది. అది పిచ్చిమతోద్రేకంగా మారింది. మన హిందూదేశ చరిత్ర వల్ల హిందూ మహమ్మదీయుల మధ్య ఏర్పడి అణగిఉన్న మతతత్వం చెలరేగింది. హిందూ మహమ్మదీయ కలహాలు, సత్యాగ్రహోద్యమం తీవ్రంగా సాగిన పంజాబు బెంగాలు సంయుక్తరాష్ట్రాలలోనే, చెలరేగాయి. నాటినుండి నేటివరకూ ఈ కలహాలు ప్రతిసంవత్సరం అలవాటుగా భారతదేశంలో ఎక్కడో ఒకచోట జరుగుతునే ఉన్నాయి. ఈ హిందూ మహమ్మదీయ కలహాలు వెనుకబడిఉన్న హైదరాబాదు సంస్థానానికి గూడ వ్యాపించాయి. 1924 లో గుల్బర్గాహుమ్నాబాదులో మతకలహాలు జరిగాయి.

ఆర్యసమాజం మొదట హిందూమతంలో ఉన్న అస్పృశ్యత, వితంతువివాహాలు లేకపోవుట, బాల్యవివాహాలు మొదలైన దురాచారాలను పోగొట్టే ఉద్దేశంతోనే బయలుదేరింది. చాలకాలం సనాతనులతో ఈ

విషయంలో పోరాటం సల్పింది. కాని మొదటి సత్యాగ్రహోద్యమం (1920–22) విఫలమయిన నాటినుండి, వచ్చిన హిందూమహ్మదీయ కలహాలలో ఈసంస్థ హిందూమతంలోని దురాచారాలకు వ్యతిరేకంగా తన కార్యక్రమానికి ప్రముఖ స్థానమీయలేదు. మహమ్మదీయ తమ వ్యతిరేక ప్రచారానికి, మహమ్మదీయులను హిందూమతంలోకి కలుపుకోవడానికి ప్రాధాన్యత ఇచ్చింది. 1924 లో మహమ్మదీయమత మూలపురుషుడైన మహమ్మదుయొక్క వ్యక్తిగతజీవితాన్నిగూర్చి దూషిస్తూ "రంగీలా రసూల్" అనే పుస్తకంగూడ ప్రచురింపబడింది. మహమ్మదీయ మతావేశపరులైన కొందరు ముల్లాలుగూడ హిందూమతాన్ని దూషించడం, హిందువులను తమ మతంలోకి కలుపుకోవడం చేశారు. 1926 లో ఆర్యసమాజ ప్రముఖుడైన స్వామిశ్రద్ధానందు కాల్చిచంపబడ్డాడు. హిందూమహాసభ గూడ ఈరోజుల్లో తీవ్రమైన ముస్లిం వ్యతిరేక ప్రచారంచేసింది. హిందువులలో హింసూమతతత్వాన్ని రేకెత్తించింది. ఈవిధంగా ఆర్యసమాజం హిందూమహాసభ మహమ్మదీయ మతావేశపరులుఅంతా, బ్రిటిషుసామ్రాజ్యవాదులు రేగగొట్టిన మతకలహాలను పెంచి పోషించారు.

1920-22 ఉద్యమం ఆపివేయబడిన తర్వాత కాంగ్రెసులో శాసనసభలోకి వెళ్ళకుండా నిర్మాణకార్యక్రమం సాగించాలనే గాంధీవాదులు (నోఛేంజర్లు), శాసనసభలోకి వెళ్ళాలనే స్వరాజ్య వాదులు (మోతీలాల్ నెహ్రూ, సి. ఆర్. దాసు), అనే రెండుముఠాలుగా చీలిపోయింది. ఈ రెండు ముఠాలుగూడ ప్రజలయొక్క దైనందిన కోర్కెలను సంబంధించిన వాటిమీద, హిందూమహమ్మదీయుల నైక్యపరచే రాజకీయ కార్యక్రమంమీద ప్రజలను సమీకరించక, మతోద్రేకపరులకు పూర్తిఅవకాశాన్ని ఇచ్చినవి. అందుచేతనే మతకలహాలు తీవ్రంగా చెలరేగాయి.

## ఇత్తెహాదుల్ ముసల్మీన్ పుట్టుక

1914–18 యుద్ధానికిపూర్వం హైదరాబాదు సంస్థానంలో రాజకీయోద్యమమేలేదు. అందుచేత సంస్థానంలోని ప్రజలలో ఏదోఒక ప్రజాభాగాన్ని ఉంచుకోవాలని ప్రయత్నించాలిసిన అవుసరం పరిపాలకవర్గానికి రాలేదు. కాని భారతదేశంలో యుద్ధకాలంలోనూ, ఆతరువాతనూ చెలరేగిన స్వాతంత్రోద్యమం, హైదరాబాదు సంస్థానంలో దానియొక్క ప్రతిబింబంవల్ల, పరిపాలకులు అధికారాన్ని నిలుపుకోడానికి ప్రజల్లో ఏదోఒక

భాగంయొక్క అండకోసం ప్రాకులాడాలిసివచ్చింది. తాము మహమ్మదీయులు. సంస్థానంలోని మహమ్మదీయులు చాల మైనారిటీ. మహమ్మదీయులలోని విద్యార్థులకు ఎక్కువగా ఉద్యోగాలిచ్చి, వారిని అనుకూలం చేసుకోవడం, ఈవిధంగా ప్రభుత్వం మహమ్మదీయుల కనుకూలమైనదని మహమ్మదీయ ప్రజల్లో భ్రమలు కల్పించడం, మహమ్మదీయ ప్రజాసామాన్యాన్ని అభివృద్ధికరమైన ఉద్యమాలకు వ్యతిరేకంగా ఉపయోగించడం, తేలికైన పనిగా పరిపాలకవర్గం అనుకున్నారు. నాటినుంచి ఈఎత్తుగడ అవలంబించబడింది. దీనికి భారతదేశమంతటా జరుగుచున్న హిందూ మహమ్మదీయ మతకలహాలుగూడ తోడ్పడినాయి. అంతేగాక రాజకీయ సంస్కరణలకోసం సంస్థానంలో ఆరంభించబడిన ఉద్యమం ప్రజాసామాన్యంలోకి పోకపోవడమేగాక, 1923 సంవత్సరంతో పూర్తిగా ఆగిపోయింది. ఈ సంస్థానంలో 20 వశతాబ్దం ఆరంభంలోనే ఆర్యసమాజం ప్రవేశించింది. అప్పటినుండి ఏదో హిందూమత సంస్కరణలనుగూర్చి మాత్రం ప్రచారం చేసేది. కాని 1923 తర్వాతనుండీ రాజకీయోద్యమం మూలబడుటచే, హిందూవిద్యార్థులను ఆకర్షించడానికి దీనికి అవకాశంగల్గింది. మహమ్మదీయ మతానికి వ్యతిరేకంగా, బ్రిటిషు ఇండియావలెనే తీవ్ర ప్రచారం సాగించమొదలు పెట్టింది. ప్రభుత్వం మహమ్మదీయ మధ్యతరగతివారికి ఉద్యోగాలు ఎక్కువగా ఇయ్యడం, మహమ్మదీయ మత సంస్థలకు ధనసహాయంచేయడం, తెలుగు, మహారాష్ట్రం, కన్నడం మొదలైన దేశభాషలకు సరియైన స్థానమివ్వక కొద్దిమందిగాఉన్న మహమ్మదీయుల మాతృభాషయైన ఉర్దూను స్కూళ్ళు కాలేజీలలో విద్యగరపే భాషగా (medium of instruction) చేయడం, మొదలైన పనులను చేసింది. ఇది హిందూ మధ్యతరగతివారిని ఆకర్షించడానికి ఆర్యసమాజానికి చక్కని అవకాశం కలుగజేసింది.

ఈపరిస్థితులలో కొంతమంది మహమ్మదీయ విద్యార్థులు, జాగీరుదార్లు 7 దై 1337 ఫసలీన (1927 నవంబరు) మోల్వీ మహమద్ నవాజ్ ఖాన్ ఖిల్లేదారుగారి గృహంలో సమావేశమయ్యారు. మహమ్మదీయుల ఆర్థిక నైతిక సామాజిక స్థితిని బాగుచేయడమనే ఉద్దేశ్యంతో, ఇత్తెహాద్ బయ్యన్ముసల్మీన్ అనే సంస్థను స్థాపించారు. దీని ఆశయంలో రాజకీయాలను గూర్చినదేదియూ లేదు. ఏ వైజ్ఞానిక సంస్థకైనా ఉండే ఆశయం లాంటి ఆశయంతోనే ఈ సంస్థ ప్రారంభమయింది. ఈ సంస్థ ఆరంభ

మవడానికి కారణం 1920 తరువాతనుండీ యీ సంస్థానంలోని మహమ్మ దీయ విద్యార్థులలో గలిగిన జాగృతి, నిరంతరం భారతదేశమంతటా జరుగుచున్న హిందూ మహమ్మదీయ కలహాలే. బ్రిటిషు ఇండియాలో ముస్లిములీగును అనుసరించియే ఈ సంస్థ యేర్పడింది. కాని మరు సంవత్సరం ఈ సంస్థలో పెద్ద మార్పువచ్చింది.

1914 – 18 యుద్ధకాలంలో బ్రిటిషు పరిశ్రమలన్నీ యుద్ధావసరాలను ఉత్పత్తి చేయడంలో నిమగ్నమయి ఉండేవి, పైగా అక్కడి వస్తువులు ఇండియాకు తీసుకురావడానికిగూడా రవానా సౌకర్యాలు లేవు. అందుచేత ఆకాలంలో భారతదేశంలో బట్టలమిల్లులు, ఇనుప పరిశ్రమ అభివృద్ధి అయినాయి. ప్రథమ సత్యాగ్రహోద్యమం జరుగుతున్నసమయంలోనూ, అటుతర్వాత కొంత కాలంవరకూగూడ నూతన భారత పరిశ్రమలపై ప్రభుత్వం దెబ్బతీయడానికి సాహసించలేకపోయింది. ఉద్యమం పూర్తిగా అణగిపోయిందని విశ్వాసం కలిగినతర్వాత భారత పరిశ్రమలకున్న రక్షణలు కొన్ని (Tariff) బ్రిటిషు వస్తువులమీద తగ్గించియూ, భారత పరిశ్రమలమీద పన్నును విధించియూ, వాటిని దెబ్బతీయడానికి పూనుకొంది. దీనికి వ్యతిరేకంగా ప్రజల్లోవచ్చే అసంతృప్తిని చల్లార్చడానికి, మరల రాజ్యాంగ సంస్కరణల నాటకాన్ని ఆడటానికి ప్రారంభించింది. 1920 లో ప్రవేశపెట్టబడిన మాంటేగ్యూ - చెమ్స్‌ఫర్డు సంస్కరణలు యెలా పనిచేశాయో, ఇకముందు యెటువంటి సంస్కరణలను ప్రవేశపెట్టాలో ఆలోచించడానికి, సైమన్ కమిషన్ వేశామంటూ 1927 నవంబరులో బ్రిటిష్‌ప్రభుత్వం ప్రకటించింది. కాంగ్రెసు దీనిని బహిష్కరించ నిశ్చయించింది. ఈ కమిటీ 1928 ఫిబ్రవరిలో భారతదేశంలో దిగింది. దీనిని ప్రతిచోట నల్లజెండాల ప్రజా ప్రదర్శనాలు ఎదుర్కొన్నాయి. అనేకచోట్ల లాఠీచార్జీలు కాల్పులు జరిగాయి. 1922 లో అణగిపోయిన ప్రజాశక్తి ఒక్కసారిగా భారతదేశమంతటా తిరిగి లేచింది. దీనితో హైదరాబాదు పరిపాలకవర్గం మేల్కొని, తమ అధికారాన్ని రక్షించుకోడానికి మహమ్మదీయ జాగీరుదార్లను విద్యార్థులను సమీకరించడానికి సమకట్టింది. దీనిఫలితమే 9 దై 1333 ఫసలీన ఇత్తెహాదు బయ్యన్ ముసల్మీన్ సమావేశంలో జరిగిన మార్పులుగూడా. ఆ సమావేశంలో ఈ సంస్థకు ఇత్తెహాదుల్ ముసల్మీన్ అనే పేరు మార్పుజరిగింది. దానికన్న

ముఖ్యమైన విషయమేమంటే, సంస్థయొక్క ఆశయాలలో మార్పు. ఈ సమావేశంలో అంగీకరింపబడిన ఆశయాలు :

(1) మహమ్మదీయులలోని వివిధముఠాలను, మహమ్మదీయమత సంరక్షణకు, మహమ్మదీయ సిద్ధాంతాల ననుసరించి, ఐక్యపరచుట.

(2) మహమ్మదీయుల ఆర్థిక, సాంస్కృతిక (Cultural), సామాజిక పద్ధతులను రక్షించుట.

(3) దేశం, సంస్థానాధీశునియందు భక్తితో ఉండుట. ప్రస్తుతమున్న రాజ్యాంగపద్ధతిని రక్షించుట.

ఈ ఆశయాలు పూర్తిగా ప్రజాస్వామ్య విరుద్ధమయినవనీ, అభివృద్ధి నిరోధకమైనవనీ, ఈ ఆశయాలను చూస్తేనే అర్థమవుతుంది. నిరంకుశ పరిపాలనను రక్షించడానికి, మహమ్మదీయులలోని వివిధముఠాలన్నీ ఏకంగావడమే ఆ ఆశయములయొక్క అర్థం. అప్పటినుండీ ఇత్తెహాదుల్ ముసల్మీన్ అభివృద్ధికరమైన ప్రజా ఉద్యమానికి వ్యతిరేకంగా పరిపాలక వర్గంచేత ఉపయోగింపబడుతోంది. కాని ఈ సంస్థ ఇంకనూ మహమ్మదీయ ప్రజాసామాన్యంలోకి జొరబడలేదు. ఇంకనూ ఈ సంస్థ విద్యాధికుల సంస్థగానే ఉంది.

## రెండవ సత్యాగ్రహోద్యమం (1930-34)

రాజ్యాంగ సంస్కరణల రిపోర్టుకోసం సామ్రాజ్యవాదులు సైమన్ కమీషన్‌ని వేస్తే, భారతదేశంయొక్క వివిధరాజకీయపార్టీలు తమ ప్రతినిధులతో గూడిన అఖిలపక్ష సమావేశాన్ని జరిపి, భావిభారత రాజ్యాంగ విధానాన్ని తయారుచేయడానికి నిర్ణయించాయి. 1927 లో మద్రాసులో సమావేశమయిన కాంగ్రెసు, దీనిలో పాల్గొనడానికి అంగీకరించింది. దానితోపాటు జవాహరులాల్ నాయకత్వంక్రింద యువకుల పట్టుదలవల్ల సంపూర్ణ స్వాతంత్రమే కాంగ్రెసుయొక్క ఆశయమని, ప్రథమపర్యాయం, తీర్మానించబడింది. అంతవరకు అధినివేశప్రతిపత్తి (Dominion Status) కాంగ్రెసు రాజకీయ ఆశయంగా ఉండేది. అఖిలపక్ష సమావేశంలో మోతీలాల్‌నెహ్రూ ఆధ్వర్యం క్రింద రిపోర్టును వ్రాయడానికి ఒక కమిటీ వేయబడింది. నెహ్రూకమిటీ ఒకరిపోర్టును తయారుచేసింది. దానిలో అధినివేశప్రతిపత్తి కావాలని వ్రాయబడింది. మహమ్మదీయ ప్రతినిధులు మహమ్మదీయులకు కొన్నిస్థానాలను ప్రత్యేకించాలనీ, వాటికి ప్రత్యేక ఎన్ని

కలు జరగాలనీ (Separate electorate) కోరారు. దానికి ఇతరపార్టీల ప్రతినిధులు అంగీకరించలేదు. అందుచే మహమ్మదీయ ప్రతినిధులు నెహ్రూ రిపోర్టును అంగీకరించలేదు. 1928 లో జరిగిన కలకత్తా కాంగ్రెసునాటికి సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమంవల్ల, సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనే తీవ్రవాదులు బలపడ్డారు. గాంధీజీ నాయకత్వం క్రింద కాంగ్రెసు లోని మితవాదులు ఒకతీర్మానం తీసుకువచ్చారు. నెహ్రూరిపోర్టును అంగీక రించడంవల్ల సంపూర్ణ స్వాతంత్ర్యాశయాన్ని వదులుకొన్నట్లుగాదనీ, 1929 డిసెంబరు 31 లోగా ప్రభుత్వం అధినివేశస్వాతంత్ర్యం ఇయ్యకపోతే, సత్యాగ్రహోద్యమం ప్రారంభించబడుతుందనీ ఆతీర్మానంయొక్క సారాంశం. నెహ్రూ రిపోర్టు పనికిరాదనీ, సంపూర్ణస్వాతంత్ర్యమే తక్షణ ఆశయమనీ అతివాదులు సవరణపెట్టారు. చాల కొద్దిఓట్ల భేదంతోనే ఈ సవరణ ఓడి పోయింది, సంవత్సరం కాలం గడచిపోయింది. సామ్రాజ్యవాదులు ప్రజా ఉద్యమాన్ని అణచడానికి వారిప్రయత్నాలు వారు చేసుకుంటున్నారు. కాని అధినివేశప్రతిపత్తి ఇయ్యడానికి అంగీకరించలేదు. 1929 డిసెంబరులో లాహోరు కాంగ్రెసు జరిగింది. సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం, అందుకు సత్యాగ్రహోద్యమం ప్రారంభించడం, అంగీకరించబడింది.

ఈసారి సత్యాగ్రహోద్యమ పోరాటసమయంలో, భారతరాజకీయ రంగంలోకి ఒక కొత్త స్వతంత్రమైన రాజకీయశక్తి స్వతంత్రరాజకీయ కార్యక్రమంతో ప్రవేశించింది. అదే భారతకార్మికవర్గం; దాని రాజకీయ పార్టీ కమ్యూనిస్టుపార్టీ. బొంబాయి, కాన్పూరు, కలకత్తా మొదలైన పారిశ్రామిక కేంద్రాలలో పెద్దపెద్ద కార్మికయూనియనులు ఉద్భవిం చాయి. బొంబాయిలోని గిర్నికాంగారు యూనియనులో 63000 మంది సభ్యులుండేవారు. కలకత్తా కాంగ్రెసు సమయంలో కమ్యూనిస్టుపార్టీ నాయ కత్వంక్రింద 20,000 మంది కార్మికులు కాంగ్రెసుపెండాలువద్ద సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనీ అందుకు ప్రజాపోరాటం వెంటనే ఆరంభించాలనీ నినాదాలిస్తూ, ప్రదర్శనం చేశారు. దేశం పోరాటానికి ఇంత సంసిద్ధంగా ఉంటే, గాంధీజీ పోరాటాన్ని ఒక సంవత్సరం వాయిదావేశాడు. సామ్రాజ్య వాదులకు ప్రజాశక్తులను చీలదీసి కొట్టడానికి మంచి అదును చిక్కింది. ముందుగా విప్లవశక్తియైన కార్మికవర్గం మీద దానిపార్టీయైన కమ్యూనిస్టు పార్టీమీద నిర్బంధవిధానం సాగించింది. పి. సి. జోషీ, జి. అధికారి, డాంగే, ఘాటే, ముజఫర్ అహమద్ మొదలైన కమ్యూనిస్టు నాయకులను

1929 లో అరెస్టుచేసి, మీరటు కుట్రకేసు పెట్టింది. పైవారిలో ముగ్గురు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులుగూడా. తరువాత అనేకసమ్మెలు జరిగాయి. వాటిని దారుణంగా ప్రభుత్వం అణచివేసింది. ఈ విధంగా సత్యాగ్రహోద్యమం ప్రారంభం కాకముందే, కార్మికవర్గాన్ని తీరనిదెబ్బ గొట్టింది.

1930 జనవరి 26 ప్రథమసారిగా స్వాతంత్ర్యదినోత్సవంగా జరుప బడింది. నాటినుండి నేటివరకూ జనవరి 26 స్వాతంత్ర్యదినంగా జరుప బడుతుంది. తరువాత ఉద్యమానికి సన్నాహాలు చేయబడినవి. ఉప్పు సత్యాగ్రహం ఏప్రిల్‌లో ఆరంభమయింది. గాంధీజీ తన 1920 అనుభవం వల్ల, ప్రజలను సమూహంగా పోరాటంలో పాల్గొననీయక మొదటనుండీ ఆటంకపరుస్తున్నా, పన్నుల నిరాకరణమాట తలపెట్టకపోయినా, ఈ ఉప్పు సత్యాగ్రహం సైతం ప్రజలలో ఎంతో స్వాతంత్ర్యావేశాన్ని గలుగజేసింది. ఉద్యమం కొద్దికాలం సాగినతర్వాత ప్రజలు తమంతట తామే చొరవ తీసుకో మొదలిడారు. అనేకచోట్ల కార్మికసమ్మెలు, బహిరంగసభలు, ప్రదర్శనాలు జరిగాయి. సంయుక్త రాష్ట్రాలలో జమీందార్లకు, రైతులు పన్నులివ్వ నిరాకరించడం అక్కడక్కడ జరుగుతోంది. అన్నిటికన్న ముఖ్యమయినది ఏమంటే, బ్రిటిషుప్రభుత్వం తన పెత్తనాన్ని కాపాడు కోడానికి ప్రధానంగా ఏ పశుబలంమీద ఆధారపడిందో, అదే నేడు వారి కెదురైంది. 1930 లో గరవాలీ సైనికులు (హిందువులు) పెషావరులో మహమ్మదీయ జనసమూహంమీద తుపాకులు పేల్చడానికి నిరాకరించారు. ఈ సంవత్సరంలోనే చిట్టగాంగులో టెర్రరిస్టులు ఆయుధాగారదోపిడీ చేశారు. 10 నెలలలోనే 90 వేలమంది పురుషులు, స్త్రీలు, పిల్లలు జైళ్ళలో ఉంచబడ్డారు. అనేకచోట్ల లాఠీచార్జీలు, తుపాకి కాల్పులు జరిగాయి. గాంధీజీకి ఉద్యమం చేతులుదాటి పోతున్నట్లుగా ఉంది. సామ్రాజ్యవాదులు గూడ అనుకోనంత తీవ్రంగా ఉద్యమం వ్యాపించింది. వారు ఉద్యమా న్నణచడానికి చేసిన తయ్యారీ సరిపోలేదు. ప్రజా ఉద్యమాన్ని చీల్చడానికి వారు సమావేశపరచిన రౌండుటేబిలు కాన్ఫరెన్సు ఒక దిష్టిబొమ్మగా తయా రయింది. సామ్రాజ్యవాదులు ఉద్యమాన్ని అణచడానికి తయ్యారయ్యేందుకు వ్యవధి కావాలసివచ్చింది. 1930 లోనే రాయబారాలు సాగినాయి. 1931 జనవరి 26 న గాంధీజీ వర్కింగుకమిటీ సభ్యులు వదలిపెట్టబడ్డారు. మార్చి 4 న గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరిగింది. పోరాటం తాత్కాలి

కంగా ఆపివేయబడింది. నానాటికీ వ్యాపించుతూ ఉన్నతస్థాయికి పోతున్న ప్రజాఉద్యమానికి దెబ్బతగిలింది. ఏరౌండుటేబుల్ కాన్ఫరెన్సును అయితే మొదట నిరశించిందో, దానిలోనే కాంగ్రెసు ఇప్పుడు పాల్గొంది. దీన్ని కార్మికులు, యువకులు వ్యతిరేకించారు. గాంధీజీ రౌండుటేబులు కాన్ఫరెన్సుకు పోతూ ఉంటే, దాన్ని నిరశిస్తూ బొంబాయిలో కార్మికులు పెద్ద ప్రదర్శనం చేశారు. సామ్రాజ్యవాదులు ఒకవైపున రౌండుటేబులు నాటకం సాగిస్తూనే, రెండవవైపున ఉద్యమాన్నణచడానికి తమ నిర్బంధ యంత్రాన్ని బలపరచుకొన్నారు. ఆ సమావేశంలో తాము స్వాతంత్ర మియ్యడానికి ముందు, భారత ప్రతినిధులను ఒక ఐక్యస్కీమును పెట్ట మన్నారు. ఆ సమావేశంలో ప్రభుత్వమును అడుగులకు మడుగులొత్తే వారు, స్వదేశసంస్థానాధీశులు గూడ ఉన్నారు. వీరు ప్రతి అభివృద్ధికరమైన విషయానికి అభ్యంతరం పెట్టారు. గాంధీజీ రౌండుటేబులు సమావేశం నుంచి 1931 ఆఖరులో వచ్చివేశాడు. ప్రభుత్వం బలపరచిన నిర్బంధ యంత్రాన్ని ఒక్కసారిగా వదలింది. గాంధీజీ ఇండియాలో దిగకమునుపే, కాంగ్రెసు సంస్థను హటాత్తుగా దెబ్బగొట్టింది. వైస్రాయి గాంధీజీ కోరి నను దర్శనమియ్య నిరాకరించాడు గాంధీజీగూడ అరెస్టు చేయబడ్డాడు. ఉద్యమం షుమారు సంవత్సరంన్నర ముమ్మరంగా సాగింది. 1930 కంటె చాలతీవ్రంగా నిర్బంధవిధానం ఉన్నా, మొత్తం 1 లక్ష, 20 వేల మంది అరెస్టు అయ్యారు.

## రెండవ సత్యాగ్రహం : హైద్రాబాద్

బ్రిటిషు ఇండియాలో ఇంతబ్రహ్మాండమైన ప్రజాఉద్యమం సాగు తూంటే, దాని ప్రభావం కొద్దిగానైనా హైదరాబాదు సంస్థానంమీద పడక పోలేదు. 1931 లో బీరారులోని అకోలా అనే పట్నంలో హైదరాబాదు స్టేటు పొలిటికల్ కాన్ఫరెన్సు అనే పేరుతో ఒక సమావేశం జరిగింది. బాధ్యతాయుత ప్రభుత్వం (Responsible Govt.) లక్ష్యంగాగల రాజ కీయ సంస్కరణలను ప్రవేశపెట్టమని ప్రభువుగారిని కోరుతూ తీర్మానించ బడింది. అంతేగాని ఆకాన్ఫరెన్సులో సమావేశమయిన విద్యాధికులు బాధ్యతాయుతమైన ప్రభుత్వాన్ని సాధింపడానికి ఏమీ చర్యతీసుకోలేదు; ప్రజలలో ప్రచారంగూడ చేయలేదు. 1920 లో ఏర్పడి నామమాత్రంగా ఉన్న జిల్లాకాంగ్రెసు కమిటీ, తిరిగి పునరుద్ధరింపబడింది. ఈసంస్థానానికి చెందిన కొన్ని వందలమంది వాలంటీర్లు బ్రిటిషు ఇండియాలో సత్యాగ్ర

హోద్యమంలో పాల్గొన్నారు బాధ్యతాయుత ప్రభుత్వంకోసం తమ సంస్థానంలోనే ప్రజాఉద్యమం సాగించుటద్వారానే, తమ సంస్థానంలో ప్రజాధికారం సాధించగలమనీ, బ్రిటిషు ఇండియాలోని భారతీయులకుగూడ తోడ్పడగలమనీ వారు గ్రహించలేదు. బ్రిటిషు ఇండియాకు స్వాతంత్ర్యం వస్తే, తమ సంస్థానంలోగూడ ప్రజాధికారం వస్తుందని వారు భావించి ఉండవచ్చును. యువకులలో వచ్చిన యీత్యాగాన్ని జిల్లాకాంగ్రెసు కమిటీ సమీకరించక, బ్రిటిషు ఇండియాకు ప్రవహించనిచ్చింది. హైదరాబాదు సంస్థానంలో ఆరోజుల్లో ఖాదీప్రచారం బాగుగాజరిగింది. కొద్దిమంది ఉత్సాహపరులైన యువకులు స్వదేశీలీగు అనే సంస్థను స్థాపించి, విదేశ వస్తు బహిష్కరణకు కొంత ప్రచారం చేశారు. ఈఆందోళనలో హైదరాబాదు సిటీకాలేజీలో ప్రొఫెసరుగా ఉండి, స్వదేశీలీగుకు కార్యదర్శిగా పని చేసిన, ఫజుల్‌రహమానుగారు తమ ఉద్యోగాన్ని పోగొట్టుకొన్నారు. హైద్రాబాదు జిల్లాకాంగ్రెసుకమిటీ వారంవారం జాతీయజండా వందన ఉత్సవం జరిపేది. ప్రభుత్వం వద్దని సలహా ఇచ్చినప్పటికీ, మోతీలాల్ దినోత్సవం జరిపింది. ఇంతటితో ఆరోజుల్లో రాజకీయాందోళన ఆగిపోయింది. బ్రిటిషు ఇండియాతో అటువంటి బ్రహ్మాండమైన ఉద్యమం సాగుతూఉంటే, సంస్థానంలో ఆంధ్రమితవాదులు తమ ఆంధ్రజన కేంద్ర సంఘాన్ని తీవ్రరాజకీయాలతో సంబంధంలేని మితవాదధోరణినే నడుపుతూ ఉన్నారు. 1930 వరకూ వివిధస్థానిక ఆంధ్రసంస్థల (గ్రంధాలయాలు, వర్తక సంఘాలు, రైతుసంఘాలు, యువజన సంఘాలు మొదలగునవి) ప్రతినిధులను సమావేశపరచి కేంద్రజన సంఘాన్ని ఎన్నుకొనేవారు. 19 బహమన్ 1339 ఫసలీన (1930 లో) మొదటి సారిగా ప్రథమ ఆంధ్రమహాసభ మెదకు జిల్లా జోగిపేటలో జరుపబడింది. దీనికి అధ్యక్షుడు గోలకొండ పత్రిక సంపాదకులయిన సూరవరం ప్రతాపరెడ్డిగారు. ఈమహాసభతో ఆంధ్రోద్యమంలో ఒకమార్పు వచ్చింది. ఇంతవరకు ఆంధ్రోద్యమం వైజ్ఞానికోద్యమంగానేఉండేది. గ్రంధాలయాలు, పాఠశాలలు స్థాపించి విద్యాభివృద్ధిగావించుట, శాసనాలు, నాణెములు, పురాతన తాటియాకు గ్రంధములను సంపాదించి ఆంధ్రుల ఔన్నత్యమును చాటుట, మొదలైన వైజ్ఞానికకార్యక్రమం ఆంధ్రజనకేంద్రసంఘం సాగించేది. ఈ మహాసభలో ఇంతవరకూ సాగిస్తున్న వైజ్ఞానిక కార్యక్రమంతోపాటు, సంఘ సంస్కరణకు ప్రజలయొక్క ఆర్థిక కోర్కెలకు కొద్దిపాటి రాజకీయ సంస్కరణ

లకు సంబంధించిన తీర్మానాలుగూడ చేయబడినవి. వ్యభిచారవృత్తి మానాలనీ, అస్పృశ్యతను నిర్మూలించాలనీ, మద్యపాన నిర్మూలన. దేవస్థానాలలో జంతుబలి నిరసన బాల్యవివాహ నిషేధం మొదలైన సంఘ సంస్కరణలకు సంబంధించిన తీర్మానాలు చేయబడినవి. తరువాత సంవత్సరాలలో బ్రిటిషు ఇండియాలో బాల్యవివాహాలను నిషేధిస్తూ చేయబడిన శారదాచట్టాన్ననుసరించి ఒకచట్టం చేయమని, ఆంధ్రమహాసభ తరఫున ఆందోళన జరిగింది ప్రభుత్వం అటువంటి బిల్లును శాసనసభలో ప్రవేశపెట్టిగూడ ఇంతవరకూ శాసనంగా చేయలేదు.

సంఘ సంస్కరణ తీర్మాలతోబాటు, వర్తకుల కష్టాలను తీర్చడానికి వర్తకసంఘాలను విరివిగా స్థాపించమనీ, రైతులకు రైతుసంఘములు స్థాపించమనీ, కార్యకర్తలను కోరింది. అధునికవ్యవసాయ విజ్ఞానవ్యాప్తికి ఆదర్శవ్యవసాయశాలలను స్థాపించమని తక్కువీఅప్పులు రైతులకిమ్మని ప్రభుత్వాన్నికోరుతూ తీర్మానించబడింది. గ్రామోద్యోగులను మర్యాదగా చూడమనీ వారిజీతాలు బ్రిటిషుఇండియాస్థాయికి హెచ్చించాలనీ తీర్మానించబడింది. ప్రభుత్వోద్యోగులు దౌరావచ్చినప్పుడు రైతులు కూలీలు వారికి నిర్బంధంగా చేసే వెట్టిచాకిరి నిర్మూలించాలనీ తీర్మానించబడింది. మున్సిఫీ సబురిజిస్ట్రారు కచ్చేరీ మొదలైన వాటిల్లో తెలంగానా ప్రాంతంలో తెలుగువాడ బడాలనీ, మంచినీళ్ళు బొత్తుగా లేని గ్రామాలలో మంచినీటి సౌకర్యాలు కల్పించాలనీ, చేనేతగాండ్రు ఉపయోగించే మిల్లునూలు పైన కరోడ్గిరీపన్ను రద్దుచేయాలనీ, యునానీవైద్యాన్ని ప్రోత్సహించినట్లే ఆయుర్వేదవైద్యాన్ని ప్రోత్సహించాలనీ, ప్రభుత్వాన్నికోరుతూ తీర్మానించబడింది. లోకలుఫండు సంఘములలో (జిల్లా తాలూకాబోర్డులు) ఎన్నికల పద్ధతిని ప్రవేశపెట్టమనీ, న్యాయ కార్యనిర్వాహక శాఖలను (Judi ciary and executive) వేరుచేయమనీ; గ్రామతగాదాల పరిషారానికి గ్రామపంచాయితీ పద్ధతిని పునరుద్ధరించమనీ, ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించింది. ఆంధ్ర మహాసభ ఆరోజుల్లోకోరిన రాజకీయసంస్కరణలివే. ఈప్రథమాంధ్ర మహాసభయొక్క ప్రాధాన్యతఏమంటే, రైతులు, కూలీలు, వర్తకులు సంఘసంస్కరణకర్తలు ఆంధ్ర విజ్ఞానోద్ధారకులు మొదలైన తెలింగానావాసులందరినీ ఈ మహాసభలో సమీకరించడానికి వీలైన కార్యక్రమాన్ని ఇచ్చింది. కాని ఈ కార్యక్రమంమీద ప్రజలను సమీకరించడానికి ఈ మితవాదులు ప్రయత్నం చేయలేదు. తీర్మానాలను ప్రభుత్వానికి పంపడం, కౌన్సిళ్ళకి (ప్రైవి

వేటు) పాఠశాలకు గ్రాంటు ఇప్పించడం, వెట్టిచాకిరి, న్యాయస్థానాలు-దేశ భాషలు, మద్యపానం మొదలగు వానిమీద కరపత్రాలు వేసి పంచిపెట్టడం, మొదలైన పనులను చేస్తూ ఉండేవారు కార్యకర్తలు అప్పుడప్పుడుదొరాకు మాత్రం పోయేవారు. 1905కు పూర్వం కాంగ్రెసు సంస్థను పోలి ఇది ఉండేది. ఆంధ్రమహాసభ ప్రాథమిక సభ్యత్వం చేర్చి స్థానికకమిటీల ఎన్నికలను జరపడంగాని, జిల్లాతాలూకా ఆఫీసులనుపెట్టి ప్రజల దైనందిన కష్టాలను తీర్చడానికి సహాయం చేయుడంగాని ఉండేదిగాదు.

తరువాత 1932 లో నల్లగొండజిల్లా దేవరకొండలో జరిగిన మహాసభలో 53 గష్తిని రద్దుచేయమనీ, ప్రజలను ఖద్దరువస్త్రధారణ చేయమనీ తీర్మానించబడింది. సర్ఫెఖాసు పాయగాలలో ఖాల్సాప్రాంతంలో వలెనే విద్యాసౌకర్యాలు కల్గించమనీ, మగ్గంపన్ను తీసివేయాలనీ తీర్మానిస్తూ జాగీరుప్రజల కష్టాలను గూర్చి గూడ ఆంధ్రమహాసభ తీసుకొంది. ఆ సంవత్సరం రైతులమీద హెచ్చించబడిన శిస్తును రద్దుచేయాలనీ, టపా చీట్లవెల హెచ్చింపును రద్దుచేయాలనీ గూడ తీర్మానించబడినది.

తృతీయాంధ్రమహాసభ వరంగల్లుజిల్లా ఖమ్మంలో 1934 లో జరుపబడింది. ఈ మహాసభ ప్రాముఖ్యత ఏమంటే, సనాతనులు దీన్ని జరగకుండా చేయడానికి చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. చివరకు సభను నిషేధించమని అవ్వల్ తాలూకాదారును కోరారు. సభ ఆగిపోతుందేమోననే భయంతో ఆంధ్రమహాసభ నాయకులు, అవ్వల్ తాలూకాదారు (జిల్లాకలెక్టరు) వత్తిడిమీద, సంఘసంస్కరణకు సంబంధించిన తీర్మానాలను వదలివేశారు.

నాల్గవఆంధ్రమహాసభ కరీంనగరం జిల్లా సిరిసిల్లాలో 1935 లో జరిగింది. దీని ప్రాముఖ్యత ఏమంటే, దీనిలో సబుకమిటీ తయారుచేసిన నిబంధనావళి అంగీకరింపబడింది ఈ మహాసభవరకూ నిబంధనావళిలేదు. మహాసభలో కార్యవర్గకమిటీ ఎన్నిక జరిగేదిగాదు. ఆంధ్రజన కేంద్రసంఘమే తీర్మానాలను అమలుజరిపేది. కాని ఈసారి ఈ నిబంధనావళి అనుసరించి స్థాయిసంఘం ఎన్నుకోబడింది. ఈ నిర్మాణమార్పువల్ల ఆంధ్ర మహాసభ నిర్మాణయుక్తంగా బలపడింది.

హైదరాబాదుస్టేటు పొలిటికలు కాన్ఫరెన్సులోని మితవాదులు బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని, ప్రభుత్వానికి అర్జీపంపి మెదలకుండా కూర్చున్నారు. ఉత్సాహవంతులైన యువకులు చుట్టుపట్లఉన్న బ్రిటిషు

ఇండియా రాష్ట్రాలలో సత్యాగ్రహోద్యమంలో పాల్గొంటూఉంటే, వారిని సమీకరించి సంస్థానంలోనే ఉద్యమాన్ని ఆరంభించకుండా, హైదరాబాదు జిల్లాకాంగ్రెసుకమిటీ చూస్తూకూర్చుంది. ఆంధ్రమితవాదులు ప్రజలకోర్కెలకు సంబంధించిన తీర్మానాలను చేస్తూ, వాటికోసం ప్రజలను సమీకరించకుండా, ప్రభుత్వానికి అర్జీలుమాత్రం పెడుతూ కూర్చున్నారు. బాధ్యతగల పైసంస్థలేవీ యువకులకు కార్యక్రమమిచ్చి ఆకర్షించలేకపోయినవి.

ఇట్టి పరిస్థితులలో ఆర్యసమాజం తీవ్రంగా మతప్రచారం సాగించింది. ప్రభుత్వంయొక్క మతశాఖ (Eclesiastical Department) హిందూదేవాలయాలను మరమ్మతు చేసుకోకుండా అభ్యంతరాలు పెట్టడం, మొదలైన పనులుచేస్తూఉంటే వాటికి వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేయడం మొదలుపెట్టింది. ప్రభుత్వంయొక్క నిర్బంధవిధానం ఆర్యసమాజంమీద పడింది. 17 సెప్టెంబరు 1932 న పండిట్ చంద్రభాను అనే ఆర్యసమాజ మతప్రచారకుని సంస్థానం బయటికి పంపివేసింది. 1933 మేలో హల్లీఖేడ్ అనేచోట ఆర్యసమాజ వార్షికోత్సవాన్ని ప్రభుత్వం నిషేధించింది. అనుమతితీసుకోకుండా కట్టారనే నెపంతో బీదరుజిల్లా నీలంగా అనేచోట హవనకుండును (నిప్పువెలిగించేచోట) పడగొట్టింది. ఈవిధంగా ఆర్యసమాజ ప్రచారకులను సంస్థానంనుంచి పంపివేయడం, ఇంకాకొంతమంది మీద సెక్యూరిటీ (చాలాన్) కేసులుపెట్టడం, ఆర్యసమాజవార్షికోత్సవాలకు అనుమతి ఇయ్యకపోవడం, హవనకుండులను స్థాపించుకోనియ్యకపోవడం, చేస్తూనే ఉంది. ఆర్యసమాజం హిందూమతంలో కొంత కుళ్లు పోగొట్టడానికి ఏర్పడిన సంస్కరణసంస్థ. భారతదేశంలో రాజకీయంగా హిందూ ముస్లిముల మధ్య విభేదాలు రావడంతో, ఇది మతోద్రేకంతో మహమ్మదీయమత వ్యతిరేకప్రచారం తీవ్రంగా సాగించింది. హైదరాబాదు సంస్థానంలో ఇది ముఖ్యంగా మార్వాడీ షావుకార్లు, కొంతమంది జాగీరుదార్లు, దేశపాండ్య, దేశముఖులు మొదలైన జమీందారీ వర్గీయులయొక్క ధనసహాయంతో నడుస్తూ ఉంది. కనుక వీరికి వ్యతిరేకంగా ఇది ప్రజలయొక్క ఆర్థిక కోర్కెలకోసం పాటుబడలేదు మతసంస్థగనుక రాజకీయ సంస్కరణలకోసం గూడ పాటుబడలేదు. కాని హిందూమత సంబంధమైన పౌరసత్వ హక్కులకోసం నిర్బంధవిధానాన్నిగూడ లెక్కచేయకుండా పాటుబడటం మొదలుపెట్టింది. మతసంబంధమైన పౌరహక్కుల కోసమైనా ఈ సంస్థ ఒక్కటే నిర్బంధవిధానాన్ని అనుభవించుటవలన, మత

ప్రచారం అయినప్పటికీ ఇదొక్కచే ప్రజల్లో పని చేయుటవలన, మిగతా సంస్థలు ఏవీ ప్రభుత్వ నిర్బంధవిధానాన్ని ఎదర్చకపోవడం వలన, ఆర్య సమాజం హిందూయువకులను ఆకర్షించింది. హిందూప్రజల హృదయాలలో స్థానం సంపాదించింది. కాని దీని ప్రచారంవల్ల మహమ్మదీయ ప్రజా సామాన్యంలోనూ మధ్యతరగతిలోనూ హిందువులంటే అనుమానాలు ప్రబలినవి. మతోద్రేకం హెచ్చింది. హిందూ - మహమ్మదీయ ప్రజా సామాన్యం మధ్య చీలికలు ఎక్కువ అయినవి. హిందూయువకులలోనూ, ప్రజా సామాన్యంలోనూ మతోద్రేకం హెచ్చింది. హిందూ యువకులు తప్పుమార్గాన పడ్డారు. హిందూ - మహమ్మదీయ ప్రజాసామాన్యాన్ని ఐక్యంజేసి, సంస్థానంలో ప్రజాస్వామ్య హక్కులకోసం పోరాడటానికి బదులుగా, మహమ్మదీయులను ప్రభుత్వంచేతుల్లోకి పోయేలా చేశారు; జాతీయసంస్థలు ముందుకు రానప్పుడు, యువకులు, ప్రజలు మతసంస్థల విషప్రచారంలో పడిపోయారు.

# 4. కాంగ్రెసు మంత్రివర్గాలు - హైదరాబాదు సంస్థానం

1934 మే లో పాట్నాలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమై సత్యాగ్రహోద్యమాన్ని ఆపుజేసింది. జూనులో కాంగ్రెసుపై నిషేధం తొలగించింది. కమ్యూనిస్టు నాయకుల నందరినీ అరెస్టుజేసి మీరటు కేసులో జైలులో ఉంచినా, 1934 లో ప్రభుత్వ నిర్బంధ విధానం వల్ల దేశంలో ఏర్పడిన నిస్పృహా వాతావరణంలోనే, అఖిలభారత బట్టల మిల్లుల కార్మికుల సమ్మె జరిగింది. 1931 లో అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసులో ఏర్పడిన చీలికలు దీనితో అంతరించాయి. బొంబాయిలో 80,000 మంది కార్మికులు రెండునెలలపాటు సమ్మె సాగించారు; కాల్పులు, లాఠీ చార్జీలనుగూడ ఎదుర్కొన్నారు. ముఖ్యనాయకులను అరెస్టుచేసినా, ఉద్యమం అభివృద్ధి అవడంజూచి, ప్రభుత్వం ఈసారి మొత్తం పార్టీనే 1934 జులైలో నిషేధించింది. కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు బయట పుట్టిపెరిగిన సంస్థ కాని ఈసారి సోషలిస్టు మొలక కాంగ్రెసులోపలనే పుట్టింది. స్వాతంత్ర్య సంపాదనకు గాంధీజీ అవలం

బించుతున్న ఎత్తుగడలతో యువకులు విసిగిపోయారు. ఈ ఎత్తుగడలతో స్వాతంత్ర్యం సాధించడం సాధ్యంకాదనుకున్నారు. నూతనమార్గాలు వెతకడం ప్రారంభించారు. జైళ్లలో మార్క్స్, లెనిన్ గ్రంధాలు పఠించారు. కార్మికులను, కర్షకులను, ఇతర కష్టజీవులను వారివారి వర్గ సంఘాలలో దైనందిన కోర్కెలమీద ఆర్గనైజుచేసి, వారిలో రాజకీయ చైతన్యం గలుగజేసి, స్వాతంత్ర్యం సాధించాలని వారు గ్రహించారు. కాంగ్రెసులోపలనే ఈకార్యక్రమంమీద కాంగ్రెసు సోషలిస్టుపార్టీని వారు ఏర్పరచారు. కమ్యూనిస్టులు కొందరు ఈ సోషలిస్టుపార్టీలో జేరి సోషలిస్టు ఐక్యతకోసం ప్రయత్నించారు.

1927 లో సైమన్ కమీషన్ ప్రారంభించిన రాజ్యాంగ సంస్కరణల తతంగం 1935 లో పార్లమెంటుచే అంగీకరించబడిన ఇండియా చట్టంతో (ఫెడరేషన్) ముగిసింది. దీని ప్రకారం ఫెడరేషన్ సూత్రం అంగీకరించబడింది. అంటే రాష్ట్రాలకు విద్య, ఆరోగ్యం, స్థానిక స్వపరిపాలన మొదలైన కొన్ని విషయాలమీద సర్వాధికారం ఉంటుంది. వీటి విషయంలో కేంద్రప్రభుత్వం ఎట్టి జోక్యం కలిగించుకోలేదు. రహదారి సౌకర్యాలు, దేశరక్షణ మొదలైన కొన్ని విషయాలలో కేంద్రప్రభుత్వానికి అధికారం ఉంటుంది. కొన్ని విషయాలమీద కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు హక్కుఉంటుంది. కాని ఈ ఫెడరేషన్ సూత్రాన్ని బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించినా, అసలు అధికారం గవర్నరు, వైస్రాయిల చేతుల్లోనే ఉంచింది. చదువుకున్నవారు, భూమిపన్ను ఇచ్చేవారికే ఓట్లు ఇవ్వబడినవి. మైనారిటీ వెళ్ళిన వారందరి ఓటింగు హక్కు అంగీకరింపబడలేదు. దీనివల్ల 100 కి 14 మందికే ఓట్లు లభించాయి. ఈఓటర్లచేత రాష్ట్ర శాసనసభలు ఎన్నుకోబడతాయి. రాష్ట్ర శాసనసభయే మంత్రివర్గాన్ని ఏర్పరచుతుంది. ఈ మంత్రివర్గం రాష్ట్ర ప్రభుత్వం యొక్క వివిధ డిపార్టుమెంట్లను విభజించుకొని, పని సాగిస్తుంది. కాని శాసనసభలో ప్యాసుఅయిన బిల్లులన్నీ గవర్నరు ఆమోదంపొందిన తర్వాతనే చట్టాలు అవుతాయి గవర్నరు మంత్రుల నిశ్చయచర్యలో గూడ జోక్యం కల్గించుకోవచ్చు. వివిధ బ్రిటిషుఇండియా రాష్ట్రాల శాసనసభల ప్రతినిధులు, ఫెడరేషనులో చేరడానికి అంగీకరించిన స్వదేశ సంస్థానాధీశుల ప్రతినిధులు, కలిసి ఫెడరలు శాసనసభ అవుతుంది. ఈ శాసనసభగూడ మంత్రివర్గాన్ని ఏర్పరచుతుంది. ఈమంత్రివర్గంగూడ రాష్ట్రనుం

త్రివర్గం వలెనే వైస్రాయికి లోబడి ఉంటుంది. వైస్రాయి సర్వాధికారి అగుటయేగాక, దీనిలో మరొక ముఖ్యవిషయమేమంటే, ప్రజాప్రతినిధులు మైనారిటీగా ఉండేటట్లు ఇది సృష్టింపబడింది. భారత సంస్థానాలలో ఎటువంటి ప్రజా ప్రాతినిధ్యం గల శాసనసభలు సైతం లేవు. ఫెడరలు శాసనసభలలో తమ హోదాల ననుసరించి, సంస్థానాధీశులే ప్రతినిధులను నిర్ణయించుతారు. మరికొందరు వైస్రాయిచే నామినేటు చేయబడినవారు ఉంటారు. అభివృద్ధి నిరోధకులు మెజారిటీగా వచ్చిన రాష్ట్రాలను కలుపుకొని, ఫెడరలు అస్సెంబ్లీలో ఎప్పుడూ ప్రజా ప్రతినిధులు మైనారిటీగానే ఉంటారు. ఈవిధంగా నిరంకుశ సంస్థానాధీశులను భారతరాజ్యాంగ విధానంలో ఇరికించి, భారతీయులతోగూడిన శాసనసభకే ప్రభుత్వభారం అప్పగించామనిచెప్పి, భారతప్రజలను ప్రపంచప్రజలను బ్రిటిషు సామ్రాజ్యవాదులు మోసగించచూచారు. స్వాతంత్ర్యోద్యమానికి వ్యతిరేకంగా స్వదేశసంస్థానాధీశులను ప్రత్యక్షంగా రాజకీయ రంగంలోకి తీసుకతురావడానికి ఇది మొదటిసారి.

ఇటువంటి బానిస రాజ్యాంగచట్టం భారతీయులమీద రుద్దబడకుండా చూడటం కాంగ్రెసుయొక్క ప్రధాన కర్తవ్యమయి వుంది. 1936 ఏప్రిల్‌లో లక్నోలో జరిగిన కాంగ్రెసులో అధ్యక్షుడైన జవాహరులాల్ ఫెడరలు రాజ్యాంగ చట్టాన్ని వ్యతిరేకించడానికి, కాంగ్రెసును అన్ని సామ్రాజ్య వ్యతిరేకశక్తులయొక్క సంయుక్త ప్రజాసంఘటనగా నిర్మించాలని చాటాడు. సోషలిజమే ప్రపంచానికి మోక్షమార్గమనిచాటాడు. సంయుక్త ప్రజాసంఘటన నినాదాన్ని కాంగ్రెసు అంగీకరించకపోయినా, ఈ ఉపన్యాసం సోషలిస్టులు ఇతర అతివాదులు ఆర్గనైజు చేయుచున్న అఖిలభారత ట్రేడియూనియన్ కాంగ్రెసు, అఖిలభారత కిసానుసభ మొదలైన సంఘాలను కాంగ్రెసుకు దగ్గరగా తీసుకువచ్చింది. జాతీయ శక్తులు దగ్గరకురావడానికి తోడ్పడింది 1936 లక్నో కాంగ్రెసులోనే, వివిధ రాష్ట్రాలలోని కిసాను సంఘాలను కలిపిఅఖిలభారత కిసానుసభను, కమ్యూనిస్టులు సోషలిస్టులు ఇతర తీవ్రవాదులు ఏర్పారచారు నాటినుంచీ రైతులు తమ వర్గఉద్యమాన్ని నిర్మించి బలపరచ మొదలుపెట్టారు.

బ్రిటిషు ప్రభుత్వం ఫెడరలుచట్టంలోని రాష్ట్రీయ స్వపరిపాలన (Provincial autonomy) భాగాన్ని 1937 లో అమలులోకి తీసుకురావడానికి ప్రయత్నించుతోంది. అందుకు 1937 ఫిబ్రువరీలో రాష్ట్ర శాసన

సభలకు ఎన్నికలు జరపడానికి ప్రయత్నాలు చేస్తోంది. లక్నో కాంగ్రెసు ఈ ఎన్నికలలో పాల్గొని, భారతదేశం ఆ రాజ్యాంగచట్టాన్ని నిరాకరించు తోందని ప్రపంచానికి చూపడానికి నిశ్చయించింది. 1936 ఆగస్టులో ఎన్ని కల ప్రణాళిక జారీచేయబడింది. ఆ బానిస రాజ్యాంగచట్టాన్ని త్రోసివేసి మైనారిటీ వెళ్ళిన స్త్రీ పురుషులందరిచే ఎన్నుకోబడే కాన్స్టిట్యుయెంటు అస్సెంబ్లీని తీసుకరావడం; కరాచీ కాంగ్రెసులో (1931) అంగీకరించ బడిన ప్రజల ప్రాథమిక హక్కుల తీర్మానం అమలు జరపడం; రైతుల అప్పుల భారాన్ని, పన్నుల భారాన్ని తగ్గించడం; కార్మికులకు చక్కని జీవిత భృతి, పనిగంటలు ఇతర సౌకర్యాలు గల్గించడం: న్యాయ, సామా జిక, రాజకీయరంగంలో స్త్రీలను పురుషులతోపాటు సమానంగాచూడటం, అస్పృశ్యతను దొలగించి వెనుకబడిఉన్న హరిజనుల నుద్ధరించుట; ఖద్దరు మొదలైన గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించుట; ఆ ఎన్నికల ప్రణాళిక లోని అంశాలు. ఈప్రణాళిక రైతుకూలీలు, కార్మికులు, స్త్రీలు, పురుషులు; అందరు భారతీయులూ కలిసి పని చేయడానికి వీలునిచ్చింది. కాంగ్రెసుతో అఖిలభారత కిసానుసభ వివిధ కార్మిక సంఘాలు కలిసి, అభివృద్ధినిరోధకు లైన జమీందార్లను ప్రభుత్వం అడుగులకు మడుగులొత్తేవారిని, ఎన్నికలలో ఓడించడానికి అవకాశం ఇచ్చింది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు ఈ అభివృద్ధి శక్తుల కూటమిని ఓడించడానికి అనేక పన్నాగాలు పన్నారు. పంజాబులో యూనియనిస్టుపార్టీ, సంయుక్త రాష్ట్రాలలో నేషనలు అగ్రికల్చరిస్టుపార్టీ లను లేవదీశారు. మద్రాసులో జస్టిసుపార్టీ, ఇతర రాష్ట్రాలలో ఈవిధంగానే ఇతర అభివృద్ధి నిరోధక పార్టీలకు సహాయం జేశారు. 1937 ఫిబ్రవరిలో ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసు, కిసానుసభ, కార్మికసంఘాలు, కమ్యూనిస్టు పార్టీ అంతా కలిసి పనిచేశారు. కాంగ్రెసు అభ్యర్థులకు అఖండవిజయం చేకూరింది. మొత్తం 7 రాష్ట్రాలలో కాంగ్రెసుకు పూర్తిమెజారిటీ వచ్చింది. బెంగాలు, సరిహద్దు, అస్సాం, రాష్ట్రాలలో పూర్తి మెజారిటీ రాకపోయినా అన్ని పార్టీలలోకి కాంగ్రెసే మెజారిటీపార్టీ. ఎంతో కాంగ్రెసు చరిత్రగల పంజాబు, బెంగాలులలో, పూర్తిమెజారిటీ రాకపోవడానికికారణం, అక్కడ కాంగ్రెసువాదులు అభివృద్ధినిరోధకశక్తులకు వ్యతిరేకంగా గట్టిగా ప్రచారం చేయకపోవడమే. మొత్తంమీద ఈఎన్నికలు జమీందార్లు, ప్రభుత్వతాబేదార్లు మొదలైన అభివృద్ధినిరోధకశక్తులకు వ్యతిరేకంగా జరిగిన ప్రజాపోరాటం, జమీందారీవిధానం సామ్రాజ్యవాదులు ఒకవైపున, మరోవైపున ప్రజాతంత్ర

శక్తులు—ఈరెంటికీ మధ్యజరిగిన పోరాటమిది. 1937 ఏప్రిల్ ఒకటవతేదీ రాష్ట్రీయస్వపరిపాలనను అమలులోకి తీసుకవచ్చేతేదీగా ప్రభుత్వం నిర్ణయించింది. గవర్నర్లు మంత్రుల దినచర్యల్లో జోక్యం కల్పించుకోమని హామీ ఇస్తేనేగాని, మంత్రి వర్గాలను ఏర్పరచమని కాంగ్రెసు ప్రకటించింది. దీన్ని నిర్లక్ష్యంజేసి కాంగ్రెసుకుమెజారిటీవచ్చిన రాష్ట్రాలలో సామ్రాజ్యవాదులుతమ తాబేదార్లచే నడమంత్రపు మంత్రివర్గాలను ఏర్పరచారు. భారతదేశమంతటా దీనికివ్యతిరేకంగా ఏప్రిల్ 1 వ తేదీన బ్రహ్మాండమైనప్రదర్శనాలు, సభలుజరిగాయి. మూడు నెలలైన తరువాత ప్రభుత్వం దిగివచ్చింది. జూన్ 22 వ తేదీన వైస్రాయి "ఏపార్టీకి చెందిన మంత్రులయినప్పటికీ, ఆ మంత్రులతో తగదారాకుండా చూడటమేగాకుండా, గవర్నర్లు ఆ తగాదాలను పరిష్కరించడానికి తమ యావచ్ఛక్తినీ వినియోగించుతారు" అని ప్రకటించాడు. దీనితో కాంగ్రెసు మొదట పూర్తి మెజారిటీగల 6 రాష్ట్రాలలో మంత్రివర్గాలను ఏర్పరచింది. తర్వాత సరిహద్దురాష్ట్రం, అస్సాములలో కాంగ్రెసు కార్యక్రమమాన్ని ఒప్పుకొన్న వారితోగలిసి సంయుక్త మంత్రివర్గాలను ఏర్పరచింది. మొత్తం 11 రాష్ట్రాలలోను 8 రాష్ట్రాల్లో కాంగ్రెసుమంత్రివర్గాలు ఏర్పడినవి. ప్రజామంత్రివర్గాలు ఏర్పడటంతో, ఆ రాష్ట్రాలలోని రైతులు, కార్మికులు తమ హక్కులకోసం సమ్మెలు — పోరాటాలు ప్రారంభించారు. కాంగ్రెసు మంత్రివర్గాలు వీటికి సహాయం చేయవలసివచ్చింది. కార్మిక-రైతు—విద్యార్థి ఉద్యమాలు ఎంతో అభివృద్ధి చెందాయి. ఎంతోకాలంనుంచి జైళ్ళలో ఉంచబడ్డ రాజకీయ ఖైదీలు వదిలిపెట్టబడ్డారు. కొన్ని ప్రజాసంస్థల మీద నిషేధం తొలిగింది. పౌరసత్వ హక్కులు కొంతవరకూ వచ్చాయి. కాంగ్రెసు చేసిన ఈ మంచి పనులతో కాంగ్రెసుసంస్థ చాల అభివృద్ధి చెందింది. 6 లక్షల 36 వేలనుండి 30 లక్షలవరకూ కాంగ్రెసు సభ్యత్వం పెరిగింది.

## సంస్థానప్రజల పోరాటం

బ్రిటిషు ఇండియాలో 1937 ఫిబ్రవరీ ఎన్నికలలో కాంగ్రెసుకు అఖండవిజయం రావడం, జులైలో కాంగ్రెసుమంత్రివర్గా లేర్పడటం, రాష్ట్రాలలో పౌరసత్వహక్కులు ఎక్కువగావడం, రైతుల - కార్మికుల పోరాటాలు చెలరేగడం, భారతసంస్థానాలలోని ప్రజాశక్తులను మేల్కొలిపాయి. సంస్థానాధీశులు గూడ ఎన్నోసంస్కరణ లిస్తామంటూ మాట్లాడవలసి వచ్చింది. అంతవరకూ రాజకీయ సంస్కరణలకోసం సంస్థానాలలో

విద్యార్థికులు మాత్రం పిటీషన్లు పెట్టేవారు. ప్రజలను ఈ ఆందోళనలోనికి తీసుకురావడానికి వారు ప్రయత్నించేవారుగాదు. కాని ప్రజలు తమంతట తామే చొరవతీసుకొని రాజకీయరంగంలోకి దూకారు. మొట్ట మొదట గుజరాతులోని మూండా అనే సంస్థానంలో అక్రమ పన్నుకు వ్యతిరేకంగా ఉద్యమం సాగింది. ప్రజలు విజయం పొందారు. దాదాపు అన్నిసంస్థానాలలోను "ప్రజామండలి", "స్టేటుకాంగ్రెసు"పేరుతో,జాతీయ కాంగ్రెసు లాంటి సంస్థలు ఏర్పడినవి.

జాతీయకాంగ్రెసు, స్వదేశసంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వాలు ఏర్పరచాలనీ, పౌరసత్వహక్కులు నెలకొల్పాలనీ, సంస్థానాధీశులను 1928 కలకత్తా సమావేశంలోనే కోరింది. కాని సంస్థాన ప్రజలను ఆ హక్కులకోసం పోరాడమని ఉద్బోధించి యుండలేదు. కాని 1935 ఫెడరేషన్ చట్టంలో బ్రిటిషుప్రభుత్వం సంస్థానాధీశులనుగూడ ఇరికించుట చేతను, ఫెడరేషనును ప్రవేశపెట్టడానికి ప్రభుత్వం తీవ్రప్రయత్నాలుచేస్తూ ఉండుటచేతనూ, సంస్థానాలవిషయంలో కాంగ్రెసు ముఖావం వహించి కూర్చోలేకపోయింది. అంతేగాక బ్రిటిషు ఇండియాలో కాంగ్రెసు విజయాలవల్ల ఏర్పడిన ప్రజలలోని ఉత్సాహం, సంస్థానాలలో, విప్లవమార్గాన పోకుండా చూడాలిసిన అవుసరం గూడ, కాంగ్రెసు నాయకత్వానికి ఏర్పడింది. సంస్థానాలలో ప్రజాసంఘాలను కాంగ్రెసుకు అనుబంధ సంఘాలుగా నిర్మించకపోయినా, పరోక్షంగా సహాయంజేస్తూ, ప్రజాసంఘాలను ఏర్పడటానికి చేయూత ఇచ్చింది. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ఇతర తీవ్రవాదులు - అంతాకలసి, ఫెడరేషనుకు వ్యతిరేకంగా ప్రజాపోరాటం ఆరంభించడానికి తీవ్రాందోళన చేస్తున్నారు. భారతస్వాతంత్ర్యపోరాటంలో సంస్థానప్రజల పోరాటం ఒకభాగమనీ, అందుచే బాధ్యతాయుత ప్రభుత్వాల కోసం సంస్థానాలలో ప్రజాపోరాటాలు సాగించడానికి కాంగ్రెసు సర్వవిధాల సహాయపడాలనీ, పై అతివాదపార్టీలు 1938 ఫిబ్రవరిలో జరిగిన హరిపురకాంగ్రెసులో తీర్మానం తీసుకువచ్చారు. గాంధీవాదులు దీన్ని తోసివేసి, దీనిస్థానే సంస్థానప్రజల న్యాయమైన కోర్కెలకు సానుభూతిని మాత్రం తెల్పి, సంస్థానప్రజలు తమమీద తామే ఆధారపడాలనే తీర్మానాన్ని పాసుచేసారు. బ్రిటిషు ఇండియాలోవలెనే గాంధీజీ ఈ సంస్థానోద్యమాలను అహింసహద్దులలో ఉంచడానికి ప్రయత్నించాడు. కొద్దిమంది సత్యాగ్రహులతో గూడిన సత్యాగ్రహోద్యమాలద్వారా సంస్థానాధీశులమీద వత్తిడి

తీసుకువచ్చి. ఏవో కొద్దిప్రజాస్వామ్య హక్కులు సాధించడానికి ప్రయత్నించాడు. కాని ప్రజలను ఈ సత్యాగ్రహోద్యమాలలోకి రానీయకుండా ప్రేక్షకులుగామాత్రమే ఉంచడానికి ఎన్నిజాగ్రత్తలు తీసుకున్నా, ఢెంకనాల్, తిరువాన్కూరు, మైసూరులలో ఆఉద్యమాలు ప్రజా తిరుగుబాట్లుగా మారాయి. సంస్థానాధీశులసైన్యాలు పోలీసుదళాలు ఈఉద్యమాన్ని అణచలేకపోయాయి. చివరకు బ్రిటిషు సైనికదళాలు వచ్చి, ఈ ఉద్యమాలను అతిదారుణంగా అణచివేశాయి. బ్రిటిషుసైన్యాల బలంమీదనే స్వదేశసంస్థానాలు నిలిచి ఉన్నాయనేది, ప్రత్యక్షంగా రుజువైనది.

## హైద్రాబాదులో మత వైషమ్యాలు

హైదరాబాదు సంస్థానంలో పరిపాలకవర్గం, 1937లో కాంగ్రెసు ఎన్నికల విజయాన్ని చూచి గాబరాపడింది. సంస్థాన ప్రజా వుద్యమానికి వ్యతిరేకంగా మహమ్మదీయ ప్రజా సామాన్యాన్ని తీసుకురావడానికి తీవ్రకృషి చేసింది. హరిజనులను మహమ్మదీయ మతం స్వీకరించేలాచేసి, మహమ్మదీయులను గట్టి మైనారిటీగానైనా జేసి, వీరిని అభివృద్ధి నిరోధక నాయకత్వంక్రింద ఉంచి, హిందువులలోని అభివద్ధి నిరోధకులను కలుపుకొని, నామమాత్రమైన శాసన సభలలోనైతం మెజారిటీని సంపాదించడానికి ఎత్తువేసింది. మహమ్మదీయులలో మతోద్రేకం రెచ్చగొట్టడానికి హరిజనులను మహమ్మదీయ మతంలో కలపడానికి (తబ్లీగ్) ఇత్తెహాదుల్ ముసల్మీనుకు పూర్తి తోడ్పాటునిచ్చింది. ప్రభుత్వంలోని మతశాఖవారు, జైలుశాఖవారు, ఇతరఉద్యోగులు ఈ తబ్లీగ్ఉద్యమానికి తీవ్రంగా సహాయంజేశారు.

ఇత్తెహాదుల్ ముసల్మీన్, ఈ సంస్థానం మహమ్మదీయ సంస్థానమనీ, దీన్ని పడగొట్టడానికి హిందువులు కుట్రలు పన్నుతున్నారనీ, రాజరికాన్ని కాపాడటం ప్రతి మహమ్మదీయుని ధర్మమనీ, మహమ్మదీయ ప్రజాసామాన్యంలో తీవ్రప్రచారం చేసింది. బహద్దుర్‌ఖాన్ (అప్పుడు బహద్దుర్ యార్ జంగుబహద్దురు)గారినాయకత్వంక్రిందతబ్లీగ్ఉద్యమంతీవ్రరూపంలో ప్రారంభించబడింది. వేలకొలది హిందువులు మహమ్మదీయ మతంలో కలుపుకోబడ్డారు. ఆర్యసమాజం ఈతబ్లీగ్ ఉద్యమానికి వ్యతిరేకంగాహిందూ జాగీరుదార్ల వర్తకుల సహాయంతో, హిందూ ప్రజా సామాన్యంలో తీవ్రప్రచారం చేసింది. తబ్లీగ్ఉద్యమానికి వ్యతిరేకంగా ఎంత తీవ్రంగా అయితే పనిచేసిందో, అంతతీవ్రంగా హరిజనుల మహమ్మదీయమతంలో కలప

డానికి కొంతకారణమైన అస్పృశ్యత మొదలైన హిందూమత దురాచారాలను నిర్మూలించడానికి పాటుబడలేదు. అయినప్పటికీ, మత తత్వాలకు తావులేకుండా చేసే ప్రజా కార్యక్రమంతో ఏ రాజకీయపక్షం ప్రజల్లో పని చేయడానికి ముందుకు రాకపోవుటచే, హిందూ మహమ్మదీయ యువకులు ఆయా అభివృద్ధి నిరోధకమతోద్యమాలకు ఎరఅయ్యారు. యువకులలోనే గాక, మతోద్రేకం ప్రజల్లోగూడ వ్యాపించింది. మహమ్మదీయ మతోద్రేకపరులకు ప్రభుత్వోద్యోగుల అండ ఉండుటచేత, వారు హిందువులమీద అత్యాచారాలుచేయ మొదలుపెట్టారు. కొంతమంది ఆర్యసమాజ ప్రచారకులు చంపివేయబడ్డారు. కొన్నిచోట్ల దేవాలయాలు ధ్వంసం చేయబడినవి.

ఆంధ్రమహాసభ మొదటినుండీ, తెలింగానాలోని హిందువులనూ మహమ్మదీయులనూ కలిపి ఉంచడానికి కృషిచేస్తూ వచ్చింది. దానిలో మహమ్మదీయ విద్యాధికులు కొందరు పాల్గొంటూ ఉండేవారు. ఈసంస్థ నిజామియాబాదు సనూవేశంలో 1937లో, హిందూ మహమ్మదీయ కలహాలు అనర్థదాయకమనీ, వారు ఐక్యతతో కలిసి మెలసి ఉండాలనీ ప్రకటించింది. "తీర్మానం" చేయబడినప్పటికీ ఈ సంస్థ హిందూ ముస్లిముల నైక్యపరచే రాజకీయ కార్యక్రమంతో ప్రజల్లో జోరబడి పనిచేయక పోవుటచే ఆర్యసమాజంయొక్క దేశహానికరమైన పంథానుండి ఆంధ్రయువకులను మరల్చలేకపోయింది. చివరకు 1938 ఏప్రిల్‌లో స్టేటు ప్రతినిధిసభకు అధ్యక్షుడయిన వినాయకరావుగారి ఇంటిని హైదరాబాదు మహమ్మదీయ మతోద్రేకులు చుట్టుముట్టారు, హైదరాబాదులో మరికొన్నిచోట్ల హిందూ ముస్లిముకొట్లాటలు తీవ్రంగాజరిగాయి వీటిలో ఆర్యసమాజీయులు హిందువులకు ముందుండి పోరాడారు. ఆర్యసమాజ కార్యక్రమం ప్రజల్లో చీలికలు కలుగజేసి స్వాతంత్ర్యోద్యమానికి దెబ్బకొట్టేది అయినప్పటికీ, ప్రభుత్వ నిర్బంధ విధానానికి మహమ్మదీయ మతోద్రేకానికి గురిఅవుతూ ప్రాణాలను సైతం అర్పించడంచేత, ఆర్యసమాజం హిందూ ప్రజల హృదయాలలో గాఢంగా నాటుకుపోయింది. ఈ ఘటనలవల్ల ఆర్యసమాజం బాగుగా బలపడింది. మహమ్మదీయ జనసామాన్యంలో మతోద్రేకం చాల ప్రబలిపోయింది. ఇత్తెహాదుల్ ముసల్మీను బాగుగా బలపడింది.

పరిపాలక వర్గం ఒకవైపున తబ్లీగ్ ఉద్యమానికి దోహదమిస్తూ, రెండవవైపు ప్రజలను మాయబుచ్చడానికి సంస్కరణల తతంగం తిరిగి ప్రారంభించింది. పైగా ప్రభువుగారి పరిపాలనకాలం 25 సంవత్సరాలు

పూర్తిఅగుటచే, 1938 లో రజితోత్సవం (Silver Jubilee) జరపడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి. ఈలోగా ఏదో ప్రజలను మెప్పించినట్లు కనబడాలి. అందుచే 17 అబాన్ 1346 ఫసలీన (1937 సెప్టెంబరు) అప్పటి ప్రధాన మంత్రిగాఉన్న సర్ అగ్బర్ హైదరీ రాజ్యాంగ సంస్కరణల గూర్చి శాసనసభలో ఒక ప్రకటనజేశాడు. రాజ్యాంగ సంస్కరణల స్కీమును తయారుచేయడానికి ప్రభువుగారు ఈకింది వారితో గూడిన కమిటీని ఏర్పరచినట్లు ప్రకటించారు :

1. దివాన్‌బహద్దుర్ అరవమూడు అయ్యంగారు (కమిటీ అధ్యక్షుడు)
2. గులామ్ మహమ్మద్ ఖురేషీ
3. ప్రొఫెసర్ ఖాదర్ హుస్సేన్‌ఖాన్
4 కాశీనాధరావు వైద్య
5. మీర్ అక్బర్ అలీఖాన్

సయ్యద్ యూసఫ్ అలీ, కార్యదర్శి

ఈ కమిటీయొక్క హద్దులు (terms of reference) "సంస్థానంలోని పరిస్థితులను, దాని అవుసరాలను దృష్టియందుంచుకొని, సంస్థానంలోని వివిధవర్గాల మతాలయొక్క అవుసరాలను కోర్కెలనుగూర్చి ఎల్లప్పుడూ ప్రభుత్వం ఇప్పటికన్న ఎక్కువగా తెలుసుకోవడానికి, అనువైన పద్ధతులను అన్వేషించి రిపోర్టు వ్రాయాలి." అని తెల్పబడింది. పై సంస్కరణల కమిటీలోని ఐదుగురిలో ఇద్దరు ప్రభుత్వోద్యోగులు. మిగతా ముగ్గిరిలో కాశీనాధరావువైద్యగారు అప్పటిరోజుల్లో మహారాష్ట్ర మహాసభకు నాయకుడుగా ఎంచబడుతున్నా, మిగతా యిద్దరూ ప్రజలతో ఎట్టి సంబంధంలేదు. ఆంధ్ర ప్రజల సంస్థ అయిన ఆంధ్రమహాసభయొక్క నాయకులెవరూ దానిలోలేరు. కమిటీ సభ్యులమాట అటుంచి, కమిటీపనికి నిర్ణయింపబడిన హద్దులు సంకుచితమైనవి. వాటిలో ప్రజాస్వామ్య విధానానికి ఎట్టితావులేదు. బాధ్యతాయుత ప్రభుత్వం మాటగాని, ప్రజాస్వామ్య పద్ధతి గూర్చిగాని ఒక్క మాటగూడ అందులోలేదు. ప్రజామోదం బొందని అటువంటి కమిటీ, ఇటువంటి సంకుచిత హద్దులలో తయారుచేసిన రిపోర్టు ఎలాఉంటుందో వేరేచెప్పనక్కరలేదు. అభివృద్ధికాముకు లందరికీ ఈ ప్రకటన సంతృప్తి గల్గించలేదు.

1937 డిశంబరులో నిజామాబాదులో జరిగిన ఆంధ్రమహాసభ సంస్కరణల కమిటీ వేసినందుకు ప్రభువుగారిని అభినందించుతూ, ప్రజాస్వామ్య పద్ధతులమీద సంస్కరణలుండాలని కోరింది.

రాబోవు రాజ్యాంగ సంస్కరణల సందర్భమున ఈ క్రింది మూలసూత్రములను దృష్టియందుంచవలయునని అయ్యంగారు కమిటీవారికిని, ప్రభుత్వమువారికిని ఈ మహాసభవారు మనవిచేయుచున్నారు.

"1. ఈ రాజ్యంగ సంస్కరణల మూలమున ఏర్పడుసంస్థ లేక సంస్థలు నిజమైన ప్రజాప్రాతినిధ్యము వహించిననిగానుండి పాలకవర్గం వారు ఈ సంస్థలకు బాధ్యులై యుండవలయును.

2. నైసర్గికములగు పౌరస్వత్వపుహక్కులు రాష్ట్రములోని ప్రతి వ్యక్తికిని గలవని ప్రకటింపవలయును.

3. శాసనసభలో ప్రవేశపెట్టకుండ ఏశాసనమును, అట్టిశాసనము వలన అధికారమియ్యబడని ఏ ఉపనియమావళియు (ఖవాయదు, లేక దస్తూరుల్ అమల్) అమలులోనికి రాకూడదు. అసాధారణ పరిస్థితులందు ప్రత్యేకముగ జారీచేయబడిన ఆజ్ఞలు, ఆరుమాసములపిదప అంతరించి పోవలయును.

పై సూత్రములను దృష్టియందుంచుకొని,ఆంధ్ర ప్రజాభిప్రాయమును కనుగొని వివరములతో గూడిన ఒక ప్రణాళికను తయారుచేసి ప్రభుత్వము వారికి సమర్పించుటకై ఈమహాసభవారు స్థాయిసంఘంను గోరుచున్నారు."

ఈ తీర్మానం తెలింగానా ఆంధ్రులకోర్కెను ప్రతిబింబించింది. ఈ తీర్మానంతో ఆంధ్రమహాసభ ఆంధ్రుల రాజకీయ ఆశయాన్ని తెలిపే సంస్థగాగూడ తయారయింది.

ఇత్తెహాదుల్ ముసిల్మీన్ నాయకులకు, ప్రజాస్వామ్య హక్కులను గూర్చిగాని, బాధ్యతాయుత ప్రభుత్వాన్ని గూర్చిగాని ఒక్క ముక్కైనాలేని సర్ అక్బర్ హైదరీ చేసిన పై ప్రకటనే ఆందోళనను గల్గించింది. మహమ్మదీయులకు అనాదినుంచీ సాంప్రదాయసిద్ధంగా ప్రభుత్వంలో ఉన్న అధిక్యతకు ప్రమాదం వస్తున్నదనీ, అసలు ప్రభువుగారి అధికారమునకే దెబ్బ దగిలే అవకాశమేర్పడినదనీ, మహమ్మదీయులంతా మేల్కోవాలనీ, లేక పోతే హిందూరాజ్యం వస్తుందనీ, మహమ్మదీయ జనసామాన్యంలో తీవ్ర ప్రచారం సాగించారు. హిందూముస్లిం తగాదాలు తీవ్రంగాఉన్న ఆరోజుల్లో ఈ ప్రచారం దావానలంలాగా మహమ్మదీయ జన సామాన్యంలో పాకిపోయింది. బాధ్యతాయుత ప్రభుత్వమంటే హిందూరాజ్యమని, మహమ్మదీయ జనసామాన్యంలో జరుగుచున్న దుష్ప్రచారానికి సమాధానంగా వివిధ

ప్రజాసంస్థల ప్రతినిధులతోగూడిన హైద్రాబాదు ప్రజాపరిషత్తు(Hydarbad people's convention) ఈ క్రింది విధంగా సమాధాన మిచ్చింది.

"హైద్రాబాదు ప్రజాపరిషత్తువారు కమిటీకి అప్పగించిన విషయము లలో ఉపయోగింపబడిన 'బాధ్యతాయుత ప్రభుత్వము' అను శబ్దముల అర్ధము కొందరు తప్పుగా గ్రహించుచున్నారు. ఇది విచారకరము. అప్ప గించబడిన విషయములలో, వాడబడిన పై శబ్దములకు అర్ధమిది. రాష్ట్రము యొక్క కార్యనిర్వహణాధికారులు మ. ఘ. వ. ప్రభువుగారికి ఎప్పుడును బాధ్యులుగానుంటూ, శాసన సభకు కూడా జవాబుదారులై యుందురు. శాసనసభ తుదకు ప్రభువుకు జవాబుదారీ వహించియుండును. ఇట్టి జవాబు దారీయొక్క విధము, వైశాల్యము మ. ఘ. వ. ప్రభువుగారివలన నిర్ణ యింపబడుతూ, మార్పబడుచునుండవచ్చును. ఈ విధమైన ప్రభుత్వమునకే 'బాధ్యతాయుత ప్రభుత్వము' అను శబ్దములు వర్తించుచున్నవి. మన రాష్ట్రపు బాధ్యతాయుత ప్రభుత్వము ఎట్టి స్వరూపముననైనను సరే, మ. ఘ. వ. నిజాము ప్రభువుయొక్కగాని ఆసఫ్‌జాహి వంశముయొక్కగాని రాజ్యాధికారములను లేక హక్కులను తగ్గించుటయనిగాని, తొలగించుట యనిగాని ఆక్రమించుటయనిగాని పై శబ్దముల కెప్పుడును అర్ధముకాదు: కాజాలదు. కనుక పరిషత్తుయొక్క సూచనలు స్పష్టముగా వెలువడునంత దనుక ప్రజలు నిరీక్షించవలయుననియు అటుతరువాత అభిప్రాయములు వెలిబుచ్చవలయుననియు, ముందుగానే పొరపాటులకు, సందేహములకు, అపోహలకు లోబడకుండ వలయుననియు కోరుచున్నాము."

దీనిలో శాసనసభ ప్రభువుగారికి బాధ్యత గావుంటుందనీ. మంత్రులు శాసనసభకు ప్రభువుకుగూడ బాధ్యులుగా వుందురనీ వ్రాయబడింది. అంటే, శాసనసభ, మంత్రివర్గం నామమాత్రములైనవే. ఇవి నిజమైన ప్రజా స్వామ్యసూత్రాలమీద ఆధారపడిలేవన్నమాట

ఈ సమయంలోనే ఇత్తెహాదుల్ ముసిల్మీన్‌యొక్క ఆశయాలు మార్చబడినవి.

(1) మహమ్మదీయ రాజ్యమైన హైదరాబాదు సంస్థానంయొక్క మహమ్మదీయులు ఖురాన్‌ను చదివి తెలుసుకొని, దానిప్రకారం నడచు కొనేటట్లు చేయుట. జనసామాన్యంలో ఖురానులోని విషయాలను సాధ్య మైనంత ఎక్కువగా ప్రచారంచేయుట.

(2) మహమ్మదీయులు తమతమ తెగల ప్రత్యేకతను కాపాడుకొంటూ, తమ సామాజిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక విషయములలో ఐక్యతతో పనిచేయుట.

(3) సంస్థాన ప్రభువుగారియొక్క అధికారం, ఆయన మూర్తి (Personality) సంస్థాన మహమ్మదీయుల రాజకీయ, సాంస్కృతిక ఆధిక్యతయొక్క ప్రతిబింబం కనుక, హైదరాబాదు సంస్థానంయొక్క నేటి స్థితిలో ఎల్లప్పుడూ అలాగే ఉండాలి రాష్ట్రం రాజ్యాంగవిధానంలో జరిగే ఏ మార్పువల్లగాని, ప్రభువుగారి సర్వాధిపత్యానికి ఎట్టిదెబ్బ తగులగూడదు.

(4) సంస్థాన మహమ్మదీయులకు, వారి రాజకీయాధిక్యత, ఆర్థిక, సాంస్కృతిక హక్కులు అనాదినుంచీ వస్తూ ఉన్నవి. వాటికి ఎట్టిదెబ్బ తగులగూడదు.

(5) ఇస్లాం ఆజ్ఞలను శిరసావహించుతూ, మహమ్మదీయేతర జాతులతో స్నేహసంబంధాలను ఉంచుకొనుటకు ప్రయత్నించుట. మరియు హైదరాబాదు సంస్థానంయొక్క స్వతంత్రతను (Sovereignity & integrity) కాపాడుట.

మహమ్మదీయులకు సాంప్రదాయసిద్ధంగా ఉన్న హక్కులు, ఆధిక్యత, ప్రభువుగారియొక్క సర్వాధికారం స్థిరంగా ఉంచుట, అనేవి పూర్వపు ఆశయాలలో అస్పష్టంగా ఉన్నవి. ఈసారి అంగీకరించబడిన ఆశయాలలో అవి స్పష్టపరచబడినవి, మహమ్మదీయులకు మిగతా మతాల వారికన్న ఎక్కువ ఆధిక్యత ఉందనీ, ఈ ఆధిక్యత ప్రభువుగారిలో ఇమిడి ఉందనీ, ఇది మహమ్మదీయ రాజ్యమనీ, ప్రభువుగారి సర్వాధికారానికి ఏ మార్పులవల్లగాని లోపం జరుగరాదనీ, ఈ ఆశయాలలో వ్రాయబడింది. మహమ్మదీయులు పాలించే జాతి అనీ, మిగతా మతాలవారు పాలింపబడే జాతులనీ, ప్రభువుగారు మహమ్మదీయుల ప్రతినిధి అనీ,. సిద్ధాంతం వీటిల్లో ఇమిడి ఉంది.

## హైదరాబాదు ప్రజాపరిషత్తు

17 ఆబాన్ 1346 ఫసలీన (22 సెప్టెంబరు 1937) లెజిస్లేటివు కౌన్సిలులో సర్ అక్బర్ హైదరీగారి ఉపన్యాసం అయిన తర్వాత, 8 దై 1347 ఫసలీన (12 నవంబరు 1937) న కొండా వెంకటరంగారెడ్డి,

పండిత రామాచారి, అబుల్ హస్సన్ సయ్యద్ అలీ ప్రభృతులు మాడపాటి హనుమంతరావుగారి అధ్యక్షతన సమావేశమయ్యారు. వివిధ మతాల ప్రతినిధులతో గూడిన ఈ సమావేశానికి హైదరాబాద్ ప్రజాపరిషత్తు అని నామకరణం గావించారు. రాజ్యాంగ సంస్కరణలను గూర్చిన స్కీమును తయారుజేసి ప్రభుత్వానికి అందజేయుటకై, ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర మహాసభ, కన్నడ మహాసభ, ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థల ప్రముఖుల తోనూ, ఏ సంస్థకు చెందని ఇతర ప్రముఖులతోనూ గూడిన కమిటీ వేయబడెను.

ఈ కమిటీ 1938 జనవరిమాసంలో రిపోర్టును తయారుజేసింది. అందులోని ముఖ్యాంశాలు ఇవి.

## శా స న స భ

(1) శాసనసభలో హైదరాబాద్ లెజిస్లేటివు అస్సెంబ్లీ, హైదరాబాద్ లెజిస్లేటివు కౌన్సిలు అని రెండు భాగములుంటాయి.

(2) అస్సెంబ్లీలోని మొత్తం 200 సంఖ్యలోనూ 33 మంది ప్రభుత్వంచేత నియమింపబడినవారు, 37 ప్రత్యేక నియోజక వర్గముల చేతనూ, 130 సాధారణ నియోజకవర్గంచేతనూ ఎన్నుకోబడేవారు ఉంటారు.

(3) కౌన్సిలు మొత్తం 65 మందిలో, 16 మంది ప్రభుత్వంచేత నియమింపబడేవారునూ, 16 మంది అస్సెంబ్లీచే ఎన్నుకోబడేవారునూ, 33 ప్రాంతీయ నియోజక వర్గములచే ఎన్నుకోబడేవారును ఉంటారు.

(4) ప్రభువుగారి కుటుంబమునకు, ప్రభువుగారికి బ్రిటిషు చక్రవర్తి గల సంబంధములనుగూర్చి శాసనసభ ఏవిషయం చర్చించడానికి అవకాశం ఉండదు

ప్రభుత్వ రుణము దానిపైన వడ్డీ సింకింగు ఫండును గూర్చిగాని; సైన్యముల పోషణకయ్యే ఖర్చు దాని క్రమశిక్షణ; ఇండియా ప్రభుత్వం బ్రిటిషు ఇండియా రాష్ట్రప్రభుత్వాలు ఇతర స్వదేశ సంస్థానములకు హైదరాబాదుకు మధ్య ఉండే సంబంధాలు; అప్పుడు అమలులోనున్న ప్రభువుగారి ఫర్మానులు శాసనములకు విరుద్ధమైన విషయములనుగూర్చి, ప్రభుత్వం యొక్క అనుమతి పొందనిదే, శాసనముగాని చివరకు ప్రతిపాదనము సైతం శాసనసభలో పెట్టడానికి వీలులేదు.

(5) అసెంబ్లీ, కౌన్సిలు రెంటిలోనూ ప్యాసు అయిన చిత్తు శాసనాలు ప్రభువుగారి అనుమతి పొందిన తరువాతనే శాసనాలు అవుతాయి ప్రభువుగారు కొన్ని మార్పులను చేసిగాని, శాసనమును పూర్తిగాగాని పునరాలోచించమని శాసనసభకు తిప్పి పంపవచ్చును. లేదా అసలే నిరాకరించవచ్చును.

(6) బడ్జటులో ప్రభువుగారి కుటుంబఖర్చు, చక్రవర్తితో ఉన్న సంబంధములకయ్యే ఖర్చు, అప్పుడు అమలులోనున్న శాసనములక్రింద ఖర్చులు. ప్రభుత్వ రుణము దానిపై వడ్డీ సింకింగుఫండు, కార్యనిర్వాహక సభ్యులు హైకోర్టు న్యాయమూర్తులు జుడిషియలు కమిటీ సభ్యుల జీతాలు, పెన్షనులు ఈనాములు ప్రధాన మంత్రిచే (కార్యనిర్వాహకసభ అధ్యక్షుడు) రాజకీయములని ధృవపరుపబడిన వ్యయములు, మొదలైన వాటినిగూర్చి ఓటుచేయడానికి శాసనసభకు అధికారంలేదు.

ఆమోదించబడిన బడ్జటులో ఏ అంశాన్నైనాసరే ప్రభువుగారు మార్చడంగాని నిరాకరించడంగాని చేయవచ్చును.

(6) రు. 10 ఖుష్కీ (మెట్ట) శిస్తు, రు 19 తరీ (మాగాని) శిస్తు చెల్లించే పట్టాదారు, షిక్మీదారు, కవులుదారు లేక ఆసామీషిక్మీ లేక ఈనాందారు; సంవత్సరానికి రు 200 ఆదాయంవచ్చే జాగీరుదారు, మన్సబుదారు (ప్రభుత్వం జమీందారీని స్వాధీనపరచుకొని, అందుకు సాలీనా కొంత పెన్షను ఇస్తుంది). సివిల్ వజీఫాదారు (పెన్షనుదారు): పెన్షనుపొందే సైన్యాధికారి; హైదరాబాదు నగరంలో రు. 84, జిల్లా ప్రధాన నగరాలలో రు. 24 అద్దె వచ్చే ఇళ్ళు గలవారు, ఆ ఇండ్లలో అద్దెకు కాపురముండేవారు; హైదరాబాదు నగరంలో హెచ్. యస్. యస్. సి. పరీక్షగాని, మెట్రిక్యులేషను పరీక్షగాని ప్యాసు అయినవారు, జిల్లా ప్రధాన నగరాలలో మిడిల్‌పరీక్ష ప్యాసు అయినవారు, గ్రామ నియోజక వర్గాలలో చదువనూ వ్రాయనూ వచ్చినవారు; అస్సెంబ్లీకి ఓటర్లుగా ఉండటానికి అర్హత ఉంది.

సంవత్సరానికి రు. 100 శిస్తు చెల్లించే పట్టాదారు, షిక్మీదారు లేక ఆసామీషిక్మీ లేక ఈనాందారు; సంవత్సరానికి రు. 250 రుసుందారు, యోమియాదారు, మిరాసీదారు, దస్తుబందుదారు, లేక యితరనగర మాషదారు; సంవత్సరమునకు రు 500 ఆదాయంవచ్చే జాగీరుదారు, మన్సబుదారు, వజీఫాగల జాగీరుదారు, మన్సబుదారు లేక సివిలు వజీఫాదారు;

మూడు సంవత్సరములకు పూర్వం పట్టభద్రుడై విద్యార్థిగా ఉండని విద్యావంతుడు; సైన్యాలలో పనిచేస్తున్న అధికారి; లెజిస్లేటివు కౌన్సిలుకు ఓట్లు ఇయ్యడానికి హక్కు ఉంది.

విద్యవల్ల ఓటువచ్చినవారి భార్యలకు తప్ప, మిగతా విధాలుగా ఓటు సంక్రమించినవారి స్త్రీలకు అస్సెంబ్లీ ఓటర్లుగా ఉండటానికి హక్కుంది.

గ్రామధేడు, చమారు, మహారు, మాంగు, మాలమాదిగగాగాని బలోతాదాటు అయిన హరిజనులకు మాత్రమే అస్సెంబ్లీకి ఓటరుగా ఉండటానికి హక్కుంది.

## కార్యనిర్వాహకసభ (బాబేహుకూమత్)

కార్యనిర్వాహకసభను ప్రభువుగారే నియమించుతారు. వారిలో సగం మంది అసెంబ్లీ సభ్యులయి ఉండాలి. కాని వారు కార్యనిర్వాహకసభలోకి తీసుకోబడిన వెంటనే వారి అస్సెంబ్లీసభ్యత్వాన్ని పోగొట్టుకొంటారు. ఈ కార్యనిర్వాహకసభను తీసివేయడానికి అస్సెంబ్లీకి హక్కు లేదు.

## పౌరసత్వహక్కులు

తన అభిప్రాయాన్ని స్వతంత్రంగా ప్రకటించడానికి, శాంతంగా సమావేశమగుటకునూ, ప్రజాశాంతికి భంగకరం కాని రీతిని సంఘములు స్థాపించుకొనడానికి హక్కును ప్రతి వ్యక్తి కలిగిఉంటాడు.

ప్రజా శాంతికి నీతికిలోబడి, అంతరాత్మ స్వాతంత్ర్యమును, మత విషయములను ప్రకటించడానికి పైనియమములకు లోబడి ముద్రశాలనడపడానికి హక్కుగలిగి ఉంటారు.

పౌరులందరికీ పబ్లికు బావులకు ఇతర పబ్లికు స్థలాలను ఉపయోగించడానికి హక్కు ఉంది.

## స్థానికస్వపరిపాలనము

గ్రామ పంచాయితీలు :—(1) 1000 మందికి తక్కువగాని ప్రతి గ్రామము లేక గ్రామసమూహమునకు ఒక పంచాయితీ ఉండవలెను.

(2) పంచాయితీలో 7 గురు కంటె తక్కువగాని 9 మంది కంటె ఎక్కువగాని సభ్యులుంటారు. వీరిలో ఎన్నుకొబడేవారు సగంకంటె తక్కువ ఉండగూడదు.

(3) 21 సంవత్సరందాటిన ప్రతి పురుషునికీ ఓటింగు హక్కు ఉంది.

(4) గ్రామపంచాయితీఅధ్యక్షుని, పంచాయితీదార్లనుండి, ప్రభుత్వం నియమించుతుంది.

(5) పంచాయితీ జీవితము ఒక సంవత్సరము మాత్రమే.

(6) పంచాయితీ లన్నింటిపైన పెత్తనము జిల్లా తాలూకాదారునిది (కలెక్టరు).

చిన్న మున్సిపాలిటీలు :—(1) 2000 జనసంఖ్యగల ప్రతి ఊరుకు మున్సిపాలిటీ ఉండును.

(2) పురపాలక సంఘంలో 9 నుండి 12 వరకూ సభ్యులుందురు. వీరిలో ఎన్నుకోబడేవారి సంఖ్య సగంకటె తక్కువ ఉండగూడదు.

(3) పురపాలకసంఘ అధ్యక్షుడు తాలూకాదారువల్ల నియమింపబడును. ఉపాధ్యక్షుడు ఎన్నుకోబడును.

జిల్లాసంఘములు (District Boards) :—(1) జిల్లా సంఘములో 12 నుంచి 16 వరకూ సభ్యులుంధురు. వీరిలో మూడింట రెండు వంతులు ఎన్నుకోబడినవారుందురు.

(2) జిల్లా తాలూక్దారు జిల్లాసంఘానికి అధ్యక్షుడుగా ఉండును.

(3) దీనికి ఓటర్లు లెజిస్లేటివు అసెంబ్లీ ఓటర్లే. తాలూకాలు నియోజకవర్గములుగా ఉండును.

హైదరాబాద్ ప్రజా పరిషత్తుచే ప్రభుత్వానికి ప్రసాదింపబడిన సంస్కరణల స్కీములోని పై ముఖ్య హంశాలను చూచినవారికి ఇప్పుడు సాగుతున్న నిరంకుశ రాజ్యాంగ విధానానికే ప్రజాస్వామ్యమనే ముసుగు మాత్రం వేయబడినదనీ, నిరంకుశ విధానం యొక్క అసలు అధికారం వాస్తవికంగా తగ్గించబడలేదనీ తేటతెల్లమవుతుంది. ప్రజాస్వామ్యమంటే, రాజ్యాంగవిధానంలో ప్రజల అధికారం స్థిరపడి ఉండాలి. నిజమైన బాధ్యతాయుత ప్రభుత్వమంటే. స్త్రీ పురుషులతోసహా మైనారిటీ వెళ్ళిన ప్రజలందరి ఓటింగుతో ఎన్నుకోబడిన ప్రతినిధులతో గూడిన శాసనసభ ఉండాలి. ఈ శాసనసభయే మంత్రివర్గాన్ని నిర్ణయించాలి. ఈ మంత్రివర్గం శాసనసభకు బాధ్యత వహించాలి. ఈ మంత్రివర్గంలో ప్రజలకు నమ్మకం పోయినప్పుడు, దీన్ని తొలగించి మరొక మంత్రి వర్గాన్ని ఏర్పరచేహక్కు శాసనసభకుండాలి. బాధ్యతాయుత ప్రభుత్వ

మంటే, ప్రజలకు బాధ్యతవహించే ప్రభుత్వమే. ప్రభువుగారి ఆధ్వర్యం క్రింద బాధ్యతాయుత ప్రభుత్వమంటే (Responsible Govt. under the aegis of H. H. the Nizam) బ్రిటిషురాజుగారివలె శాసనబద్ధమైన రాజుగా (Constitutional monarch) ఉంటాడన్నమాట

బాధ్యతాయుత ప్రభుత్వమంటే పై నిర్వచనం చూచిన తర్వాత, ప్రజా పరిషత్తు ఇచ్చిన స్కీముసు పరిశీలించుదాం. అస్సెంబ్లీకౌన్సిలు అనే రెండు శాఖలు శాసనసభలో ఉంటాయి. మొదటిదానిలో సామాన్యప్రజల ప్రతినిధులు, రెండవదానిలో ప్రధానంగా పెద్ద జాగీరుదార్లు, పెద్ద రైతులు, ఇతర ధనికుల ప్రతినిధులు ఉంటారు. శాసనసభయొక్క పై రెండు భాగాల్లోనూ ఏచట్టమైనా ప్యాసు అయితేనేగాని, అది ప్రభువుగారి అంగీకారానికి పంపబడదు. ఈ రెండు భాగాల విధానం బ్రిటిషు ఇండియాలో కొన్ని రాష్ట్రాలలోనూ కేంద్రంలోనూ ప్రస్తుతం అమలులోఉంది. సామాన్యంగా కౌన్సిలు అభివృద్ధినిరోధకులైన జమీందార్లు షాహుకార్లతోనూ నిండి ఉంటుంది. అస్సెంబ్లీలో ఏదైనా అభివృద్ధికరమైన చట్టం ప్యాసు అయితే, దాన్ని కౌన్సిలు వడపోసి సారంతీసివేసి పిప్పిని ఉంచడం జరుగుతుంది. ఈవిదంగా జరిగే స్వల్ప అభివృద్ధిని సైతం నిరోధించడానికే ఈ ద్వంద విధానం బ్రిటిషు సామ్రాజ్యవాదులు సృష్టించారు. దీన్నే ప్రజా పరిషత్తు అనుకరించింది. ఇక ఓటింగు విధానం చూధాం. ఆస్థి ఉన్న వారికి చదువు వచ్చినవారికి ఓటింగు హక్కుఉంది. ఏ ఆస్థిలేని రెక్కల కష్టంమీద బ్రతికే కూలీలు కార్మికులకు, బీద రైతులకు ఓట్లులేవు. ఏ చదువు రాని నిరక్షరాస్యులకు (సంస్థానంలో చదువువచ్చినవారు ప్రభుత్వ లెఖ్ఖ ప్రకారం 100 కి 6 మందే!) ప్రాతినిధ్యంలేదు. పల్లెగ్రామాల్లో నివశించే కూలీలు అత్యధిక సంఖ్యాకులు హరిజనులు. వీరు సాంఘికంగాను, ఆర్థికంగాను రాజకీయంగాను మిగతా ప్రజాసామాన్యంకన్న ఎంతో వెనుకబడి ఉన్నారు. వీరికి రాజ్యాంగ విధానంలో స్థానమేలేదు. గ్రామ వెట్టిపని చేసే కొద్దిమందికి మాత్రమే ఓట్లు. ఇక చదువువచ్చినవారి విషయం చూదామా అంటే హైదరాబాద్ నగరంలో మెట్రిక్యులేషనుపరీక్ష, జిల్లా ప్రధాన నగరాలలో మిడిల్‌స్కూలు పరీక్ష, గ్రామాల్లో ఉత్తరంముక్క వ్రాసే జ్ఞానం, ఓటు పొందడానికి అర్హతగా నిర్ణయించబడినవి. సామాన్యంగా పెద్దపట్టణాలలో విద్యకు ఎక్కువ అవకాశాలు ఉంటాయి గనుక, గ్రామాలకన్న ఎక్కువ మంది అక్షరజ్ఞానం కలవారు ఉంటారు. అటువంటిచోట్ల

ఓటర్లసంఖ్యను తగ్గించడానికి ఓటుకు అర్హతకుకావలసిన విద్యస్థాయి హెచ్చించబడినది.

ఇక శాసనసభయొక్క అధికారాలు చూదాం: హైదరాబాదు సంస్థానం మొత్తం వైశాల్యం 82698 చదరపుమైళ్ళలో 8014 చదరపు మైళ్ళు. సర్ఫుఖాస్ అనే పేరుతో ప్రభువుగారి కుటుంబ పోషణార్థమై ప్రత్యేకించబడినది. దీనినిగూర్చి శాసనసభ జోక్యం కలుగజేసుకోరాదు. ఇదిగాక (1350 ఫసలీ బడ్జటునుబట్టి) ప్రభువుగారి స్వంతఖర్చులకు 50 లక్షల రూపాయలు. యువరాజులకు 12 లక్షల 19 వేల రూపాయలు. సాలీనా ప్రభుత్వ బొక్కసంనుండి యివ్వాలి. దీన్నిగూర్చిగూడ శాసన సభ మాట్లాడగూడదు.

ప్రభుత్వపు అప్పు దానిమీద వడ్డీ సింకింగుఫండు మొదలైనవి. మంత్రులు హైకోర్టుజడ్జీలు మొదలైన వేలకువేలు జీతాలుగుంజే పెద్ద ఉద్యోగులజీతాలు. జమిందారీలు లాక్కున్న దేశముఖు. దేశపాండ్యాలకిచ్చే మున్సబులు. ఇతర పెన్షన్లనుగూర్చిగూడ మాటాడటానికి శాసనసభకు హక్కు లేదు. ప్రభువుగారియొక్క, రాకుమారులయొక్క స్వంతఖర్చు పెద్దఉద్యోగుల జీతాలు, దేశముఖు, దేశపాండ్యాల మున్సబులు యితర పెన్షనులు, బడ్జటులో మూడవవంతుకు పైగా ఉంటాయి. మిగతా హ. శాలలోగూడ మార్చడానికి ప్రభువుగారికి హక్కుంది. డబ్బుమీద పెత్తనంలేనప్పుడు ఇంకా శాసనసభ ప్రజలకు చేయగలిగేమేలు ఏమి?

ఆర్థిక విషయాలమాట అటుంచి, యితర శాసనాలవిషయంచూదాం. ఇతర చిత్తు శాసనాలు అస్సెంబ్లీ కౌన్సిలు రెంటిచే ఆమోదించబడినప్పటికీ ప్రభువుగారు సవరణలు చేయవచ్చును. లేదా పూర్తిగా తోసివేయవచ్చును. అంటే ఇక ప్రభుత్వయంత్రాన్ని నడిపే బాబేహుకూమత్ మాట. ఇది ప్రభువుగారిచే, శాసనసభలోని సభ్యులనుంచి, యింకా యితరులనుంచీ యేర్పరుపబడుతుంది. బాబేహుకూమత్‌లోనికి తీసికోబడిన శాసనసభ్యులు శాసనసభలో వారి సభ్యత్వాన్ని పోగొట్టుకొంటారు. ఈబాబేహుకూమత్‌ను తొలగించడానికి శాసనసభకు అధికారంలేదు. మంత్రివర్గాన్ని నిర్మించడానికి, దాన్ని తోసివేయడానికి, శాసనసభకు హక్కులేకపోతే, ఇక శాసనసభకు అధికారమేముంది?

ఇక స్థానిక స్వపరిపాలకసంస్థల విషయం. పంచాయితీదార్ల నెన్నుకోడానికి గ్రామంలో 21 సం॥ దాటిన పురుషులందరికీ ఓట్లున్నా. (స్త్రీలకు

ఓట్లులేవు) పంచాయితీ దినచర్యను నడిపే అధ్యక్షుని యెన్నుకొనే హక్కు పంచాయితీకి లేదు. ఇతడు ప్రభుత్వంచే పంచాయితీదార్లనుండి నియమింపబడతాడు.

మున్సిపాలిటీల విషయంలో సగంమందిని ప్రభుత్వం నిర్ణయించుతుంది. మిగతా సగంమంది యెన్నుకోబడతారు. అధ్యక్షుడు తాలూకాదారుచే నియమించబడతాడు. ప్రభుత్వంచే నియమించబడిన సభ్యులు, యెన్నుకోబడిన సభ్యులలో అభివృద్ధినిరోధకులు ఎప్పుడూ మెజారిటీలోనే ఉంటారు. ఇంక ప్రజాస్వామ్యమేముంది.

జిల్లాసంఘాలలో మూడవవంతు ప్రభుత్వంచే నియమించబడేవారు ఉంటారు. ఎన్నుబడేసభ్యులు 2/3 వంతులున్నా, పంచాయితీలు మున్సిపాలిటీలవలె జనసామాన్యం గాక, శాసనసభ ఓటర్లే వీరిని ఎన్నుకోవడం వల్ల, వీరిలో ఎక్కువమంది అభివృద్ధినిరోధకులు వస్తారు. ఆ విధంగా ఈ అభివృద్ధినిరోధకులు ప్రభుత్వంచే నియమించబడిన సభ్యులు గలిసి మెజారిటీ అవుతారు. అంతేగాక జిల్లాసంఘానికి అధ్యక్షుడు ప్రభుత్వోద్యోగి తాలూకాదారే అగుటవల్ల, ప్రజాప్రతిధులకు అసలే ఏమనికీ అవకాశం ఉండదు, బ్రిటిషుఇండియాలో సైతం స్థానికసంస్థలకున్న అధికారాలు, స్థానికసంస్థలకు ఈ స్కీములో కోరబడలేదు.

ఈ పరిషత్తులోని సభ్యులు ధనికవర్గాలవారగుటవలన, ప్రజతో సంబంధంలేని మితవాదులగుటవలన, పై నేతిబీరకాయలాంటి స్కీమును తయారుచేశారు: దానిలోసైతం ధనికవర్గాలకే ప్రాముఖ్యత ఇచ్చారు: రెక్కలమీద కష్టించే కూలీలకు, కార్మికులకు వెనుకబడిఉన్న మాల మాదిగ వగైరా కులాలవారికి ఓటింగుహక్కైనా లేకుండాచేశారు.

పై నామమాత్రమై ప్రజాస్వామ్యమున్న స్కీము సైతం ఇత్తిహాదుల్ ముసిల్మీన్ నాయకులకు గిట్టలేదు. అయినప్పటికీ ఆస్కీమును మొత్తంమీద కాదంటే మహమ్మదీయ ప్రజాసామాన్యం అంగీకరించదని జనరలుసీట్లలో 100 కి 50 మహమ్మదీయులకు ప్రత్యేకించాలని చెప్పి పేచీపెట్టారు. పరిషత్తులోని మిగతా నాయకులు 100 కి 20 సీట్లు ప్రత్యేకించుతామని అంగీకరించారు. దీనిపై మౌల్వీ అబుల్‌హస్సన్ సయ్యద్అలీ, అబ్దుల్లాపాషా, కరీముద్దీన్అన్సారీ, మహమ్మదు అహసన్‌గారలు పరిషత్తునుండి 1938 జనవరిలో రాజీనామానిచ్చారు. మహమ్మదీయులలో జాతీయవాది అయిన సిరాజుల్‌హసన్ తిరుముజీగారుమాత్రం రాజీనామా పెట్టలేదు.

## స్టేటు కాంగ్రెసు

1937 ఎన్నికలలో బ్రిటిషు ఇండియాలో కాంగ్రెసుకు అఖండ విజయం, కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పరచిన రాష్ట్రాలలో పౌరసత్వ హక్కులు విస్తరించబడటం, అనేక రైతుకార్మిక పోరాటాలు, హైదరాబాదు సంస్థాన యువకులలో ఉత్తేజాన్ని కల్గించినాయి. ప్రభుత్వం కొన సాగించుతున్న రాజ్యాంగసంస్కరణల తతంగం వీరిని తృప్తిపరచలేదు. సంస్థానంలో పూర్వమునుంచీ రాజకీయరంగలో అమలులో ఉన్న ప్రజలను సమీకరించకుండా అర్జీలతోనే తృప్తిజెందే మితవాదపంథా వారికి నచ్చలేదు. నూతనపంథాకోసం వెదుకుతున్నారు. 1938 ఫిబ్రవరిలో జరిగిన హరిపుర కాంగ్రెసుకు మొత్తం 500 మంది యువకులు వెళ్ళారు. తమకు కాంగ్రెసు ఎంతగానో సహాయంచేస్తుందని ఆశించారు. కాని కాంగ్రెసు మితవాద నాయకులు సంస్థానాలన్నిటిలోనూ చెలరేగిన ఉత్సాహాన్ని, ముఖ్యంగా మైసూరు, తిరువాన్కూరులలోని ప్రజాఉద్యమ ఉధృతాన్ని చూచి భయ పడ్డారు. ఉద్యమాన్ని తీవ్రప్రజావుద్యమంగా మారకుండా ఎలాచేయాలా అనేదే వారి ఆలోచన. అందువల్ల సంస్థానప్రజాఉద్యమాలకు కాంగ్రెసు నిరంతరసహాయం జేస్తూ, ఆ ప్రజల ఆశయసిద్ధికి తోడ్పడాలని కమ్యూనిస్టులు, సోషలిస్టులు మొదలైన తీవ్రవాదులు పెట్టిన తీర్మానం త్రోసివేయ బడింది. దానిస్థానే సంస్థానప్రజల ఉద్యమాలయెడల కాంగ్రెసుకు సానుభూతి ఉందనీ, కాని సంస్థానప్రజలు తమమీద తామే ఆధారపడాలనీ తీర్మానంచేశారు. ఈ తీర్మానం సంస్థానప్రజల ఉద్యమాలమీద చన్నీళ్లు పోసినట్లు అయినా, ఆ ఉద్యమాలు ముందుకు పోయినాయి. హైదరాబాదు సంస్థానం నుంచి కాంగ్రెసుకు వెళ్ళివచ్చిన యువకులలో బాధ్యతాయుత ప్రభుత్వంకోసం ఉద్యమాన్ని ఆరంభించడానికి, స్టేటుకాంగ్రెసు ఏర్పరచా లనే భావం గల్గింది.

హైదరాబాదు పీపుల్సు కన్వెన్షనులోని మితవాదులుసైతం, ప్రభుత్వం ఇవ్వబోయే రాజ్యాంగ సంస్కరణలను అమలు జరపడానికిగూడ, వివిధ మతాలవారితో గూడిన జాతీయసంస్థ కావాలనీ, లేకపోతే ప్రజలు మతతత్వవాదుల విషప్రచారంలో పడిపోతారనీ భావించారు. (హైదరాబాదు ప్రజాపరిషత్తు బాధ్యతాయుత ప్రభుత్వాన్నిసాధించే ఆశయంతో స్టేటుకాంగ్రెసును ఏర్పరచడానికి తీర్మానించింది.) కాని వీరికి బాధ్యతాయుత ప్రభుత్వం

కోసం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాఉద్యమాన్ని సాగించాలనే కోరిక లేదు. వారి ఉద్దేశ్యంలో బాధ్యతాయుత ప్రభుత్వమంటే, ప్రభుగారి సర్వాధికారానికి లోబడిఉండే శాసనసభయే 1938 జులైలో ఒక తాత్కాలికకమిటీ ఏర్పరుపబడింది. ఉత్సాహవంతులైన యువకులుగూడ దీనిలోనేచేరారు. దీనిలో ఆంధ్ర మహారాష్ట్ర కన్నడ స్వాతంత్రాభిలాషులందరూ చేరారు. ఒక్క నెలలోనే 1200 ప్రాథమిక సభ్యులు చేర్చబడ్డారు. ఆగస్టు రెండవ వారంలో తాత్కాలికకమిటీ స్టేటుకాంగ్రెసుయొక్క ఆశయాలను వివరించుతూ ఒక విన్నపాన్ని ప్రకటించింది. బ్రిటిషు ఇండియా రాష్ట్రాలలోనూ ఇతర స్వదేశసంస్థానాలలోనూ అభివృద్ధికరమైన రాజకీయ సంస్కరణలకు సంబంధించిన మార్పులు జరుగుతున్నప్పుడు, హైదరాబాదు సంస్థానంలో సైతం రాజకీయ సంస్కరణలు, సాంఘిక ఆర్థికస్కీములు ప్రవేశపెట్టబడటానికి ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు, వీటిఫలితాలను ప్రజలకు అందించాలంటే, వివిధమతాలు. కులాలవారిమధ్య ఐక్యత అవసరమని అటువంటి ఐక్యతను నిర్మించే స్వచ్ఛమైన జాతీయసంస్థ అవుసరమనీ ఆ విజ్ఞప్తిలో వ్రాయబడింది. కులమత తగాదాలు దేశాభివృద్ధికి ఎలా ఆటంకమో వ్రాయబడింది. "హైదరాబాదు సంస్థనంలో మతవైషమ్యాలనుగూర్చి అందరూ బాగుగా ఎరిగినదే గనుక ప్రత్యేకంగా చెప్పాలిసిన అవుసరం లేదు ఈ క్లిష్టపరిస్థితులలో వివిధమతాలవారి మధ్య సామరస్యం కుదిర్చే బాధ్యత ఒక్క ప్రభుత్వంమీదనే కాదు: సాంఘిక ఆర్థిక రాజకీయ అభివృద్ధి ఏకాంచం జరగాలన్నా వివిధమతాలవారిమధ్య ఐక్యత సహకారం అవుసరమని హృదయ పూర్వకంగా నమ్మే ప్రజలందరిమీద ఆ బాధ్యత ఉంది. ప్రజలలో జాగృతి వ్యాపించడం ఈకాలంయొక్క లక్షణం. ఈ జాగృతిని సక్రమమైన మార్గాలనడిపే బాధ్యత సంస్థానంలోని ముఖ్యమైన రెండు మతాల ప్రజలయొక్క నాయకులమీద ఉంది. వారు మత తగాదాలలో జోక్యం కల్పించుకోకుండా దూరంగాకూర్చోవడం పనికిరాదు; ప్రజలను తప్పుమార్గాలనుంచి మరలించి, వారిలోదేశభక్తిని రేకెత్తించడం నాయకుల విధి. అన్నిరకాలైన మత వైషమ్యాలను రేకెత్తించే చర్యలను ఎదుర్కొడానికి, అదొక్కటేమార్గం. దినదినాభివృద్ధి అవుతున్న ప్రజల జాగృత్తిని అణచివేయడం సాధ్యముగాదు. అది సక్రమమైనదిగాదు. ఆజాగృత్తిని సక్రమమార్గాలలోకి మళ్ళించి, జాతీయోద్యమాన్ని సక్రమ పద్ధతులతో నిర్మించడమే, అసలు సమస్య"

ఆర్యసమాజం ఇత్తిహాదుల్ ముసిల్మీను సంస్థలు హిందూ మహ మ్మదీయుల మధ్య చీలికలు ఎక్కువ చేస్తుంటే, వాటినుండి ప్రజలను మరల్చి వారిలో జాతీయ భావాలను రగుల్కొలిపి, ఐక్యతను నిర్మించి, సంస్థానప్రజలను అభివృద్ధి మార్గాన తీసుకుపోయే ప్రధానాశయంతోనే స్టేటుకాంగ్రెసు పుట్టిందని, పై విజ్ఞప్తిలోని భాగంవల్ల స్పష్టమవుతుంది.

స్టేటుకాంగ్రెసుయొక్క ఆశయం ఈ క్రింది విధంగా నిర్వచించ బడింది "మహాఘనత వహించిన నిజాంప్రభువుగారు ఆసఫ్‌జాహివంశ ఛత్రఛాయక్రింద, బాధ్యతాయుతప్రభుత్వాన్ని సంపాదించడమే హైదరాబాదు స్టేటు కాంగ్రెసుయొక్క ఆశయం. శాంతియుతమైన ధర్మసమ్మతమైన పద్ధతులద్వారాను, జాతీయైక్యతను నిర్మించుటద్వారాను, విద్యావిషయమైన నైతిక ఆర్థిక పారిశ్రామిక సంపత్తిని సంఘటితపరచి అభివృద్ధి చేయడం ద్వారాను, పై ఆశయాన్ని సాధించడం స్టేటుకాంగ్రెసు ఉద్దేశం."

తరువాత ప్రచురింపబడిన మరొక విజ్ఞప్తిలో బాధ్యతాయుత ప్రభుత్వం క్రమక్రమంగా ఎలా ఇవ్వబడాలో వ్రాయబడింది.

(1) "ప్రజలకు ప్రాథమికహక్కులు వెంటనే ఇవ్వబడాలి. వాక్స్వాతంత్ర్యాన్ని సంఘాలు పెట్టుకొనే హక్కును, పత్రికా స్వాతంత్ర్యాన్ని, మత సంబధమైన ఊరేగింపులను, సంకుచిత పరచుతున్న రూల్సు రెగ్యులేషన్లు సర్క్యులర్లువెంటనే రద్దుచేయబడాలి.

(2) సంస్థానంలో అమలుజరుపబడే రాజ్యాంగ సంస్కరణల యొక్క ఆశయం బాధ్యతాయుత ప్రభుత్వమని ప్రభుత్వం అంగీకరించాలి.

(3) హైదరాబాదు ప్రజా పరిషత్తుచే తయారుచేయబడిన రిపోర్టు లోని సూచనలను అనుసరించి, బాధ్యతాయుత ప్రభుత్వం యింకా వాస్తవికమైనదిగా చేయడానికి కొన్ని అవుసరమైన మార్పులతో, బాధ్యతాయుత ప్రభుత్వంలో మొదటిమెట్టును వెంటనే ఇవ్వాలి.

(4) ఏమతం, లేక కులంవారికైన స్థానాలను ప్రత్యేకించే సూత్రాన్ని మరొకరకమైన మతకులతత్వంగా స్టేటు కాంగ్రెసు భావించుతుంది. అయి నప్పటికీ తాత్కాలిక యేర్పాటుగా 10 సంవత్సరాలపాటు, శాసనసభలో కొన్ని సీట్లు అల్పసంఖ్యాకులకు ప్రత్యేకించటానికి స్టేటు కాంగ్రెసు అంగీక రించుతుంది.

(5) ప్రభుత్వోద్యోగాల విషయంలో కులమత పద్ధతులమీద ప్రత్యే కించడాన్ని స్టేటు కాంగ్రెసు అంగీకరించదు. ఉద్యోగాలు యివ్వడంలో

చూపే పక్షపాత దృష్టిని రూపుమాపడానికి, న్యాయమైన పద్ధతులమీద ఉద్యోగులను తీసుకోడానికి, అధికార, అనధికార సభ్యులతోకూడిన పబ్లికు సర్వీసుకమిషను వెంటనే నిర్మించాలి.

(6) స్టేటు కాంగ్రెసు తన స్కీములో యే సక్రమమైన పద్ధతి మీదనైనా, అల్పసంఖ్యాకుల సాంస్కృతిక, విద్య, మత సంబంధమైన హక్కులను గ్యారంటీచేస్తుంది.

బాధ్యతాయుత ప్రభుత్వాన్నిగూర్చి స్టేటు కాంగ్రెసు తాత్కాలికకమిటీ యొక్క పైవివరణనుపరికించితే, వెంటనే బాధ్యతాయుతప్రభుత్వాన్ని యిమ్మని అది కోరలేదనీ, దాన్ని తన లక్ష్యంగా అంగీకరించమని మాత్రమే కోరిన దనీ స్పష్టమవుతుంది. హైదరాబాదు ప్రజా పరిషత్తులో అన్ని రాజకీయ గ్రూపులు, మహమ్మదీయ ప్రతినిధులు కూడ అంగీకరించిన ప్రధాన సూత్రాల ననుసరించియే సంస్కరణలను ప్రవేశపెట్టమని కోరింది. అంటే యెన్నుకోబడిన ప్రతినిధులు, ప్రభుత్వంచేత నామినేటు చేయబడిన శాసన సభ్యులు—వీరితో కూడిఉన్న రెండు శాసనసభలను ఏర్పాటుచేయడం; నిజాం ప్రభువుగారే కాబినెటును నిర్ణయించడం; కాబినెటు ప్రభువుగారికే బాధ్యతవహించడం. ఇది ప్రజా పరిషత్తు రిపోర్టుయొక్క సారాంశం. దీన్నిబట్టి స్టేటుకాంగ్రెసుకోర్కె యెంత మితవాదంగా ఉందో తేలుతుంది. అయినప్పటికీ ప్రభుత్వం వీటినికూడ అంగీకరించలేదు.

ఇక హిందూ-ముస్లిం సామరస్యం విషయంలో స్టేటు కాంగ్రెసు యేమి సూచనలుచేసిందో చూదాం. బాధ్యతాయుత ప్రభుత్వం సంపాదించ డానికి హిందూ - ముస్లిం ఐక్యత అవసరమనీ, అల్పసంఖ్యాకుల అనుమా నాలు తొలగించి, వారిలో విశ్వాసాన్ని కల్గించడం అధికసంఖ్యాకుల విధి అనీ, స్టేటుకాంగ్రెసు తన మొదటి విజ్ఞప్తిలో అంగీకరించింది. అయినా యీ అనుమానాలు తొలగించడానికి చేసినసూచనలు మాత్రం ఇందుకు అంతగా ఉపయోగపడుటలేదు. ఒకవిధంగా మహమ్మదీయుల అనుమానా లను బలపరచినవనికూడ చెప్పవచ్చు. తమకు శాసనసభల్లో తగినన్ని సీట్లు ప్రత్యేకించకపోతే, హిందూమెజారిటీ తమకు అన్యాయం చేస్తుందేమోనని మహమ్మదీయుల భయం; తాత్కాలికంగా 10 సం॥పాటు సీట్లు ప్రత్యేకించ డానికి అంగీకరించినా, తగినన్ని యిస్తామని చెప్పలేదు. ఉద్యోగాల విష యంలో స్టేటు కాంగ్రెసు సూచన వారి అనుమానాన్ని మరీ బలపరచింది. బాధ్యతాయుత ప్రభుత్వంవస్తే అప్పుడు మహమ్మదీయులు అనుభవించు

తున్న యెక్కువ ఉద్యోగాల సంఖ్య తగ్గించి, హిందువులకు యిస్తారని వారి భయం. అసలు వుద్యోగాల విషయంలో యేమీ మార్పుచెయ్యమని స్టేటుకాంగ్రెసు హామీ ఇయ్యాలిసింది. ప్రధానవిషయం బాధ్యతాయుత ప్రభుత్వం సాధించడం. ఇందుకు ఉద్యోగాలవిషయంలో మహమ్మదీయులకు హామీయిచ్చి, వారిని కలుపుకోవడం అవుసరం. మహమ్మదీయుల అనుమానాలను తీర్చకపోబట్టే, వారు స్టేటుకాంగ్రెసు ఉద్యమానికి సహాయము చేయకపోగా, మత తత్వవాదుల దుష్ప్రచారంలోబడి వ్యతిరేకంగా కూడ తయారయ్యారు.

1938 ఆగస్టు 23 వ తేదీన ప్రధానామాత్యులైన సర్ అక్బర్ హైదరీగారు లెజిస్లేటివుకౌన్సిలుయొక్క ప్రత్యేకసమావేశం జరిపి, ప్రభుత్వం రాజ్యాంగసంస్కరణలు ప్రవేశపెట్టబూనుకొన్నదనియు, వాటిలో పౌరసత్వ హక్కులుగూడ ఇమిడిఉన్నవనియూ, కులమతతత్వాల ననుసరించి రాజ్యాంగ సంస్కరణలనీయుటకు ప్రభుత్వం వ్యతిరేకి అనియూ, కులమత పద్ధతుల మీద రాజకీయసంస్థలు నిర్మించడాన్ని తాము వ్యతిరేకిస్తున్నామనియూ, చెప్పారు. తరువాత కొద్దిరోజులకు కుల మత సంస్థలపేర్లు ప్రభుత్వం ప్రకటించింది. దానిలో స్టేటుకాంగ్రెసు పేరులేదు. కాని సెప్టెంబరు 7 వ తేదీన స్టేటుకాంగ్రెసు నిషేధించబడింది. స్టేటుకాంగ్రెసులో మత తత్వవాదులున్నారనియూ, జాతీయపద్ధతులమీద ఆ సంస్థను పునర్నిర్మించడానికి ఇచ్చిన సూచనలను ఆచరణలో పెట్టలేదనీ, కాంగ్రెసు అనే పేరు క్రింద మతతత్వచర్యలను, రాజద్రోహచర్యలను ప్రోత్సహించడానికి ఊహింపబడుచున్నదనియూ, నిషేధపుటుత్తరువులో వ్రాయబడింది. ప్రభుత్వం స్టేటుకాంగ్రెసుపై మోపిన పైనేరం ఆధారరహితమైనది. మహమ్మదీయులు ఆ సంస్థలో చేరనంతమాత్రాన అది మతతత్వసంస్థ కానేరదు. ప్రభుత్వం నిషేధించడానికి పై ఆరోపణను సాకుగామాత్రమే తీసుకొంది. ప్రభుత్వంతో రాయబారాలు జరిపి నిషేధాన్ని తీసివేయించుదామనే ఉద్దేశంతో తాత్కాలిక కమిటీ సమావేశమయి, సెప్టెంబరు 9 వ తేదీన జరగడానికి నిర్ణయింపబడిన స్టేటుకాంగ్రెసు సాధారణసభ్యుల సమావేశాన్ని వాయిదా వేసింది.

తాత్కాలిక కమిటీ ప్రతినిధులు సర్ అక్బర్ హైదరీని, కాన్స్టిట్యూషనల్ సెక్రటరీ నవాబ్ ఆలియావర్ జంగు గార్లను కలుసుకొన్నారు. ప్రభుత్వం నిషేధాజ్ఞను రద్దుచేయడానికి రెండు షరతులను పెట్టింది:

(1) "హైదరాబాద్‌స్టేటుకాంగ్రెసు" అనే పేరునుంచి "కాంగ్రెసు" అనే పదాన్ని తీసివేయడం.

(2) మందుముల నరసింగరావుగారికి-బహద్దుర్ యార్ జంగుగారికి మధ్య హిందూ - ముస్లిం ఐక్యతకోసం జరిగిన సంభాషణల వివరాలను తెలపాలి. ఏ పాయింట్లమీద ఐక్యత కుదిరినదో, వేటిమీద కుదురలేదో స్పష్టంగా తెలియజేయాలి. 100 కి 50 పాళ్ళయినా రాజీ సంభాషణలు జయప్రదమయ్యే అవకాశాలు ఉండాలి. రాజీ సంభాషణలు జయప్రదం అవుతాయని హామీగూడ ఇయ్యాలి. పై షరతుల అర్ధమేమంటే, బాధ్యతా యుత పరిపాలనకు వ్యతిరేకంగా ఉన్న ఇత్తెహాదుల్ ముసిల్మీన్ నాయకత్వంతో రాజీపడితే నిషేధాజ్ఞను రద్దుచేస్తాం. ఇత్తెహాదుల్ ముసిల్మీన్ నాయకత్వంతో ఆ పరిస్థితుల్లో రాజీ పడటమంటే, బాధ్యతాయుతపరిపాలన అనే ఆశయాన్ని వదలుకోవడమే. ఇది సాధ్యంగానిపని. హిందూ - ముస్లిము ఐక్యతకోసం సంభాషణల ప్రారంభం ఆశాజనకంగా ఉందనీ, జయప్రదంగా ముగుస్తుందనే ఆశ ఉందనీ, నిషేధాజ్ఞను రద్దుచేయమనీ తాత్కాలిక కమిటీ ప్రభుత్వానికి పంపిన పిటీషనులో వ్రాయబడింది. ప్రభుత్వం హిందూ - ముస్లిము ఐక్యతనుగూర్చిన సంభాషణలనుగూర్చి పైవిధంగా జనరల్‌గా వ్రాయడాన్ని అంగీకరించలేదు. సెప్టెంబరు 26 వ తేదీన బాబేహుకూమత్ నిషేధాజ్ఞను ఉపసంహరించుకోగూడదని తీర్మానించింది. నరసింగరావు, బహద్దుర్ యార్ జంగుగార్ల మధ్య సంభాషణలు జయప్రదమయ్యే సూచనలు కనపడలేదు. అందుచే స్టేటు కాంగ్రెసు పోరాటం మొదలు పెట్టాలిసిన అవుసరం ఏర్పడింది. తాత్కాలికకమిటీ సత్యాగ్రహం చేయడానికి నిశ్చయించి, కౌన్సిలు ఆఫ్ ఏక్షన్ ఏర్పరచి, తాను రద్దయినట్లు ప్రకటించింది. ఆకౌన్సిలు ఆఫ్ ఏక్షన్ స్టేటుకాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంగా ప్రకటించుకొంది. సత్యాగ్రహం వ్యక్తిగతంగా ఉండాలనీ, అందుచే మీటింగులు, ప్రదర్శనలు పెట్టగూడదనీ, అహింసకు వ్యతిరేకమైన పనులేమీ చేయగూడదనీ ప్రజలకు స్టేటు కాంగ్రెసు తరపున అప్పీలు ఇయ్యబడింది. ప్రజలు ఉద్యమంలో పాల్గొనకుండా ప్రేక్షకులనుగానేఉంచి, ఉద్యమాన్ని సంకుచిత పరచడమే స్టేటు కాంగ్రెసు నాయకత్వం యొక్క ఉద్దేశ్యం.

అధ్యక్షుడు గోవిందరావునానల్, కార్యదర్శి రామకృష్ణధూత్, సభ్యులు జనార్ధనరావుదేశాయి, రావి నారాయణరెడ్డి (ప్రస్తుత ఆంధ్రమహా సభాధ్యక్షులు), శ్రీనివాసరావుబోరికరుగార్లు కార్యవర్గంలోఉండిరి. ఈకార్య

నిర్వాహకవర్గం అక్టోబరు 24 వ తేదీన స్టేటుకాంగ్రెసు నిర్మింపబడినట్లుగా వీధిలోకివచ్చి హైదరాబాదులో ప్రకటించింది. దానితో కార్యవర్గం వెంటనే అరెస్టు చేయబడింది. దీనితో పోరాటం ఆరంభమయింది.

## సత్యాగ్రహం

హైదారబాదు నగరంలో కార్యనిర్వాహకవర్గం అరెస్టు చేయబడిన తరువాత, సంస్థానమంతటా యువకులలో ఉద్రేకాగ్ని రగుల్కొంది. ముఖ్యంగా తెలంగానా, మరాత్వాడాలలో ముఖ్య పట్టణాలలో సత్యాగ్రహ దళాలు క్రమంగా అరెస్టు చేయబడ్డాయి.

స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం ఆరంభించినవెంటనే, అంతకు ముందే సిద్ధంగా కూర్చున్న ఆర్యసమాజంగూడ మతహక్కులకోసం సత్యాగ్రహం ప్రారంభించింది. పండిట్ నారాయణస్వామిగారిని మొదటి డిక్టేటరుగా నియమించింది. అప్పటినుంచీ ఆర్యసమాజం సంస్థానంబయటి నుంచి గూడ దళాలనుదింపి ఆరెస్టుచేయించడం ప్రారంభించింది.

హిందూమహాసభ హైదరాబాదు సంస్థానంలో నామమాత్రమైన సంస్థయే. దీనికి ప్రజల్లో ఏమీ పలుకుబడిలేదు. అయినను ఇతర రాష్ట్రాల నుంచి, ముఖ్యంగా మహరాష్ట్రదేశంనుంచి వందలాదిగా స్పెషల్ ట్రెయిన్లలోదింపి అరెస్టు చేయించడం మొదలు పెట్టింది.

ఈ సత్యాగ్రహ సంరంభం సంస్థానంలోపల విద్యార్థులను గూడ కదల్చింది. 1938 నవంబరు మాసంలో ఉస్మానియా యూనివర్సిటీ హాస్టలులోని విద్యార్థులు వందేమాతరం గీతం పాడుతుంటే, అధికారులు ఆటంకపరిచారు. దానితో యూనివర్సిటీలోని హిందూ విద్యార్థులలో 100 కి 90 మంది సమ్మెజేశారు. సంస్థానంలోని కాలేజీలు, స్కూళ్లు— అన్నిటిలోను సమ్మెచేయించారు. సమ్మెకమిటీని ఎన్నుకొన్నారు. ఈకమిటీ సంస్థానంలోని చాల స్కూళ్ళకు, కాలేజీలకు వెళ్ళి సమ్మెను ఆర్గనైజు చేసింది. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం ఆరంభించబోయేముందు ఇచ్చిన విజ్ఞప్తిలో, సత్యాగ్రహం వ్యక్తిగతంగా ఉండాలనీ, ప్రజలను సభలు ఊరేగింపులుద్వారా తీసుకురాగూడదని ప్రకటించింది. అప్పటికే ముఖ్యులైన స్టేటు కాంగ్రెసు నాయకులంతా అరెస్టు అయ్యారు. బయటనున్న కాంగ్రెసు నాయకులు, సత్యాగ్రహోద్యమంలో పాల్గొకపోయినా సానుభూతిచూపే మితవాద నాయకులు. ఈ బ్రహ్మాండమైన విద్యార్థి ఉద్యమాన్ని నడపటానికి

వారు ముందంజవేయలేదు. పైగా ఈ విద్యార్థి వెల్లువను ప్రమాదరహిత మార్గానపట్టించారు. డబ్బు వసూలుచేసి ఈ విద్యార్థులనందరినీ నాగపూరు యూనివర్సిటీకి పంపారు. నాగపూరు యూనివర్సిటీ అధికార్లు ప్రత్యేక తీర్మానం పాసుచేసి, ఈ విద్యార్థులనందరినీ చేర్చుకొన్నారు. దీనితో బ్రహ్మాండమైన వెల్లువ అణగిపోయింది.

సరియైన జాతీయ పద్ధతులమీద ఉద్యమాన్ని నడపాలిసిన స్టేటు కాంగ్రెసు, చిన్నచిన్న దళాలను అరెస్టు చేయించడం తప్ప, ప్రజలను ఊరేగింపులలోను బహిరంగసభలలోను తీసుకురాలేదు. ఆర్యసమాజం ఊరేగింపులు సభలు జరపడం, పెద్దయెత్తున బయటినుంచిగూడ దళాలు తీసుకురావడంవలన హిందూ ప్రజాసామాన్యం ఎక్కువగా ఆర్యసమాజం వైపుకు ఆకర్షింపబడింది. దీనితోపాటు హిందూమహాసభ బయటినుంచి వందలాదిగాసత్యాగ్రహంచేయడానికి దింపడంతో ఉద్యమానికి మతపురంగు ఎక్కువగా వచ్చింది. వీరి హిందూ నినాదాలు పాటలకుతోడు ఇత్తెహాదుల్ ముసిల్మీనునాయకత్వం, హిందువులంతా మహమ్మదీయ ప్రభువును తీసివేసి, హిందూరాజ్యం స్థాపించి మహమ్మదీయులను అణచివేయ పూనుకున్నారని, మహమ్మదీయ జనసామాన్యంలో తీవ్రప్రచారం చేసింది. మహమ్మదీయ జనసామాన్యం, పై రెండు కారణాలవల్ల ఉద్యమానికి సహాయపడక పోవడమే కాక, పూర్తిగా వ్యతిరేకించింది. కొన్నిచోట్ల ఆర్యసమాజ హిందూమహాసభ సత్యాగ్రహులను మహమ్మదీయ మతోద్రేకులు స్వయంగా కొట్టి బాధించారు. ఈ పోరాటం మనకు ఏమి గుణపాఠం నేర్పుతుంది? ప్రాముఖ్యమైన అల్పసంఖ్యాక ప్రజలు స్వాతంత్ర్యోద్యమానికి దోహదమియ్యకుండా తటస్థంగా ఉంటే, ఉద్యమం లక్ష్యాన్ని చేరడం కష్టతరం; ఆ అల్పసంఖ్యాక ప్రజలు తోడ్పడకపోగా వ్యతిరేకించితే, లక్ష్యాన్ని చేరడమే అసంభవం.

పట్టణాలనుంచి స్టేటుకాంగ్రెసు ఉద్యమం గ్రామాలకు గూడ పాకింది. గ్రామాలయువకులు గూడ సత్యాగ్రహంచేయ మొదలుపెట్టారు. ఈ సమయంలో చాలచోట్ల తీవ్రమైన హిందూముస్లిము గలాటాలు జరిగాయి. అన్నిటికన్న ముఖ్యమైనది హైదరాబాదు పట్టణంలో జరిగిన హిందూముస్లిము కొట్లాట. కొంతమంది హిందువులు మహమ్మదీయులు చచ్చిపోయారు. చాలమందికి గాయాలుతగిలాయి. ఉద్యమం స్టేటుకాంగ్రెసు చేయిదాటిపోయింది. హిందూ మతతత్వమార్గాలు పట్టింది. అం

దుకు ముఖ్యకారణం స్టేటుకాం(గెసు అవలంబించిన విధానమే. (ప్రజల్లో స్వాతం(త్ర్యకాంక్ష పెచ్చుపెరిగింది. దానిని స(క్రమమైన మార్గాన నడపాలి. లేకపోతే వ(క్రమార్గాలు పట్టి, అసలు ఆశయానికే హాని గలుగజేస్తుంది. ప్రజలలో పుట్టిన ఉత్సాహానికి సభలు, వూరేగింపులద్వారా మార్గంచూపి, వారిని గూడ ఉద్యమ్యంలో స్టేటుకాం(గెసు పాల్గొనేలా చేయలేకపోయింది. ఆర్యసమాజం అందుకు అవకాశం గలుగజేసింది. (ప్రజలను తన సత్యా గ్రహంలో ఇముడ్చుకొంది. అందుచే (ప్రజలు తప్పుడుమార్గాన పడ్డారు. వారిలో స్వాతం(త్రాగ్నితోపాటు, మతతత్వం గూడ రేగింది. ఈ పరిస్థి తుల్లో బయటనున్న స్టేటుకాం(గెసు నాయకులు సత్యా(గహాన్ని నిలిపివేశారు. ప్రజలను ఆర్యసమాజ మతఉ(ద్రేక (ప్రచారానికి పూర్తిగా అప్పజెప్పారు. ఆశ్చర్యకరమైన విషయమేమంటే, (బిటిషుఇండియాలోని ఆం(ధకాం(గెసు నాయకులు తమ సోదర తెలంగానా ఆం(ధకాం(గెసువాదులకు ఈ వుద్య మంలో పరోక్షంగా గాని, (ప్రత్యక్షంగాగాని ఎట్టిసాయమూ చేయలేదు. మొత్తం సుమారు 500 మంది స్టేటుకాం(గెసు తరపున జైళ్ళకుపోయారు. ఇతరవిధములైన అనేక నిర్బంధాలకు గురిఅయ్యారు.

ఆర్యసమాజం ఇంకా కొంతకాలం సత్యా(గహాన్ని సాగించింది. ప్రభుత్వం పర్మిషను అవుసరం లేకుండానే నాల్గుగోడలమధ్య సభలు జరుపుకునే హక్కును, హోమం వెలిగించే కుండీలనుకట్టుకునే హక్కును, శిధిలమయిన దేవాలయములను బాగుచేయించుకొనే హక్కును ఇచ్చింది. దీనితో ఆర్యసమాజం సత్యా(గహాన్ని ఆపివేసింది.

ఇక స్టేటుకాంగ్రెసు ఉద్యమంవలన కలిగిన ఫలితాలను పరిశీలిం చుదాం. ఏ ఉద్యమమైనా గమ్యస్థానం చేరకపోయినప్పటికీ కొంత ఫలి తము గలుగుతుంది. మొదటిలాభం యేమంటే ప్రజల్లో స్వాతం(త్రకాంక్ష ప్రబలింది. మొదటిసారిగా, మానవులు మానవులుగా జీవించడానికి అవు సరమైన పౌరసత్వ హక్కులకోసం దేశసేవకులు కష్టాలను సహించి జైళ్ళపాలుగావడం తమకళ్ళార చూచారు. రెండవలాభం తమ జీవితం దేశసేవకు అర్పించడానికి తయారయిన దేశసేవకులు యీ ఉద్యమం నుండి ఉద్భవించారు. వీరే యిప్పుడు ఆంధ్ర మహాసభ, మహారాష్ట్ర మహాసభలను ప్రజాసంస్థలుగా చేయడానికి పాటుబడుతున్నారు. ప్రజల నిత్యజీవిత సమస్యలను తీసుకొని పనిచేస్తూ, వారి కష్టాలను కొంతవరకు బాపుతున్నారు.

ఇంక యీ వుద్యమంవల్ల కలిగిన దుష్ఫలితాలు ఏమంటే, హిందువులలోనూ, మహమ్మదీయులలోనూ మతోద్రేకం హెచ్చింది. హిందువులు, మహమ్మదీయులు ఒకరికొకరు యింకనూ దూరమయ్యారు. హిందూ-ముస్లిం ఐక్యతలేనిది భారతదేశం బ్రిటిషు బానిస శృంఖలాలను త్రెంచుకొని బయటబడలేదు; హైదరాబాదు సంస్థానంలో ఒక్క అడుగు కూడ ముందుకు వేయలేం.

# 5. రాజ్యాంగ సంస్కరణలు

## అయ్యంగారు కమిటీ సూచనలు

## బాబెహుకూమత్ మెమోరాండం - ప్రభువుగారి ఫర్మాన్

22 సెప్టెంబరు 1937 తేదీన ప్రభువుగారిచే జారీచేయబడిన ఫర్మాను ప్రకారం, రాజ్యాంగ సంస్కరణలనుగూర్చి రిపోర్టును తయారుచేయుటకు, అయ్యంగారు కమిటీ ఎర్పాటుచేయబడింది. ఆ కమిటీ రిపోర్టును తయారు జేసి, 31 ఆగస్టు 1938 తేదీన బాబేహుకూమత్‌కు సమర్పించింది. బాబే హుకూమత్ ఆ రిపోర్టుమీద తన అభిప్రాయాలను తెలియబరుస్తూ 15 జులై 1939 తేదీన ఒక మెమోరాండమును ప్రభువుగారికి సమర్పించింది. ప్రభువుగారు రాజ్యాంగసంస్కరణలనుగూర్చిన ఫర్మాను జారీచేశారు. ఈఫర్మాను, పై మెమోరాండము, ప్రత్యేక గజెటులో 19 జులై 1939 న ప్రకటించబడినాయి.

చదువరులకు సులభంగా గ్రాహ్యమవడానికి ప్రతి అంశం తీసుకొని దానిమీద అయ్యంగారు కమిటీ చేసిన సూచనలు, బాబెహుకూమత్ సూచించిన మార్పులు, ప్రభువుగారు చివరకు అంగీకరించిన విషయములు, అన్నీ కలిపి వ్రాయబడతాయి.

“సంస్థానంలోని వివిధవర్గాల, మతాలయొక్క అవసరాలను-కోర్కెలను ప్రభుత్వం యెల్లప్పుడూ ఇప్పటికన్నా యెక్కువగా తెలుసుకోడానికి సంస్థానంలోని పరిస్థితులు, దాని అవుసరాలు దృష్టియందుంచుకొని, అనువైన పద్ధతులను అన్వేషించి, రిపోర్టువ్రాయాలి” అని అయ్యంగారు కమిటీని నియమిస్తూ ప్రభువుగారిచే జారీచేయబడిన ఫర్మానులో, ఆ కమిటీకి విచారణీయ అంశంగా తెలుపబడింది. పైదానిలో బాధ్యతాయుత పరి

పాలన, ప్రజాస్వామ్యాన్నిగూర్చి ఒక్క ముక్కయినా లేదు. ప్రభుత్వం ఇప్పటికన్న ఇంకా యెక్కువగా ప్రజలకోర్కెలను తెలుసుకోడానికి అనువైన పద్ధతులను మాత్రమే కమిటీ అన్వేషించాలట. రిపోర్టు దేనిని ఆధారంగాజేసుకొని వ్రాయబడిందో, దానిలోనే బాధ్యతాయుత ప్రభుత్వాన్ని గూర్చి యెత్తకపోయినప్పుడు, ఇంక ఆ రిపోర్టులో ప్రజాస్వామ్యమనేది ఉండదని వేరే చెప్పాలిసిన అవుసరంలేదు.

ఈ క్రింది ప్రధానసూత్రాన్ని ఆధారంచేసుకొని రిపోర్టు తయారు చేయబడిందని కమిటీ తన రిపోర్టుకో ప్రథమంలో వ్రాసింది. "ప్రభువు గారు తనప్రజలకు స్వయంగా ప్రాతినిధ్యంవహిస్తారు. అందువల్ల ఆయనకు ప్రజలతో ఉండే సంబంధం కొద్దికాలానికి మాత్రమే యెన్నుకోబడిన ప్రతి నిధికన్న యెక్కువ సహజంగాను, దృఢంగాను ఉంటుంది. ఆయన ప్రభు త్వంయొక్క సర్వాధికారి ప్రజలహక్కులు అతనిలోనే ఇమిడివుంటాయి. అందువల్ల అటువంటి రాజ్యాంగవిధానంలో ఆయనకు యే చట్టాన్నయినా అంగీకరించేఅధికారంగాని, తోసివేసేఅధికారంగాని ఉంటుంది. అంతేగాక, తన కార్యనిర్వాహకవర్గాన్ని నిర్ణయించడానికి, తీసివేయడానికి, తన ప్రజల కోర్కెలను తెలుసుకోడానికి సాధనమైన ప్రభుత్వయంత్రాన్ని మార్చడా నికి, ఆయనకు ప్రత్యేకాధికారం ఉంటుంది. పై పునాదిమీదనే ఇప్పుడు అమలులోవున్న రాజ్యాంగవిధానం ఆధారపడివుంది. దీన్నే ఇకముందు కూడ ఉంచాలి."

ప్రభువుగారే సర్వాధికారి అనీ, ఆయన ఏ చట్టాన్నయినా అంగీక రించవచ్చు లేదా తోసివేయవచ్చనీ, మంత్రివర్గాన్ని తనే ఏర్పరచుకొంటా డనీ, వీటిమీదనే ఆధారపడి ప్రస్తుత రాజ్యాంగవిధానం ఉందనీ, ఇక ముందుకూడ తాము తూ-చా తప్పకుండా దానినే అనుసరిస్తామనీ, అయ్యంగారు కమిటీ వ్రాసింది.

## రాజ్యాంగ సంస్కరణల సూచనలు : ప్రభుత్వోద్యోగాలు

అయ్యంగారు కమిటీ సూచన:—

ప్రభుత్వోద్యోగులద్వారా ప్రజలతో ప్రభుత్వం సంబంధం పెట్టు కోడానికి చక్కని అవకాశంవుంది. అందువల్ల ప్రజలనుంచి ఉద్యోగులను తీసుకోవాలి. వారు ప్రజలనుంచి వచ్చినవారగుటచేత, ప్రజల కోర్కెలను తెలుసుకోడానికి సహజమైన అవకాశంవుంది. కనుక ప్రభుత్వోద్యోగులను

నియమించడంలో పక్షపాతంగాని, రికమెండేషన్లుగాని ఉండకూడదు: నైతికప్రవర్తన, శక్తిసామర్థ్యాలను మాత్రమే గమనించాలి. ఉద్యోగులను తీసుకోడానికి ఒక మంచి యంత్రాన్ని నిర్ణయించాలి.

బాబే హుంకూమత్ సూచన :–

ఉద్యోగాలు ఇయ్యడంలో ప్రస్తుతం అమలునందున్న ముల్కీరూల్సు ఇంకా ఎక్కువ కఠినంగావుండేలా మార్పు చేయబడుతున్నాయి.

హైదరాబాదు సివిల్ సర్వీసుకమిటీ కొన్ని రెగ్యులేషనుల ననుసరించి పోటీపరీక్షపెట్టి, రివెన్యూ ఉన్నతోద్యోగులను తీసుకొంటుంది. రివెన్యూ, న్యాయ, విద్యా శాఖలుమూడూ ఉద్యోగులను తీసుకోడానికి నియమాలను యేర్పరచినవి. కొన్ని డిపార్టుమెంటులలో సెలక్షనుబోర్డులుకూడ ఉన్నవి.

ఇకముందుప్రతిడిపార్టుమెంటుకు ఒక "ఎప్పాయింటుమెంటుబోర్డు" ఉండాలి. ఈ బోర్డులో ఆ డిపార్టుమెంటుకు బాధ్యతవహించే బాబేహుంకూమత్‌సభ్యుడు, డిపార్టుమెంటు అధికారి, డిపార్టుమెంటు కార్యదర్శిసభ్యులుగా ఉండాలి. ఉద్యోగులను తీసికోడానికి ప్రతి డిపార్టుమెంటుకు ప్రత్యేకమైన నియమాలుండాలి. హైదరాబాదు సివిలుసర్వీసుకమిటీ ఈ బోర్డులన్నిటిమీద అజమాయిషీ చేస్తుంది. ఈకమిటీలో ప్రధానామాత్యుడు, కనీసం హిందువు ఒకరు,మహమ్మదీయుడు ఒకరు ఉంటారు. ప్రభువుగారు బాబేహుకూమత్ యొక్క ఈ సూచనను అంగీకరించారు.

## వాక్సమావేశ పత్రికా స్వాతంత్ర్యాలు

ప్రజలు తమ కోర్కెలను వెలిబుచ్చడానికి పత్రికలు, సంఘాలు సభలు, ఒకసాధనం. దీన్ని పూర్తిగా అరికడితే రాజకీయ వాతావరణంలో అసంతృప్తి అనే పుండు పుడుతుంది. అందువల్ల కొన్ని సక్రమమైన హద్దులలో పై పౌరసత్వహక్కులను ప్రసాదించవచ్చును కాని ఈ హక్కులు హద్దులు దాటిపోకుండా కొన్ని పీనలుసెక్షన్సు చేయబడాలి. అసాధారణ పరిస్థితులలో పై హక్కులను యింకా తగ్గించడానికి గూడ కొన్ని పీనలుసెక్షన్లు ఉండాలి అని అయ్యంగారుకమిటీ సూచన. అయ్యంగారు కమిటీయొక్క పై సూచనను బాబెహుంకూమత్ అంగీకరించుతూ యీక్రింది సూచనలను చేసింది. కొన్ని ఇతర సంస్థానాలలోవలె ఇక్కడ సంఘాలు, సభలు పెట్టుకొనే విషయంలో చట్టంలేదు. బాబేహుంకూమత్‌చే

చేయబడిన రూల్సుమాత్రింవున్నవి. వీటిని ఇప్పుడు పూర్తిగా రద్దుచేయడం అసంభవం. ప్రజలచే యెన్నుకోబడిన ప్రతినిధులుగల ప్రభుత్వ సంస్థలు యేర్పడేకొలదీ, పరిస్థితుల కనుగుణ్యమైన స్వేచ్ఛను ప్రభుత్వం ఇస్తుంది. అందువల్ల పై రూల్సును ఉపసంహరించి, వానిస్థానే ఈ క్రింది రూల్సు చేయబడాలి. "పబ్లికు మీటింగు పెట్టుకోడానికి యిప్పటివలె ముందుగా అనుమతి తీసుకోవలసిన అవుసరంలేదు. అందుకు నిర్ణయింపబడిన ప్రభుత్వోద్యోగికి ముందు సమాచారం పంపితేచాలు. అందుకు అవుసరమైన స్థానిక అవకాశాలు కలుగజేయబడతాయి. ఆ బహిరంగసభ ప్రజాశాంతికి భంగం కలుగజేస్తుందనిగాని, లేక రాజద్రోహాన్ని ప్రోత్సహించుతుందనిగాని, లేక వర్గ వైషమ్యం కలుగజేస్తుందనిగాని, ఆ ప్రభుత్వోద్యోగికి తోచినప్పుడు ఆ బహిరంగ సభను నిషేధించవచ్చును."

వార్తా పత్రికలనుగూర్చి బ్రిటిషు ఇండియాలోని ప్రెసు రెగ్యులేషన్సును అనుసరించి స్థానిక పరిస్థితులకన్వయించి, ఒక కొత్త రెగ్యులేషను జారీ చేయబడుతుంది. ఈ సూచనను ప్రభువుగారుకూడ అంగీకరించారు.

పౌరసత్వ హక్కులవిషయంలో యిప్పుడున్న నిర్బంధవిధానంలో పెద్ద మార్పుయేమీ రాలేదు ఇప్పుడు ప్రతి బహిరంగసభకు ముందు అనుమతి తీసుకోవాలి. బాచేహుకూమత్ సూచనప్రకారం సమాచారం ముందు ఉద్యోగికి పంపితేచాలు. కాని ఉద్యోగి ప్రజాశాంతికి భంగకరమనిగానీ, రాజద్రోహం తలపెట్టారనిగాని, యేదీలేకపోతే చివరకు వర్గ తగాదాలను పెంచుతుందనిగాని, యేదో ఒక సాకుతో బహిరంగ సభను ఆపివేయవచ్చును.

## ఎన్నికలు - ప్రాతినిధ్యం

అయ్యంగారు కమిటీ ఆర్థిక ప్రయోజనాలనుబట్టి లాయర్లు, డాక్టర్లు, పట్టాదార్లు మొదలైన గ్రూపులుగా నియోజకవర్గాలు యేర్పరుపబడాలని (Representation on the basis of interests) సూచించింది. దీనినే బాబేహుకూమత్‌కూడ అంగీకరించుతూ దీన్ని సమర్థించడానికి కొన్ని కారణాలను చూపింది. మొదటిది, ప్రాంతీయ ప్రాతినిధ్యం (Territorial representation) వల్ల ఒకవ్యక్తియొక్క ఆర్థిక ప్రయోజనాలకు నిజమైన ప్రాతినిధ్యం గలుగదు. రెండవది : ప్రతినిధులు ఆర్థిక ప్రయోజనాల పునాదిమీద ఎన్నుకోబడినపుడు, శాసనసభలలో చేయబడే చట్టాలు ప్రజల

వాస్తవిక పరిస్థితులకు యెక్కువ దగ్గరగా వుంటాయి. మూడవది: భాష, జాతి, మత, వైషమ్యాలు యెక్కువగావున్న నైజాం సంస్థానంలో అవి అంతరించడానికి పై పద్ధతి యెక్కువగా తోడ్పడుతుంది.

ప్రభుత్వం ప్రాంతీయ నియోజకవర్గవిధానం ప్రవేశపెట్టకపోవడానికి అసలు కారణమేమంటే, బ్రిటిషు ఇండియాలో 1937 లో జరిగిన రాష్ట్ర శాసనసభా యెన్నికలలో, పై యెన్నికల విధానంలో జమీందార్లు ప్రభుత్వతొత్తులు తుడిచిపెట్టుకుపోయారు. బ్రిటిషు ప్రభుత్వ ఆశలు అడియాశలైనవి. పైగా బ్రిటిషు ఇండియాలో రేగిన ప్రజావెల్లువ సంస్థానాలలోకికూడా ప్రవేశించింది. ఇందుచే ప్రాంతీయ నియోజకవర్గ విధానానికి మారుగా, ఆర్థిక ప్రయోజనాల ననుసరించి నియోజకవర్గాలను యేర్పాటు చేసే పద్దతి ప్రవేశపెట్టబడింది. దీనిలో జాగీరుదార్లు మక్తేదార్లు పెద్ద దేశముఖులు మొదలైన అభివృద్ధి నిరోధకులకు యెక్కువ ప్రాతినిధ్యం యిచ్చి, వీరు తప్పక శాసనసభలోకి వచ్చేమార్గం తీసుకురాబడింది.

ఆర్థిక ప్రయోజనాలను అనుసరించి నియోజకవర్గాలను యేర్పరచే పద్ధతి ఫాసిస్టు పద్ధతనీ, ప్రాంతాన్నిబట్టి నియోజకవర్గాలు ప్రజాస్వామిక పద్ధతనీ, జాతీయవాదులు వాదించుతున్నారు. 'ఫాసిస్టు రాజ్యాంగానికీ, ప్రజాస్వామ్య రాజ్యాంగానికీ అసలు భేదం నియోజకవర్గాలను నిర్ణయించడంలో లేదు. ఫాసిజంలో ప్రజలకు యే విధమైన హక్కు ఉండదు: ప్రజాస్వామ్యంలో ప్రజల ఓట్లమీద యెన్నుకోబడిన ప్రతినిధులు పరిపాలనచేస్తారు. సోవియటు యూనియనులోకూడ 1936 కి పూర్వం చాలవరకు ఆర్థిక ప్రయోజనాలబట్టియే నియోజకవర్గాలు నిర్ణయింపబడేవి. కార్మికులు, రైతులు, మేధావులు అని మూడు భాగాలుగా విభజింపబడేవారు. అయినా ప్రతి రాజ్యాంగ యంత్రంలోని ప్రతి అంగము ప్రజలచే యెన్నుకోబడుతుంది,

ఫాసిస్టు విధానంలో అట్లాగాదు. ప్రజలను అసహజంగా విభజించుతుంది. ఉదాహరణకు: కార్మికులను తీసుకుందాం. వారిలో వివిధ పరిశ్రమల కార్మికులను వేరువేరు ముఠాలుగా చేస్తుంది. కార్మికులు యే పరిశ్రమలో పనిచేసినా వారి ప్రధాన ప్రయోజనం ఒక్కటే, పెట్టుబడిదారి దేశాల్లో వారి ప్రధాన ప్రయోజనం కూలికి రెక్కలు అమ్ముకోవడమే. ప్రతి పరిశ్రమలోని కార్మికులతరపున కొంతమందిని ప్రభుత్వమే నియమిస్తుంది. ఆ పరిశ్రమకు సంబంధించిన పెట్టుబడీదార్లు తమ ప్రతినిధు

లను నియమిస్తారు. కార్మికుల తరపున నియమింపబడినవారు పెట్టుబడి దార్ల ప్రతినిధులు కలిసి ఒక కమిటీగా ఉండి, కార్మికుల కూలి ఇతర విషయాలను నిర్ణయిస్తారు. ప్రభుత్వం పెట్టుబడిదార్ల నియంతృత్వ ప్రభుత్వంగనుక, దానిచే కార్మికులతరపున నియమింపబడినవారు ఎన్నడూ కార్మికులకు మేలుచేయరు. దీనినే కార్పొరేషను విధానం అంటారు. ఇంక డిక్టేటరు సర్వాధికారి. అతడే కాబినెటును యేర్పరచుకొంటాడు. ఎక్కడా యెన్నికలు ఉండవు.

ప్రభువు రాజ్యాంగ సంస్కరణలలో అసలు విషయమేమంటే, దాదాపుసగం మంది ప్రభుత్వంచేత నామినేటు చేయబడతారు. ఎన్నుకోబడే ప్రతినిధులలోనైతేం, 100కి 5 మందిగూడ లేని జాగీరుదార్లు షాహుకార్లు మధ్యతరగతి మేధావులకు 100కి 75 స్థానాలు; 100కి 95 మందిగాఉన్న రైతులు కూలీలు కార్మికులు మొదలైన బీదప్రజలకు 100కి 25 స్థానాలు. కష్టజీవులైన బీదప్రజల సంఖ్యకు తగినన్ని స్థానాలు ఇయ్యబడలేదు. అంతే గాక బాబేహుకూమత్ అసెంబ్లీచే నియమింపబడదు. ప్రభువుగారిచేతనే ఎన్నుకోబడుతూంది. అసెంబ్లీకి చాల స్వల్పమైన హక్కులు మాత్రమే ఉన్నవి. అందువల్ల రాజ్యాంగ సంస్కరణలలో నామమాత్రమైన ప్రజా స్వామ్యం మాత్రమే ఉన్నది.

## హిందూ — మహమ్మదీయ ప్రాతినిధ్యం

మహమ్మదీయులకు ఏరకమైన ప్రాతినిధ్యం ఉండాలి, అనే విష యాన్నిగూర్చి అయ్యంగారు కమిటీ రిపోర్టులో ఏమీ వ్రాయలేదు. కాని బాబేహుకూమత్ ఈ విషయాన్నిగూర్చి మహమ్మదీయుల చారిత్రక ప్రాము ఖ్యతనుగూర్చి తన మెమొరాండంలో ఈ క్రింది విధంగా వ్రాసింది. "మహమ్మదీయులకు ఈ సంస్థానంలో చారిత్రికంగా ఒక ప్రాముఖ్యమైన స్థానం ఏర్పడిందని సుస్పష్టం. అందువల్ల అసెంబ్లీలో వారిని మైనారిటీ స్థానంలో ఉంచడానికి వీలులేదు." ఈ సూత్రాన్ని అనుసరించియే అన్ని ఎన్నిక సంస్థలలోనూ, (ఎన్నుకోబడిన సభ్యులలోనూ, నామినేటు చేయ బడిన సభ్యులలోనూ) హిందువులకు మహమ్మదీయులకు సమానస్థానాలు ఉండాలని బాబేహుకూమత్ సిఫార్సు చేసింది. హిందువులకు మహమ్మ దీయులకు వేరువేరు నియోజకవర్గాలు ఉండవు. కాని ఎన్నుకోబడిన ప్రతి సభ్యుడు తన మతం వారిలో పోలు అయిన ఓట్లలో కనీసం 100కి 40 ఓట్లయినా తెచ్చుకొంటేనేగాని, ఎన్నుకోబడినట్లుగా పరిగణింపబడడు.

హిందువులకు మహమ్మదీయులకు సమానస్థానాల విషయం జాతీయ వాదులు, ఇతర హిందూనాయకులు అంగీకరించడంలేదు. హిందువులకు మహమ్మదీయులకు మధ్య దేశాభ్యుదయం కోసం అవసరమయితే దాన్ని అంగీకరించవచ్చు. కాని మహమ్మదీయులకు చారిత్రికంగా సంస్థానంలో ఏర్పడిన స్థానంవల్ల అది వారి హక్కని వాదించడం సరియైనదిగాదు. ఇలా అంగీకరించడమంటే, కొందరు మహమ్మదీయ మతతత్వవాదులు మహమ్మదీయులు పాలకజాతి (Rulingrace) అని లేవదీసే సిద్ధాంతాన్ని అంగీకరించినట్లు అవుతుంది. బాబేహుకూమత్ యొక్క పై సూచనలను ప్రభువుగారు అంగీకరించారు.

## శా స న స భ

అయ్యంగారు కమిటీ బ్రిటిషుఇండియాలోవలె శాసనసభలో రెండు భాగాలు — అసెంబ్లీ. కౌన్సిలు — లేకుండా, అసెంబ్లీ అనే ఒక్కటే ఉండాలని సూచించింది. అసెంబ్లీలో బాబేహుకూమత్ సభ్యులుగాక, 70 మంది సభ్యులుంటారు. అందులో 33 ఎన్నుకోబడిన సభ్యులు. 37మంది నామినేటెడ్ సభ్యులుంటారు. అసెంబ్లీలో ఉద్యోగులు కాని వారు మెజారిటీగాఉన్నా, ఎన్నుకోబడినవారి సభ్యత్వం మైనారిటీగానే ఉంది. 100కి 95 మందిగా ఉన్న రైతులు కూలీలు కార్మికులకు 14 స్థానాలు, పట్టణంలో కార్మికులు గాని ఇతర బీదలకు (చిన్న దుకాణదార్లు దర్జీలు జట్కాబళ్ళవాళ్ళు) ప్రత్యక్షంగా ప్రాతినిధ్యమేలేదు. 100కి 5 మందిగాఉన్న షాహుకార్లకు జాగీరుదార్లకు మాషుదార్లకు 16 స్థానాలు. ఇంతేగాక ఉద్యోగులు కాని వారిలో నామినేటు చేయబడే వారంతా ధనికులుగానే ఉంటారు. ఈక్రింద వివరాలు ఇవ్వబడినవి.

| | | | |
|---|---|---|---|
| వకీళ్ళు | 2 | కార్మికులు | 1 |
| డాక్టర్లు | 2 | పరిశ్రమలు | 2 |
| (వీరిలో పాశ్చాత్యడాక్టర్లు 1, నాటు వైద్యులు 1) | | వర్తకులు | 1 |
| | | బ్యాంకులు | 2 |
| ఉపాధ్యాయులు | 1 | (నాటువడ్డీ వ్యాపారులు 1, కో ఆపరేటివు, జాయింటుస్టాకు సొసైటీలు 1) | |
| గ్రాడ్యుయేట్లు | 1 | | |
| ఉస్మానియా యూనివర్సిటీ | 1 | వ్యవసాయదార్లు | 12 |
| స్త్రీలు | 1 | పట్టాదార్లు 8, కౌలుదార్లు 4) | |
| హరిజనులు | 1 | జాగీరుదార్లు | 2 |

| | | | |
|---|---|---|---|
| మాషుదార్లు (పెన్షను పుచ్చుకొనేవారు) | 1 | గ్రామపరిశ్రమలు | 1 |
| జిల్లామునిసిపాలిటీలు | 1 | వెనుకబడిఉన్న కులాలు వగైరా | 1 |
| హైదరాబాదుసిటీ మున్సిపాలిటీ | 1 | ప్రాతినిధ్యం ఇవ్వబడని ఇతరచిన్నతెగలు వగైరా | 3 |
| జిల్లాబోర్డులు వగైరా | 1 | ఇతరులు | 6 |
| ఇలాకాలు (సర్ఫేఖాస్ 2, పాయిగాలు 3, పేష్కారీ 1, సాలారు జంగు జాగీరు 1, సంస్థానాలు 1) | 8 | ఉద్యోగులు (బాబేహుంకూమత్ సభ్యులుకాక) | 18 |
| | | మొత్తం | 70 |

పై శీర్షికలలో (1) నుండి (17) వరకూ యెన్నుకోబడతారు. (18) నుండి (23) వరకూ ప్రభుత్వంచే నామినేటు చేయబడతారు.

తొత్తులకన్నా ఒకొకసారి పాలకులే కొంచం న్యాయంగావుంటారు. కమిటీ అస్సెంబ్లీలో నామినేటు చేయబడినవారు మెజారిటీగా ఉండాలని అయ్యంగారు సూచించింది. కాని బాబేహుంకూమత్ యెన్నుకోబడినవారు మెజారిటీగా ఉండాలని సూచించింది. ప్రభువుగారుకూడ అందుకు అంగీకరించారు. అయినా ఈ స్కీములోకూడ 100 కి 95 గురుగా ఉండేప్రజా సామాన్యానికి 18 స్థానాలు, షాహుకార్లకు, జాగీరుదార్లకు 15 స్థానాలు. ఇందులో కౌలుదార్లకుమాత్రం 4 నుండి 8 స్థానాలవరకూ హెచ్చింపబడినది. వివరాలు యీక్రింద ఇయ్యబడుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| సంస్థానాలు, జాగీర్లు | 4 | డాక్టర్లు | 2 |
| మాషుదార్లు | 2 | గ్రాడ్యుయేట్లు | 2 |
| వ్యవసాయదార్లు (పట్టాదార్లు 8, కౌలుదార్లు 8) | 16 | జిల్లాబోర్డులు | 2 |
| కార్మికులు వగైరా | 2 | జిల్లామున్సిపాలిటీలు, టౌనుకమిటీలు | 2 |
| పరిశ్రమలు | 2 | హైదరాబాదు మున్సిపలు కార్పొరేషను | 2 |
| వర్తకులు | 2 | | |
| బ్యాంకులు వగైరా | 2 | | |
| వకీళ్ళు | 2 | మొత్తం ఎన్నుకోబడే సభ్యులు | 42 |

క్రిందవచ్చే శీర్షికలలోనివారు నామినేటెడ్ సభ్యులు :

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వంచేత నామినేటు చేయబడేవారు (ఉద్యోగులు 14, ఉద్యోగులు కానివారు 14) | 28 | ఇలాకాలచేత నామినేటు చేయబడేవారు (మూడు పాయిగాలు 3, పేష్కారీ ఎస్టేటు 1, సాలారుజంగుఎస్టేటు 1) | 5 |
| | | సర్ఫేఖాస్ | 3 |

బాబేహుకూమత్ సభ్యులుగాక మొత్తం అస్సెంబ్లీ సభ్యులు 78 మంది. ఎన్నుకోబడినవారిలోను, నామినేటు చేయబడినవారిలోను హిందువులు, మహమ్మదీయులు సమానంగా ఉండాలి.

ప్రభుత్వంచేత నామినేటు చేయబడే సభ్యులలో ఒకరు యూనివర్సిటీ సెనేటునుండీ, 5 మంది హరిజనులు, ఒక లింగాయతు, ఒక ఆంగ్లో ఇండియను, ఒక భారత క్రైస్తవుడూ, ఒక పార్సీ అయివుండాలి. లింగాయతులు, హరిజనులు, మొదలైన వెనుకబడిఉన్న తెగలలో ఉన్న నాయకులను నామినేటు చేయడంద్వారా, వారిని ప్రభుత్వం చెప్పుచేతల్లో ఉంచుకోవచ్చును.

## అస్సెంబ్లీ అధికారాలు

సంస్థానానికి సంబంధించిన విషయాలు మూడు భాగాలుగా విభజింపబడినవి.

(1) మొదటిభాగంలోని విషయాలనుగూర్చి అస్సెంబ్లీలో బిల్లులు, తీర్మానాలు, ప్రశ్నలు మరెట్టి వ్యవహారం జరుగకూడదు.

అవి యేవనగా —

1. ప్రభువుగారు, ఆయన కుటుంబం.
2. ప్రభువుగారి స్వంత పోషణకు ప్రత్యేకించబడిన సర్ఫెఖాసు.
3. బ్రిటను, భారతదేశంలోని బ్రిటిషు రాష్ట్రాలు, ఇతర స్వదేశ సంస్థానాధీశులు మొదలైనవారితో ప్రభువుగారికుండే సంబంధాలు, సంధులు వగైరా.
4. బీరారురాష్ట్ర వ్యవహారాలు.
5. పాయిగాలతో ప్రభువుగారి సంబంధం.
6. బాబే హుకూమత్.
7. మిలిటరీ, పోలీసు, సి. ఐ. డి. డిపార్టుమెంటు, దానిలోని స్పెషలు బ్రాంచి.
8. సంస్థానాలతోను, జాగీర్లతోను సన్నదులద్వారా గ్రాంటులు పొందే ఇతరులతోను ప్రభువుగారి సంబంధాలు.
9. భూమి రూపంలోగాని, ధన రూపంలోగాని ఇంతవరకు ఇయ్యబడిన గ్రాంటులు, ఇకముందు ఇయ్యబోయే గ్రాంటుల విషయంలో ప్రభువుగారి అధికారాలు.

10. ప్రభువుగారిచే ప్రసాదించబడిన చార్టర్లు.

11. దర్బారు, దానికి సంబంధించిన ఏర్పాట్లు వగైరా; టైటిల్సు ఇయ్యడం.

12. ప్రభువుగారి ప్రత్యేకాధికారాలు; క్షమించి దయచూపేహక్కు.

13. రాజ భాష ఉర్దూ.

14. పై విషయాలలోని ఉద్యోగులను నియమించుట; పై విషయాలనుగూర్చిన ఖర్చులు; ప్రస్తుతం అమలులోనున్న చట్టాలనుగూర్చిన ఖర్చులు; ప్రభుత్వం రాజకీయ ఖర్చులు (Political charges) అని నిర్ణయించినవి; జీతాలు, అలవెన్సులు; పెన్షనులు, ధర్మాలు; సింకింగుఫండు, పబ్లికుడెట్టు: ప్రభుత్వ ధర్మాలు, డొనేషన్లు, మత సంబంధమైన ధర్మాలు.

15. పై విషయాలకు సంబంధించిన 'ఎన్క్వాయిరీలు' 'స్టాటిస్టిక్సు'

16. ఈశాసనాన్ని గూర్చిన మార్పులు.

17. ప్రభువుగారిచే ఈ భాగంలోచేర్చబడే ఇతర అన్నివిషయాలు.

(2) రెండవభాగంలోని విషయాలను గూర్చి ప్రభుత్వంయొక్క అంగీకారం ముందుగాతీసుకొనకుండా బిల్లుగాని, తీర్మానంగాని, ప్రశ్నగాని, అస్సెంబ్లీలో ప్రవేశపెట్టగూడదు. ప్రభుత్వాంగీకారం పొందినవారికి సైతం ప్రభుత్వం సూచన ఇచ్చిన పద్ధతులలోనే, సంస్థానంలోని ఏమతం వారి యొక్క కలంవారియొక్క నమ్మకాలకు విరుద్ధంగాని పద్ధతులలోనే బిల్లులు, తీర్మానాలు ప్రశ్నలు ప్రవేశపెట్టాలి ఈ భాగంలోని విషయాలు ఏవనగా :

1. వ్యవసాయం, దాన్ని అభివృద్ధిపరచే మార్గాలు వ్యవసాయ పరిశోధన; పశువులరక్షణ వైద్యము; బందిలదొడ్లు వగైరా.

2. చేపలపరిశ్రమ.

3. సంస్థానంలోని వర్తకం; మార్కెట్లు, సంతలు; వడ్డీవ్యాపారం.

4. పరిశ్రమల నభివృద్ధిపరచుట.

5. ఫ్యాక్టరీలు.

6. కార్మికుల సౌకర్యాలు; ప్రావిడెంటుఫండులు, ఆరోగ్యం, నిరుద్యోగభీమా, ముసలితనపు పెన్షనులు, వికలాంగులైనపుడు యజమానులు ఇవ్వవలసిన కంపెన్సేషన్లు వగైరా.

7. గనులు, నూనెగనులలో కార్మికులకు సంబంధించిన విషయాలు.

8. బీదలకు సహాయం; నిరుద్యోగం.

9. తిరుగుబోతుతనం, భిక్షాటనం.

10. రహదారిసౌకర్యాలు; రోడ్లు, పడవలు, రైల్వేలకు సంబంధించని వంతెనలు, మున్సిపాలిటీ ట్రాములు, బస్సులు వగైరా.

11. మాగాణికినీటి సప్లయిచేసే ఆనకట్టలు, చెరువులువగైరా; మురుగు కాల్వలు ; హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీములు.

12 విద్య: ఉన్నతవిద్య ఏభాషలో చెప్పాలి అనే విషయాన్ని మినహాయించి, మిగతావిషయాలు.

13. ప్రభుత్వం పోషించే లైబ్రరీలు, మ్యూజియములు.

14. సంస్థానంలో భూమి, వృక్షాలు, జంతువులకు సంబంధించిన పరిశోధనలు: ప్రకృతిశాస్త్రం (వర్షం, నక్షత్రాలు వగైరా) సంబంధించిన దర్శనశాలలు (Observatories)

15. 16. 17. వ్యాపారసంస్థలు, బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు వగైరా.

18. భాష, శాస్త్రసంబంధమైన సంఘాలు: కోఆపరేటివు సొసైటీలు.

19. ఆరోగ్యం, పరిశుభ్రత; ఆస్పత్రులు, జనన మరణ లెక్కలు.

20. అంటురోగులను ఉంచడానికి ప్రత్యేకించేస్థలాలు, ఆస్పత్రులు.

21. పిచ్చివాళ్లు, పిచ్చి ఆస్పత్రులు.

22. మనుష్యులకు, జంతువులకు, మొక్కలకు వచ్చే అంటురోగాలను అరికట్టుట.

23. ఆహారసరుకులలోను, ఇతరవస్తువులలోను కల్తీకలుపుట; తూనిక కొలత పాత్రలు.

24. జంతువులపట్ల క్రూరత్వాన్ని ఆపుట.

25. హోటళ్ళు.

26. పురాతన కట్టడాలు, వాటి రక్షణ.

27. పోస్టాఫీసు, సేవింగ్సు బ్యాంకులు.

28. ట్రేడ్‌మార్కులు, కొత్తగా కనిపెట్టబడిన యంత్రాలు, పనిముట్లు వగైరా కాపీరైటు.

29. భూమిని ప్రజోపయోగంకోసం బలవంతంగా ప్రభుత్వం 'ఎక్వైరు' చేయుట.

30. సమిష్టిభూములు, భవనాలు వగైరా.

31. నాటకశాలలు, సినిమాహాల్సు.

32. జూదం
33. పెండ్లి, విడాకులు, పసిపిల్లలు, మైనర్లు; దత్తతచేసుకోవడం.
34. వ్యవసాయభూములకు సంబంధించని వీలునామాలు, వారసత్వం.
35. వ్యవసాయ భూములుకాని ఆస్థిని ట్రాన్స్ఫరుచేయడం.
36. దస్తావేజులు, అగ్రిమెంటులు మొదలైనవాటికి సంబంధించిన కాగితాల రిజిస్ట్రేషను.
37. ప్రభుత్వం ట్రిస్టీగావున్న ట్రస్టులను మినహాయించి, మిగతా ట్రస్టులు (ధర్మాదాయాలు).
38. వ్యవసాయ భూములకు సంబంధిచ నటువంటి, ప్రభుత్వ కంట్రాక్టులుకాని, ఇతర కంట్రాక్టు ఉత్తరాలు.
39. పంచాయితీ చేయడం (Arbitration)
40. దివాళాతీయడం, ఆస్తులమీద అజమాయిషీదార్లను నియమించుట.
41. (Actionable wrongs)
42. సాక్ష్యము, కోర్టు ప్రమాణం
43. సివిల్ ప్రొసీజరు, లిమిటేషన్‌లాతో సహా.
44. మాల్గుజారీ కోర్టులలో కార్యవిధానం.
45. కోర్టుఫీజుల రేటులు మినహా, మిగతాఫీజులు.
46. వకీళ్లు, వైద్యులు, మొదలైన ఇతరవృత్తులవారు.
47. ధర్మాలు, ధర్మసంఘాలు.
48. స్టాంపుడ్యూటీ మినహాయించి, ఇతర చెక్కులు, ప్రామిసరీనోట్లు వగైరా.
49. హైకోర్టు మినహా, ఈ భాగంలోని విషయాలకు సంబంధించినంతవరకూ ఇతర కోర్టులను గూర్చి చట్టసంబంధమైన వ్యవహారాలు.
50. ఈ భాగంలోని విషయాలకు సంబంధించిన పరిశోధన, టెక్నికల్ ట్రెయినింగు వగైరా.
51. ఈభాగంలోని విషయాలకు సంబంధించిన వాటిలో చట్టవిరుద్ధమైన చర్యలు.
52. ఈభాగంలోని విషయాలకుసంబంధించిన లెక్కలను సేకరించుట.
53. ప్రభువుగారు దీనిలో చేర్చే ఇతరవిషయాలు.

(3) మూడవభాగంలోని యీక్రింది విషయాలనుగూర్చి ప్రభుత్వం మాత్రమే బిల్లులను అస్సెంబ్లీలో పెట్టవచ్చు: అస్సెంబ్లీలోని ఏయితర సభ్యుడు పెట్టడానికి వీలులేదు.

1. రైల్వేలు, లేక విమానాలు ప్రయాణీకులను—సరుకులను రవాణాచేయుట. దానికి సంబంధించిన ఇతరవిషయాలు; స్టేటు రైల్వే, టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు.

2. ఆయుధాలు, తుపాకులు, పేలుడువస్తువులు, తేలికగా తగుల బడే పెట్రోలియం మొదలైన వస్తువులను ఉంచుకోవడం, రవాణాచేయడం వగైరా.

3. ప్రజాశాంతిని కాపాడుట; డిటెయిన్ చేయడం; వార్తలను సెన్సారుచేయుట, ప్రభుత్వ రహస్యాలు కాపాడుట.

4. సంస్థానం బయటివారిని సంస్థానం లోనికి రానివ్వడం, బయటికి పంపడం, సంస్థానంలో ఒకచోటినుంచి మరొకచోటుకు పోవడాన్ని కంట్రోలుచేయడం; సంస్థానంలో బయటివారు నివాసస్థలం ఏర్పరచుకొని, సంస్థానవాసు లవడం.

5. సివిలు, క్రిమినలు, రెవిన్యూ కోర్టులను నిర్మించడం, వాటిని నడపడం; జూడిషియల్ కమిటీ హైకోర్టు అధికారాలు.

6. ప్రభువుగారిచే యివ్వబడిన జాగీర్లు, పాయిగాలు మొదలైన వాటికి సంబంధించిన విషయాలు, (ప్రైవేటికి సంబంధించిన కోర్టు ప్రొసీజరు తప్ప).

7. గనులు, వాటి అభివృద్ధి, రక్షణ.

8. ప్రభుత్వ ఇన్స్యూరెన్సు, స్టేటుబ్యాంకింగు; గుత్తలు (moncpolies)

9. రాజ్యాంగ పరిపాలన, ఉద్యోగస్థులు,

10. స్థానిక పరిపాలక సంస్థలు (స్టేటు కంటోన్మెంటుల, గనుల ప్రాంతాలలోని స్థానిక పరిపాలక సంస్థలతోసహా); ఆప్రాంతాల హద్దుల నిర్ణయం.

11. కర్రెన్సీనోట్లు, నాణెములు వేయుట వగైరా.

12. పన్నుల విధించుట (స్థానిక పన్నులతోసహా); భూమిపన్ను దాని నిర్ణయం; కోర్టులు మొదలైనవాటి ఫీజు; ఈభాగంలోని విషయాలన్నిటిని గూర్చిన ఖర్చులు.

13. ఈ భాగంలోని విషయాలను గూర్చిన లెక్కలు.

14. ప్రభువుగారు చేర్చదలచుకొన్న ఇతరవిషయాలు.

(4) పైమూడుభాగాలలో వేటిలోనికి రానివిషయాలను (1) లేక (3) భాగాలలోకే వస్తాయి. అంతేగాక మొత్తం అన్ని విషయాలలో దేనిలోనైన సందిగ్ధం వచ్చినప్పుడు (1), (2), (3), లలో ఏ భాగానికి చెందేదీ నిర్ణయించడానికి గూడ ప్రభుత్వానికి హక్కు ఉంటుంది.

## బడ్జటు

బడ్జటు అంతనూ ప్రభుత్వం అస్సెంబ్లీముందు పెడుతుంది. కాని అస్సెంబ్లీ అధికారాలను గూర్చి వివరించబడినదానిలో మొదటిభాగంలోని విషయాలను గూర్చి అస్సెంబ్లీ చర్చించడానికి గూడ వీలులేదు. ఆమొదటి భాగంలోని విషయాలకు సంబంధించిన ఖర్చులు ఆదాయాలను గూర్చి అస్సెంబ్లీకి చర్చించడానికి గూడ హక్కులేదు. మిగతావిషయాలనుగూర్చి అస్సెంబ్లీలో తీర్మానాలు, ప్రశ్నలు ప్రవేశపెట్టవచ్చును. అస్సెంబ్లీయొక్క సూచనలను ఎంతవరకు అంగీకరించిందీ తెలియబరుస్తూ, ప్రభుత్వం ఫైనలుబడ్జటును ప్రకటిస్తుంది.

అస్సెంబ్లీచే ప్యాసుచేయబడిన తీర్మానాలను త్రోసిపేయడానికి, అంగీకరించబడని తీర్మానాలను 'సర్టిఫై' చేయడానికి, ప్రభుత్వానికి హక్కుంది. ఏబిల్లుఅయినా ప్రభువుగారిచే అంగీకరించబడినతరువాతనే చట్టం అవుతుంది. అవసరమైనప్పుడు ప్రభుత్వం అస్సెంబ్లీలో ప్రవేశ పెట్టకుండానే చట్టాలను ప్యాసుచేయవచ్చును. ఇటువంటిచట్టాలు 6 నెలల కాలం అమలులో ఉంటాయి. ఆరునెలలు పూర్తిఅయిన వెంటనే, అవుసర మైతే ఇంకొక ఆరునెలలు పొడిగించవచ్చును.

ఉర్దూ సంస్థానంయొక్క రాజభాష. అస్సెంబ్లీలో కార్యకలాపం అంతా ఈ భాషలోనే జరగాలి. ఈభాష సరిగా ఏ సభ్యునికైనా రానప్పుడు తెలుగు, మరాఠీ, కన్నడం లేక ఇంగ్లీషులో మాట్లాడడానికి అధ్యక్షుడు అవకాశం ఇవ్వవచ్చు

అస్సెంబ్లీ ఒకసారి ఎన్నుకోబడినతర్వాత 5 సంవత్సరాలవరకూ పనిచేస్తుంది.

బాబెహుకూమత్ యొక్క అధ్యక్షుడు (ప్రధానామాత్యుడు) అస్సెంబ్లీ అధ్యక్షుడుగా గూడ ఉంటాడు. ఈ అధ్యక్షుడే తను లేనిసమయాలలో

ఆధ్యక్షత వహించడానికి అస్సెంబ్లీసభ్యుల నుండి ఎవరినైనా ఉపాధ్యక్షుని నియమించవచ్చును.

## అస్సెంబ్లీ అధికారాలు నామమాత్రమే

అస్సెంబ్లీలో దాదాపు సగంమంది ప్రభుత్వంచే నామినేటు చేయబడిన వారుగా ఉండటం, 100 కి 95 మందయినప్రజాసామాన్యానికి చాలతక్కువ ప్రాతినిధ్యం ఉండటం, 100 కి 5 మందయిన షావుకార్లు, జాగీరుదార్లకు చాలయెక్కువ ప్రాతినిధ్యం ఉండటంమాట అటుంచి, అస్సెంబ్లీకి ఉన్న అధికారాలవిషయం చూదాం. అస్సెంబ్లీ ఒక ఆటవస్తువుమాత్రమే. బాబే హుకూమత్‌ను నియమించేహక్కు అస్సెంబ్లీకి లేదు. అంటే బాబేహుకూమత్ అస్సెంబ్లీకి బాధ్యత వహించదన్నమాట. సర్ఫేఖాస్, పాయిగాలు, మిలిటరీపోలీసు, ఇతరరాష్ట్రాలు, భారత ప్రభుత్వంతో సంస్థాన సంబంధాలు, మొదలైన ముఖ్యవిషయాలనుగూర్చి అస్సెంబ్లీ నోరు యెత్తడానికే వీలు లేదు. బడ్జటులో వీటికయ్యే ఖర్చు (దాదాపుసగం) ను గూర్చిగూడ నోరు మెదపడానికి వీలులేదు.

కరెన్సీ, ప్రభుత్వోద్యోగులు, పన్నులు, ప్రజాశాంతి కాపాడుట, రైల్వే, మొదలైన విషయాలలో ప్రభుత్వం బిల్లులు ప్రవేశపెడితే, దాని మీద మాట్లాడవచ్చును.

53 చిన్నచిన్న అప్రధాన విషయాలలో బిల్లులు, తీర్మానాలు ప్రవేశపెట్టడానికిమాత్రం అస్సెంబ్లీ సభ్యులకు అవకాశం యివ్వబడింది. అందుకూడా ముందుగా ప్రభుత్వ అనుమతి పొందాలి.

పై సంకుచిత హద్దులలోసైతం, అస్సెంబ్లీచేసిన తీర్మానాలను, బిల్లులను ప్రభుత్వం తోసివేయవచ్చును; అస్సెంబ్లీ అంగీకరించని విషయాలను సర్టిఫై చేయవచ్చును.

## శాసనబద్ధమైన సలహా కమిటీలు
## (Statutory Advisory Committees)

ఇప్పటికే ప్రభువుగారి ఫర్మానులవల్లగాని, ఇతర విధములుగా గాని, ఏర్పాటయి వివిధ డిపార్టుమెంటులకు అనుబంధింపబడి పనిచేస్తున్నవి. ఇవి శాసనబద్ధం కావు. రాజ్యాంగసంస్కరణల ప్రకారం, అన్ని డిపార్టుమెంటులకు సలహాలు ఇయ్యడానికి శాసనబద్ధమైన సలహాకమిటీలు ఏర్పరుపబడతాయి. అవి ఏవనగా—

(1) వ్యవసాయాభివృద్ధి
(2) విద్య
(3) ఆర్థికవిషయం
(4) పారిశ్రామికాభివృద్ధి
(5) ఆరోగ్యం
(6) హిందూ ధర్మసంస్థలు
(7) ముస్లిము ధర్మసంస్థలు
(8) మత వ్యవహారాలు
(9) కార్మికుల బాగోగులు

అవసరమైనయడల ఈ సలహాకమిటీల అధీనంక్రింద వివిధ విషయాలకు సంబంధించి ప్రవీణులతో కూడిన సబ్ కమిటీలు నియమింపబడవచ్చును.

పై సలహా కమిటీలలో సగంమంది ఉద్యోగులు, సగంమంది ఇతరులు ఉండాలి. ప్రతి కమిటీకి ఆ డిపార్టుమెంటు బాధ్యతవహించే బాబే హుకూమత్ సభ్యుడు అధ్యక్షుడుగాను, ఆడిపార్టుమెంటుయొక్క డైరెక్టరు కార్యదర్శిగాను ఉంటారు. ఈ కమిటీలు మూడు సంవత్సరాల కాలం పని చేస్తాయి. ఈ కమిటీలలోని సభ్యులు సామాన్యంగా అస్సెంబ్లీసభ్యులై ఉండాలి.

ఈ కమిటీలు పాలసీలనుగూర్చి ఏర్పడిన పెద్దసమస్యలు, డబ్బు ఖర్చుపెట్టాలిసిన పెద్దస్కీములు, ప్రభుత్వం ఈ కమిటీ సలహాలకోసం పంపే ఇతర విషయాలు, డిపార్టుమెంటు పనినిగూర్చిన సాంవత్సరిక రిపోర్టులు, మొదలైనవాటిని గూర్చి ప్రభుత్వానికి సలహాలు ఇవ్వాలి. అంతేగాని డిపార్టుమెంటు యొక్క పరిపాలననుగూర్చిన నిత్యవ్యవహారాలతో ఈ కమిటీలకు సంబంధం లేదు ఏదైనావిషయంలో కమిటీకి తనకు మధ్య అభిప్రాయభేదం ఏర్పడినప్పుడు, ఆ కమిటీ అధ్యక్షుడు బాబేహుకూమత్ అధ్యక్షునికి దానిని తెలియపర్చాలి.

## స్థానిక పరిపాలన

ఇప్పుడు ఖాల్సాప్రాంతానికి సంబంధించిన అన్ని జిల్లాలలోను జిల్లాబోర్డులు, అన్ని తాలూకాలలోను తాలూకాబోర్డులు ఉన్నవి. వీటి అధ్యక్షులు అయా జిల్లా, తాలూకాల ముఖ్య రెవెన్యూ ఆఫీసర్లు. ఈ బోర్డులలో సగంమంది ఉద్యోగులు, సగంమంది ఇతరులు—అందరూ ప్రభుత్వం చేత నామినేటు చేయబడినవారే సభ్యులు.

8 పెద్ద పట్టణాలలో, మున్సిపలు కమిటీలు ఉన్నవి. వానిలో, 8 మంది ఉద్యోగులు, 9 నుండి 15 మందివరకూ నామినేటుచేయబడిన ఇతరులు సభ్యులుగా ఉన్నారు.

57 ఇతర ఖాల్సాపట్టణాలలో 'హైదరాబాదు లోకల్ సెస్సు ఆక్టు' ననుసరించి స్థానిక పన్నులు వసూలుచేయబడుతున్నవి. వాటిలో 14 పట్టణాలకు ప్రత్యేక పట్టణకమిటీలు ఉన్నవి. మిగతా 43 పట్టణాలలో తాలూకా బోర్డులే తాలూకాలతో వేరుగాఉండే ప్రత్యేక బడ్జెటులతో పట్టణకమిటీల వలె గూడ పనిచేస్తున్నవి.

రాబోయే రాజ్యాంగసంస్కరణలలో తాలూకాబోర్డులు రద్దుచేయబడినవి. జిల్లాబోర్డులు, మున్సిపాలిటీలు, పట్టణకమిటీలతోపాటు, గ్రామ పంచాయితీలు ఏర్పరుపబడుతాయి.

## జిల్లా బోర్డులు

అన్ని జిల్లాలకు జిల్లాబోర్డులు ఉండాలి. సంవత్సరానికి 2 లక్షల రూపాయలు, అంతకుపైగా, భూమిపన్ను ఆదాయం వస్తూ, ఒకేప్రాంతంగా ఉన్న ఇలాకాలకు, జాగీరులకు, ఇలాకా జాగీరుబోర్డులు ఏర్పరుపబడాలి. మిగతా జాగీర్లు ఆయా జిల్లాబోర్డుల పరిపాలనక్రిందకు పోవాలి. ఈ జాగీర్లలో వసూలుచేయబడిన స్థానికపన్ను ఖర్చులు పోను మిగతాది ఆయా జిల్లాబోర్డుల ఆదాయాలలోకి పోవాలి.

జిల్లాబోర్డులకు అవ్వల్ తాలూక్దారు (జిల్లాకలెక్టరు) అధ్యక్షుడుగా ఉండాలి. జాగీరు బోర్డులలో ఆ జాగీర్లలోని ముఖ్య రివెన్యూ అధికారి ఆ బోర్డులకు అధ్యక్షుడుగా వుంటాడు.

ప్రతి బోర్డులోనూ సామాన్యంగా 25 మంది సభ్యులుంటారు. స్థానిక పరిస్థితులనుబట్టి ఈ సంఖ్యను హెచ్చించడంగాని, తగ్గించడంగాని చేయవచ్చును. ఈ సభ్యులలో యెన్నుకోబడినవారు నామినేటు చేయబడినవారు 5: 3 నిష్పత్తిలో ఉండాలి. అస్సెంబ్లీలోవలెనే యెన్నుకోబడినవారిలోనూ, నామినేటు చేయబడినవారిలోనూ హిందువులు, ముస్లిములు సమానంగా ఉండాలి. అస్సెంబ్లీకివలెనే యెన్నికలు ప్రాతినిధ్యం వృత్తులనుబట్టి ఉంటాయి. వివిధగ్రూపులు యేవనగా :—

1. సంస్థానాధీశులు, జాగీరుదార్లు
2. మాష్‌దార్లు

3. పట్టేదార్లు
4. కౌలుదార్లు
5. గ్రామ కో-ఆపరేటివుల సభ్యులు
6. కార్మికులు
7. పారిశ్రామికదార్లు, వర్తకులు
8. బ్యాంకులు
9. వకీళ్లు, డాక్టర్లు
10. స్త్రీలు

ఆయా జిల్లాపరిస్థితుల ననుసరించి ప్రాముఖ్యమైన వృత్తులుకూడ పై లిస్టులో చేర్చబడతాయి.

## జిల్లాబోర్డుల విధులు

(1) రహదారి సౌకర్యాలు. ప్రభుత్వం, మరే ఇతర స్థానికసంస్థ క్రిందలేని రోడ్లను మరమ్మతుచేయుట; కొత్తరోడ్లను నిర్మించుట; ఇతర పబ్లికు స్థలాలను జాగ్రత్తగా ఉంచుట.

(2) పబ్లికు వర్క్సు: మార్కెట్లు, ముసాఫిర్‌ఖానాలు, ఇతర పబ్లికు భవనాలను కట్టించుట జాగ్రత్తగా కాపాడుట, సమిష్టి బావులు, చెరువులను నిర్మించుట, వాటిని కాపాడుట.

(3) ఆరోగ్యం, పరిశుభ్రత : టీకాలువేయించుట, టీకాలువేసే వారిని నియమించుట వగైరా; యాత్రిలు పుణ్యస్థలాలలో పరిశుభ్రతను కాపాడుట.

(4) విద్య : ప్రాథమికస్కూళ్ళ భవనాలను, ఆటస్థలాలను నిర్మించుట మాత్రమే. టీచర్లను వేయడం, వారిమీద అజమాయిషీ అంతా ప్రభుత్వమే స్వయంగా చూస్తుంది.

జిల్లాబోర్డులు కావాలంటే ఈక్రింది బాధ్యతలనుగూడ తీసికోవచ్చు.

(1) జనన మరణ లెక్కలను ఉంచుట,

(2) కో-ఆపరేటివు సొసైటీలను అభివృద్ధిచేయుట.

(3) వ్యవసాయం, పరిశ్రమలు, వర్తకాన్ని, అభివృద్ధిచేయుట; పరిశ్రమలకు అప్పులు యిచ్చుట.

సంతలు, పశువులు, వ్యవసాయ ప్రదర్శనాలు, పారిశ్రామిక ప్రదర్శనాలు ఆర్గనైజు చేయుట.

(4) సభ్యులకు ప్రయాణఖర్చులు యిచ్చుట.

(5) కరువుప్రాంతాలలో కరువు నివారణ పనులు, దుకాణాలు ఆర్గనైజు చేయుట.

(6) జిల్లాబోర్డు ఉద్యోగులకు ఇండ్లుకట్టించుట.

(7) జిల్లాలోపలగాని, జిల్లాబయటగాని ప్రజా కష్టాలను పోగొట్ట డానికి ప్రోగుచేయబడే ఫండుకు ధనసహాయంచేయుట.

(8) పెద్దవారిని ఆహ్వానించుట మొదలైనవాటిలో, జిల్లాబోర్డులో తీర్మానం పాసుచేసి ప్రభుత్వంయొక్క అంగీకారం పొందాలి;

(9) పైవానిలో చెప్పబడనుండా ప్రజారోగ్యానికి సౌకర్యానికి తోడ్పడే యే యితర కార్యానికైనా పూనుకొనుట.

## జిల్లాబోర్డులకు ఆదాయమార్గాలు

(1) స్థానిక సెస్సు

(2) వృత్తిపన్ను

(3) యాత్రికుల పన్ను. ఈపన్ను 2/3 వంతు మంది బోర్డు సభ్యులు అంగీకరించినప్పుడు, యాత్రికులకు సౌకర్యాలు కలుగజేసినప్పుడు మాత్రమే వేయవచ్చును.

(4) సినిమాలు, నాటకాలమీద పన్ను.

(5) మార్కెట్టులకు సరుకులుతీసుకువచ్చే బండ్లమీద టోల్‌పన్ను; ఇళ్ళమీద పన్ను.

(6) బందిలదొడ్లమీద ఆదాయం.

(7) ప్రభుత్వమునుంచి గ్రాంటులు; వ్యక్తులనుంచి వచ్చే చందాలు వగైరా.

(8) లాభాలువచ్చే స్కీములు పెట్టడం: బోర్డు ఆస్తిమీద ఆదాయం; లైసెన్సుఫీజులు జరిమానాలు.

ప్రస్తుతం అమలులోవున్న మూడు ప్రత్యేక బడ్జట్లుపద్ధతి (రిఫాయిఅమ్, ఆరోగ్యం, విద్య) రద్దుచేయబడాలి. ఒక బడ్జటులో సాధారణంగా స్థానికసెస్సులో 2 పాయిలు ఆరోగ్యానికి, 3 పాయిలు విద్యకు ఖర్చు పెట్టాలి. జిల్లాబోర్డు బడ్జటు ప్రభుత్వంచేత అంగీకరించబడనిదే అమలు లోకి రాదు.

జిల్లాబోర్డుల మీద అజమాయిషీ నేరుగా ప్రభుత్వమే చేసినా, కొన్ని పరిస్థితులలో సుబేదారు లేక జాగీరుదారు గూడ అజమాయిషీ చేయవచ్చును.

జిల్లాబోర్డులను గూర్చిన సూచనలలో ఏ యే వృత్తులవారికి ఎన్ని స్థానాలు అనేది చెప్పకిపోయినా, అయ్యంగారు కమిటీసిఫార్సులను బట్టి చూస్తే బీదలకు వారి సంఖ్యకు తగినన్నిస్థానాలు ఉండవని స్పష్టమవు తుంది. ఎక్కువసంఖ్యగా ఉన్న వ్యవసాయకూలీలకు ప్రాతినిధ్యమేలేదు. స్థానికసంస్థలలో సైతం పూర్తి ఎన్నికపద్ధతిని ప్రవేశపెట్టలేదు. ప్రభుత్వో ద్యోగి అధ్యక్షుడుగా ఉండుటవలన, జిల్లాబోర్డు ప్యాసుచేసిన తీర్మానాలు సైతం, ప్రజాప్రతినిధి అధ్యక్షుడుగా వుండి, అమలుజరిపే అవకాశంలేదు. ప్రాథమిక పాఠశాల భవనాలను కట్టించడానికి మాత్రమే జిల్లాబోర్డుకు హక్కుందిగాని, ప్రాథమిక విద్యావిధానాన్ని నడపడానికి హక్కులేదు. గ్రామ ఆరోగ్యంకోసం స్థానికఆస్పత్రులను పెట్టడానికి గూడ హక్కు లేదు. స్థానికసంస్థలవిషయంలో గూడ ప్రభుత్వం ఉదారస్వభావం చూపలేదు.

## జిల్లా మున్సిపాలిటీలు, టౌనుకమిటీలు

15000 గాని అంతకన్న ఎక్కువ జనాభాగల పట్టణాలు, అంత కన్న తక్కువ జనాభా ఉన్నప్పటికీ జిల్లా ముఖ్యపట్టణంగా ఉన్నవాటిలో జిల్లామున్సిపలు కమిటీలు ఏర్పరుపబడాలి. ఈకమిటీ సభ్యులు 24 మందికి తక్కువగాకుండా ఉండాలి. అవసరమైనచోట్ల స్థానిక పరిస్థితులనుబట్టి హెచ్చించవచ్చును. ఎన్నుకోబడినవారికి నామినేటు చేయబడినవారికి మధ్య 5.3 నిష్పత్తి ఉండాలి. నామినేటు చేయబడిన వారిలో సగంకంటె హెచ్చుగా ప్రభుత్వోగులు ఉండాలి. అస్సెంబ్లీ జిల్లాబోర్డులలోవలెనే నామినేటు చేయబడిన వారిలోను ఎన్నికోబడినవారిలోను హిందువులు, మహమ్మదీయులు సమానసంఖ్యలో ఉండాలి. పట్టణంలో ఉంచబడిన రెవెన్యూ ఉద్యోగులలో ముఖ్యుడు మున్సిపల్ కమిటీకి అధ్యక్షుడుగాఉండాలి. ఈక్రింది వృత్తులవారీగా ఎన్నికలు జరగాలి.

1. మున్సిపల్ సరిహద్దులలోపల భూమి లేక ఇళ్లు కలవారు.
2. మున్సిపల్ సరిహద్దులలోపల భూములు ఇండ్లు అద్దెకు తీసుకున్నవారు.
3. కార్మికులు వగైరా.

4. పారిశ్రామికులు, వర్తకులు.
5. బ్యాంకులు.
6. వకీళ్ళు, డాక్టర్లు.
7. స్త్రీలు.

స్థానిక పరిస్థితులనుబట్టి ఏయితర వృత్తినిగాని, మతానిగాని ప్రైశ్రికలో చేర్చవచ్చును. ఉదహరణకు నాందేడులో సిఖులు.

ఓటర్లకు ప్రతినిధులకుండాల్సిన అర్హతలు ఎన్నికలపద్ధతి అస్సెంబ్లీకి వలెనే ఉంటుంది.

## జిల్లా మున్సిపాలిటీల విధులు

1. వీధులకు ఇండ్లకు లైట్ల సౌకర్యం
2. పట్టణాన్ని పరిశుభ్రంగా ఉంచుట
3. అగ్ని ప్రమాదాన్ని అరికట్టుట
4. ప్రమాదమైన కట్టడాలను భవనాలను తీసివేయించడం
5. ప్రజలకు ప్రమాదకరమైన వ్యాపారాలను వృత్తులను అరికట్టడం
6. స్మశానాలను కాపాడటం
7. వీధులకు పేర్లు పెట్టటం, ఇండ్లకు నెంబర్లువేయడం
8. జనన మరణ లెక్కలు ఉంచడం
9. టీకాలువేయుట
10. ఆస్పత్రులు ఏర్పరచుట
11. పిచ్చికుక్కలు కరవడంవల్ల వచ్చిన పిచ్చివాళ్ళను నయం చేయడానికి ఏర్పాట్లు
12. దిక్కులేని పిల్లలకు, కుంటి, గుడ్డివాళ్ళకు ఇళ్ళవసతి - భోజన సౌకర్యం కల్గించుట.
13. మున్సిపలు పరిపాలనను గూర్చిన సాంవత్సరిక రిపోర్టులు అచ్చువేయించుట.
14. అంటువ్యాధులను అరికట్టడానికి, రోగం తగిలినవారిని ఉంచడానికి ఏర్పాట్లు
15. కరువు వచ్చినప్పుడు మున్సిపలు సరిహద్దులో నివారణకు ఏర్పాట్లు

## మున్సిపల్ కమిటీల ఆదాయవ్యయాలు

1. భూమి, లేక ఇండ్లమీద ఆస్తిపన్ను
2. వకీళ్లు, డాక్టర్లువగైరాలమీద వృత్తిపన్ను
3. బళ్లు, కార్లు, జంతువులమీద పన్ను
4. నీరు, లైటింగు మొదలైన సౌకర్యాలు ఇండ్లలోపల కలుగ జేసినందుకు పన్ను
5. ప్రభుత్వం అంగీకరించే యాత్రికుల పన్నువంటి ఇతర పన్నులు
6. ప్రభుత్వ గ్రాంటు

## టౌన్ కమిటీలు

5,000 నుంచి 15,000 వరకు జనాభాగల పట్టణాలన్నిటిలోను టౌను కమిటీలు ఉండాలి. 5,000 కన్న తక్కువ జనాభాగలిగిన పట్టణం, తాలూకా ముఖ్యపట్టణంగాగాని వర్తక కేంద్రంగా అభివృద్ధి చెందుతున్న పట్టణంగా గాని అయి ఉన్నపుడు, దానిలోగూడ టౌనుకమిటీ ఏర్పరుపబడాలి. ఇలాగే జాగీరుల పట్టణాలలోగూడ టౌనుకమిటీల నేర్పరచాలి.

ఏ టౌను కమిటీలోగూడ 10 మందికన్న తక్కువమంది సభ్యులు ఉండగూడదు. స్థానిక పరిస్థితులనుబట్టి అవసరమయినప్పుడు పైసంఖ్యను పెంచవచ్చును. ఆ టౌనులో స్థిరంగా ఉంచబడిన రెవిన్యూ ఉద్యోగులలో ముఖ్యుడు టౌనుకమిటీకి అధ్యక్షుడుగా ఉంటాడు. ఎన్నుకోబడినవారికి, నామినేటు చేయబడినవారికి మధ్య నిష్పత్తి 5 : 3 అయివుండాలి. ఎన్నుకోబడినవారిలోను, నామినేటు చేయబడినవారిలోనూ హిందువులు, మహమ్మదీయులు సమానసంఖ్యలో ఉండాలి. నామినేటు చేయబడినవారిలో సగం కంటె హెచ్చుగా ఉద్యోగులు ఉండాలి.

వోటర్ల, ప్రతినిధుల అర్హతలు, ఎన్నికలపద్ధతులు అసెంబ్లీకివలెనే ఉంటాయి.

సామాన్యంగా ఎన్నికలకోసం ఈక్రింది నియోజవర్గాలు ఏర్పరుపబడతాయి స్థానికపరిస్థితులను బట్టి అవసరమయినప్పుడు ఇంకా నియోజకవర్గాలను ఏర్పరచవచ్చును

(1) భూములు, ఇండ్లు గలిగి టౌను సరిహద్దుల్లో ఉన్నవారు.

(2) ఇండ్లలో అద్దెకు కాపురముండేవారు.

(జిల్లా మున్సిపాలిటీలకు ఉన్న బాధ్యతలు, ఆదాయపద్ధతులు సాధారణంగా టౌనుకమిటీలకు గూడ వర్తించుతాయి)

## కంటోన్‌మెంటు బోర్డులు

మిలిటరీనివసించే ప్రాంతాలలో మున్సిపలుకమిటీలు, టౌనుకమిటీలు, కంటోనుమెంటుకు బాధ్యుడైన మిలిటరీఆఫీసరు యొక్క జనరలు కంట్రోలుకు దెబ్బతగులకుండా, పనిచేయడానికి కంటోన్‌మెంటు రెగ్యులేషను ఒకటి చేయబడాలి. ప్రత్యేకంగా కంటోన్‌మెంటుబోర్డులు ఏర్పరుపబడిన చోట్ల, వాటిలో వృత్తుల సూత్రంమీద ఎన్నుకోబడిన ప్రతినిధులు గూడ ఉండాలి.

## పంచాయితీలు

1000 — 5000 మధ్యజనాభాగల గ్రామాలన్నిటిలోనూ గ్రామ పంచాయితీలు ఏర్పరుపబడాలని అయ్యంగారు కమిటీ సూచించింది. కాని ఈవిధంగా అయితే 3657 గ్రామాలలో పంచాయితీలు స్థాపించాలిసి ఉంటుందనీ, ఇందుకు ప్రభుత్వస్టాఫ్ చాలదనీ, 2500 — 5000 మధ్య జనాభా గల గ్రామాలలో మాత్రమే పంచాయితీలు ఏర్పరుపబడాలనీ బాబెహంకూమత్ సూచించింది. దీని ప్రకారం షుమారు 1000 పంచాయితీలు ఏర్పరచాలిసివస్తుంది.

ఇంతేగాక, ఇప్పటికే 1323 ఫసలీ హైదరాబాదు కో ఆపరేటివు సొసయిటీ ఆక్టు II ప్రకారం రిజిస్టరుచేయబడి, 'రూరల్ రీకన్‌స్ట్రక్షన్ సొసయిటీలు గ్రామసౌకర్యాలకోసం పనిచేస్తున్నాయి. వీటికీ, పంచాతీలకు పోటీరాకుండా ఉండటానికి, 1000 మందిగాని, అంతకన్న ఎక్కువగాని, జనాభా గల గ్రామాలలో పై సొసయిటీలు చక్కగా పనిచేస్తున్నచోట్ల, వేరే పంచాయితీలు ఏర్పరచకుండా వాటినే పంచాయితీలుగా గుర్తించవచ్చు.

సాధారణంగా గ్రామస్థులు చదువుసంధ్యలు లేనివారు, పాతఆచారాలను, మూఢనమ్మకాలను పట్టుకు వ్రేళ్లాడేవారనియూ, కులతత్వం గాఢంగా పాతుకొని ఉండటంవల్ల వారిహృదయాలలో సమత్వం లేదయూ, ఎన్నికలు పెడితే తగాదాలు పెరిగిపోయి, పార్టీలుఏర్పడి, గ్రామశాంతికి భంగం

కలుగుతుందనియూ, వోటును సరిగా ఉపయోగించలేరనియూ, అందుచేత వోటింగుపద్ధతికి మారుగా పంచాయితీదార్లను సెలెక్టుచేయాలనీ, అయ్యం గారు కమిటీ సూచించింది. ఈ సూచనను అంగీకరిస్తూ పంచాయితీదార్లను ఈ క్రింది విధంగా సెలెక్టుచెయ్యాలని బాబేహుకూమిత్ సూచించింది:

"తహసిల్‌దారు గ్రామంలోని కుటుంబపెద్దల సమావేశంలో, ఆ పంచాయితీకి అవసరమైన పంచాయితీదార్లకు రెట్టింపు సంఖ్యతో పేర్ల పట్టీని తయారుచేస్తాడు. ఈ పేర్లపట్టీనుంచి అవన్‌తాలూక్దారు సగం మందిని ఏరి, వారినుంచి సర్‌పంచాయితీదారు పంచాయితీదార్లను నియమిస్తాడు. ప్రతిపంచాయితీలోనూ, పంచాయిదార్లలో హిందువులు, మహమ్మదీయులు సమానసంఖ్యలో ఉండాలి"

ప్రతి పంచాయితీలో 5 నుంచి 11 వరకూ పంచాయితీదార్లు ఉండవచ్చును.

## పంచాయితీ బాధ్యతలు

(1) ఇళ్ళల్లో వాడుకోడానికి నీటిసప్లయి.
(2) గ్రామ సరిహద్దుల లోపల ఉన్నరోడ్లను, వంతెనలను బాగుచేయుట, కొత్తవాటిని నిర్మించుట. రోడ్లు, వంతెనలు ఇతర స్థానికసంస్థలకు సంబంధించినవి అయితే, వాటి అనుమతితో మరమ్మతు చేయించుట.
(3) గ్రామ పరిశుభ్రత, ఆరోగ్యం.
(4) పశువులుమేసే గ్రామ సమిష్టి బీళ్లు, చెరువులు, నూతులు, సత్రవులు వగైరా.
(5) వీధిలైట్లు.
(6) సంతలు, బజారులు, బండ్లదొడ్ల అజమాయిషీ.
(7) స్మశానాలు.
(8) చెట్లు నాటుట, గ్రామ సమిష్టి ఆస్థిలోని చెట్లను కాపాడుట.
(9) గ్రామంయొక్క పరిశుభ్రత, ఆర్థికాభ్యుదయం మొదలైన వాటికి సంబంధించిన ఇతర విషయాలు.

సంతలు, బండ్లదొడ్లు, గ్రామ సమిష్టి పచ్చికభూములు, చెరువులు మొదలైనవాటిమీద ఆదాయంతో పంచాయితీలు పనిచేయవచ్చును. కాని స్మశానాలమీద, యాత్రికులమీద పన్నువేయడానికి హక్కులేదు.

పంచాయితీల ఆదాయంమాట. గ్రామసౌభాగ్యంకోసం పాటుబడే అవకాశాలమాట అటుంచండి; గ్రామస్తులకు చదువురాదనీ, గ్రామాల్లో పార్టీలు ఏర్పడతాయి అనీ, నెపంతో అసలు వోటింగుహక్కే లేకుండా చేయబడింది. మైనారిటీవెళ్ళిన గ్రామస్తులందరినీ సమావేశపరచకుండా, కుటుంబపెద్దలను మాత్రం సమావేశపరచే ఫ్యూడల్ పద్ధతి పంచాయితీదార్లను సెలెక్టు చేయడంలో ఉపయోగింపబడుతోంది.

## హైదరాబాదు మున్సిపలు కార్పొరేషన్

ఇప్పుడు హైదరాబాదు మున్సిపలు కార్పొరేషనులో 36 మంది సభ్యులు, ప్రభుత్వంచే నిర్ణయించబడిన అధ్యక్షుడు ఉంటారు. యీ సభ్యులలో—

(1) జాగీర్లచేత, వివిధసంస్థలచేత నియమింపబడినవారు—

| | | |
|---|---|---|
| సర్ఫెఖాస్ | 1 | |
| మూడు పాయిగాలు | 3 | |
| నవాబ్ సాలార్‌జంగ్ జాగీరు | 1 | |
| కిషన్‌ప్రసాద్ జాగీరు | 1 | |
| జాగీరుదార్లసంఘం | 2 | |
| గ్రాడ్యుయేట్సుసంఘం | 1 | |
| షావుకార్లు వర్తకసంఘం | 1 | 10 |

(2) వివిధవార్డులలో జనరలు ఎన్నికలద్వారా ఎన్నుకోబడినవారు 13

(3) ప్రభుత్వంచేత నామినేటు చేయబడినవారు—

| | | |
|---|---|---|
| ఉద్యోగులు, ఇతరులు | 10 | |
| వెనుకబడి ఉన్న వర్గాలు | 1 | |
| పార్సీలు | 1 | |
| క్రీస్టియనులు | 1 | 13 |
| | మొత్తం | 36 |

అయ్యంగారు కమిటీ సూచన, హైదరాబాదు పట్టణ మున్సిపలు ఆక్టులో, వార్డుపద్ధతిమీద జరిగే ఎన్నికవిధానంలో వృత్తులనుబట్టి ఎన్నిక జరిగే పద్ధతిగూడ ఇమిడేటట్లు, సవరణలు చేయబడాలి, వివిధ వృత్తుల వారికి ఈ క్రింది విధంగా ప్రాతినిధ్యం ఉండాలి.

| | |
|---|---|
| ప్రభుత్వంచేత నామినేటు చేయబడినవారు | 14 |
| ఇలాకాలు | 6 |
| వెనుకబడిఉన్న కులాలు | 2 |
| సంఘాలలో ఉన్నకార్మికులు | 1 |
| స్త్రీలు | 2 |
| గ్రాడ్యుయేట్లు | 1 |
| బాంకులు | 1 |
| వర్తకులు | 2 |
| జాగీరుదార్లు | 2 |
| పారిశ్రామికులు | 1 |
| డాక్టర్లు (ఇంగ్లీషు. దేశీయ) | 2 |
| వకీళ్ళు | 1 |
| టీచర్లు | 1 |
| మున్సిపలు సరిహద్దులలో భూములు, భవనాల యజమానులు | 4 |
| మొత్తం | 40 |

బాబేహుకూమత్ పై సూచనను అంగీకరించింది. అన్ని ఇతర సంస్థలలోవలెనే హిందువులు, మహమ్మదీయులు ఈ కార్పొరేషనులో గూడ నిష్పత్తిని నిర్ణయించడం మొదలైన మార్పులతో హైదరాబాదు పట్టణ మున్సిపలు ఆక్టు త్వరలోనే తీసుకురాబడుతుందని వాగ్దానంచేసింది.

ఇతర సంస్థలలో వలెనే ప్రజాసామాన్యానికి చాలతక్కువ స్థానాలు దీనిలో ఉన్నాయి. సంఘాలలోలేని కార్మికులు, జట్కాబండివారు, కుట్టు పనివారు మొదలైన చిన్నవృత్తిదార్లు లక్షలాదిగా పట్టణంలో ఉన్నవారికి అసలు ప్రాతినిధ్యమేలేదు. ఇదిచాల అన్యాయం.

## జిల్లా కాన్ఫరెన్సులు

ప్రతిజిల్లాలోనూ సంవత్సరానికి ఒకసారి సుబేదారు అధ్యక్షతక్రింద జిల్లా కాన్ఫరెన్సులు జరుగుతాయి. వీటిలో హాజరవడానికి ప్రభుత్వమే జిల్లాలోని ముఖ్యులకు ఆహ్వానాలు పంపుతుంది. వీనిలో ప్రభుత్వానికి సూచనలు చేయవచ్చును. ప్రజలు, పై ప్రముఖులద్వారా తమ కష్టాలకు

సంబంధించిన పిటీషన్లు పెట్టవచ్చును. వీటన్నిటినీ ఎంతవరకు నెరవేర్చిందీ, తరువాత కాన్ఫరెన్సులో సుబేదారు రిపోర్టు ఇస్తాడు. జిల్లాకాన్ఫరెన్సులు చాల జిల్లాలలో ఈసంవత్సరం జరుపబడినవి. వీటిలో హాజరైన వారు తమ అభిప్రాయాలు సరిగా చెప్పడానికిగూడ అవకాశమివ్వబడలేదు.

## జూడిషియల్ బెంచీలు

కోర్టులు దూరంగా ఉండుటవలన, ఇప్పుడు కేసులకోసం రైతులు చాలకాలం, డబ్బు వృధాచేసుకోవలసి వస్తుందనీ, ఒకొకకేసు ప్లీడర్లవాదన, అప్పీళ్ళవల్ల చాలాకాలం సాగి గెలిచినవాడు, ఓడినవాడు ఇద్దరూ నష్టపడుతున్నారనీ, అయ్యంగారు కమిటీ అభిప్రాయపడింది. అందువల్ల మున్సిపుల అజమాయిషీక్రింద, సివిలుకేసులు విచారించడానికి మాత్రమే ప్రజలకు సౌకర్యంగా ఉండే గ్రామాలలో జూడిషియల్ బెంచీలు పెట్టాలని సూచించింది. ఈ కోర్టులలో ప్లీడర్లు వాదించకూడదని గూడ సూచించింది.

పై సూచనను బాబేహుకూమత్ సూత్రప్రాయంగా అంగీకరించింది. ఇప్పుడు అమలులో ఉన్న గౌరవ మున్సిఫు, మాజిస్ట్రేటు కోర్టులకన్న ముందుకు పోవడం సాధ్యంగాదని అభిప్రాయం వెలిబుచ్చింది. కాని అక్కడక్కడ కొద్దిసంఖ్యలో జూడిషియల్ బెంచీలు ఆరంభించవచ్చని సూచించింది. ఈ విధమైన ప్రజలకు అందుబాటులో ఉండే కోర్టులు పెట్టడంవల్ల ప్రజలకు చాలసౌకర్యంగా ఉంటుంది.

# 6 యుద్ధం - హైదరాబాదుసంస్థానం

1933 లో జర్మనీలో హిట్లరు అధికారంలోకి వచ్చినప్పటినుండి, ప్రపంచం సోషలిజంవైపుకు పోవాలా లేదా అనే ప్రశ్నస్థానే, ప్రపంచం ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవడమా లేక మరొక ప్రపంచ భీషణ సంగ్రామం, అమానుషమయిన ఫాసిస్టు విధానంక్రింద నలిగిపోవడమా అనే ప్రశ్న ఉదయించింది. అప్పటినుండి సోవియట్ యూనియన్ వివిధదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు ప్రజాస్వామ్యరక్షణకొరకు, ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజాస్వామ్యశక్తులనన్నిటినీ సమీకరించడం తమ ప్రధాన కర్తవ్యంగా పెట్టుకున్నవి. మరొక ప్రపంచమహాసంగ్రామం రాకుండా చేయడానికి పూనుకొన్నవి. ప్రతిదేశంలోను ఐక్య ప్రజాసంఘటనలను నిర్మించ

బూనుకొన్నవి. సోవియట్ యూనియన్ లీగుఆఫ్ నేషన్సులో జేరి అప్ప టికి ప్రజాస్వామ్యమున్న ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలైన దేశాల ప్రభుత్వా లను గూడ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రపంచ శాంతిని కాపాడటానికి పూనుకొంది. కాని బ్రిటను, ఫ్రాన్సు, అమెరికా మొదలైన దేశాలలోని అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాదులు, సోవియటుయూనియన్ను, యూరపు ప్రజా ఉద్యమాలను అణచడానికి, హిట్లరు ముస్సోలినీ జపాను ఫాసిస్టు పాలకవర్గాలను పాలుపోసి పెంచుతూ వచ్చారు. 1935 లో ముస్సోలినీకి అబిసీనియాను బలియిచ్చారు. 1936 లో స్పానిష్ ప్రజాప్రభుత్వాన్ని నాశనం చేయడానికి హిట్లరు ముస్సోలినీలకు అవకాశం ఇచ్చి, స్పానిష్ ప్రజాఐక్య సంఘటనను భగ్నంచేసి, స్పెయిన్‌ను ఫాసిస్టు ఫ్రాంకోకు బలియిచ్చుటకు పూనుకున్నారు. 1937 లో ఆస్ట్రియాను హిట్లరుకు అప్పజెప్పారు. ఆ సంవత్సరంలోనే ఫ్రాన్సులోని ప్రజాఐక్యసంఘటనచే ఏర్పరుపబడిన ప్రజా ప్రభుత్వాన్ని పడగొట్టి, దలడియరును ఎక్కించారు. 1938 లో ప్రజాస్వామ్య జెకోస్లావోకియాను హిట్లరునోటపెట్టారు. అటు ఆసియాలో, జపాను చైనాలో చాలభాగం మింగడానికి తోడ్పడ్డారు.

ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజాఐక్యసంఘటనను ఫ్రాన్సు, స్పెయిన్ చైనాలలో మాత్రం జయమొందినాయి. ఫ్రాన్సు జెకోస్లావోకియా లు సోవి యటు యూనియనుతో పరస్పర సహాయక సంధులుగూడ చేసుకొన్నాయి. సోవియట్ యూనియన్ నాయకత్వంక్రింద నిర్మింపబడుచున్న ప్రపంచ శాంతి సంఘటన యింకా బలపడకముందే, అన్నిదేశాలకు వ్యాపించక ముందే, ఫాసిస్టులు అభివృద్ధినిరోధకసామ్రాజ్యవాదులు దెబ్బ తీయాలను కున్నారు. స్పెయిన్‌లోని ప్రజాప్రభుత్వాన్ని పడగొట్టటానికి మొదలు పెట్టారు. స్పెయిన్‌లోని ప్రజాప్రభుత్వరిక్షణకు ప్రపంచ ప్రజాశక్తులు తీవ్రకృషి చేశాయి. చివరకు ప్రజాశక్తులే ఓడిపోయాయి. స్పెయిన్ ఫాసిస్టు ఫ్రాంకోకు అప్పగించబడింది. ఇందుకు ప్రధానకారణం బ్రిటను, ఫ్రాన్సు, అమెరికాలలోని ప్రజలు ఆదేశాలలోని ఫాసిస్టు అనుకూల సామ్రాజ్యవాదులను ప్రజలనుండి వేరుజేసి, స్పానిష్ ప్రజాప్రభుత్వానికి తమ ప్రభుత్వాలు సహాయం చేసేలా చేయకపోవుటయే. కాని స్పానిష్ ప్రజలు చేసిన త్యాగం వృథాగాపోలేదు. ప్రపంచయుద్ధాన్ని రెండుసంవత్స రాలు వాయిదావేసింది. ప్రపంచ ప్రజాశక్తులు బలపడటానికి కొంత అవ కాశం గలుగజేసింది.

1939 సెప్టెంబరుకు జర్మనీ ఇటలీలు పూర్తిగా తయారయిఉన్నవి. ఫ్రాన్సు ఇంగ్లండులతో పరస్పర సహాయక సంధికోసం చివరిసారిగా సోవియటు యూనియను ప్రయత్నించింది. అప్పటికే హిట్లరు సోవియట్ యూనియనుతో తాను యుద్ధానికి అప్పుడే దిగితే సర్వనాశనమవుతాననీ, అటుతర్వాత బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యవాదులకు కీలుబొమ్మవలె పని చేయాలసివస్తుందనీ భయపడ్డాడు. ముందు యూరపునంతనూ ఆక్ర మించిన తర్వాత సోవియట్ యూనియన్ సంగతి చూడవచ్చుననుకున్నాడు. అందుచే సోవియట్ యూనియన్‌తో సంధి రాయబారాలు సాగించాడు. అయినప్పటికీ సోవియటు యూనియను బ్రిటను ఫ్రాన్సులతో సంధి చేసు కోవడానికి తీవ్రప్రయత్నాలు సాగించింది. బ్రిటిష్, ఫ్రెంచి, పోలిష్, ప్రభు త్వాలు అందుకు అంగీకరించలేదు. ఆ దేశాల ప్రజలు తమ ప్రభుత్వ స్థానాలలో కూర్చున్న అభివృద్ధి నిరోధకులను దింపి, సోవియటు యూనియనుతో రాజీపడే అభివృద్ధికర ప్రభుత్వాలను ఏర్పరచలేకపోయారు. హిట్లరును సోవియటుయూనియనుమీదికి పంపడానికి, ఛాంబర్లేను (అప్పటి బ్రిటిష్‌ప్రధాని). దలదీయులు (అప్పటి ఫ్రెంచిప్రధాని) పోలండును హిట్ల రుకు లంచం ఇయ్యడానికిగూడ సిద్ధమయ్యారు ప్రపంచ ప్రజాశక్తులు బలహీనంగావున్న ఆ సమయంలో హిట్లరుతో తలపడటంవల్ల లాభంలేదని ఊహించి, తాను బలపడటానికీ; ప్రపంచ ప్రజాశక్తులు బలపడి అభివృద్ధి నిరోధకులను ప్రభుత్వ స్థానాలలోనుండి దింపి, ప్రపంచశాంతి రక్షణకు తనతో రాజీపడే ప్రభుత్వాలను ఏర్పరచుటకు అవకాశమియ్యడానికీ, జర్మ నీతో తాత్కాలికంగా నిరాక్రమణ సంధిని చేసుకొంది సోవియటు యూని యన్. ప్రపంచంలోని సోవియటు వ్యతిరేకులయిన అభివృద్ధి నిరోధకు లందరూ, సోవియటు యూనియను ప్రజాస్వామ్యానికి ద్రోహంచేసిందనీ, ఫేసిజంతో కలిసిపోయిందనీ దుమ్మెత్తిపోశారు. జర్మనీతో చేసుకొన్న సంధిని, ఇంగ్లండు ఫ్రాన్సులతో చేసుకొన బూనిన పరస్పర సహాయక సంధిని, ఒకదానితో ఒకటి పోల్చిచూస్తే ఇది శుద్ధఅబద్ధమని తేలుతుంది. ఇంగ్లండు ఫ్రాన్సులతో చేయబూనుకొన్న సంధి, హిట్లరు దురాక్రమణకు వ్యతిరేకంగా ఒకరికొకరుసహాయం చేసుకోవడానికి. జర్మనీతో చేసుకున్న సంధి, జర్మనీ సోవియటుయూనియనులు ఒకదానిమీద మరొకటి దాడిసల్ప గూడదని ఈ రెంటికీఎంతో భేదముంది. చివరకు సోవియటుయూనియను మీదకు జర్మనీనిపంపాలనే బ్రిటిషు ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ప్లానులు

తాత్కాలికంగా భగ్నమయ్యాయి. తాము తీసుకున్నగోతిలో తామేపడ్డారు. హిట్లరు ఫ్రాన్సు, ఇంగ్లండు, పోలండులమీద యుద్ధాన్ని 1939 సెప్టెంబరు 1 వ తేదీన ప్రకటించాడు. రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమయింది.

అప్పటికి భారతదేశంలో 8 రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు పనిచేస్తున్నాయి. పంజాబు, బెంగాలులలో ముస్లింలీగు మంత్రివర్గాలు ఉన్నవి. ఈ మంత్రివర్గాలతో సంప్రదించకుండానే, కేంద్ర శాసనసభతో సంప్రదించకుండానే, బ్రిటిషుప్రభుత్వం భారతప్రభుత్వాన్నిగూడ యుద్ధంలో దింపింది. ఇందుకు దేశంలోని ప్రధానసంస్థలైన కాంగ్రెసు-లీగులు గూడ అసమ్మతి తెలిపాయి. 8 రాష్ట్రాలలోని కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా నిచ్చాయి. కేంద్రశాసనసభకు కాంగ్రెసుసభ్యులు వెళ్ళడం మానివేశారు.

యుద్ధం ప్రారంభమయిన 18 రోజుల్లోనే హిట్లరు పోలండును కబళించాడు. యుద్ధగమనం చూస్తే ప్రపంచంలో అన్నిపాలకవర్గాలకు భయం పుట్టింది. ఫేసిజం చేతిక్రిందకు పోవలసివస్తుందో, లేక తమదేశాల ప్రజలచే కూల్చివేయబడతామో అని భయం పుట్టింది. యుద్ధజ్వాలలతో నిద్రాణమైయున్న ప్రజాశక్తులన్నీగూడ కదిలాయి. భారతదేశంలో గూడ ప్రజలలో, ముఖ్యంగా రాజకీయచైతన్యంగల యువకులలో సంచలనం గలిగింది. దేశంలో ప్రధానసంస్థలైన కాంగ్రెసు, లీగులు యుద్ధం యెడల తటస్థవైఖరిని బూని, ప్రజలకు మార్గం చూపించకుండా కూర్చున్నవి. ఈ పరిస్థితుల్లో భారత కమ్యూనిస్టుపార్టీ ముందుకువచ్చి, స్వాతంత్ర్య సంపాదనకు ప్రజలకు మార్గంచూపి, ప్రజా సమీకరణకు పూనుకుంది. రాజకీయ చైతన్యంగల యువకులలో చాలమంది కమ్యూనిస్టుపార్టీవైపుకు ఆకర్షించబడ్డారు బ్రహ్మాండమైన విద్యార్థి, కార్మిక, రైతు ఉద్యమాలు నిర్మించబడ్డాయి. కమ్యూనిస్టుపార్టీ చాల బలపడింది. అంతవరకూ అతి వాద బురఖా వేసుకొని యువకులను మోసపుచ్చుతున్న కాంగ్రెసు సోష లిస్టుపార్టీ నాయకత్వం, ఫార్వర్డుబ్లాకు, రాయిస్టుపార్టీల నిజరంగు బయట బడిపోయింది. ఇవిపూర్తిగా బలహీనపడినవి.

## ఇత్తెహాదుల్ ముసిల్మీను - రాజ్యాంగసంస్కరణలు

రాజ్యాంగ సంస్కరణలను గూర్చిన రిపోర్టు తయారుచేయడానికి 1937 లో అయ్యంగారు కమిటీ నియమింపబడినతర్వాత, ప్రభుత్వానికి సంస్కరణలమీద సూచన ఇచ్చుటకు వివిధ ప్రజాసంస్థల ప్రతినిధులతోను

ఇతర ప్రముఖులతోను హైదరాబాదు ప్రజాపరిషత్తు ఏర్పడింది. దానిలో మహమ్మదీయ ప్రముఖులుగూడ పాల్గొన్నారు. మిగతా అన్నివిషయాల మీద ఏకాభిప్రాయం కుదిరినా, అస్సెంబ్లీలో 100 కి 50 స్థానాలు మహమ్మదీయుల కుండాలనే మహమ్మదీయ ప్రముఖుల కోర్కెను పరిషత్తు అంగీకరించక పోవుటచేత, ఈ మహమ్మదీయ ప్రముఖులు పరిషత్తునుంచి విరమించుకున్నారు. అయ్యంగారు కమిటీ 1938 ఆగస్టు 31 న ప్రభుత్వానికి రిపోర్టును సమర్పించి నప్పటినుండీ, దాన్ని ప్రచురించమని ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకులు ఆందోళన ప్రారంభించారు. సంస్కరణలు మహమ్మదీయులకు 'చారిత్రకంగా లభించిన' ఉన్నతస్థానానికి ఏమాత్రం దెబ్బ తగిలేలాగు ఉండగూడ దని అన్నారు. పెద్దపెద్ద ప్రజాప్రదర్శనాలు చేశారు. దేశంయొక్క ముఖ్య వర్గాలు తెగలవారి హక్కులు అవసరాలు ఆధిక్యతలను రక్షిస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసింది. దానితో ఇత్తెహాదుల్ ముసల్మీను ప్రదర్శనాలను ఆపివేసింది. ఈరోజుల్లోనే ఇత్తెహాదుల్ముసిల్మీను నాయకత్వం "ముస్లిం ఆధిక్యత" అనే నినాదాన్ని "అనల్‌మల్లిక్" అనే జాత్యహంకారసిద్ధాంతంగా ముందుకు వచ్చింది. అంటే ముస్లిములు పాలకజాతివారనీ, ఇతరులు పాలితజాతులవారనీ, ప్రభువుగారు పాలకజాతియైన ముస్లిముల ప్రతినిధి అని అర్థం. ఈ నినాదానికి వ్యతిరేకంగా సంస్థానంలో చెలరేగిన ప్రజాభిప్రాయంవల్ల, ప్రభువుగారు, తన సంస్థానంలోని హిందువులు ముస్లిములు అందరూ తనదృష్టిలో సమానమే అని ప్రకటించుటవల్ల, ఈజాత్యహంకార నినాదం కొద్దిరోజులలోనే మానివేయబడింది

9 వ అర్దీబెహస్తు 1348 ఫసలీన (1939 మార్చి) ఇత్తెహాదుల్ ముసిల్మీను ఈక్రింది మెమొరాండంను ప్రధానామాత్యునికి సమర్పించింది.

(1) హైదరాబాదు సంస్థానం ఆసఫియావంశానికి చెందిన మహమ్మదీయరాజుచే, సంపూర్ణహక్కులుగలిగి, ఎల్లప్పుడూ పరిపాలింపబడాలి.

(2) ఒకవేళ హైదరాబాదు సంస్థానం భారత ఫెడరేషనులో పాల్గొనవలసివచ్చినచో, అది తన గౌరవ ప్రతిష్ఠలకు తగినట్లుగాను, రాజకీయప్రతిష్ఠ ఆర్థికాభివృద్ధికి అవకాశాలు దెబ్బతినకుండగాను పాల్గొనాలి.

(3) దేశముయొక్క అభివృద్ధికి ప్రస్తుత రాజ్యాంగమునందు మార్పులు అవుసరమైతే, దక్కన్ ముస్లిములు తమకు తరతరాలనుండీ

అనుశృతంగా సాగుతున్న రాజకీయాధిక్యతకు హానిగల్గడానికి అంగీక రించరు.

(అ) శాసనసభలోను, స్థానికసంస్థలలోను, ప్రభుత్వ నిర్మాణము నందు ముస్లింలు అధికసంఖ్యలో ఉండవలెను.

(ఆ) మహమ్మదీయ స్థానములకు ప్రతేక ఎన్నికలు జరుగవలెను.

(4) ఉర్దూ మొత్తం హిందూదేశానికి సంబంధించినదియూ, హైదరాబాదుసంస్థానంయొక్క రాజ్యాంగభాషయు, అయి ఉంది. అది ఎల్లప్పుడు ప్రభుత్వ కార్యనిర్వహణలోను, కళాశాలలు-ప్రాథమిక పాఠశాలలో విద్యనేర్పే భాషగను ఉండాలి.

(5) ఉద్యోగములు ముస్లిములయొక్క చారిత్రిక, రాజకీయ ప్రతిష్టకు సంబంధించినవేగాక, వారి ఆర్థికసమస్యకు సంబంధించినవిగూడ అయిఉన్నవి. కాబట్టి మతాలవారి. కులాలవారి సంఖ్యనుబట్టి ఉద్యోగాలు ఇవ్వరాదు. మహమ్మదీయులు వీటిని వదలుకోడానికి ఎట్టి పరిస్థితుల లోనూ సిద్ధపడజాలరు.

(6) ఇప్పుడు హైదరాబాదు సంస్థానంలో అన్ని మతములవారికి, తెగలవారికి "న్యాయమైన" స్వతంత్రం ఉందియే ఉంది. ముందుగూడ ఉండును, కాని ప్రభువుగారి మతం ఇస్లాం అయి ఉండుటవలననూ, ఇక ముందుకూడ ఉండగలదుగనుకనూ, సదరుల్‌సదూర్ (ముస్లింమత పీఠాధిపతి) స్థానమును స్థాపించి, ముస్లింల పద్ధతులను నిలుపుటకు ఒక డిపార్టుమెంటును స్థాపించవలెను.

(7) ఏమతం, ఏతెగవారయినను పౌరహక్కులు కలిగిఉంటారు. కాని వీటిని రాజద్రోహమునకు మతకలహములను రెచ్చగొట్టుటకు, వినియోగించకూడదు.

(8) దేశంయొక్క ముఖ్యవృత్తులు వ్యవసాయం, వర్తకం. వ్యాపారమునందు ముస్లిములకు స్థానం సున్నయే. అందువల్ల వారి ఆర్థిక జీవితానికి దెబ్బతగులుచున్నది. ముస్లిములు అందువల్ల తమ గౌరవమునకు తగినట్లు దానియందు పాల్గొని, తమ ఆర్థికలోటును పూడ్చుకొనడానికి అవకాశాన్ని కల్పించాలి.

(9) శాసనసభయందు ముస్లిములకు అధికస్థానములతోపాటు ఏమతమువారు తమ సంస్కృతి విషయంలో శాసనం చేయదలచినన్నూ, ఆ

మతము వారి స్థానములయందు 3/4 వంతు ఒప్పుకున్నతర్వాత మాత్రమే చేయాలి.

ఈ మెమొరాండం సమర్పించిన నాలుగైదురోజులకు ఇత్తెహాదుల్ ముసిల్మీను కార్యకారిణీసంఘం ఒకతీర్మానం చేసింది. దానిలో ప్రస్తుతం సంస్కరణలకు వాతావరణం అననుకూలంగా ఉన్నదిగనుక వాయిదా వేయమనీ, ప్రస్తుతం సంస్కరణలు అవుసరమా, అనవుసరమా అనే విషయంమీద దేశంయొక్క అభిప్రాయాన్ని తెలుసుకోమనీ, ఎంతవరకైతే ముస్లిముల హక్కులు నిర్ణయంగావో, అంతవరకు అయ్యంగారు కమిటీ యొక్క సలహాలను సంస్కరణలకు పునాదిగా తీసుకోగూడదని, కోర బడింది.

1939 జులైలో ప్రభుత్వం సంస్కరణల స్కీమును ప్రకటించింది. నెలరోజులకే ప్రపంచయుద్ధం ఆరంభమయింది. యుద్ధం, సంస్కరణల ప్రకటన, రాష్ట్ర రాజకీయవాతావరణంలోని ఒడుదుడుకులు,—హైదరాబాదు ఇవి సంస్థానమహమ్మదీయులలో సంచలనం కలుగజేసింది. ఆసంవత్సరం డిసెంబరులో ఇత్తెహాదుల్ ముసిల్మీన్ మహాసభ హైదరాబాదులో జరిగింది. హైదరాబాదు పట్టణంలోనే సుమారు 4 లక్షలమంది మహమ్మదీయులు ఉన్నారు. ఆ సంవత్సరం మొత్తం 70,000 మంది మహాసభకు వచ్చారు. ఆ మహాసభకు అధ్యక్షుడు బహద్దుర్ యార్ జంగ్‌గారు. ఈయన అధ్యక్షో పన్యాసం చాలముఖ్యమైనది. ఎందుకనగా దీనిలో హైదరాబాదు సంస్థానం భారతదేశాన్నెదుర్కొనుచున్న సమస్యల యెడల, ఇత్తెహాదుల్ ముసల్మీను నాయకత్వం యొక్క అభిప్రాయాలు స్పష్టపరచబడ్డాయి. ముఖ్యమైన విషయాలు ఈ క్రింద ఇవ్వబడ్డాయి:

(1) కాంగ్రెసు భారతదేశంమీద పెత్తనం తనకే అప్పజెప్పమంది. దాని అర్థం, ఇప్పుడు సంస్థానాల విషయంలో బ్రిటను చలాయించుతున్న పెత్తనంగూడ కాంగ్రెసుచే ఏర్పరుపబడిన ప్రభుత్వానికి ఇమ్మనే. హైదరా బాదు సంస్థానానికీ, బ్రిటిషుప్రభుత్వానికి మధ్యఉన్న సంబంధాలు ఇతరులకు అప్పగించదగినవిగావు. బ్రిటిషుప్రభుత్వం భారతదేశానికి డొమీనియన్ స్టేటసు ఇచ్చే పరిస్థితులలో, హైదరాబాదు సంస్థానాధీశుడు బ్రిటిషువారి కిచ్చిన బీరారు, ఉత్తర సర్కారు జిల్లాలు, రాయలసీమ, బందరుపట్టణం- ఇవి అన్నీ తిరిగి ఇచ్చివేయాలి.

(2) సంస్థానంయొక్క అంతరంగిక వ్యవహారాలలో ఎవ్వరూ జోక్యం కలిగించుకోగూడదు. మంత్రుల నియామకం, వారిని తీసివేయుట మొదలైన వాటిలో వైస్రాయి జోక్యం కలిగించుకోవడం ముస్లిములకు బాధాకరంగా ఉంది. అందుచే ఈ విధమైనజోక్యం కల్గించుకోవడం వైస్రాయి మానాలి.

(3) హైదరాబాదు సంస్థానానికీ - బ్రిటనుకు మధ్య జరిగిన ఒడం బడికలలో ఎక్కడా, బిరుదుపెట్టుకోడానికి బ్రిటను అనుమతిని పొందాలని లేదు. ఈ రోజున భారతదేశంలో మొగలుసామ్రాజ్యానికి నిజమైన వార సులు ఎవరైనాఉంటే, వారు ఆసఫ్‌జాహీ వంశీయులే. అంతేగాక, భారత దేశ ముస్లిములందరూ ప్రభువుగారిని హిజ్ మెజెస్టీ (His Majesty) అని పిలవాలని కోరుతున్నారు. కనుక అందరూ ఈ రోజునుంచే ప్రభువుగారిని హిజ్ మెజెస్టీ అని పిలవాలి.

(4) ప్రజాస్వామికం పేరుతో హిందూమెజారిటీకి అధికారం అప్పగించే ఏ ప్రజాస్వామిక సూత్రాన్నిగూడ ముస్లింలుసహించరు. ఏసంస్థ అయితే ముస్లిము అభిప్రాయాన్ని సంపూర్ణంగా వ్యక్తీకరించడానికి అవ కాశం ఇచ్చి, ముస్లిముల ప్రభుత్వానికి ప్రజల నిజమైన కోర్కెలనుగూర్చి "సలహామాత్రమే" ఇయ్యడానికి పూనుకుంటుందో అటువంటి సంస్థతో మాత్రమే ఇత్తెహాదుల్ ముసిల్మీను సహకారం చేస్తుంది. అధికారం ముస్లిమేతర మెజారిటీ చేతుల్లోకి తేజూచే సంస్థలను సహించదు. ప్రమాద కరమైన భావాలను వ్యాపింపజేసే స్టేటు కాంగ్రెసు పేరు మార్చుకొన్నంత మాత్రాన, దానిమీద నిషేధం తీసివేయగూడదు.

(5) ఏ రాజ్యాంగ సంస్కరణలలోనైనా ఈ క్రింది విషయాలు ఉంటేనే, ఇత్తెహాదుల్ ముసిల్మీను వాటిని అంగీకరించుతుంది.

(అ) ప్రభువుగారి సర్వాధిపత్యంలో ఎటువంటి తగ్గింపు ఉండ గూడదు.

(ఆ) మహమ్మదీయుల చారిత్రికహక్కులకు దెబ్బతగలగూడదు. ప్రజల నిజమైన అవసరాలనుగూర్చి ప్రభుత్వానికి సల హాగామాత్రం ఇచ్చే శాసనసభలో, మహమ్మదీయులకు వారి చారిత్రిక ఆధిపత్యానికి తగినట్లుగా ప్రాతినిధ్యం ఉండాలి.

ఈపై రెండు విషయాలు ప్రభుత్వంచే ప్రకటింపబడిన సంస్కరణలలో ఉన్నవి గనుక, ఇత్తెహాదుల్ ముసిల్మీను సంస్కరణలను అంగీకరించుతుంది. వాటిని అమలు పరచడానికి తగినప్రయత్నాలు చేస్తుంది.

(6) కాలం చాల ఒడుదుడుకుగాఉంది. పరిస్థితులు ఎలా మారుతాయో ఎవ్వరూ చెప్పలేరు. కనుక మిలిటరీ కాలేజి తెరిచి, దానిలో ఆసఫియావంశానికి విశ్వాసపాత్రులుగా ఉండేవారికి తర్ఫీదు యివ్వాలి.

(7) ఇత్తెహాదుల్ ముసిల్మీను బ్రాంచీలన్నీ వాలంటీరుదళాలను ఏర్పరచాలి.

(8) హిందూదేశములో మహమ్మదీయులు 1000 ఏండ్లనుండి ఉన్నప్పటికీ, మహమ్మదీయరాజులు ఎంతోకాలం యిక్కడ పరిపాలించినప్పటికీ 9 కోట్లమంది మహమ్మదీయులే ఉండడం ఆశ్చర్యం. హైదరాబాదు సంస్థానంలో మహమ్మదీయులసంఖ్యను ఎక్కువచెయ్యాలి. డాక్టరు లాయరు, వర్తకుడు, విజ్ఞానవేత్త తమతమ పనులు చేసుకొంటూ, ఇతరులను మహమ్మదీయులుగా జేయడానికి ఎల్లప్పుడూ ప్రయత్నించాలి.

పై జెప్పబడిన విషయాలనుగూర్చి ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభ తీర్మానాలుచేసింది. వీనితోపాటు, సంస్థానాలయొక్క ప్రధానామాత్యుల సమావేశం సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వములు పనికిరావని తీర్మానం చేసినందుకు అభినందించబడింది. సంస్థానంలో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పాలని కొన్నిసంస్థలు చేసిన ప్రయత్నాలను భగ్నం చేయడంలో ఇత్తెహాదుల్ ముసల్మీను జయంపొందినందుకు ఆనందం తెలుపబడింది. ఇంకా సంస్థాన మహమ్మదీయుల ఇతరకోర్కెలనుగూర్చి తీర్మానాలు చేయబడినవి.

1940 మేలో ఫ్రాన్సు, బెల్జియం, హాలెండులను దేశద్రోహుల సహాయంతో హిట్లరు ఒక నెలరోజుల్లోనే పూర్తిగా ఆక్రమించాడు. బ్రిటిషుసామ్రాజ్యం ఉంటుందా, ఊడుతుందా అనే సంశయం ప్రపంచంలో వ్యాపించింది. బ్రిటనుమీద హిట్లరు దాడి జరుపుతాడని ఊహించబడింది. ఇట్టి పరిస్థితులలో భారతదేశంలో అభివృద్ధినిరోధకశక్తులు, స్వదేశసంస్థానాధీశులు, ఇండియాలో బ్రిటిషు అధికారం అస్తమించగనే భారతదేశాన్ని కబళించడానికి ఉవ్విళ్లూరారు. ఈ పరిస్థితులలో హిందూమహాసభవలెనే హైదరాబాదులో ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకత్వంయొక్క భావాలు చాలదూరంపోయాయి. ముస్లిము సామ్రాజ్యం స్థాపించాలనే స్థితికిగూడ

పోయింది. 1939 డిసెంబరులో జరిగిన మహాసభ నినాదాలు యింకా స్పష్టంగా తెలుపబడ్డాయి. 1940 జూనులో కార్యకారిణీసంఘం ప్రధానామాత్యునికి ఒక మెమోరాండం ఇచ్చింది. దానిలోని ప్రధానాంశాలు యివి :—

(1) హైదరాబాదు సంస్థానం దానిశక్తికి, గౌరవానికి తగినట్లుగా సైన్యాన్ని గలిగి లేదు. అందుచేత కొద్దిపాటి సేననే యుద్ధరంగంలోకి హైదరాబాదు పంపగలిగింది. అంతేగాక ఉన్న సైన్యానికి సైతం బ్రిటను నుంచి ఆయుధాలు రావలసివస్తోంది. అందుచే హైదరాబాదు సంస్థానంలో ఆయుధ ఫ్యాక్టరీలు వెంటనే నిర్మించాలి.

(2) సైన్యాన్ని ఎక్కువచేయడం, ఆయుధ కర్మాగారాలకు అవసరమైన మనుష్యులను సప్లయిచేయడమేగాక, ఇత్తెహాదుల్ ముసిల్మీను ప్రత్యేక వాలంటీరు దళాలను యివ్వడానికి సిద్ధంగాఉంది. "ఇది దేశంలో శాంతిని కాపాడుటకొరకేగాక, యుద్ధరంగానికి రిజర్వుదళంగా ఉపయోగ పడును."

(3) హైదరాబాదు సంస్థానం 1724 లో మొగలు సామ్రాజ్యం నుండి స్వతంత్రం ప్రకటించినతర్వాతనుండీ, బ్రిటిషువారు వచ్చేవరకూ స్వతంత్రంగా ఉంది. ఈ స్థితిలోనే ఇంగ్లీషువారికి ఆసఫ్‌జా వంశంవారు తోడ్పడ్డారు. అందువల్ల బ్రిటిషువారికి మిత్రులయ్యారు. అటుతర్వాత క్రమంగా హైదరాబాదు ఆంతరంగిక వ్యవహారాలలో బ్రిటిషు జోక్యం హెచ్చింది. ఇక హైదరాబాదు ఈ పరిస్థితిని సహించగూడదు. హైదరాబాదు ఒక బలమైన స్వతంత్రరాజ్యంగా ఉండాలని ఆతురతజెందుతున్నాం.

భారతదేశానికి డొమినియనుస్టేటసు యివ్వబడితే, ఆ భారత ప్రభుత్వంతో స్వతంత్రంగా హైదరాబాదు సంధులు చేసుకోడానికి హక్కుగలిగి ఉండాలి. హైదరాబాదు యిదివరకు బ్రిటిషువారి కిచ్చిన ప్రాంతములన్నీ తిరిగి ఇయ్యబడాలి.

(4) " హైదరాబాదు మహమ్మదీయులేగాక, భారతదేశ మహమ్మదీయులుసైతం, హైదరాబాదు సింహాసనమును తమయొక్క రాజకీయ ఔన్నత్య చిహ్నంగా తలచుతున్నారు. దానియొక్క ఔన్నత్యాన్ని, భవిష్యత్తును కాపాడటానికి ఎట్టి త్యాగానికైన సిద్ధంగా ఉన్నారు. అందువల్ల, హైదరాబాదు ఒక నూతన తేజస్సుతో ముందుకు రావాలి. దీనికి ఎట్టిత్యాగమునకు వెనుకాడరాదు.

"ఈ విషయాలలో దేవుడు ప్రభుత్వానికి స్థైర్యం, శక్తి గల్గించాలని కోరుతున్నాం. సమయం మించినచో ప్రభుత్వం కాలానికి కవుసరమైనపని చేయనట్లే. అందువల్ల హైదరాబాదునందు, హిందూదేశమునందు ముస్లిములకు గల్గు హానికి ప్రభుత్వమే కారణమగును."

## కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభం

1939 లో స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహం ఆపివేయబడినతర్వాత, "స్టేటు పీపుల్సు కాన్ఫరెన్సు" అని పేరుమార్చితే నిషేధం తొలగింపబడుతుందేమోనని, ప్రయత్నించబడింది. కాని ప్రభుత్వం అందుకు అంగీకరించలేదు.

తాత్కాలికంగా కేంద్రశాసనసభలో ఎన్నుకోబడిన సభ్యులచే ఏర్పడు కాబినెట్టు, యుద్ధం అయినతర్వాత కాన్స్టిట్యుయంటు అస్సెంబ్లీద్వారా భావిభారత రాజ్యాంగ విధానం నిర్ణయింపబడాలనీ, కాంగ్రెసు కోరింది. ఇందుకు సమాధానంగా అమెరీ 1940 ఆగస్టులో, యుద్ధం అయినతర్వాత డొమీనియను స్టేటసు ఇస్తామనీ, ఈలోగా ప్రస్తుతంఉన్న వైస్రాయి కార్యనిర్వాహక వర్గంలో (ఈకార్యవర్గం వైస్రాయికే బాధ్యత వహిస్తుంది: అస్సెంబ్లీకి బాధ్యతవహించదు) చేరమని అన్నాడు. దీనినే "ఆగస్టు ఆఫర్" అని గూడా అంటారు. పైగా ఆ రోజుల్లో కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్యం కోసం ప్రజలకు సక్రమమైన మార్గం చూపుటవల్ల, రాజకీయ చైతన్యం గల యువకులందరూ ఆకర్షింపబడి. అది దినదిన ప్రవర్ధమానమవుతోంది. ఈ పరిస్థితుల్లో గాంధీజీ ఏదోఒకటి చేయకతప్పలేదు. గాంధీజీ వ్యక్తిగత సత్యాగ్రహం ఆరంభించాడు.

హైదరాబాదు సంస్థానంలోగూడ స్టేటుకాంగ్రెసుమీద నిషేధంతొలగించనందుకు అసమ్మతి తెలుపుతూ నాయకులు మాత్రమే వ్యక్తిగత సత్యాగ్రహంచేయమని గాంధీజీ సలహాఇచ్చాడు. 1939లో జరిగిన సత్యాగ్రహంలో అవలంబింపబడిన ఎత్తుగడలు, ప్రజాసామాన్యం పాల్గొకుండా కల్గింపబడిన అడ్డంకులు, ఉద్యమం ప్రజాఉద్యమం కాకుండా సంకుచితపరచే ఎత్తులు, అవలంబించడంవల్ల హైదరాబాదు సంస్థానంలోని రాజకీయ చైతన్యంగల యువకులలోనూ, స్టేటుకాంగ్రెసు యువకనాయకులలోనూ (రావినారాయణ రెడ్డి, బద్దం యల్లారెడ్డి వగైరా) సత్యాగ్రహ ఎత్తుగడలయెడల అసంతృప్తి గల్గింది. నూతన మార్గం కోసం వెతకడం మొదలుపెట్టారు.

1940 లో గాంధీజీ చేయమనిచెప్పిన వ్యక్తి సత్యాగ్రహం వారికి అసలే నచ్చ లేదు. వీరిపై బ్రిటిషుఇండియాలోని, ముఖ్యంగా ఆంధ్రలోని, కమ్యూనిస్టు పార్టీ కార్యకలాప ప్రభావం పడింది వీరు స్వాతంత్ర్య సంపాదనకు ప్రజా సమీకరణయే మార్గమని గ్రహించారు.

తెలంగానాలోని యువక కార్యకర్తలలో 100 కి 90 మంది, మహారాష్ట్ర ప్రాంతంలో కొంతమంది, కమ్యూనిస్టులయ్యారు.

## కామ్రేడ్స్ అసోసియేషన్

యుద్ధానికి పూర్వం హైదరాబాదు రాష్ట్రంలోనూ, భారతదేశంలోను గలిగిన రాజకీయ సంచలన ప్రభావం ముస్లిము యువకులమీద గూడ పడింది. ముఖ్యంగా కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమ ప్రభావం పడింది. దీని ఫలితంగా, హైదరాబాదులోని ముస్లిము విద్యార్థులు కొంతమంది హిందూ విద్యార్థులతోగూడిన కామ్రేడ్సు అసోసియేషను ఏర్పడింది. మీటింగులు. డిబేటులద్వారా అభివృద్ధిభావాల ప్రచారం జరుగుతుండేది. దీనిలో ముఖ్యులు ప్రఖ్యాత కవి మగ్దూమ్ (సిటీకాలేజీ ప్రొఫెసరు) డాక్టరు రాజ బహద్దుర్ గౌడు, సయ్యద్ ఇబ్రహిం, సయ్యద్ అలం, గారలు.

ఈ విధంగా కమూనిస్టులుగా మారిన హిందూ ముస్లిము యువకు లందరూ తమపనికి హిందూ - ముస్లిము ఐక్యతయే పునాదిగా బెట్టు కొన్నారు, హిందూ ముస్లిము ఐక్యతలేనిది, ప్రజలయొక్క స్థానిక ఇబ్బందులను తీర్చగలగడంగాని, స్టేటులో ప్రజా ప్రభుత్వం సాధించడం గాని, సాధ్యపడదని వారు గట్టిగా నమ్మారు. వట్టి రాజకీయ ప్రచారంతో మాత్రమే ప్రజలను సమీకరించలేమనీ, దీనితోపాటు ప్రజల దైనందిన ఇంబ్బందులు తీసుకు పనిచేస్తేనేగాని, స్వాతంత్ర్యాన్ని సాధించే బ్రహ్మాండ మైన ప్రజాఉద్యమాన్ని నిర్మించలేమని, వీరు గ్రహించారు. అందుచే వీరు ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర పరిషత్తులలోనూ, హైదరాబాదులో చార్ మీనార్ అల్వీనుమెటల్ ఫ్యాక్టరీలలోని కార్మికులలోనూ పనిచేయ ప్రారం భించారు.

## మల్కాపురం ఆంధ్రమహాసభ - 1940

ఈ మహాసభకు అధ్యక్షుడు సుప్రసిద్ధ జాతీయవాది మందుముల రామచంద్రరావుగారు. ఈమహాసభ చరిత్రాత్మకమైనది. ఆంధ్రమహాసభ చరిత్రలో నూతన అధ్యాయాన్ని తెరిచింది. అంతవరకూ ఆంధ్రమహాసభ

ఎక్కువగా పట్టణ మధ్యతరగతివారిలోను, వర్తకులలోనేఉండేది. ప్రజలకు సంబంధించిన సమస్యలను గూర్చి తీర్మానాలుచేసి, ప్రభుత్వానికి పంపేది. అంతేగాని వారిదైనందిన కష్టాలను నివారించడానికి కృషిఉండేదిగాదు. ఈ మహాసభకు ముందే కమ్యూనిస్టులుగా మారిన యువకులు దీనిలో ప్రవేశించడంవల్ల దీనికి ఒక నూతనరూపం పొందడానికి అవకాశం గలిగింది. ప్రజాసమస్యలను తీసుకొని ప్రజలను సమీకరించడమనే సాంప్రదాయం వచ్చింది. అంతేగాక అప్పటివరకు ఆంధ్రమహాసభకు ప్రాథమికసభ్యత్వం లేదు. మహాసభకు వచ్చినవారంతా ఒకరూపాయి చెల్లించితే డెలిగేట్లే. ఈ మహాసభనుండీ ప్రాథమిక సభ్యులను జేర్పించడం, తాలూకా ఆఫీసులు పెట్టి పనిచేయడం, ఆరంభమయింది.

ఈ మహాసభలో రైతులు, కార్మికులు మొదలైన వారికి సంబంధించిన తీర్మానాలు చేయబడినవి. కాని మహాసభయొక్క దృష్టిఅంతా రాజ్యాంగ సంస్కరణలనుగూర్చిన తీర్మానంమీదనే కేంద్రీకరింపబడింది.

## తీర్మానం

"ప్రభుత్వమువారు ప్రకటించిన రాజ్యాంగ సంస్కరణలు అసంతృప్తికరముగాను, నిరాశాజనకముగాను, దేశ భావ్యాభివృద్ధికి హానికరముగాను నున్నవి. వివిధకారణముల వలన, ముఖ్యముగ నిజామాబాదు సభయందు గావింపబడిన తీర్మానమునందు సూచింపబడిన తత్వమునకు విరుద్ధముగా నున్నందునను, ప్రజాపరిషత్తు వారిసూచనలలోని సిద్ధాంతములకు ప్రతికూలముగా నున్నందునను, శాసనసభయెదుట మంత్రివర్గము బాధ్యత వహించవలయును తత్వము అంగీకరింపబడనందునను, బహుసంఖ్యాకులగు దేశీయులకు ప్రాతినిధ్యము దొరకకుండ వృత్తిపూర్వకమగు విభాగములపై ప్రాతినిధ్యము నేర్పరుచుటవలనను, పౌరసత్వహక్కులు లేకుండుట (Absence of civil liberties) యు, అల్పసంఖ్యాకులకు సగముకన్న నెక్కువ ప్రాతినిధ్యమిచ్చి అధిక సంఖ్యాకులకు తక్కువ ప్రాతినిధ్యమిచ్చి అల్పసంఖ్యాలకుల తెగగా మార్చుటయు, ప్రజలచే ఎన్నుకొనబడిన సభ్యులు అల్పసంఖ్యలోనుండుట చేతను, మరియు నూతన సంస్కరణములలో సాధారణ మార్పులవలన బాగుపడనట్టి పుట్టుదోషములనేకము లున్నందునను ఈ మహాసభవారు ఈ రాజ్యాంగ సంస్కరణలను నిరాకరించుచు, వీనితో యేలాటి సంబంధ ముంచుకొనకూడదని దేశీయులను హెచ్చరించుచున్నారు."

ఈ తీర్మానాన్ని కమ్యూనిస్టు ఐన రావి నారాయణరెడ్డిగారు ప్రతిపాదించారు. వీనిలో రాజ్యాంగ సంస్కరణలు ఎలా ప్రజలకు సరియైన ప్రాతినిధ్యం యిచ్చుటలేదో, కొంతమందికి అసలే ప్రాతినిధ్యం ఎలాలేదో, తెలుపుతూ, ఈ సంస్కరణలను నిరాకరించుతున్నామని వుంది. దీనితో పాటు "వీనితో ఏలాంటిసంబంధం ఉంచుకోగూడదని దేశీయులను హెచ్చరించుతున్నారు" అని ఉంది. ఎన్నికలు ఏమిటో ప్రజలకు తెలియని, అసలు పౌరసత్వహక్కులులేని, రాజకీయాభిప్రాయాలను ప్రచారం చేసుకోడానికి వీలులేని, హైదరాబాదు సంస్థానంలో ఆ సంస్కరణలను నిరాకరించవచ్చును. కాని అటువంటి వెనుకబడివున్న పరిస్థితులలో అస్సెంబ్లీని, యితర స్థానిక సంస్థలను, అసలు ఎన్నికలను, బయట ప్రజా ఉద్యమాన్ని అభివృద్ధి చేయడానికి, ప్రజల్లో చైతన్యం గలుగజేయడడానికి, వేదికగాగూడ ఉపయోగించుకోగూడదనడం పొరబాటు

అయినా, అసలు మితవాదులకూ-కమ్యూనిస్టులు మొదలైన అతివాదులకూ మధ్యవచ్చిన భేదం యిదిగాదు. అసలు సంస్కరణలను ఆచరణలో పెట్టాలా? లేదా? అనే విషయంమీద భేదాభిప్రాయంవచ్చింది కాని ప్రతినిధులలో 100కి 90 మంది సంస్కరణలను ఆచరణలో పెట్టగూడదనే అభిప్రాయంలోఉన్నారు. అట్టి పరిస్థితులలో మితవాదులకు నాయకత్వంవహించిన మందుముల నరసింగరావుగారు "వీనితో ఏలాంటి సంబంధ ముంచుకోగూడదని దేశీయులను హెచ్చరించుతున్నారు." అనేభాగాన్ని తొలగించాలని సవరణ తెచ్చారు. అయినా ఈ విషయంలో తీవ్రవాదులు పొరపాటు చేయడంవల్ల, అసలు భేదం కప్పబడిపోయింది. ఈసవరణను ప్రవేశపెడుతూ నరసింగరావుగారు యిచ్చిన ఉపన్యాసమే యిందుకుతార్కాణం. "గత సంవత్సరం నవాబ్ బహద్దురు యార్ జంగు బహద్దురుగారికినీ తమకును హిందూమహమ్మదీయ సఖ్యత కుదిరి రాష్ట్రమునందు సమిష్టి వేదిక స్థాపింపబడవలెనను ఉద్దేశముతో జరిగిన సంభాషణలందు తమకును, నబాబుగారికిని ఎన్నియోవిషయములందు ఏకాభిప్రాయము కుదిరెననియు, ఒక బాధ్యతాయుత ప్రభుత్వమేర్పడుటను గూర్చియే అభిప్రాయ భేదము గలిగెననియు, వారు బాధ్యతాయుత ప్రభుత్వమునకు విముఖులుగా నుండుటచే సంప్రతింపులు భగ్నము లయ్యె" ననియూ, వారుపన్యసించారు. "తనకునూ నవాబు బహద్దురు యారుజంగుగారికిని ఎన్నియో విషయా

లలో ఏకాభిప్రాయం కుదిరెననియూ" అనేదానిలోనే ఈ సంస్కరణలను పనిచేయగలవనే అభిప్రాయం యిమిడివుంది.

పై సవరణ అత్యధిక సంఖ్యాకుల వోటుతో ఓడిపోయింది. రావి నారాయణరెడ్డిగారి తీర్మానం ఎంతో మెజారిటీతో నెగ్గింది. దీనితో మిత వాదులు ఆంధ్రమహాసభనుండి బయటికి పోవడానికి ఉద్యుక్తులయ్యారు. కాని కమ్యూనిస్టులు, తీవ్రవాదులు, రాజకీయాభిప్రాయములలో భేదం వచ్చి నంత మాత్రాన సభవిడిచి పోవడం మంచిదిగాదనియూ, ప్రజలను ఎన్నో విషమసమస్య లెదుర్కొన్న ఈ పరిస్థితిలో ఆంధ్రమహాసభలో చీలికలు రావడంవల్ల దేశానికి ఎంతో హానికల్గుతుందనీ నచ్చచెప్పి, ఆంధ్ర మహాసభ ఐక్యతను కాపాడారు. తాము మెజారిటీలో ఉన్నా, అధికారస్థానా లకు పెనుగులాడకుండా అన్నిపక్షాల రాజకీయాభిప్రాయాల వారితోగూడ ఒక ఐక్య వర్కింగుకమిటీని నియమించడంలో అధ్యక్షులవారికి తోడ్పడి, ఆంధ్రమహాసభ రధాన్ని ముందుకు తీసుకువెళ్ళారు.

మల్కాపురం ఆంధ్రమహాసభ జరిగిన తరువాతనుండీ తెలింగానా ఆంధ్రమహాసభలో ఒక నూతనోత్సాహం బయలుదేరింది. 1937 లో జరిగిన నిజామాబాదు ఆంధ్రమహాసభ తరువాత సంస్థానంలో జరిగిన రాజ కీయ కల్లోల సమయంలో ఆంధ్రమహాసభలో ఏర్పడిన నిస్తబ్ధత, మల్కా పురం మహాసభలో తొలగిపోయింది. కార్యకర్తలు చురుకుగా పనిచేయ ప్రారంభించారు. బద్దం ఎల్లారెడ్డిగారు, వట్టికోట ఆళ్వారుస్వామిగారు గద్వాలు స్టేటులో పండితసన్మానమనే పేరుతో వసూలుచేయబడుతున్న రు. 80,000 అక్రమపన్నును గూర్చి వివరాలు సేకరించి, ఆంధ్రమహాసభకు రిపోర్టు పంపారు. దానిమీద కొంత ఆందోళనచేయగా, ఈ పన్ను రద్దు చేయబడింది. ఆసిఫాబాదుజిల్లాలో "గోండుల"మీద అక్రమంగా జరిగిన కాల్పుల విషయంలో బద్దం యల్లారెడ్డిగారు వివరాలను సేకరించి, పత్రికల ద్వారా ఆందోళన బరిపారు. గ్రామాలవెంటబోయి ప్రజలను దోచుకొను చున్న ఇరానీముఠాల అక్రమాలనుగూర్చి ప్రభుత్వానికి తెలియపర్చారు. కరీంనగరం జిల్లాలో క్షామపీడితులపై శిస్తువసూళ్లు తాత్కాలికంగా ఆపించబడెను. ఈ విధంగానే అనేక విషయాలలో తాలూకా ఆఫీసులు పెట్టి, ప్రజలకు లీగలుసహాయం జేశారు. ప్రాధమిక సభ్యులనుజేర్చి, గ్రామ సంఘాలు, పట్టీసంఘాలుగూడ పెట్టబడినవి. అధ్యక్షులగు శ్రీ మందుమల

రామచంద్రరావుగారు వివిధజిల్లాలలో పర్యటనంజేసి, స్థానిక కమిటీలను స్థాపించి, నిర్మాణరీత్యా మహాసభకు బలముచేకూర్చినారు.

ఈ నూతనోత్సాహంతో మరుసంవత్సరం మహాసభ నల్లగొండ జిల్లా చిల్కూరులో 1941 లో జరిగింది. దానికి కమ్యూనిస్టు యువకుడు రావి నారాయణరెడ్డిగారు ఏకగ్రీవంగా అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆ సభయొక్క ప్రాముఖ్యత ఏమంటే, మొదటిసారిగా ఆయనచేసిన సేవకు తెలంగాణా ప్రజానీకం అధ్యక్షునిగా ఎన్నుకొని గౌరవించింది. ఈయన యిచ్చిన అధ్యక్షోపన్యాసంలో కష్టజీవులైన ప్రజానీకంయొక్క స్థితిగతులు, వాటి నివారణోపాయాలు నిర్భయంగా వెల్లడిచేశారు. ప్రభుత్వ బడ్జటులో ప్రజల సౌకర్యార్థం ఎంత తక్కువఖర్చు పెట్టబడుతోందో, ఎంత దూబరాఖర్చు చేయబడుతోందో లెక్కలతో చూపింపబడింది. జాగీరు రైతుల, కార్మికుల, స్త్రీల స్థితి ఎంతదుర్భరంగా ఉందో చూపుతూ, వారికి అవసరంగా చేయవలసిన చట్టాలనుగూర్చి తెలిపారు.

ఈ మహాసభలో ముఖ్యమైనది నియమావళిలోమార్పు. ఇంతవరకు నిజాం సంస్థానంలోని, ఆంధ్రం మాతృభాష గలిగి ఆంధ్రులని చెప్పుకొను వారు మాత్రమే దీనిలో చేరడానికి అవకాశం ఉండెడిది. ఈ మహాసభలో "నిజాంరాష్ట్ర ఆంధ్రప్రాంతంలో నివశించువారందరును ఈ నియమావళినందు ఆంధ్రులుగా ఎంచబడుదురు." అని మార్పు చేయబడింది. దీని ప్రకారం తెలంగాణాలోని ఆంధ్రం మాతృభాష గాని ముస్లిములు, మహారాష్ట్రులు, కన్నడులు అందరూ దీనిలో చేరడానికి అవకాశం కలిగింది. ఈవిధంగా ఆంధ్రమహాసభయొక్క పునాది విశాలపరచబడింది. తెలంగాణా ప్రజలు ఏ మతం, ఏ తెగవారైనా అందరూ కలిసి తమ కష్టాలను తీర్చుకోడానికి, ఆంధ్రమహాసభ వేదికగా అయింది. దీనితోపాటు ఈ క్రింది విషయాలతో కూడుకొన్న నియమావళిని అంగీకరించి, మహాసభ నిర్మాణము ఎక్కువ ప్రజాస్వామిక సూత్రాలపై నడుచుటకు అవకాశము కల్పింపబడింది.

(1) ప్రాథమిక సభ్యత్వం రు. 0-4-0 గా అంగీకరింపబడింది.

(2) అంతకుముందున్న ఒకరూపాయి మహాసభసందర్భమున చెల్లించినవారి నందరిని ప్రతినిధులుగా అంగీకరించు పద్ధతికి బదులుగా, ప్రాథమిక సభ్యుల సంఖ్య ననుసరించి, జిల్లాలోని స్థానికకమిటీ సభ్యుల చేత ఎన్నుకొనబడు అవకాశము కలుగజేసింది.

(3) స్థాయిసంఘము, అధ్యక్షుడు ప్రతినిధులచే ఎన్నుకోబడునట్లు జేయబడింది.

(4) స్థాయిసంఘమే మహాసభకు ముందు విషయనిర్ణయసభగా మారునట్లు జేయబడింది.

(5) జిల్లాకమిటీలు జిల్లాలోని స్థానిక కమిటీ సభ్యులచే ఎన్నుకోబడునట్లు గావింపబడింది.

## సోవియటు - జర్మనీ యుద్ధం : హైదరాబాదు

హిట్లరు పోలెండును ఆక్రమించి, సోవియటు యూనియనుతో సరిహద్దు కలిపితే, సోవియటు యూనియను—జర్మనీల మధ్య సంఘర్షణ వస్తుందేమోనని బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు, ఆశపడ్డారు. అందువల్లనే ఫ్రెంచి సరిహద్దుమీద యుద్ధం ముమ్మరంగా సాగించకుండా కూర్చున్నారు. కానిఆదేమీజరుగకపోగా, పోలండుప్రభుత్వంపోలండునుంచిపారిపోయింది. పోలండు త్వరలోనే నాజీల హస్తగతమవుతుందని తేలిపోయింది. వెంటనే, సోవియటు సైన్యాలు 1921 లో పోలిషు అభివృద్ధినిరోధకులు అక్రమంగా అక్రమించుకొన్న యుక్రేనియన్, వైట్‌రష్యను భూభాగాలను మాత్రం హిట్లరు చేతిలో పడకుండా చేశాయి. హిట్లరు గ్రుడ్లుమిటకరించి చూచాడే గాని, ఏమీ చేయలేకపోయాడు అంతేగాక లిథూనియా, లాట్వియా, ఇస్తోనియాలలో అప్పుడున్న సోవియటు వ్యతిరేక ప్రభుత్వాలను సోవియటు యూనియను లొంగదీసి, తనరక్షణార్థం ఆ దేశాలలో సోవియటు సైన్యాలను ఉంచింది ఆ తరువాత ఆ దేశాల పార్లమెంటులకు స్వేచ్ఛగా ఎన్నికలు జరిగి, ప్రజా ప్రతినిధులు మెజారిటీగా వచ్చి, సోవియటు యూనియనులో కలిసిపోవడానికి తీర్మానించితే, హిట్లరు ఏమీచేయలేకపోయాడు. హిట్లరు సోవియటు యూనియనుకు వ్యతిరేకంగా యుద్ధం చేయడానికి కాలుమోపే స్థలాలుగా పై మూడు దేశాలను, ఫిన్లండును సామ్రాజ్యవాదులందరూ ఎంతోకాలం నుంచి తయారుచేసుకుంటూ వచ్చారు. ఇక ఫిన్లండు, సామ్రాజ్యవాదుల సహాయంతో లెలిన్‌గ్రాడ్‌కు చేరువగా మానర్‌హీము కోటలను కట్టింది. సోవియట్ యూనియను రక్షణార్థం ఈ కోట లున్న భూమిని సోవియటుకు ఇచ్చివేయమని, దీనికి బదులుగా కొంత భూభాగం, డబ్బు ఇస్తామని చెప్పినా, బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల మద్దతుతో ఫిన్లండు నిరాకరించింది గత్యంతరంలేక, సోవియటు యూనియను నడిశీతకాలంలో ఆర్కిటిక్ మంచులో ఫిన్లండుతో యుద్ధానికి దిగా

లిసి వచ్చింది. బ్రిటిషు, ఫ్రెంచిసామ్రాజ్యవాదులు ఫిన్లండుకు సహాయంగా సైన్యాలను పంపడానికి సిద్ధంచేశారు. కాని ఇంతలోనే ఫిన్లండు ఓడిపోయి, సోవియటుతో సంధిచేసుకొంది. అంతేగాక, టర్కీద్వారా సోవియటును యుద్ధంలోకి దింపడానికి బ్రిటను, ఫ్రాన్సు సామ్రాజ్యవాదులు తీవ్రప్రయత్నాలు చేశారు. కాని ఫలించలేదు.

ఇంతలో హిట్లరు ఫ్రాన్సును ఆక్రమించాడు. నార్వే, డెన్మార్కులను ఆక్రమించాడు. హిట్లరుకు పాలుపోసి పెంచిన, ఈ అపజయాలకన్నిటికి కారకుడైన, అసలు ప్రపంచంలోనే ఫేసిజం ప్రబలటానికి మూలకారకుడైన చాంబర్లేనును, బ్రిటిషుప్రజలు యిక సహించలేకపోయారు. అతనిని ప్రధానమంత్రి పదవినుంచి దించారు. చర్చిలు ప్రధానమంత్రి అయ్యాడు. ఆ తర్వాత బ్రిటను విదేశాంగనీతిలో సోవియటుకు వ్యతిరేకంగా కుట్రలు పన్నడం అనేది పోయింది. సోవియటుతో రాజీకి రావడానికి అవకాశం ఏర్పడింది. హిట్లరు ఆతర్వాత వరుసగా రుమేనియా, హంగరీ, బల్గేరియా, యుగోస్లావియా, గ్రీసులను ఆ దేశాల పాలకవర్గంలోని పంచమాంగదళ సహాయంతో చకచక ఆక్రమించాడు. సోవియటు యూనియను, బ్రిటను తప్ప మిగతా యూరపుఅంతా నాజీ జర్మనీక్రిందకు వచ్చింది. ప్రపంచంలో నాజీలను ఎదిర్చే శక్తి లేదా! అనిపించింది.

ఈ పరిస్థితులలో హిట్లరు ముందున్నవి రెండుమార్గాలు. ముందు బ్రిటనును లొంగదీసి, తరువాత సోవియటు యూనియనుమీద వెళ్ళడమా? లేక ముందే సోవియటు యూనియనుమీద దాడిచేయడమా? బ్రిటనుమీద ముందే దాడి ప్రారంభించితే, సోవియటు యూనియను యుద్ధంలోకి దిగుతుందేమోనని ఒకభయం. సోవియటుయూనియనుమీద దాడిచేస్తే, కార్మిక కర్షక రాజ్యాన్ని నాశనంచేయడానికి బ్రిటిషు పాలకవర్గం, ముఖ్యంగా చాంబర్లేను ముఠా, తనకు సహాయం చేస్తారనీ, కనీసం సోవియటుయూనియనుతో చేతులు కలపకుండా తటస్థంగానైనా ఉంటారనీ, ఆశపడ్డాడు. హెస్సును ఇంగ్లండుపంపాడు. బ్రిటిషు కమ్యూనిస్టుపార్టీ హిట్లరుయొక్కయీఎత్తుగడను ప్రజలముందు బట్టబయలు చేసింది. బ్రిటను కనీసం తటస్థంగానైనా ఉంటుందని హిట్లరు ఆశించి 1941 జూను 22 న సోవియటు యూనియనుమీద దాడి ప్రారంభించాడు. యూరపును మ్రింగిన మదంతో కళ్ళుగానక, 2నెలలలోనే సోవియటును జయించుతానని ప్రగల్భాలుపలికాడు హిట్లరు సోవియటు యూనియన్‌మీద యుద్ధం ప్రారంభించినవెంటనే,

చర్చిల్ సోవియటు యూనియను మిత్రరాజ్యమని ప్రకటించాడు. అమెరికా ఇంకా జర్మనీమీద యుద్ధం ప్రకటించకపోయినా, రూజ్వెల్టు సోవియటు యూనియనుకు సానుభూతి సహాయాలను తెల్పాడు. జులై 14 న బ్రిటను సోవియటుతో సంధిచేసుకొంది. గత 25 సంవత్సరాలుగా సాగించిన సోవియటు వ్యతిరేక కుట్రలు మానుకొని, బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్య వాదులు సోవియటు యూనియనుతో చేతులుగలిపినవి. బ్రిటిషు అమెరికను సామ్రాజ్యవాదులు ఎంతోకాలంనుండి పాలుబోసి పెంచిన జపాను ఫాసిస్టులు సైతం, బ్రిటను అమెరికాల కష్టదశ జూచి పసిఫిక్కు సముద్రంలో డిసెంబరు 7, 1941 న యుద్ధం ప్రారంభించారు. వీరికి సోవియట్ యూనియన్‌లో జర్మన్ సేనల ఉధృతం ఉషారు నిచ్చింది. దీనితో అమెరికాగూడ యుద్ధంలో దిగింది. హిట్లరుగూడ అమెరికామీద యుద్ధాన్ని ప్రకటించాడు. బ్రిటను, అమెరికా, సోవియటు యూనియన్‌లు ఇంకా దగ్గరకు వచ్చినవి. జపాను గూడ జర్మనీ వలెనే పంచమాంగదళ సహాయంతో బ్రిటన్, అమెరికా, డచ్చి సామ్రాజ్యవాదుల చేతిక్రింద ఎంతోకాలం నుంచి బానిసత్వం అనుభ వించి అసంతృప్తిచెందియున్న బర్మా, మలయా, డచ్చి ఇండియా దీవుల నన్నిటినీ 2 నెలలో ఆక్రమించింది; భారతదేశం సరిహద్దు మీదకి జపాను సైన్యాలువచ్చికూర్చున్నవి–అటుపశ్చిమాన హిట్లరుయూరప్‌అంతటి ఆయుధ సైనిక బలంతో తనమీద పడినప్పటికీ, సోవియటు యూనియన్ జయ ప్రదంగా ఎదిర్చి పోరాడింది. దానితో జర్మన్ నాజీలను ఎదిర్చగల శక్తి ఒకటి ఉందిగదా అని. హిట్లరు పాదాలక్రింద నలిగిపోతున్న యూరప్ దేశాల ప్రజలు ఉత్సాహంతో నాజీల నెదిర్చి పోరాడటం మొదలుపెట్టారు.

1941 డిసెంబరులో జపానుదాడి ప్రారంభించిన కొద్దిరోజులకేవ్యక్తి గత సత్యాగ్రహంలో అరెస్టుచేయబడిన కాంగ్రెసునాయకులునూ, ఇతర కాం గ్రెసువాదు లందరునూ జైళ్ళనుండి వదలివేయబడిరి. జపానుకు త్వరితగతిని లభించిన విజయాలతో బ్రిటీషు, అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రతిష్ఠకు దెబ్బ తగిలింది. పైగా భారతదేశం ఆసియాఖండంలో జపానువ్యతిరేకంగా యుద్ధం సాగించడానికి ప్రధాన సప్లయి కేంద్రం. దీనికే ముప్పువచ్చేటప్పటికి బ్రిటన్, అమెరికాలలో పెద్ద ఆందోళన బయలుదేరింది. సామ్రాజ్యవాదులు భారత ప్రజల ప్రధానసంస్థలైన కాంగ్రెసు - ముస్లింలీగు వగైరాలతో రాజీకొరకై సంభాషణలు జరపడానికి, బ్రిటిషు మంత్రివర్గ సభ్యు డైన సర్ స్టాఫర్డు క్రిప్సును పంపాలసి వచ్చింది. బ్రిటిషు ప్రజలు తమ

ప్రభుత్వాల మెడలు వంచి, భారతీయ ప్రతినిధులతో రాయబారాలు సాగించే టట్లుచేసి, తమ బాధ్యతను నెరవేర్చారు. భారతీయుల బాధ్యత ఏమంటే, భారతదేశంలో కాంగ్రెసు-లీగు మధ్య ఐక్యతలేదనే నెపంతో రాయబారాలు భగ్నం చేయకుండా చూడడం. కాంగ్రెసు లీగులు ఐక్యపడి, భారతదేశాన్ని జపానుదాడినుండి కాపాడటానికి జాతీయ ప్రభుత్వ మిమ్మని, ఐక్యవాంఛను బ్రిటిష సామ్రాజ్యవాదుల ముందుపెట్టాలి. కాంగ్రెసు లీగుయొక్క స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించి, లీగును తనతో కలుపుకోవాలసి ఉండేది. దానికి బదులుగా ఎవరంతట వారు ప్రత్యేకంగా రాయబారాలు సాగించడంతో, భారతదేశంలో ఐక్యత లేకపోవడం వల్ల రాయబారాలు చెడిపోయినవని, బ్రిటిషు సామ్రాజ్యవాదులు బ్రిటిషు, అమెరికను ప్రజలను తాత్కాలికంగా మోసగించగలిగారు. రాయబారాలఅంత్యదశలో కాంగ్రెసు వర్కింగుకమిటీ ఢిల్లీలోసమావేశమై, ఇష్టంలేనిరాష్ట్రాలను బలవంతంగా భారత ఫెడరేషనులో వుంచడం కాంగ్రెసుఉద్దేశ్యం కాదని ప్రకటించింది. కాని అప్పటికే సమయంమించిపోయింది. క్రిప్సు ఇంగ్లండు తిరిగివెళ్లాడు.

రాయబారాలు విఫలమయ్యాయి. జపాను భారతదేశ సరిహద్దున పొంచి కూర్చుంది. అటు నాజీలు స్టాలిన్‌గ్రాడును జయించి, ఇరానుగుండా, అటు ఈజిప్టునుండి బెలూచిస్థాన్‌గుండా, రోమెలుసైన్యాలు భారతదేశంలో జపాను సైన్యాలతో కలుసుకోవాలని ప్లాను వేసుకొని, స్టాలిన్‌గ్రాడువద్ద పోరాడుతున్నాయి. ఈ స్థితిలో భారతీయుల కర్తవ్యమేమి? బ్రిటిషు సామ్రాజ్యవాదులు రాజీ భగ్నం చేయగలిగారు గదా అనేకోపంతో, ఫాసిస్టు లకు వ్యతిరేకంగా జరిగే యుద్ధ ప్రయత్నాన్ని కుంటుపర్చడానికి ఉద్య మాన్ని ఆరంభించడంగాదు. అలాజేస్తే మనదేశానికి స్వాతంత్ర్యం రాక పోగా, జపాను జర్మను బానిసత్వం క్రిందకు పోయే ప్రమాద ముండేది. ఫాసిస్టు బానిసత్వంనుండి ప్రపంచాన్ని కాపాడడానికి అసమానత్యాగం చేస్తున్న చైనా సోవియటు యూనియను ప్రపంచ ప్రజలమీద వెనుకనుంచి పోటు పొడిచినట్లవుతుంది. ఆ పరిస్థితుల్లో మనదేశానికి స్వాతంత్ర్యం, లభించేటటువంటి ప్రపంచ ప్రజలను సహాయం గలిగేటటువంటి మార్గం ఏమంటే, యుద్ధ ప్రయత్నాలకు చేతనైనంత సహాయం జేస్తూ, మహమ్మ దీయ ప్రజాసామాన్యం కోరే స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించి కాంగ్రెసు - లీగు ఐక్యత సాధించడమే. యుద్ధప్రయత్నాలను వ్యతిరే కించితే మన స్వాతంత్ర్య సంపాదనకు ప్రపంచ ప్రజల సహాయం లేక

పోతుంది. భారతీయులు ఫాసిస్టు అనుకూలురని సామ్రాజ్యవాదులు దుష్ప్రచారం జేసి, మన స్వాతంత్ర్యపోరాటానికి వారని విరోధులనుగా చేయడానికి అవకాశం లభించుతుంది. కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే పై పాలసీని అనుసరించింది. ముస్లిమ్‌లీగు నిస్పృహతో తటస్థంగా గూర్చుంది. కాంగ్రెసువాదులు బ్రిటిషు సామ్రాజ్యవాదులు స్వతంత్రమియ్యరనీ, లీగు కలిసిరాదనే భావాలతో రెచ్చిపోయారు. 1942 ఆగస్టు 8 వ తేదీన బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసుకమిటీ సమావేశమయింది. ప్రపంచ యుద్ధం రెండు ముఠాలమధ్య జరుగుతోందనీ, సోవియటుయూనియన్, చైనా అమెరికా బ్రిటనుల పక్షం న్యాయమైనదనీ, తమ సానుభూతి ఆపక్షం వైపుననే ఉందనీ, భారతదేశానికి స్వాతంత్ర్య మిస్తే జపాను జర్మనీల నెదిర్చి పోరాడటానికి సిద్ధమవుతామనీ, లేకపోతే గాంధీజీ నాయకత్వంక్రింద సత్యాగ్రహోద్యమం ఆరంభించుతామనీ. తీర్మానం చేయబడింది. తీర్మానంలో జపాను జర్మను ఫాసిజానికి వ్యతరేకంగా పోరాడుతామని ఉన్నా, స్వాతంత్ర్య మియ్యకపోతే సత్యాగ్రహోద్యమం ప్రారంభించుతామనడంతో, బ్రిటిషు సామ్రాజ్యవాదులకు అవకాశం జిక్కింది. కాంగ్రెసు జపాను అనుకూలసంస్థ అని బ్రిటను అమెరికాప్రజలను తాత్కాలికంగా మోసపుచ్చారు. ఆగస్టు 9 న గాంధీజీ వర్కింగుకమిటీ సభ్యులను రాష్ట్రాలలోని ముఖ్య కాంగ్రెసునాయకులను ప్రభుత్వం అరెస్టుచేసింది. దానితో భారతదేశమంతటా రైలుపట్టాలు పీకటం, తీగలు తెంపడం, ప్రభుత్వాఫీసులుతగులబెట్టడం, మొదలైనవి ప్రారంభమయింది. ప్రభుత్వం ఈ ప్రజల ఉద్రేకాన్ని దారుణంగా అణచివేసింది. ఫార్వర్డు బ్లాకు, కాంగ్రెసు సోషలిస్టులు మొదలైన పంచమాంగదళం ముఠాలు విధ్వంసక చర్యలను చాలకాలంవరకూ ప్రోత్సహించింది. కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే అటు ప్రభుత్వం ఇటు కాంగ్రెసువాదులమధ్య నిలబడి, అనేక కష్టాలకు లోనై, చాలచోట్ల విధ్వంసకచర్యలనుండి ప్రజాసామాన్యాన్ని మరల్చింది. కార్మికులలో సమ్మెలు రాకుండా కాపాడింది. ఈవిధంగా దేశాన్ని జపాను దాడినుండి రక్షించడంలో అపూర్వపాత్రను వహించింది. దీనికితోడు స్టాలిన్‌గ్రాడువద్ద నాజీలను తుత్తునియలుచేసి, రెడ్ ఆర్మీ 400 మైళ్ళు వెనుకకు తరుముకుపోయింది. దానితో ఫాసిస్టుల ప్రపంచప్లాను భగ్నమైంది. భారతదేశంలో పరిస్థితులు తనకు ఎంతో అనుకూలంగాఉన్నా, జపాను ఇంక ముందడుగు వేయడానికి వెనకాడింది. నాజీలు ఓడిపోయి వెనుకకు

పారిపోతోంటే తానేమి చేయగలదు. సింహంవెంట నక్కవలె, నాజీలు విజయాలు యూరపులో సాధించుతోంటే, వారివెంటబడి ఆసియాఖండంలో సులభంగా దేశాలను ఆక్రమించుకోవడమే జపాను యుద్ధతంత్రం. స్టాలిన్‌గ్రాడు యుద్ధంతో ఫాసిస్టులు ప్రపంచాన్ని మ్రింగలేరని తేలిపోయింది. అందుచే జపాను ముందడుగు వేయలేకపోయింది. భారతదేశం జపాను జర్మనీల పాదాక్రాంతం గాకుండా కాపాడినందుకు, రెడ్‌ఆర్మీకి సోవియటు యూనియనుకు భారతదేశం ఎంతో రుణపడింది.

## హైదరాబాదు సంస్థానం - జపానుదాడి ప్రమాదం

సోవియట్ యూనియన్‌మీద జర్మనీ అకస్మాత్తుగా దాడిచేయడం, జపానుగూడ బ్రిటన్, అమెరికా, హాలండు వలసదేశాలమీద దాడిజరిపి భారత సరిహద్దువరకు రావడం, భారతదేశానికి క్రిప్సురాక, రాజీ రాయబారాలు. హైదరాబాదు సంస్థాన రాజకీయ వాతావరణంలో సంచలనం గలుగజేసింది. ఈయుద్ధం యెడల ఉండాల్సిన దృక్పథం, ఈ పరిస్థితుల్లో హైదరాబాదు సంస్థానంలో ఏరాజకీయ నినాదాలు అవుసరం. అనే విషయాలమీద కమ్యూనిస్టులకు, జాతీయవాదులకు మధ్య అభిప్రాయభేదం వచ్చింది. జపానుదాడినుండి దేశాన్ని రక్షించడానికి యుద్ధానికి సహాయం చేయాలని, హిందువులు, మహ్మదీయుల ప్రతినిధులతోగూడిన ఈయుద్ధంలో ప్రజలయొక్క పూర్తిసహకారాన్ని సాధించగల మంత్రివర్గ నిర్మాణంకోసం పాటుబడాలని, కమ్యూనిస్టులు చెప్పారు. జాతీయవాదులు యుద్ధంయెడల తటస్థ వైఖరి అవలంబించాలనీ, ఏస్పష్టమైన రాజకీయనినాదం ఇవ్వకుండా ప్రభుత్వం ప్రకటించిన రాజకీయసంస్కరణలు అవుసరంలేదనీ, 'నెగెటివు' పంథాను అవలంబించారు.

ఈ పరిస్థితుల్లో 1942 మేలో వరంగలుజిల్లా ధర్మవరం గ్రామంలో ఆంధ్రమహాసభ వార్షికసభ జరిగింది. ఈ మహాసభలో ఫాసిజాన్ని నిరసించుతూ, దాన్ని ధైర్యసాహసాలతో ప్రతిఘటించుతున్న, చైనా, సోవియటు యూనియన్, బ్రిటను, అమెరికాలను అభినందించుతూ, ఈ క్రింది తీర్మానం కమ్యూనిస్టులు, జాతీయవాదులు ఏకగ్రీవంగా పాసుచేశారు.

" ఫాసిజంయొక్క నైచ్యమును, పశుత్వమును దృష్టియందుంచుకొని స్వాతంత్ర్య రక్షణార్థం ఫాసిజం, నాజీజం శక్తులతో యుద్ధమొనర్చు దేశీయులతో ఈ మహాసభవారు సానుభూతిని చూపించుచున్నారు. ఎన్నటి

కయినను ఫాసిజంయొక్క అపాయమును రూపుమాపనున్న చైనాపూవుల, యోధులగు రష్యనుల, వీరులగు బ్రిటిషు అమెరికాదేశీయుల, మరియు ఆక్రమితరాజ్యముల జనసామాన్యపు సమిష్టియుద్ధప్రయత్నమును ఈ మహాసభవారు శ్లాఘించుచున్నారు. ఫాసిజం, నాజీజంను ప్రతిఘటించి మానవ సమాజమును శాశ్వత బానిసత్వము నుండియు, అథఃపతనము బొందించు వ్యవస్థనుండియు విముక్తిగావించ ప్రయత్నించుచున్న దేశములతో యీ మహాసభ సంపూర్ణసానుభూతిని వెల్లడించుచున్నది."

మిత్రమండలితో సానుభూతిని ప్రకటించినా, జాతీయవాదులు హైదరాబాదు ప్రభుత్వం సాగించుతున్న యుద్ధకృషి విషయంలో తటస్థవైఖరియే అవలంబించారు.

కమ్యూనిస్టుల, వారి సానుభూతిపరుల, తరపున ఈ క్రింది తీర్మానాన్ని పోల్కంపల్లి వెంకటరామారావుగారు ప్రతిపాదించారు:

"ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన రాజ్యాంగసంస్కరణములు మిక్కిలి అసంతృప్తికరముగను, నిరాశాజనకముగను, దేశాభివృద్ధికి హానికరముగను ఉన్నవి. ప్రజాస్వామిక సిద్ధాంతమున కిందుస్థానము లేకపోవుటయేగాక అట్టి సిద్ధాంతములకు ప్రతికూలమగు ఫాసిస్టుసిద్ధాంత పునాదులపై సంస్కరణలసూచనలు నిర్మింపబడియున్నవి. ఫాసిస్టురాజ్యాంగ విధానమునందుండు వృత్తిపూర్వక ప్రాతినిధ్య మేర్పడియున్నది. ప్రస్తుతం అమలులోకి రానున్న రాజ్యాంగసంస్కరణములలోని అంతర్భాగములైన జిల్లా కాన్ఫరెన్సులతోను మరియు సలహాసంఘములతోను ఇకముందు అమలులోనికి రాబోవు ఇతర అంతర్భాగములతోను ప్రజలేపాటి సంబంధముంచుకొనగూడదని ఈ మహాసభవారు దేశీయులను హెచ్చరించుచున్నారు.

"మల్కాపురము మహాసభ తర్వాత ఉద్భవించిన అంతర్జాతీయ పరిస్థితులను దృష్టియందుంచుకొని ఫాసిస్టు దురాక్రమణశక్తులకు ప్రతికూలంగా దేశీయులను సమీకరించే ఉద్దేశంగూడా దృష్టియందుంచుకొని ప్రభుత్వంవారు సంస్కరణలయందు క్రింది సవరణలను గావించినచో, మల్కాపురం తీర్మానమును పునరాలోచించుటకు ఈ మహాసభవారు స్థాయిసంఘమున కధికార మిచ్చుచున్నారు.

1. శాసనసభలు, స్థానికసంస్థలు ప్రజాస్వామిక సిద్ధాంతములపై ఆధారపడి ప్రాంతీయపద్ధతి (Territorial basis) న ఎన్నికలు జరుపబడవలయును.

2. ప్రజాసామాన్యముచే యెన్నుకొనబడిన శాసనసభాసభ్యులనుంచి మంత్రివర్గమును నియమించవలయును.

3. రాజకీయాభివృద్ధికి హిందూ మహమ్మదీయ సఖ్యము అవసరము కావున నిర్దుష్టమైన సమిష్టి ఎన్నికలవిధానమును ప్రవేశపెట్టవలెను.

4. సంపూర్ణ పౌరసత్వహక్కులను ఇవ్వవలయును."

ఈ తీర్మానం తీసుకురావలసిన పరిస్థితులనుగూర్చి ఈక్రింది వాక్యాలలో ఆయన చెప్పాడు :

"మల్కాపురం తీర్మానమును బలపర్చవలయునని 500 సారులు నేను కోరుచున్నాను. కానిపరిస్థితులు మారుటచే రాజకీయసకర్త యైన ఆంధ్రమహాసభ ముక్కుమూసుకొని కూర్చొనకూడదు. 'తనకుతానే దారిచూపవలయును; ఎన్నికలు దగ్గరకు వచ్చుచున్నవి; మనకు రాజకీయ సంస్కరణలు వద్దన్నాము కాని కావలసిందేదేటిటో చెప్పలేదు. ఏసిద్ధాంతములపీద మార్పులు జరిగినా ఆసంస్కరణలు తిరిగి మనము ఆలోచించెదమో తెలియజెప్పవలయును. మొద్దులుగా కూర్చొనగూడదు; ప్రభుత్వంవారు పై నాలుగు షరతులు అంగీకరించిన వాటినిగురించి పునరాలోచించుటకు స్థాయిసంఘమునకు అనుమతి నిచ్చుచున్నాము. నాకు విరుద్ధంగా జెప్పువారు మల్కాపురంలో చేసిన తీర్మానము మార్చుటకు పరిస్థితులలో మార్పులు ఏమికల్గినవని అడుగుతారు. ప్రపంచయుద్ధం జరుగుతున్నది. ఫ్రాన్సు స్వాతంత్ర్యం పోయినది. రష్యా, అమెరికాలు యుద్ధంలోనికి యీడ్వబడినవి. జపాను విజృంభించినది. కాకినాడ, విశాఖపట్టణములమీద జపానువారు బాంబులువేశారు. హైదరాబాదుమీదకూడ బాంబులు పడవచ్చు." ప్రభుత్వంతో బేరమునకు దిగుతున్నారను మాటలను ఖండించుచు యిట్లుచెప్పిరి. "మేము ప్రభుత్వమును అడుగుకొనుటలేదు. స్త్రీలాగా ప్రభుత్వమును బ్రతిమాలుకొనుటలేదు. మేము కూపస్థమండూకమువలె ఉంటున్నచోటనే ఉండుటకు ఇష్టపడము. పరిస్థితులనుబట్టి రాజకీయములలో మా దృక్పథమును మార్చుకొందుము. పిరికితనమునకు యీ తీర్మానంలో తావులేదు. యుద్ధమునకు సహాయము చేయవలయునన్నవాడు పిరికితనంతో రాడు. యుద్ధముచేయుటకు తయారై వచ్చును. ముక్కుమూసుకొని కూర్చుంటున్నామనే అపవాదు పోగొట్టి ముందంజ వేయుచున్నాము. తప్పక ఈ తీర్మానమును మీరు అందరు అంగీకరించవలయును"

ఈ తీర్మానంలో ఫాసిస్టు దురాక్రమణదార్లనుండి దేశరక్షణకు ప్రజలను సమీకరించడానికి, రాజ్యాంగ సంస్కరణలలో చేయవలసిన మార్పులను గూర్చిన రెండవ పేరాను తొలగించవలెనని జాతీయవాదుల తరఫున బూర్గుల రామకృష్ణరావుగారు సవరణ తెచ్చారు.

ఈ సవరణను మందుముల రామచంద్రరావుగారు బలపరచారు.

మల్కాపురంలో ఆమోదించిన రాజ్యాంగ సంస్కరణల తీర్మానమునకు వ్యతిరేకంగా ఇప్పుడు ఈతీర్మానము చేయుటకు రాజకీయ వాతావరణమునందు ఏమియు అనుకూలమైన మార్పులు కలుగలేదని చెప్పుచు, తాము యుద్ధప్రయత్నములకు ఆటంకముగాని, రాజకీయ సంక్షోభము గలిగించవలయుననే వైఖరినిగాని, ధోరణిగాని అవలంబించలేదనియు, యుద్ధము తీవ్రమై మనదేశమునకు వచ్చుటచే ఆంధ్రమహాసభ సివిలు డిఫెన్సులో సహకారం చేయవలయునని 15 రోజులకిందట తీర్మానించియున్న దనియు, 24 గంటలతో ఇటువంటి తీర్మానముచేయుటకు రాజకీయ వాతావరణమందు యేమంత బ్రహ్మాండమైన మార్పులు కల్గినవని అడిగిరి.

తీర్మానం ఆమోదించినచో కల్గు దుష్ఫలితములను, రాజకీయములలో అంధకార వాతావరణము వ్యాపించియున్నదనియు, ఒక్క కిరణమైనను కనబడుటలేదనియు, ఇటువంటి తీర్మానము ఆల్ పార్టీ కాన్ఫరెన్సులో ప్రవేశపెట్టి ఆమోదించిన తరువాత ఆంధ్రమహాసభలో ఆమోదించవలయుననియు, ఇప్పుడు దీనివల్ల ఒక్క ఆంధ్రమహాసభకే ఈ రాజకీయ దౌర్బల్యము కలుగదనియు, తతిమ్మా సభలకుకూడా కల్గుననియు, ఆంధ్ర మహాసభ ఒకటి అనుటయు, మహారాష్ట్ర కర్నాటక సభలు మరొకటి అంటున్నాయని ప్రభుత్వమున కవకాశము గలుగునని నుడివిరి.

జాతీయవాదులచే ప్రవేశపెట్టబడిన సవరణకు 115 వోట్లు అనుకూలంగాను, 172 ఓట్లు ప్రతికూలంగాను వచ్చాయి. సవరణ ఓడిపోయింది. తీర్మానం గెలిచింది.

మల్కాపురం మహాసభలో " రాజ్యాంగసంస్కరణలతో ఎట్టి సంబంధం ఉంచుకోగూడదని దేశీయులను హెచ్చరించుతున్నాం." అనే వాక్యాన్ని తొలగించాలని పట్టుబట్టిన జాతీయవాదులలోని మితవాదులే, నేడు మందుముల నరసింగరావుగారు తప్ప మిగతావారు, సంస్కరణలలో ఎట్టిమార్పు కోరగూడదని పట్టు బట్టారు. దీని అర్థం, వీరు అతివాదులుగా మారిపోయారనిగాదు. వారి ఉపన్యాసాలు జాగ్రత్తగా చదివితే, అసలు

సంస్కరణలలో మార్పులుచేస్తే వాటిని అమలుజరపమనిగాదు; ప్రభుత్వం అటువంటి మార్పులు ఏమీ చేయడానికి సిద్ధంగాలేనప్పుడు మనం తెలివి తక్కువగా ఎందుకు బయటపడాలి? అనే భావం స్పష్టంగా కన్పిస్తుంది.

100 కి 95 గా ఉన్న కష్టపడే ప్రజాసామాన్యానికి చాల తక్కువ ప్రాతినిధ్యం, జాగీరుదార్లు, షాహుకార్లకు చాల ఎక్కువ ప్రాతినిధ్యం ఉన్న, నామినేటెడ్ సభ్యులు దాదాపు సగంమంది అస్సెంబ్లీలో ఉన్న, స్థానికసంస్థలలో సైతం సరియైన ప్రజాప్రాతినిధ్యంలేని, అన్ని ప్రజా సంస్థలచే నిరాకరింపబడిన, రాజ్యాంగ సంస్కరణలలో మార్పులు చేయ మని కమ్యూనిస్టులు కోరి ఉండాలిసిందిగాదు. అందువలననే మితవాదులు సైతం జాతీయ అతివాదులముందు, తీవ్రవాదులుగా ప్రదర్శించుకోగలిగారు. ఈ రాజ్యాంగ సంస్కరణలను నిరసించుతూ, దేశాన్ని రక్షించడానికి అన్ని ప్రధాన ప్రజాసంస్థల ప్రతినిధులతోగూడిన, హిందువుల్ని, మహమ్మ దీయుల్ని, సమీకరించగల, ప్రజామంత్రివర్గాన్ని కోరి ఉండాలిసింది.

ధర్మవరం మహాసభ అయిన 2 నెలలకే గాంధీజీ, కాంగ్రెసు నాయ కుల అరెస్టులు, తత్ఫలితంగా భారతదేశమంతటా సాగిన విధ్వంసక కార్య క్రమం, ప్రభుత్వంయొక్క దారుణనిర్బంధవిధానం జరిగాయి. హైదరా బాదు సంస్థానంలోగూడ దానిచిహ్నాలు కనపడ్డాయి. కాని ముఖ్యంగా తెలంగానాలో రాజకీయరంగంలో చురుకుగా పనిచేసేవారిలో 100 కి 90 మంది కమ్యూనిస్టులవడంవల్ల, వీరు విధ్వంసకార్యక్రమానికి వ్యతిరేకంగా తీవ్రప్రచారం చేయడంవల్ల జరగలేదు. అందుచే ప్రభుత్వం కొంతమంది మహారాష్ట్ర జాతీయవాదులను అరెస్టుచేసినా, తీవ్ర నిర్బంధవిధానం కొన సాగలేదు.

ధర్మవరం మహాసభ అయినతర్వాత నుండీ కమ్యూనిస్టులు మును పటికన్న ఎక్కువగా ప్రజలయొక్క దైనందిన కష్టాలు తీసుకొని పని చేశారు. సూర్యాపేట తాలూకాలో కౌలుదార్ల శాసనం రాబోతూఉందని, ఎన్నో ఏళ్ళనుంచి హక్కు భుక్తములలో ఉన్నభూమిని బీదరైతులనుండి లాక్కోడానికి జమీందార్లు ప్రయత్నించారు. దానిమీద ఆరైతులనందరినీ సంఘటితపరచి జమీందార్ల ఎత్తుగడలను కమ్యూనిస్టులు భగ్నంచేశారు.

నల్లగొండజిల్లా కొలనుపాక ముస్లిము జాగీరులోని కొలనుపాక గ్రామంలో హిందూమహమ్మదీయ రైతులలో ఐక్యతసాధించి, రు 3000, అక్రమపన్నును రద్దుచేయించారు. వరంగల్లుజిల్లా ఖమ్మం, మధిర

తాలూకాలలో తాలూకా ఆంధ్రమహాసభ ఆఫీసులుపెట్టి, ఉద్యోగుల లంచ గొండితనాన్ని, ఇతర నిర్బంధవిధానాన్ని, వెట్టిచాకిరిని పోగొట్టడానికి తీవ్ర మైన కృషిచేశారు. ఖమ్మంమెట్టులో ఖిల్లేదారు అక్రమంగా విధించుతున్న మగ్గం పన్ను రద్దుచేయించబడింది. కరీంనగరం జిల్లా, షర్కీ-తాలూకా, ఆదిలాబాదు తాలూకాలలో ఇటువంటి సమస్యలు చాల తీసుకొని ప్రజలకు మేళ్లు కల్గించారు. ఈ విధమైన కృషివల్ల ఆంధ్రమహాసభ కష్టజీవులైన ప్రజాసామాన్యంలో వేళ్లు నాటుకొంది. 10000 మంది 0-4-0 సభ్యులు ఆంధ్ర మహాసభలో చేరారు. ఆంధ్ర మహాసభలోని మితవాదులు చాల మంది వకీళ్లు. వీరికి కేసులసందర్భంలో దేశపాండ్య-దేశముఖులు-జాగీరు దార్లు - పెద్ద భూస్వాములు - వర్తకులతో ఆర్థిక సంబంధాలు ఉన్నవి. పై జెప్పబడినవారు గ్రామాల్లోని ప్రజలను దోచుకుతింటూ విపరీతంగా బాధ పెడతారు. కమ్యూనిస్టులు ప్రజావుద్యమాన్ని నిర్మించి వీరిఅక్రమచర్యలను ఎదుర్కోవడానికి ఈమితవాదులుఇష్టపడలేదు. దానితో ధర్మవరం మహాసభలో రాజకీయంగా వచ్చిన భేదాభిప్రాయాలు ఇంకా తీవ్రతరమైనాయి దానితో జాతీయపక్షంలోని మితవాదులు, తీవ్రవాదులలోని కొందరు ఏకమై, కమ్యూనిస్టులు వర్గకలహం తీసుకువచ్చి రక్తపాతం చేయ బూనుకున్నారనీ, మాస్కో యేజంట్లనీ మొదలైనవిధాల దుష్ప్రచారం సాగించారు. యెంతో కాలంనుండీ ఆంధ్రమహాసభలు ప్యాసుచేస్తున్న ప్రజల కష్టాలనుగురించి ప్యాసుచేస్తున్నతీర్మానాలను కమ్యూనిస్టులు అమలుజరుపుతూవుంటే, జాతీయ వాదులు కొందరు వాటికి వ్యతిరేకంగాపోతూ, ఆంధ్రమహాసభకే చేటుతెచ్చి పెట్టారు ఈపరిస్థితుల్లో హైదరాబాదులో 1943 మే నెలలో ఆంధ్రమహాసభ యొక్క కాన్ఫరెన్సు జరిగింది. ఈ మహాసభకు ముందు స్థానిక కమిటీల ఎన్నికలను, కొత్తకమిటీల స్థాపనను, నిషేధించి, మితవాదులు ప్రజాస్వామ్య సూత్రాలకే విరుద్ధంగాప్రవర్తించారు. (అప్పటి ఆంధ్రమహాసభనిబంధనావళి ప్రకారం, డెలిగేట్లను యెన్నుకొనేది స్థానిక ఫిర్కా-తాలూకా-జిల్లా-కమిటీల సభ్యులు; ప్రాథమిక సభ్యులుగాదు. ఈ నిబంధనావళి సరియైన ప్రజాస్వామ్య సూత్రాలమీద ఆధారపడిలేదు.) ఈ మహాసభకు కమ్యూనిస్టులగు శ్రీ బద్దం ఎల్లారెడ్డిగారు అధ్యక్షస్థానమునకు పోటీజేసి, కొలది వోట్ల భేదముతో ఓడిపోయినారు. కమ్యూనిస్టులు వర్గకలహాలు రేకెత్తించి మీ భూములు లాక్కుంటారని జమీందార్లను, మీమీద ఆదాయపుపన్ను (నైజాంలో ఇంతవరకూలేదు) వేయించి మీకు నష్టంజేస్తారని వర్తకులను,

రెన్నుగొట్టారు. ఇలా వారిసహాయంతోను ఎన్నికలలో అక్రమాలు చేయడం ద్వారాను, కొన్ని జిల్లా-తాలూకాకమిటీలలోనేగాక, కాన్ఫరెన్సు డెలిగేట్లలో కూడా మెజారిటీ తెచ్చుకున్నారు. హైదరాబాదులోజరిగిన ఆంధ్రమహాసభలో ఇరుపక్షాలవారు వారివారి బలాలను సమీకరించారు. ఈ మహాసభలో చేయబడిన తీర్మానాలలో ప్రధానమైనవి రాజ్యాంగ సంస్కరణల తీర్మానం, ఆహార తీర్మానం. రాజ్యాంగ సంస్కరణల తీర్మానంలో వాటినిగూర్చి ధర్మవరం మహాసభ యిచ్చిన సూచనలకు ప్రభుత్వం సమాధానం యివ్వనందుననూ, దేశాన్నెదుర్కొన్న ఆహార పదార్థాలకొరత - జపాను దాడి సమస్యలను పరిష్కరించడానికి ప్రజావిశ్వాసం పొందిన మంత్రి వర్గాన్ని నియమించాలని కోరబడింది.

## రాజ్యాంగ సంస్కరణల తీర్మానం

"రాజ్యాంగ సంస్కరణములు ప్రకటింపబడి 4 సంవత్సరములు అయినది. ప్రాంతీయమహాసభలవారు తమ అసంతృప్తినితెలిపి నిరాకరించి యున్నారు. ధర్మవరం మహాసభలో కొన్ని సవరణలు సూచించబడెను. కాని ప్రభుత్వమువారు తమ విధానములో మార్పేమియు ప్రకటించలేదు. రాజ్యాంగ సంస్కరణములలో అంతర్భాగములగు జిల్లా కాన్ఫరెన్సులు, సలహాసంఘములు అమలులోనికి తేబడినవి కావున యీ సభవారు ప్రభుత్వముయొక్క యీ వైఖరికి తమ అసమ్మతిని ప్రకటించి, ధర్మవరము సభలో అంగీకరింపబడిన తీర్మానములోని సూచనలను ఉపసంహరించుకొనుచున్నారు. మరియు హైదరాబాదు రాష్ట్రములో కూడ, యుద్ధపరిస్థితుల ప్రభావము ఆవరించి, ఆహారపదార్థములు, నిత్యజీవిత అవసరముల ధరలు హెచ్చుగా పెరిగినందున ప్రజల సంక్షోభమునకు కారణమగుచున్నది; కావున యుద్ధకాలములో యీ విషమ పరిస్థితుల నెదుర్కొనుటకును, ఫాసిస్టు దుండగీడుల దాడులను శక్తివంతముగా యెదుర్కొనుటకును, ప్రజావిశ్వాసము పొందిన మంత్రివర్గ నియామకము అవసరమని యీ సభవారు అభిప్రాయపడుచున్నారు. కావున జాతీయ ప్రభుత్వమును నిర్మించవలెనని యీ సభవారు హైదరాబాదు ప్రభుత్వమువారిని కోరుచున్నారు."

ఈ తీర్మానంలో ప్రజావిశ్వాసంగల మంత్రివర్గాన్నిగూర్చి అస్పష్టంగావున్నా, క్రమమైన మార్గాన్నే దీనిధోరణివుంది.

1943 ప్రారంభంలోనే భారతదేశమంతటా ఆహారపదార్థాలకొరత యేర్పడింది. మే నెలనాటికి బెంగాలు ఒరిస్సాలలో కరువుయేర్పడి, మర ణాలుగూడ ప్రారంభమయ్యాయి. హైదరాబాదుకోగూడ ఆహారపదార్థాల కొరత యేర్పడింది. ఈ పరిస్థితులను పరిష్కరించడానికి అనుగుణ్యమైన సూచనలతో ఆంధ్రమహాసభ ఒకతీర్మానంచేసింది. ప్రజా ఆహారకమిటీలు నిర్మించాలనీ, రైతులకు సక్రమమైన ధరలు నిర్ణయింపబడేటట్లు చూడా లనీ, చౌకడిపోలను ప్రభుత్వం తెరవాలనీ, పట్టణాలలో రేషనింగు పెట్టా లనీ, రైతులచే అధికాహారోత్పత్తిని చేయించాలనీ, ఆ తీర్మానంలోవుంది.

నైజాంలో బ్రిటిషు ఇండియాలోవలె, ఆదాయపుపన్ను (income-tax) లేదు. అందుచే లక్షల ఆదాయం తీసే వర్తకులు పన్నుభారంనుంచి తప్పించుకోవడం, ఆభారం రైతులమీద పడటం గూడ జరుగుతోంది. ప్రభుత్వం తన ఆదాయం పెంచుకోడానికి, రైతులమీద భూమిశిస్తు పెంచుతూ పోతూవుంది. ఇది చాలా అన్యాయం అందుచే కమ్యూనిస్టులు ఆదాయపుపన్ను వేసి, రైతులమీద పన్నుభారం తగ్గించాలనే తీర్మానం తీసుకువచ్చారు. ఈ తీర్మానం చర్చకువచ్చేటప్పటికి మితవాదనాయకులు కొం దరు మొఖంచాటువేశారు, కాన్ఫరెన్సుప్రథమంలో జాతీయవాదులవైపు ఓటు చేసిన చాలమంది సామాన్య ప్రతినిధులకు ఈతీర్మానంతో, కమ్యూనిస్టుల మీద కల్గింపబడిన అపోహలు తొలగిపోయినవి. వారు కమ్యూనిస్టుల వైపు వోటుచేశారు. అందువలన రెండుపక్షాలకు మొదటఉన్న షుమారు 150 వోట్లుతేడా ఈ తీర్మానంలో సుమారు 20 వోట్లకు తగ్గిపోయింది. 20 వోట్లతో తీర్మానం ఓడిపోయింది. ఆంధ్రమహాసభయొక్క హైదరా బాదు కాన్ఫరెన్సు తర్వాత తమకు ఎన్నిఅభ్యంతరాలు కల్గుతున్నా, ఆంధ్ర మహాసభలోనే ఉండి కమ్యూనిస్టులు ప్రజాసమస్యలకు సంబంధించిన ఆంధ్ర మహాసభ తీర్మానాలనే అమలు జరుపుతూవచ్చారు. ఇదివరకునుంచి పనిచేస్తున్న శిస్తుమాఫీలు బరాయిందాలు, అక్రమశిస్తువసూళ్లు, లంచగొండి తనం మొదలైన సమస్యలతోబాటు, ఆహారసమస్యను తీసుకొని పనిచేస్తూ వచ్చారు. ఆహారసమస్య హైదరాబాదు సంస్థానంలో తీవ్రమగుతూ వచ్చింది. ప్రభుత్వం ధాన్యసేకరణ విధానాన్ని అమలుజరిపింది. పట్టణా లలో చౌకడిపోలను తెరిచింది. వీటిలో ఉన్న లోపాలను సవరించడానికి ప్రయత్నంజేస్తూ, వీటిని జయప్రదంచేయడానికి ఆంధ్రమహాసభ ద్వారా కమ్యూనిస్టులు తీవ్రకృషిచేశారు. తాము పనిచేస్తున్నచోట్ల గోదాముల

వద్ద తూనికలలోనూ, కిమ్మతుకట్టడంలోను, రైతులకు జరిగే అన్యాయాలను చాలవరకు అరికట్టారు. చౌకడిపోలవద్ద జరిగే అన్యాయాలను పోగొట్ట డానికి కృషిచేసి, బీదలకు బియ్యందొరికేలా చేశారు. దొంగవ్యాపారాన్ని అరికట్టడానికి ప్రయత్నించారు. ఒకటి రెండుచోట్ల ఆంధ్రమహాసభ ముసుగుకింద దొంగవ్యాపారం సాగించుతున్న వర్తకులను పట్టించడం కూడ జరిగింది ప్రజలకోసం ఈవిధంగా కృషిచేస్తున్న కమ్యూనిస్టు కార్యకర్తలమీద కేసులు పెట్టించి, జైళ్ళకు పంపించడంలో సూర్యాపేటలో జాతీయవాదియైన వేములపల్లి వెంకటకృష్ణయ్యగారు సాయపడడంగూడ జరిగింది. ఆంధ్రమహాసభాధ్యక్షులు కొన్నిజిల్లాలలో పర్యటనచేసి, ఆంధ్ర భవన నిధికై సుమారు రు. 10,000 వసూలుచేశారు. జాతీయవాదులు, మితవాదులు కొన్నిప్రాంతాలలో ప్రజలకు, కార్యకర్తలకు న్యాయస్థానాలలో సహాయంచేశారు. కమ్యూనిస్టులు ప్రజలకు చేసిన సేవవల్ల, ఆంధ్రమహా సభకు ప్రజల్లో ఇంకెంతో పలుకుబడి వచ్చింది. కొత్తప్రాంతాలకు వ్యాపిం చింది. 1944 మే లో జరిగిన భువనగిరి ఆంధ్రమహాసభ కాన్ఫరెన్సునాటికి మొత్తం 23000 0–4–0 సభ్యులు చేరారు. ఈవిధంగా ఆంధ్రమహాసభ నిజమైన ప్రజాసంస్థ అయింది

ఒకవైపున ఆంధ్రమహాసభ అభివృద్ధి అవుతూవున్నా, కమ్యూ నిస్టులకు - జాతీయవాదులకు మధ్య చీలికలు ఎక్కువయ్యాయి అసలు ఈయుద్ధకాలంలోఏర్పడ్డ రాజకీయభేదాభిప్రాయాలతోపాటు, ప్రజలకుసంబం ధించిన సమస్యలను గూర్చి ఆంధ్రమహాసభ చేసిన తీర్మానాలను అమలు జరుపుటలోగూడ భేదాభిప్రాయాలు పెరిగిపోయాయి. క్రమంగా ఈభేదాభి ప్రాయాలు తీవ్రదశకు వచ్చినవి. అధికారంలో ఉన్న జాతీయవాదులు ఆహారసమస్య క్లిష్టంగా ఉన్న ఆరోజుల్లో కాన్ఫరెన్సు జరపడం అసంభవ మనే నెపంతో, ఈ సంవత్సరం కాన్ఫరెన్సు జరుపగూడదని కార్యనిర్వా హకవర్గంలో తీర్మానంప్యాసుచేశారు. కాన్ఫరెన్సుకోసం తెలంగానావాసులు తహతహలాడారు. కమ్యూనిస్టులు, కాన్ఫరెన్సు జరగాలనికోరే ఇతరులు, తీసుకువచ్చిన ప్రజావత్తిడికి అధికారంలోఉన్న జాతీయవాదులు లొంగక తప్పలేదు. స్టాండింగు కమిటీ నల్లగొండ జిల్లాలో కాన్ఫరెన్సు జరప డానికి అంగీకరించింది. జాతీయవాదులలో చాలమంది కాన్ఫరెన్సు జయ ప్రదం చేయడానికి తోడ్పడక, తటస్థవైఖరి నవలంభించారు. కొంతమంది ప్రముఖులు చందాలు యివ్వవద్దని ప్రచారం చేశారుగూడా. అయినా వారిది

ఏటికి ఎదురీత అయింది. భువనగిరిలో కాన్ఫరెన్సుజరపడానికి నిశ్చయింప బడింది. నెలరోజుల్లోనే షుమారు రు 12000 పోగుఅయింది. రైతులు, పట్టణవాసులు, వర్తకులు - అంతా చందా లిచ్చారు. ఇదివరకు వలెగాక ఈసారి ఏర్పాట్లు చాలావరకు వాలంటీర్లే చేశారు. కాన్ఫరెన్సు మేనెలలో జరిగింది. అధ్యక్షుని ఊరేగింపులో 5000 మంది ప్రజలు పాల్గొన్నారు. మహాసభకు 10000 మంది ప్రజలు వచ్చారు. యిందులో స్త్రీలు 1000 మంది. ఇంతటి ప్రజాసమీకరణ ఇంతకుముందెప్పుడూ జరిగివుండలేదు. ఈసంవత్సరం ప్రత్యేకత ఏమంటే, షుమారు 300 మంది స్థానికమహమ్మదీయులుగూడ వచ్చారు. ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకులలో ఒకరైన అక్బరువఫాఖానీగారుగూడ కాన్ఫరెన్సులో ఉపన్యసించారు. ఇదొక అపూర్వ విషయం. ఈ మహాసభకు అధ్యక్షుడు కమ్యూనిస్టు. 1930 నుండీ ప్రజాసేవలో నిమగ్నుడైన రావి నారాయణరెడ్డిగారికి ఇటువంటి మహాసభకు అధ్యక్షతవహించే గౌరవం దక్కింది. అధ్యక్షోపన్యాసం కాన్ఫరెన్సువలెనే చరిత్రాత్మకమైనది. ఇది 40 పేజీలు చిన్న సైపులో ముద్రించబడింది. దీనిలో రాజకీయసమస్యనుండి హైదరాబాదు సంస్థానం లోని అన్ని వర్గాల ప్రజలను నేడు ఎదుర్కొన్న ముఖ్యసమస్యలవరకు విపులంగా చర్చించి సూచనలియ్యబడినవి. రాజకీయ సమస్యనుగూర్చి అధ్యక్షోపన్యాసంలోని భాగం హైదరాబాదు వాసులకు చక్కని ఆచరణ యోగ్యమైన మార్గం చూపించుతోంది. హైదరాబాదులో హిందూ-ముస్లిం విభేదాలు ఎలావచ్చాయో, నేడు మనం ముందడుగువేయాలంటే హిందూ-ముస్లిం ఐక్యత ఎంత అవుసరమో, ఆ ఐక్యత సాధించడానికి మార్గం ఏదో స్పష్టంగా చెప్పబడిన ఈక్రిందిభాగం చూడండి.

## రాజకీయ సమస్య - ప్రజా ప్రభుత్వావశ్యకత

"నేడు నిజాంరాష్ట్రప్రజలను ఎదుర్కొనుచున్న సమస్యలలో ముఖ్యమైన వాటిని నేను వివరించియున్నాను. ప్రభుత్వము, ప్రజలు ఈ సమస్యలను పరిష్కరించుటకై చేయుచున్న ప్రయత్నములను తెలుసుకొన్నాము. రోజుకు రోజు పరిస్థితులు ఏ విధముగా విషమించుచున్నవోకూడ మీరు గ్రహించియే యుంటారు.

"పై విషయములను జాగ్రత్తగా పరిశీలించిన తరువాత, ప్రస్తుతపు మన ప్రభుత్వము ఈ తీవ్రసమస్యలను పరిష్కరింపజాలకపోతున్నదని

స్పష్టపడుచున్నది. ప్రభుత్వ మెట్టి సదుద్దేశములతో తన పరిపాలనా కార్య క్రమము నెరవేర్చ ప్రయత్నించుచున్నప్పటికి, ఈ భీషణసమస్యలను పరిష్కరించలేక పోవుచున్నది. ప్రజాప్రతినిధులు లేక, నిరంకుశాధికారవర్గముతోనే కూడుకొనిన ఈ ప్రభుత్వమునకు ఇది సహజము. శాంతి సమయములోనే ప్రజాకార్యముల సక్రమముగా నిర్వహించలేని ఇట్టి ప్రభుత్వముల గురించి ఈ భీకరయుద్ధపరిస్థితులయందు వేరే చెప్పనవసరములేదు. ప్రస్తుత నిరంకుశాధికారుల పరిపాలనముల నంతముచేసి, వానిస్థానే ప్రజా ప్రతినిధులుగల ప్రభుత్వమును ఏర్పర్చవలయునని నేడు భారతదేశమునందలి అన్నిపార్టీలవారు ఐక్యకంఠముతో కోరుచున్నారు. యుద్ధపరిస్థితుల వలన ఏర్పడిన సమస్యలను ఈ ప్రభుత్వము ఏమాత్రము పరిష్కరింపలేకపోవుటయే దీనికి కారణము. అట్టి ప్రభుత్వము మనరాష్ట్రములో కూడ క్లిష్టసమస్యలను పరిష్కరించలేకపోవుటలో ఆశ్చర్యమేమియులేదని నా అభిప్రాయము అందువల్లనే మనప్రభుత్వము ఆహారసమస్యయొక్క వివిధ దశలలో సరియైనపంథా నవలంబించలేక, తీవ్రతర మొనర్చుటకు అవకాశమిచ్చినది. అధికాహారోత్పత్తి, కార్మిక సమస్యలు, పౌరసత్వములు మొదలగు వివిధవిషయములలో ప్రభుత్వవిధానమువల్ల ఎట్టి చిక్కు సమస్యలు ఏర్పడినవో మీరు గమనించియే యుందురు.

"అందువలన ఈ యుద్ధపరిస్థితులలో ప్రభుత్వము, ప్రజలకు మధ్య సుహృద్భావ ముండుటకు బదులు వ్యతిరేకభావము అభివృద్ధి అయింది. ప్రభుత్వవిధానము ప్రజలలోని వివిధపక్షముల వ్యతిరేకభావమును పెంపొందించినది. ప్రభుత్వముకూడ ఈ పరిస్థితులను గ్రహించియే 'బాబెహూకూమతు'ను విస్తరించి, కొంతబలము చేకూర్చుకొనవలెనని ప్రయత్నించినది. కాని ఇట్టి విస్తరణవలన ఏమాత్రము లాభములేదని ప్రజలనుండి వచ్చిన వ్యతిరేకతచే ఈ ప్రయత్నము మానుకున్నట్లు నాకు కనిపిస్తున్నది.

"ప్రస్తుతమున్న బాబేహూకూమతును విస్తరించి, మరికొంతమంది సభ్యులను తీసుకున్నంత మాత్రమున పరిస్థితులు మారజాలవు. వీరు ఎంత ప్రతిభావంతు లయినప్పటికి, ప్రజలతో సంబంధము లేనివారగుటచే ప్రస్తుత పరిస్థితులందు మార్పుతేజాలరు. అందువల్ల నిజమైన ప్రజాప్రభుత్వమే ప్రస్తుతం ప్రజల నెదుర్కొనుచున్న క్లిష్ట సమస్యలను పరిష్కరింపజాలుతుంది. ప్రస్తుతమున్న బాబేహూకూమతును పూర్తిగా మార్చి, రాష్ట్రంలోని ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక మహాసభల ప్రతినిధులను, అంజుమన్

ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ప్రతినిధులను ప్రభుత్వములోనికి తీసుకొని, బాబె హుకూమతును నిజమైన ప్రజాప్రభుత్వముగ చేయవలెను. ఇట్టి ప్రభుత్వమునకు పరిపాలనా విషయములో అన్ని సమస్యలను పరిష్కరించుటకు అధికారముండవలయును. దీనితోబాటు ఈ క్రింది కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకు అవకాశముండవలయును

1. పూర్తి పౌరసత్వహక్కుల నేర్పరుచుట.

2. ఆంధ్రమహాసభ, ఇతర ప్రజాసంస్థలు ఎంతో కాలమునుండి ఆందోళన చేయుచున్న రైతుల, కార్మికుల, కౌలుదార్ల, జాగీరు రైతుల ప్రధాన కష్టములను తొలగించు కార్యక్రమమును నెరవేర్చుట.

"మనము నేడు కోరవలసిన ప్రజాప్రభుత్వము యిట్టి అధికారములు కలదిగా నుండవలయును. ఇది పూర్తియైన బాధ్యతాయుతప్రభుత్వము కాని మాటనిజమే. కాని నేటి పరిస్థితులలో ఇట్టి ప్రభుత్వము మనరాష్ట్ర ప్రజలందరియొక్క శ్రేయస్సుకు అనుకూలమని నేనుఅభిప్రాయపడుచున్నాను. నేడు మనల నెదుర్కొనుచున్న దేశరక్షణ సమస్యల నన్నిటిని ఈ ప్రభుత్వము పరిష్కరించగలదు. అట్లు పరిష్కరించుటద్వారా ఇది పూర్తి సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించు శక్తిని, పరిస్థితులను ఏర్పర్చి, హైదరాబాద్ ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించగలదు.

## ప్రజా ప్రభుత్వ స్థాపనకు మార్గము

"ఇట్టి ప్రజాప్రభుత్వమును కోరుటతోనే మనకర్తవ్యము తీరిపోదు. దాన్ని సాధించుట కవసరమైన కార్యక్రమాన్ని నిర్ణయించి, దాన్ని ఆచరణలో పెట్టుటకు పూనుకొనవలయును. ప్రభుత్వముయొక్క కఠిన దృక్పథమువల్ల మనం ఏమియు సాధించలేమనే నిరాశ, నిస్పృహలతో కొందరు దేశభక్తులు నిండియున్నారు. బ్రిటిష్ ఇండియాలో ప్రధాన రాజకీయ మార్పులు వస్తేనేకాని యిచ్చట మార్పుల కవకాశములేదని, అంతవరకు మనమేమియు చేయలేమని వీరి అభిప్రాయము. కాని ఈ అభిప్రాయముతో నే నేకీభవించజాలను.

"నేను వివరించిన రాజకీయ ఆశయమును నెరవేర్చవలెనన్న రెండు విధములైన కార్యక్రమములు అవలంభించవలసియుండును. 1. వట్టి వ్యతిరేక (Negative) పంథాను వదలి, నిర్మాణయుక్తమైన దేశరక్షణ కార్యక్రమమునకై ప్రజలను సంఘటితపరచుటకు బూనుకొనవలయును.

2. "మన రాజకీయ ఆర్థిక కార్యక్రమమును ఆధారముగ చేసుకొని హిందూముస్లిం ఐక్యతను ఏర్పర్చవలెను.

"నేడు మనము దేశరక్షణ కార్యక్రమమును బలపర్చుటద్వారానే ముందుకు పోగలమనే విషయాన్ని గ్రహించవలసినదిగా దేశభక్తులకు మనవి చేయుచున్నాను. దేశరక్షణకు ప్రధానమైన ఆహారసమస్యను పరిష్కరించుటకు ఎంత హెచ్చుగా మనము పూనుకుంటామో, ఎంత హెచ్చుగా జపాను ఫాసిస్టులను ఎదిరించుటకు ప్రజలను సమీకరించుతామో, అంత ఎక్కువగా ప్రజాఉద్యమము బలపడి. మన ప్రధాన ఆశయాలను సాధించుటకు అవకాశము కలగగలదని నేను నమ్ముచున్నాను. మనరాష్ట్ర ప్రభుత్వముయొక్క నిరంకుశ విధానమువలన మన ప్రతి కార్యక్రమానికి అడ్డంకు లేర్పడుచుండుట నిజమే. కాని ఈ చర్యలవలన మనము రెచ్చిపోయి ప్రభుత్వవిధానముతో వ్యతిరేకించుటయే మన కార్యక్రమముగా పెట్టుకొన్నచో. ప్రజలకు మేలుచేయజాలము. దేశరక్షణ కార్యాలకు మనము వ్యతిరేకిస్తున్నామనే సాకుతో నిర్బంధవిధానము ప్రయోగింపబడుతుంది. అట్లుగాక మన కవకాశ మున్నవిధముగా ప్రభుత్వ దేశరక్షణ కార్యాలతో సహకారము చేయుచు, అవసర మొచ్చినప్పుడు విమర్శించవలయును. ఉదాహరణకు : ధాన్యసేకరణ విధానంవిషయములో ప్రభుత్వ స్కీములోని లోపములను విమర్శించుటయేగాక, చెల్లించ జాలనివారికి మినహాయింపులు ఇప్పించుచు, ధాన్యమివ్వగలవారిచేత ఇప్పించవలయును. నిల్వధాన్యపు స్టాకులను బయలుపరచవలయును. ఈపద్ధతుల నవలంబించినచో, ఒకవైపు దేశరక్షణను బలపర్చుచు యింకొకవైపున నిర్బంధవిధానాన్ని అరికట్టి ప్రజలసమస్యల పరిష్కరించి, ప్రజాఉద్యమాన్ని బలపర్చగలము. ప్రజాప్రభుత్వమును సాధించుట కవసరమైన స్థాయికి ప్రజా ఉద్యమాన్ని తీసుకవెళ్ళగలము.

## హిందూ - ముస్లిం ఐక్యత

"ప్రజాప్రభుత్వమునుఏర్పర్చుటకు మనము నెరవేర్చవలసిన రెండవ కర్తవ్యము హిందూ - ముస్లిం సామరస్యము నేర్పర్చుట.

"హిందూ-ముస్లిం సమస్య విషయంలో బ్రిటిష్ ఇండియా రాష్ట్రములలోలేని కొన్ని ప్రత్యేక పరిస్థితులు మన రాష్ట్రములో ఉన్నవను విషయము దేశభక్తులందరు అంగీకరించుతారనియే నా నమ్మకము. ఈపరి

స్థితులలో ముస్లింప్రజల సహకారం, అంగీకారం లేకుండా నేను పైన వివరించిన ప్రజాప్రభుత్వాన్ని సాధించుట సాధ్యము కాదనే విషయము కూడ దేశభక్తులు గ్రహించెదరనుకుంటాను. ఈసందర్భములో ఇంకొక విషయముకూడ దేశభక్తులు గ్రహించుట అవసరమని నా అభిప్రాయము. ఈ రాష్ట్రములో ముస్లిములతో సఖ్యత సాధించుటయనగా, మజ్లీస్ అంజుమన్ ఇత్తెహాదుల్ ముసిల్మీన్‌తో అనుకూలత ఏర్పరుచుటయే. ఇది నిజాం రాష్ట్ర ముస్లింల ప్రధానసంస్థ అత్యధికసంఖ్యాకులైన ముస్లింలు ఈసంస్థలో నున్నారుగనుక, బ్రిటిష్ ఇండియాలో ముస్లింలీగును వదిలేసి ముస్లింలతో ఏవిధముగా ఐకమత్యము సాధించలేమో, అట్లే ఇత్తెహాదుల్ ముసిల్మీనునువదిలి ముస్లింలతో ఐకమత్యము సాధించ బూనుకొనుట వాస్తవిక పరిస్థితులను మరచిపోవుటయని నా అభిప్రాయం.

"ప్రజాప్రభుత్వాన్ని సాధించుటకు ముస్లింప్రజలు మనతో కలిసి వస్తారా ? ఒకవేళ ముస్లిం ప్రజలు కలిసివచ్చే పరిస్థితియందున్నను యిది వరకు "పాలకజాతి" అనే నినాద మిచ్చిన ఇత్తెహాదుల్ ముస్లిమీన్ ప్రజా ప్రభుత్వాన్ని కోరుటలో ప్రజాపక్షముతో కలిసివస్తుందా ? — అనేప్రశ్నలు వెంటనే దేశీయులకు కలుగుట సహజము.

"ముస్లింలుకూడ మనవంటి ప్రజలేనని ప్రథమములో దేశభక్తులు గుర్తించవలెను. వీరిలో అత్యధికులు చిన్న ఉద్యోగస్తులు, కార్మికులు, చిన్నవర్తకులు, యితర చిల్లరపనులు చేయువారు అయియున్నారు. ఇతర ప్రజలలోవలె వీరిలోగూడ ధనికులు స్వల్పము. ఇట్టి పరిస్థితులలో యితర ప్రజలందరు నేడు అనుభవిస్తున్న కష్టసుఖములు వీరుకూడ అనుభవించుచున్నారు. యుద్ధపరిస్థితులవల్ల ఏర్పడ్డ కష్టములన్నియు వీరినికూడ బాధించుచునేయున్నవి. ధరలు విపరీతముగా పెరుగుటచే ఇతరప్రజలందరి వలెనే వీరికికూడ ఆహారము లభించక బాధపడుచున్నారు. ముస్లిం కార్మికులు పరిశ్రమలలో ఎట్టి హక్కులులేక యితరులతోబాటు కష్టపడుచునే యున్నారు. అందుచేత తమ సమస్యలను పరిష్కరించలేనటువంటి ఈ ప్రభుత్వములో మార్పు రావాలనియు, తమకష్టములు తీర్చగల ప్రభుత్వమేర్పడవలయుననియు, వీరుకోరుట సహజముకదా? కనుక మనము సుహృదయముతో ప్రయత్నించి మన రాజకీయ విధానాన్ని వారు సరిగా అర్థము చేసుకొనునటుల చేసినచో, వారి వ్యతిరేకత పోవుననుటలో సందేహమేమియు లేదు.

"ఇత్తెహాదుల్ ముసిల్మీన్, ఒకప్పుడు ముస్లిములు "పాలకజాతి" అనేనినాదం ఇచ్చినమాటనిజమే కాని ప్రజలలో దాని పలుకుబడి హెచ్చిన కొలది, ప్రజాబలము అభివృద్ధి చెందినకొలది, ముస్లింప్రజలలో వచ్చిన మార్పుతోపాటు ఈసంస్థయొక్క విధానములోకూడ, మార్పులువచ్చినవి. "పాలకజాతి" అనే నినాదం ఎవరూ నేడు ప్రచారము చేయుటలేదు. ఆహారసమస్యా పరిష్కారార్ధమై యితర ప్రజాసంస్థలతో సహకారం చేయుటకు అంగీకరించుతున్నారు. దానిలో అభివృద్ధికరవర్గం ఒకటి క్రమంగా ఏర్పడుచున్నది. వీరు నేటి ప్రభుత్వవిధానంలో పెద్దమార్పు రావాలనియు, హిందువులతో సఖ్యత కుదుర్చుకోవలెననియు కోరుచున్నారు. బాబేహుకూమతులో ఇత్తేహాదుల్ ముసిల్మీన్ ప్రతినిధులను తీసుకొను విషయంలో సాగిన వాదవివాదములు చూస్తే నేడు ఈ సంస్థలో కలిగిన మార్పును గుర్తించగల్గుతాము బాబేహుకూమత్‌లోకి వెళ్ళే తమ ప్రతినిధి తమ సంస్థకు బాధ్యుడుగ ఉండవలెననియు, ముస్లింప్రజల కనుకూలమైన విధానాన్ని అనుసరించాలనియు, చాలమంది కోరినారు కేవలం తమ ప్రతినిధి మాత్రమే బాబే హుకూమత్‌లోనికిపోయిన లాభము లేదని కొందరు గుర్తించినారు. మౌల్వీ బహదూర్ ఖాన్‌గారు కూడా బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకు సిద్ధాంతరీత్యా తాము వ్యతిరేకులం కామని చెప్పినారు. ఇత్తెహాదుల్ ముసిల్మీన్ సంఘముకూడ ప్రభుత్వంలో మార్పు రావాలని తీర్మానించినది.

"ఇత్తెహాదుల్ ముసిల్మీన్ సంస్థలోను, ముస్లిం ప్రజలలోను అభివృద్ధికరమైన మార్పులు వస్తూన్నప్పటికి, ప్రస్తుతం వారు ప్రజాప్రభుత్వాన్ని కోరుటలో మనతో సహకారం చేయుటకు సిద్ధంగాలేరు. ఇందులకు ప్రధాన కారణం మొదటినుంచి వస్తూన్న అపనమ్మకాలే. హిందువులు అత్యధిక సంఖ్యలో వుండుటచే ప్రజాప్రభుత్వం స్థాపించబడినచో తమ శ్రేయస్సుకు వ్యతిరేకమైన కార్యక్రమం సాగింపబడుననే భయము, అనుమానం వీరిని తీవ్రంగా బాధించుచున్నది. అట్టి అనుమానాలకెట్టి అవకాశం లేదని వారికి నమ్మకమేర్పడినట్లయిన, యితర ప్రజలతోకలసి ప్రజాప్రభుత్వాన్ని కోరెదమనిగూడ సూచనలు వస్తున్నవి. ముస్లిం ప్రజల ఈ అనుమానాలను తొలగించి, హిందూ-ముస్లిం సఖ్యత కుదుర్చుట అత్యవసరమని నా అభిప్రాయము. ఇట్టి ఐక్యతను సాధించుటకై నేను ఒక ప్రాతిపదికను సూచించుచున్నాను.

"1. ప్రజాప్రభుత్వంలో సగం సభ్యులు ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక మహాసభల ప్రతినిధులును, మిగతా సగం సభ్యులు అంజుమన్ ఇత్తెహాదుల్ ముసిల్మీన్ ప్రతినిధులు అయి ఉండవలయును.

2. ప్రస్తుతమున్న ప్రభుత్వ ఉద్యోగులు వారి స్థానములలో ఉండవలయును. ఇత్తెహాదుల్ ముసిల్మీన్, మూడు మహాసభలు ఒప్పుకన్న విధానం ప్రకారం నూతన ఉద్యోగులు తీసుకొనబడవలయును.

3. ప్రతిపౌరుని మత స్వాతంత్ర్యాన్ని రక్షించవలయును.

"ఇట్టి ప్రతిపాదనలు ప్రజాశ్రేయస్సుకు వ్యతిరేకముకాదాయని దేశభక్తులకు అనుమానము కలుగవచ్చు. అట్టి సందేహములకు తావులేదని నేను ధైర్యముగా చెప్పగలను. అట్టి ప్రతిపాదనలు మనమంగీకరించినచో, ముస్లిం ప్రజలలో నేడున్న అనుమానాలను తొలగించి మనముకోరే ప్రజాప్రభుత్వ స్థాపనకు వారి సహకారాన్ని సంపాదించెదము. ఇట్టి ప్రజాప్రభుత్వం వలన నేడు ఎదుర్కొన్న సమస్యను పరిష్కరించి, ప్రజా ఉద్యమాన్ని బలపర్చగలము. నేడు మనలనెదుర్కొనుచున్న సమస్యల పరిష్కరించుట ముస్లిం ప్రజలకుగూడ అవసరము గనుక వారి సహకారం లభించును. మనతోగలసి సమిష్టిగా పనిచేయుటవల్ల వారికున్న అనుమానాలు కూడ తొలగిపోవుట కవకాశము ఏర్పడును. అందుచే ముందు ప్రభుత్వములో సగం సీట్లను ముస్లింలకు ప్రత్యేకించుట అనవసరమని ముస్లింలే నిర్ణయించెదరు. ఈపరిస్థితులు ఆధారంగా తీసుకొని పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని సాధించి ప్రజలకు సౌఖ్యప్రదమైన జీవితాన్ని కలుగజేయగలుగుదుము.

"ఈ ప్రతిపాదనలు మనము అంగీకరించిన వెంటనే పరిస్థితులన్నియు మారిపోతవనే అభిప్రాయముకూడ నేను కలుగజేయవలచుకోలేను. ముస్లింలలో నేడు అభివృద్ధియగుచున్న అభివృద్ధి శక్తులు బలపడుటకును, వారు త్వరగా ముస్లిం ప్రజలలో అనుమానాలను పోగొట్టుటకు ఈప్రతిపాదనలు ఉపయోగించగలవు మన ఈ ప్రతిపాదనలను ముసింల ముందుంచి మన దృక్పథమును ప్రచారము చేయవలెను. అట్లుచేసిన త్వరలో అనుకూలమైన మార్పు గలుగుట కవకాశము గలదని నా అభిప్రాయం. నేటి పరిస్థితిలు అందుగనుకూలముగా యున్నవి. ముస్లింలలో ఇట్టి మార్పు వచ్చినచో ఇత్తెహాదుల్ ముస్లింలలోకూడ మార్పు వచ్చితీరును."

"నేడు భారతదేశమంతటితోబాటు మనరాష్ట్రంలోని ముస్లింలలోను ఇత్తెహాదుల్ ముస్లింలలోను, వస్తున్న మార్పులను గుర్తించవలసినదిగా దేశభక్తులకు నేను మనవిచేయుచున్నాను. వెనుకటినుంచి వస్తున్న అనుమానాలు భావాలు త్వరగా నశించవు. కాని గతించిపోయిన పనులలోవచ్చే మార్పులవలన మనకు సహాయం లభించినను, ప్రధానంగా మన రాష్ట్రం లోని ప్రజాఉద్యమ బలంపైననే మన మాధారపడవలసి యుండును."

"క్రమంగా నశించుచున్న ఈభావాలను అంట్టిపెట్టుకొని ఉండరాదు నూతన పరిస్థితులలో ఉద్భవించి అభివృద్ధియగుచున్న నూతన భావాలను దృష్టియందు చుకోవలయును. గత నాల్గు ఐదు సంవత్సరములలో బ్రిటిషు ఇండియాలోని ముస్లింలలో వచ్చిన మార్పు గమనించవలయును. కేంద్ర అసెంబ్లీలో కాంగ్రెసు ముస్లింలీగుల మధ్య ఏర్పడ్డ ఐక్యతను ప్రాముఖ్యతను గుర్తించవలయును శ్రీమతి సరోజినీదేవిగారు చెప్పినట్లు మన సమిష్టికష్టాలు, దుఃఖాలు మనల నందరను దగ్గరకు తీసుకొస్తున్నవి. మన నేటి జీవిధానమే మనలనిట్లు ఐక్యపర్చుచున్నది. పరస్పర అనుమానాలను పోగొట్టుచున్నది. ఈ పరిస్థితులలో సరియైన పంథా నవలంబించినచో మనమనుకోనంత త్వరగా ఐక్యమయ్యెదము. ప్రజాప్రభుత్వాన్ని సాధించెదము."

" ఈ ప్రజాప్రభుత్వం మనము కోరగనే ప్రభుత్వం ఇచ్చివేస్తుందని మీలో ఎవరైన భావించినచో పొరపాటు మనం ఇట్టి కార్యక్రమంతో హిందూ ముస్లింలలో ఐక్యత దేశంలోని వివిధవర్గాలలో ఐక్యతచేకూర్చి బ్రహ్మాండమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించి, అట్టి ఉద్యమ బలముచేతనే దీనిని సాధించ గలుగుతాము ప్రజా ప్రభుత్వం హిందూ ముస్లిం ఐక్యత ఈరెండూ ఒకరోజు జరుగునవిగావు. దీనికొరకై మనం తీవ్రకృషి చేయవలసి యుండును. ఈ కార్యక్రమం దినదిన ప్రవర్ధమానమౌనటువంటి ఒక ఉద్యమంగా పరిగణించవలయును. అప్పుడే దీని నిజమైన అర్థం. ఆకోరే ప్రజాప్రభుత్వంయొక్క బలమును గ్రహింప జూపుతాము.

మహాసభలో రాజకీయసమస్య, ఆహారసమస్య, ధాన్యసేకరణ విధానం, కార్మికచట్టాలు, విద్యావిషయాలు మొదలైన అన్ని ముఖ్య సమస్యలమీద మార్గదర్శకమైన వివరమైన తీర్మానాలు చేయబడ్డాయి. రాజకీయ తీర్మానంలో అధ్యక్షోపన్యాసంలో సూచి చబడినట్లుగా ప్రజా మంత్రివర్గములో సగంస్థానాలు ఇత్తెహాదుల్ ముసిల్మీను ప్రతినిధులకు, మిగతా

సగం స్థానాలు ఆంధ్ర మహారాష్ట్ర కర్ణాటక మహాసభల ప్రతినిధుల కుండాలనే విషయాన్ని చేర్చలేదు. పై నాల్గు సంస్థల ప్రతినిధులతోగూడిన ప్రజా మంత్రివర్గంమాత్రం ఏర్పరుపబడాలని ఉంది.

100 కి 50 స్థానాలు మహమ్మదీయులకివ్వాలనే పై సూత్రాన్ని జాతీయవాదులు తీవ్రంగా వ్యతిరేకించుతున్నారు. ఈ పరిస్థితుల్లో ఆంధ్ర మహాసభలోని ఐక్యత కాపాడటానికి, ఆంధ్రమహాసభను ఐక్య ప్రజా ఉద్యమంగా విస్తృతపరచడానికి, ఆ సూత్రం తీర్మానంలో చేర్చబడలేదు. అయినప్పటికీ ఆ సూత్రాన్ని సంస్థానంలో సగంమందిగావున్న ఆంధ్రుల ప్రతినిధియైన ఆంధ్ర మహాసభ వేదికనుంచి అధ్యక్షుడు ప్రకటించడం, ఆంధ్ర మహాసభ హిందూ - ముస్లిములను దగ్గరకు తీసుకువచ్చే ప్రజా మంత్రివర్గ తీర్మానం ప్యాసుచేయడం ఒక పెద్దవిషయం. ఆంధ్రమహాసభ భువనగిరి కాన్ఫరెన్సులో సంస్థానంలో ప్రజా ఐక్యతకు ముందడుగువేసి, మిగతా సంస్థలకు దారిజూపింది.

ఈ మహాసభలో ఆంధ్రమహాసభ అభివృద్ధికి అనుగుణ్యంగా, నిబంధనావళిగూడ మార్చబడింది. అభివృద్ధికి ఆటంకంగాఉన్న నిబంధనలు తొలగించబడినవి; వాటిస్థానే ఆంధ్రమహాసభను ముందుకు తీసుకుపోయే నిబంధనలు చేయబడినవి. ప్రాథమికసభ్యత్వ రుసుము బీదప్రజల కందుబాటులో ఉండేలాగున 0-4-0 నుండి 0-1-0 కు తగ్గించబడింది. ప్రాథమికసభ్యులే నేరుగా డెలిగేట్లును, జిల్లాకమిటీ సభ్యులను ఎన్నుకొనే అవకాశం కల్గించబడింది. కాన్ఫరెన్సుకు, కాన్ఫరెన్సుకు మధ్య ఆంధ్ర మహాసభ పాలసీని నడిపే స్టాండింగుకమిటీలో అన్నిరాజకీయ పక్షాలవారు ఉండే సౌకర్యం కల్గించబడింది. భువనగిరిలో జరిగిన 11 వ ఆంధ్రమహాసభ చరిత్రాత్మకమైనది. రాజకీయంగాను, నిర్మాణరీత్యా ఎంతో ముందుకు పోయింది. ఆంధ్రమహాసభ జీవితంలో నూతన అధ్యాయాన్ని తెరిచింది. ఇతర ప్రజాసంస్థలకు ముందుండి, హిందూ - ముస్లిము ఐక్యత సాధించడానికి, నాయకురాలుగా ముందుకు వచ్చింది."

"అయినా ఒక విచారకరవిషయ మేమంటే, జాతీయవాదులు మహాసభను బహిష్కరించారు. జాతీయపక్ష మనేదానిని ఒకదానిని ఏర్పరచారు. ఆంధ్రమహాసభలో వారు బాధ్యతగల స్థానాలు తీసుకో నిరాకరించారు. ప్రాథమిక సభ్యులుగా ఉన్నా, జాతీయపక్షం ఆంధ్రమహాసభకు పోటీగాదని ప్రకటించినా, వారు ప్రజాసమావేశంలో స్థానిక కమిటీలను నియమించడం

చూస్తే, ఆంధ్రమహాసభకు పోటీగా తయారయ్యే సూచనలు కన్పిస్తున్నాయి. ఆంధ్రమహాసభలో ఇటువంటి చీలికరావడం తెలంగానా వాసులకు చాల హానికరం. జాతీయపక్షంలో ఆంధ్రమహాసభను ఆంధ్రుల వైజ్ఞానిక సంస్థగా ఆరంభించి, లైబ్రరీ ఉద్యమంద్వారా ఆంధ్రులలో జాతీయం ను మేల్కొలిపిన మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణరావు, మందుముల నరసింగరావుగార్ల వంటివారు ఉన్నారు. 1938 ఉద్యమంలో జైళ్ళకుపోయిన దేశభక్తుడు మందుముల రామచంద్రరావు లాంటివాళ్ళు ఉన్నారు. వీరందరూ ఆంధ్రమహాసభ అభివృద్ధికి పాటుబడినవారే. అందరూ కృషిచేయుటవలననే ఆంధ్రమహాసభ ఈ స్థితికి వచ్చింది. ఇప్పుడు హైదరాబాదు సంస్థాన ప్రజల నెదుర్కొన్న ఆహారసమస్యను పరిష్కరించాలంటే, భావి స్వతంత్రభారతదేశంలో హైదరాబాదు సంస్థానం తన స్థానాన్ని వహించాలంటే, ఆంధ్రమహాసభలో ఐక్యత అవసరం. ఈ విషయాన్ని గూర్చి అధ్యక్షుడు ఈ క్రిందివిధంగా చెప్పాడు."

## అభిప్రాయ భేదములు

"ఉద్యమము పెరిగినకొలది ప్రజలు కార్యకర్తల అభిప్రాయములలో అభివృద్ధి వికాసములు కలిగి అభిప్రాయభేదములు జనించుట సహజము. ఇది ఉద్యమాభివృద్ధికి సూచకమేగాని వేరుకాదు. ఇదేపరిస్థితి ఆంధ్రోద్యమ చరిత్రయందుకూడ కాననగును. 6 వ ఆంధ్రమహాసభ సందర్భమున అభివృద్ధిపక్షమువారికి, అధికారపక్షమువారికి తీవ్రమైన అభిప్రాయభేదములు కలిగి తీవ్రమైన విమర్శనలు బయలుదేరినవి. నేడుకలిగిన అభిప్రాయభేదములుకూడ పై చారిత్రకదృష్టితో పరికించదగినవేకాని ప్రత్యేకత ఏమియులేదు. అభిప్రాయభేదములు కలిగినప్పుడల్లా మహాసభ ప్రజాస్వామికముగా నిర్ణయించిన అధికసంఖ్యాకుల అభిప్రాయము ననుసరించి ఐక్యతతో నడుచుట దేశానికి, ప్రజలకు ఉద్యమానికి లాభకరము. ఈ సందర్భమున ఈలోగా గలిగిన అభిప్రాయభేదములచే ఆంధ్రమహాసభయందలి జాతీయపక్షము వారవలంబించిన తటస్థవిధానమును నేను ప్రశంసింపజాలనని చెప్పినచో వారు నన్ను క్షమించెదరుగాక."

మహాసభయందు పనిచేయుచున్న ఒకపక్షమువారు మహాసభను తమ కార్యక్రమమునకు ఉపయోగించుకొందురనుట తప్పు. ఇట్టి అపోహకు సరియైన కారణమేమి నాకు అగుపడుటలేదు. ఆంధ్రమహాసభ ఆంధ్రుల సమిష్టివేదిక. ఏ రాజకీయ అభిప్రాయమునకు జెందినవారైనను

ప్రజాశ్రేయస్సుకు వ్యతిరేకులు గానిచో వారికి ఆంధ్రమహాసభయందు స్థానమున్నది. నేను అధ్యక్షోపన్యాసమందు వెల్లడించిన అభిప్రాయములు వ్యక్తిగతమైనవి. నేడు ప్రజాశ్రేయస్సుకొరకు ఈ అభిప్రాయముల ననుసరించి కార్యక్రమము జరిపిన క్షేమదాయకమని నేను నమ్ముచున్నాను. ఆంధ్రమహాసభ ఈ అభిప్రాయములను అంగీకరింపవచ్చును. లేదా నిరాకరింపవచ్చును. ప్రజాస్వామిక సిద్ధాంతాలకు నేను బద్ధుడనైయున్నాను.

"నేడు మనదేశమును, ప్రజలను అతిభయంకరమైన సమస్యలు ఎదిరించుచున్నవి. ఈ సమస్యల నన్నిటిని ఏ ఒక రాజకీయ పక్షమైనను సాధింపజాలుననుట సాహసము. అన్నిరాజకీయపక్షములు కలసి ఈసమస్యలను సమిష్టిగా ఎదిరింపవలసియుండును. దేశములోని అన్ని రాజకీయ పక్షములు కలసి ఈ సమస్యలను సమిష్టిగా ఎదిరింపవలసియుండును. దేశములోని అన్ని రాజకీయపక్షములు ఐక్యత అవసరమైనప్పుడు ఆంధ్ర మహాసభలోని వివిధపక్షాలు ఐక్యతతో పనిచేయుట ఎంత అవసరమో మనవిజేయ నవసరములేదు."

"కావున మా జాతీయపక్ష మిత్రులు తమ తటస్థవిధానమును వదిలి, ఇతర సోదరదేశభక్తులతోపాటు ఆంధ్రోద్యమాభివృద్ధికి, ఆంధ్ర ప్రజల శ్రేయస్సుకు నేటిసమస్యల పరిష్కారమునకు, ప్రజాప్రభుత్వస్థాపనకు ఆంధ్రమహాసభయందు బాధ్యతగల స్థానముల నంగీకరించి ప్రజాసేవ జేయుటకు ముందంజ వేయుదురని ఆశించుచున్నాను. వారిని సుహృదయముతో ఆహ్వానించుచున్నాను.

ఆంధ్ర మహాసభ కాన్ఫరెన్సుగూడ జాతీయవాదులను తటస్థవిధానం వదలి, బాధ్యతగల స్థానాలు స్వీకరించమని తీర్మానించింది. కమ్యూనిస్టులు ఆ ఐక్యతకోసం ఎల్లప్పుడూ కృషిచేస్తారుగూడా.

## కార్మికోద్యమం

హైదరాబాదు సంస్థానంలో కమ్యూనిస్టులు కార్మికరంగంలో ప్రవేసించే టప్పటికి, నైజాంస్టేటు రైల్వే యూనియన్ మాత్రముంది. మిగతా కార్మికులకు యూనియన్లులేవు. బ్రిటిషు ఇండియాలోఉన్న ట్రేడ్‌యూనియన్ ఆక్టు లేకపోవడంచేత, యూనియన్లు పెట్టుకోపడమే కష్టంగాఉంది. యూనియన్లు లేకపోవుటవలన, వర్క్‌మన్సు కంపెన్సేషను ఆక్టు, మెటర్నిటీ బెనిఫిటు ఆక్టు, పేమెంటు ఆఫ్ వేజెస్ఆక్టు మొదలైనవి ఉండిగూడ

కార్మికులు లాభం పొందలేకుండాఉన్నారు. ఇటువంటి కష్టపరిస్థితుల్లో కమ్యూనిస్టులు కార్మికోద్యమ నిర్మాణానికి పూనుకున్నారు. మొదట హైదరాబాదు పట్టణంలో చార్‌మీనారు సిగిరెట్టుఫ్యాక్టరీ, ఆల్విను మెటల్ ఫ్యాక్టరీలో పని ప్రారంభించారు. అక్కడ ఆకస్మిక సమ్మెలు వచ్చాయి. వాటిని నడిపారు. అవి చాలకాలం సాగి ఓడిపోయాయి. ఐనా కార్మికులలో సంఘ చైతన్యంగల్గింది.

1942 లో నైజాం స్టేటురైల్వేలో సమ్మెవచ్చినప్పుడు, నాయకు లందరూ అరెస్టు అయ్యారు నాయకులులేని ఆ కార్మికులను పెడత్రోవల పట్టించి, తమవిధ్వంసకచర్యలకు ఉపయోగించుకోడానికి ట్రాట్స్కీయిస్టులు ప్రయత్నించారు. కామ్రేడ్ మగ్దూం ఇతర కమ్యూనిస్టులు కార్మికులలో ఐక్యతను నెలకొల్పి, ట్రాట్స్కీయిస్టుల కుతంత్రాన్నుండి కార్మికసంఘాన్ని కాపాడి, సమ్మెను కొంతవరకూ జయప్రదంగా సమాప్తంచేశారు. ఆ తర వాతనుండీ ట్రాట్స్కీయిస్టులు, ముస్లిము మత తత్వవాదులయొక్క సంఘ విచ్ఛిన్న చర్యలను భగ్నంచేస్తూ, సంఘ ఐక్యతను కాపాడటానికి సంఘ నాయకులకు తోడ్పడుతున్నారు. కార్మికుల దైనందిన యిబ్బందులను పరి ష్కరించడానికి పాటుబడుతూ, ఈ పరిస్థితులలో కార్మికులు తమ బాధ్యత లను గుర్తించి పనిచేసేటట్లు చేస్తూ సంఘాన్ని బలపరచుతున్నారు.

1943లో 4,000 కార్మికులుగల వరంగల్లు ఆజంజాహి మిల్లు కార్మికు లలో పని ప్రారంభించారు. దేశరక్షణకు అధికోత్పత్తికి కార్మికులను సమీ కరించుతూ, కార్మికసంఘాన్ని నిర్మించారు. కాని యజమానులు కార్మికుల యొక్క న్యాయమైన కోర్కెలను కూడా గుర్తించకుండా, సంఘం పెట్టు కున్నందుకు ముఖ్యులను పనినుండి తొలగించివేశారు. అనేకసార్లు ఆకస్మి కంగా వచ్చిన సమ్మెలు ఆపుచేయబడినవి. కాని చివరకు 1944 ఫిబ్ర వరిలో బోనసు సమస్యమీద ఆకస్మికసమ్మె వచ్చింది ఆ సమ్మెలో హిందూ ముస్లిములు ఒక్కటిగా నిలిచారు. యజమానులు, హిందూ - ముస్లిముల మధ్య చీలికలు రెచ్చగొట్టి, సమ్మెను భగ్నంచేసే యత్నాలు సాగలేదు. చివరకు ప్రభుత్వ తీవ్రనిర్బంధవిధానంవల్ల, షుమారు 25 రోజులు సాగిన తర్వాత సమ్మె నిలిపివేయబడింది. సమ్మె విజయవంతం కాకపోయినా సంస్థానంలో పెద్ద ఫలితాలను గలుగజేసింది. ఈ సమ్మెలో వచ్చిన హిందూ - ముస్లిం ఐక్యత, ప్రజలను నివ్వెరపోయేలా చేసింది. ప్రభుత్వం ముస్లిముల ప్రభుత్వమని అపోహలో ఉన్న ముస్లిం కార్మికులయొక్క

కళ్ళను తెరిచింది. హిందూ - ముస్లిం ఐక్యత హైదరాబాదు సంస్థానంలో సాధ్యమవుతుందని రుజువుచేసింది.

వరంగల్లు జిల్లాలో కొత్తగూడెంలో బొగ్గు గనులలో షుమారు 10,000 మంది కార్మికులు పనిచేస్తూ ఉంటారు. వారికి జీతాలు చాల తక్కువ. వారికి ఇళ్ళవసతి మొదలైనవి చాల ఘోరంగా ఉన్నవి. పైగా కొట్టడం, తిట్టడం, జరిమానాలు మామూలు. వారికి చట్టసమ్మతమైన హక్కులను గూడ అమలుజరుపుటలేదు. ఏ కార్మిక శ్రేయోభిలాషి బహిరంగంగా అక్కడికి వెళ్ళడానికి అవకాశంలేదు. ఈ పరిస్థితులన్నీ సేకరించి కమ్యూనిస్టులు తాలూకా ఆంధ్రమహాసభద్వారా ప్రభుత్వానికి మెమొరాండం పంపారు. దానితో ప్రభుత్వం ఎన్క్వాయిరీకి రావడం, కార్మికుల జీతం 100 కి 50 పెరగడం జరిగింది. ఆ కార్మికులయొక్క దైనందిన కష్టాలను తీసుకొని పనిచేస్తున్నారు.

ఈవిధంగానే సూర్యాపేట, భోనగిరి, ఖమ్మంమెట్టు మొదలైచోట్ల, హమాలీలకు (ముఠాకూలీలు) చట్టసమ్మతమైన కూలి ఇచ్చేలాచేయబడింది.

ఇప్పటికి హైదరాబాదులో కార్మికోద్యమానికి స్థిరమైన పునాది ఏర్పడింది.

## మహిళావుద్యమం

1930 లో మెదక్ జిల్లా సిద్దీపేటలో జరిగిన ప్రథమ ఆంధ్రమహాసభనుండి గతసంవత్సరంవరకూ, ఆంధ్రమహాసభతోపాటు, ఆంధ్రమహిళా సభగూడ జరుపబడుతూవచ్చేది. కాని మహాసభ అయినతర్వాత దానిలో చేయబడిన తీర్మానాలను ప్రచారంచేయడం ప్రాథమిక సభ్యులను చేర్చడం ఉండేదిగాదు. ఇప్పుడిప్పుడే ఆంధ్ర మహిళా మహాసభలో ప్రాథమిక సభ్యులను చేర్చడం, ప్రాథమిక సంఘాలను పెట్టడం జరుగుతోంది. అక్కడక్కడయున్న కమ్యూనిస్టుయువతులు స్థానిక సంఘాలనుపెట్టిపుస్తకాలు, పత్రికల పఠన సాగించుతున్నారు. హైదరాబాదులోవున్న స్థానిక ఆంధ్ర మహిళా మహాసభ తరపున అప్పుడప్పుడూ సభలు, ఉపన్యాసాలు జరుగుతూవుంటాయి.

హైదరాబాదు పట్టణంలో మధ్యతరగతి యువతులలో పలుకుబడి గల నవజవాన్ మహిళామండలిలో, కమ్యూనిస్టు యువతులుచేరి దానిని అభివృద్ధిపరచారు. దానితరపున జపానుదాడి ప్రమాదం రోజుల్లో చాల

మంది స్త్రీలకు విమానదాడి రక్షణ తర్ఫీదుయిచ్చారు. దానితర్వాత ఆహార సమస్య తీవ్రమయి, పట్టణంలోని సామాన్యప్రజలు కష్టపడుతున్నప్పుడు, చౌకడిపోలకోసం ఆందోళనచేసి సాధించారు. అక్కడ బియ్యం అందరికీ అందేలాచేశారు. తరువాత రేషనింగు ప్రవేశపెట్టినప్పుడు, అందరికీ రేషనుకార్డులు యిప్పించడం, రేషనుషాపులదగ్గర అన్యాయం జరగకుండా చూడటం చేస్తున్నారు. ఈ కార్యక్రమంవల్ల నవజీవన్ మహిళామండలి ప్రజాసంస్థగా తయారయింది.

అఖిల భారత మహిళాసభ బ్రాంచి ఒకటి హైదరాబాదు పట్టణంలో ఉంది. దానిలో పెద్ద ఉద్యోగులభార్యలు రాణులు పెద్ద ధనికుల భార్యలు ఉంటారు. వారు క్లబ్బుజీవితంతో కాలంవెళ్ళబుచ్చుతూ ఉంటారు వారిని గూడ ఆహారసమస్య కదిల్చింది. వారుగూడ చౌకడిపోలు రేషనింగుకోసం కొంత పాటుబడ్డారు.

ఈ పరిస్థితులలో ప్రజల నెదుర్కొన్న సమస్యలను పరిష్కరించాలంటే, స్త్రీలను సమీకరించడానికి మహిళాఉద్యమం నిర్మింపబడాలి.

## విద్యార్థి ఉద్యమం

1938 లో వచ్చిన వందేమాతరం ఉద్యమంతో, హైదరాబాదులో విద్యార్థి ఉద్యమం ప్రారంభమయింది. ఈ వందేమాతరం ఉద్యమంలో ముస్లిం విద్యార్థులు చేరలేదు. ఈ ఉద్యమం అణగిపోయిన తర్వాత, 1940 వరకు విద్యార్థులలో సంచలనంలేదు. సంవత్సరానికొకసారి సమావేశమయి 'వందేమాతరం గీతం పాడటం' మీద నిషేధం తొలగించమని తీర్మానం మాత్రం చేస్తూఉండేవారు 1940 లో కమ్యూనిస్టులు విద్యార్థికోర్కెలమీద ఐక్య విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించ పూనుకొన్నారు. వందేమాతరం విద్యార్థి ఉద్యమంలో జాతీయోద్యమైనప్పటికీ, వందేమాతరం గీతం హిందూముస్లిం విద్యార్థి ఐక్యతకు ఎలా ఆటంకంగా ఉందో, హిందూముస్లిం విద్యార్థుల మధ్య ఐక్యత ఉంటేనేగాని ఎలా విద్యార్థి కోర్కెలను సాధించలేమో, హిందూ విద్యార్థులకు నచ్చజెప్పారు. అప్పటి నుండీ విద్యార్థికోర్కెలమీద ఐక్య విద్యార్థిసంఘం ఆరంభించబడింది. ఈసంఘం కాలేజీ విద్యార్థులకు సంవత్సరానికి రెండుసార్లు పబ్లికు పరీక్షలు పెట్టడం. స్కూలుఫైనలు విద్యార్థులకు తమ స్కూళ్ళలోనే పరీక్ష సెంటర్లు పెట్టటం, మొదలైన కోర్కెలమీద ఆందోళన ప్రారంభించింది.

ఈ ఐక్యవిద్యార్థి ఉద్యమ వ్యాప్తివలన, ఉస్మానియా యూనివర్సిటీ అధికారులు యూనివర్సిటీ విద్యార్థిఎన్నికలను రద్దుచేయడం, యూనివర్సిటీ విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనగూడదని నిషేధించే రూల్సు చేయడం జరిగింది. కామ్రేడ్స్ జవాద్, ఓంకార్ మొదలైన విద్యార్థివర్కర్లు యూనివర్సిటీనుండి తొలగించబడ్డారు. ఈ ఐక్యతా విద్యార్థి ఉద్యమం సంస్థానంలోని మిగతా కాలేజీలు స్కూళ్ళలోకి వ్యాపిస్తోంది.

## ఇత్తెహాదుల్ ముసిల్మీను-యుద్ధంయెడల దానిప్రస్తుతవైఖరి

భారతదేశంలో ముస్లిం జనసామాన్యంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత, స్వాతంత్ర్యకాంక్ష క్రమంగా వృద్ధి అవుతూ వచ్చింది. స్వాతంత్ర్య సమరంలో కాంగ్రెసు ముందడుగు వేసిన తర్వాత, వెనువెంటనే ముస్లింలీగు గూడ వస్తూ వచ్చింది. మొదటిరోజుల్లో కాంగ్రెసు - ముస్లింలీగులు రెండూ భారతీయులకు ఎక్కువగా ఉద్యోగాలియ్యాలనీ, ఉన్నతోద్యోగులు గూడ ప్రభుత్వానికి విజ్ఞప్తులుపంపుతుండేవి. 1906 లో కాంగ్రెసు కలకత్తా సమావేశంలో స్వయంపాలన (Dominion Status) ఇయ్యాలని తీర్మానించింది. ముస్లింలీగు ఈకోర్కెనే 1912లో లక్నో సమావేశంలో కోరింది. మింటో మార్లే సంస్కరణలను ప్రభుత్వం ప్రవేశపెట్టిన తర్వాత ముస్లింలీగు ప్రత్యేక నియోజకవర్గాలను కోరింది. కాంగ్రెసు దీనిని 1916 లో లక్నో ఒడంబడికలో అంగీకరించింది. 1922 సత్యాగ్రహోద్యంలో కాంగ్రెసు - ఖిలాఫతు కమిటీల నాయకత్వంక్రింద, హిందువులతోపాటు ముస్లిములుగూడ ఎంతో త్యాగంజేశారు. మలబారు జిల్లాలో ముస్లింలైన మోప్లాలు తిరుగుబాటుచేసి ఎన్నో ఇడుములుపడ్డారు. సత్యాగ్రహోద్యమం తర్వాత దేశమంతటా ముస్లిం కోట్లాటలు జరిగినవి. హిందూ-మహమ్మదీయుల మధ్య అపోహలు పెరిగిపోయినాయి అయినప్పటికీ ముస్లింలీగు సైమన్‌కమిషన్‌ను బహిష్కరించడంలో కాంగ్రెసుతో పూర్తి సహకారం జేసింది. కేంద్రప్రభుత్వానికి ప్రత్యేకింపబడిన దేశరక్షణ, రహదారిమార్గాలు, వాణిజ్యం వగైరా అధికారాలుపోను మిగతా అన్ని అధికారాలు రాష్ట్రప్రభుత్వాలకుండే ఫెడరేషనుపద్ధతిననుసరించి రాబోయే రాజ్యాంగవిధానం ఉండాలని ముస్లింలీగు కోరింది. దీనిని కాంగ్రెసు అంగీకరించక, రాష్ట్రాలమీద సర్వాధికారాలు కేంద్రప్రభుత్వానికుండే, కేంద్రీకరణ విధానం ఉండాలని చెప్పింది. దీనితో 1930-32సత్యాగ్రహోద్యమంలో ముస్లింప్రజాసామాన్యం అంతగా చేరలేదు. తటస్థంగా ఉన్నారు సరిహద్దురాష్ట్రంలో ముస్లిములు

ఈ ఉద్యమంలో పాల్గొని, తీవ్రనిర్బంధవిధానాన్ని అనుభవించారు. పెషావరు కాల్పులు హిందూ గూర్ఖాసిపాయీలు సోదర ముస్లిం ప్రజలమీద తుపాకీలు కాల్చ నిరాకరించడం, అందరికీ తెలిసిన విషయమే.

1929 లో జరిగిన లాహోరు కాంగ్రెసులో కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్నిచేసింది. ముస్లింలీగు 1937 లో లక్నో మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానంచేసింది. 1939 లో యుద్ధం ఆరంభమవడంతోనే అధికారం హస్తగతంచేసుకొనే సమస్య, కాంగ్రెసు ముస్లింలీగుల రెంటిముందు వచ్చింది. కాంగ్రెసు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరింది. 1940 లాహోరు సమావేశంలో ముస్లిములీగు పాకిస్తానను కోరింది. తరువాత కొంతకాలానికి కాంగ్రెసు క్రిప్సురాయబారాల సమయంలో, ఇష్టంలేని రాష్ట్రాలను బలవంతంగా భారత ఫెడరేషనులో కలిపి ఉంచమనిగూడ పాకిస్తానును పరోక్షంగా అంగీకరించింది. 1942 ఆగస్టు 8 న బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసుకమిటీ సమావేశంలో ఫెడరేషను విధానాన్ని అంగీకరించింది. భారతదేశంలో పశ్చిమోత్తర సరిహద్దున, తూర్పు సరిహద్దునవున్న ముస్లిముజాతులు తాము విడిపోయి వేరుగాఉండే హక్కును ముస్లిములీగు కోరినంతమాత్రాన, ముస్లిములు అభివృద్ధినిరోధకులనీ, ముస్లిములీగు నాయకులు బ్రిటిషు సామ్రాజ్యవాద యేజంట్లని కొందరుదేశభక్తులు అనుకోవడం సబబుగాదు. ముస్లిములలో స్వాతంత్ర్యకాంక్ష ఉందనీ, వారుగూడ దేశస్వాతంత్ర్య సమరంలో యెంతో త్యాగంచేశారని చరిత్ర రుజువుచేస్తుంది. కాంగ్రెసు, ముస్లిముల అనుమానాలను తీర్చకపోవడం, ముస్లిముజాతులు విడిపోయే న్యాయమైన హక్కును అంగీకరించకపోవడంవలన, వారు కాంగ్రెసుతో చేతులుకలపడం మానివేశారు. వారి న్యాయమైన కోర్కెను అంగీకరించితే, వారు స్వాతంత్ర్య సమరంలో హిందువులకు తీసిపోరు.

భారత ముస్లిములలోని ఈ స్వాతంత్ర్యకాంక్ష సామ్రాజ్యవాద వ్యతిరేకత హైదరాబాదు ముస్లిములలోగూడ వున్నది. దానితోపాటు భారత ముస్లిములలో హిందువులయెడల కాంగ్రెసుయెడల వున్న అనుమానాలుగూడ హైదరాబాదు ముస్లిములలో ఉన్నవి హైదరాబాదులోని ప్రత్యేక పరిస్థితులలో ఈ అనుమానాలు మత అహంకారమార్గంపట్టాయి. ప్రభువుగారు ముస్లిము మతస్థులు అవడం, ఆర్యసమాజంయొక్క మత

తత్వప్రచారంవల్ల, ఇత్తెహాదుల్ ముసిల్మీన్ నాయకత్వం "ముస్లిములు పాలకజాతి" అనే సిద్ధాంతాన్నిగూడ వారిలో ప్రవేశపెట్టగలిగింది.

ప్రపంచ ఘటనల ప్రభావం భారత ముస్లింలమీద పడుతోంది. సోవియటు యూనియన్, రెడ్ఆర్మీ ఈయుద్ధంలో చూపిన అపారత్యాగం వారిని ముగ్ధులను జేసింది. ఫ్రాన్సు యుగోస్లావియా మొదలైన నాజీ ఆక్రమిత దేశాలలో ప్రజాశక్తుల విజృంభణ, తమ తొత్తులను అధికారంలోకి తీసుకురావడానికి బ్రిటిషు, అమెరికన్ సామ్రాజ్యవాదులు పన్నిన కుట్రలు భగ్నమవడం వారు చూస్తున్నారు. ఫ్రెంచి సామ్రాజ్యంనుండి ముస్లిందేశాలైన సిరియా, లెబనానులు విముక్తిఅవడం, భారత ముస్లింలలో ఎంతో ప్రభావం గలుగజేసింది. వారిలో స్వాతంత్ర్యకాంక్ష సామ్రాజ్యవాద వ్యతిరేకతతోపాటు, సోవియట్ యూనియన్ యెడల అభిమానం గూడ హెచ్చుతూ బోతూఉంది. హైదరాబాదు సంస్థానంలోగూడ పైప్రపంచ సంఘటనలు ముస్లిం జనసామాన్యాన్ని కదిల్చాయి.

అన్నిటికన్న ఆహారసమస్య విషయంలో హైదరాబాదు సంస్థానంలో ముస్లిం జనసామాన్యం ఎక్కువగా కదిలింది. అందువల్ల ఇత్తెహాదల్ ముసిల్మీన్ నాయకత్వంగూడ ఆంధ్రమహాసభ కార్యకర్తలతో ఈ విషయంలో కలిసి పనిచేయడానికి అంగీకరించింది. ముస్లిం జనసామాన్యంలో. ఆహారపరిస్థితి క్లిష్టంగావడం ప్రపంచఘటనలలో ప్రజాశక్తులు ముందుకు రావడంవల్ల, "పాలకజాతి" "ముస్లింల చరిత్రకాధిక్యత" మొదలైన మతఅహంకార నినాదాల పునాది కదలిపోయింది. వారు తీవ్రంగా ఆలోచించ మొదలెట్టారు. వారిలో తమ అహంకార భావాలను రూపుమాపడానికి అభివృద్ధి శక్తులకు ఇది చక్కని అవకాశం. హిందూ ముస్లిం ఐక్యత మార్గానికి, ముస్లింలను ముందుకు తీసుకురావడానికి ఇది చక్కని అవకాశం. కాని ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకత్వంలో 100 కి 100 పాళ్ళు మతతత్వ వాదులు ముస్లిం జనసామాన్యంలో వచ్చిన ఈ కదలికను, బ్రిటిషుప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించుతూ "ఆజాద్ హైద్రాబాదు" (హైదరాబాదు భారతదేశంనుండి పూర్తిగా వేరుగా స్వతంత్రంగా ఉండాలి. బ్రిటిషుప్రభుత్వం సంస్థాన పరిపాలనలో ఎట్టి జోక్యం కల్పించుకోగూడదు) అనే నినాదం వైపుకు తీసుకువెళుతూ, అసలు సమస్యను మరుగుపరుస్తున్నారు.

ముస్లింలో కలిగిన అభివృద్ధి సంచలనం, 1944 మే నెలలో ఒరం గల్లులో జరిగిన ఇత్తెహాదుల్ ముసిల్మీన్ మహాసభలో స్పష్టంగా కన్పించు తుంది. ఈమహాసభయొక్క అధ్యక్షోపన్యాసం తీర్మానాలు పరిశీలించితే ఈ విషయం తేటతెల్లమవుతుంది.

ఈ మహాసభ చరిత్రాత్మకమైనది. ఇత్తెహాదుల్ ముసిల్మీన్ చరిత్రలో నూతన అభివృద్ధి అధ్యాయాన్ని తెరిచింది. ఈ అభివృద్ధి అధ్యాయాన్ని వ్రాయించే బాధ్యత ముస్లిం హిందూ అభివృద్ధికాముల మీద ఉంది.

అధ్యక్షోపన్యాసంలోని ముఖ్యవిషయాలు ఈక్రింద వ్రాయబడుతూ ఉన్నవి.

(1) సోవియటు యూనియనుయడల ముస్లిము జనసామాన్యం యొక్క అభిమానం అధ్యక్షోపన్యాసంలోని ఈ క్రింది భాగంవల్ల తేట తెల్లమవుతుంది.

సభాసదులారా!

దీర్ఘమైన నాలుగు సంవత్సరాలు గడిచినప్పటికి యుద్ధపరిస్థితి యందు మార్పేమియులేదు. ఉత్తర ఆఫ్రికాలో ఫాసిస్టుల నడుం బ్రద్ధలైంది. ఇటలీలో వీరిదొక అంగం విరిగిపోయింది. రష్యారంగమునందు ఇంకొక అంగము గాయబడుచున్నది. ఐనప్పటికి యుద్ధతీవ్రత తగ్గలేదు. బెర్లిన్, టోక్యోలలో యుద్ధనిర్వహణ కార్యక్రమం బలంగానే జరుగుచున్నది. ఇది జరుగుచున్నంతవరకు ప్రపంచమునకీ రక్తప్రవాహము నుండి విముక్తి లేనట్లగపడుచున్నది. గత సంవత్సరము నా అధ్యక్షోపన్యాసమునందు ఒక సైనికునిరీతి, సోవియటు యూనియన్‌కు నా అభివందనాలు దెల్పియుంటిని. నేడు సంపూర్ణ సంతోషముతో దీని రెండోకిస్తు అర్పిస్తున్నాను. ఈ జాతి గనబరచిన దేశభక్తి, త్యాగము మరొక పర్యాయము మానవత్వము తలఎత్తునటులజేసి, మానవ స్వాతంత్ర్యాన్ని కాపాడింది. వీరి దేశరక్షణ ప్రయత్నం జయప్రదమగుటకు భగవంతుని ప్రార్థిస్తున్నాను. వీరి విజయోత్సాహం హద్దులు మీరిపోగూడదనియు, వీరిలో ఇతరదేశాలను పరిపాలించు వాంఛ కలుగగూడదని గూడా భగవంతుని ప్రార్థించుచున్నాను.

ఇంగ్లాండు, అమెరికాదేశాల సంయుక్త ప్రయత్నం, ఆఫ్రికా యూరపు ఖండాలలో పశుబలాన్ని ఓడించుటచే, శాంతిప్రియ ప్రపంచము సంతృప్తిపడింది. తూర్పు యుద్ధరంగాలలో గూడా వీరికిట్టి విజయాలే

చేకూరాలని ప్రతి స్వాతంత్ర్యప్రియుడూ కోర్తాడు. ఈ రెండుదేశాల నాయకులును అట్లాంటిక్ ప్రణాళికపై దృఢముగా భగవంతుడు ఉండునట్లు చేయాలని హృదయపూర్వకమైన నా వాంఛను తిరిగి ప్రకటించుచున్నాను.

(2) యుద్ధంయెడల ముస్లిము జనసామాన్యం చూపుతున్న యీ అనుకూలత, మత అహంకార లక్ష్యసిద్ధికి ఉపయోగించుకోబడుతోంది. ఈ యుద్ధంలో హైదరాబాదు సంస్థానం చేసిన సహాయానికి ప్రతిఫలంగా "హైదరాబాదుగూడ చారిత్రిక ఒడంబడికల ప్రకారం ముందు సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవించునని ఒక స్పష్టమైన ప్రకటన" చేయాలట!

"యుద్ధకాలంలో హైదరాబాదు ఆంతరంగిక విషయాలలో సలహాపేరిటగాని, మరి యే రూపంలోగాని" బ్రిటిషు ప్రభుత్వం జోక్యం కలిగించుకోకూడదు.

"వీలైనంత త్వరగా పూర్వపు ఒడంబడికలప్రకారం హైదరాబాదు స్వతంత్రంగా ఉండునని (బ్రిటిషుప్రభుత్వం) ప్రకటించాలి. మరియూ యుద్ధానంతరం భారతీయ ప్రభుత్వంతో యెటువంటి ఒడంబడికలు చేసుకోవడానికైనా సంపూర్ణ స్వతంత్రముండునని ప్రకటించాలి. హైదరాబాదు సంస్థానం బ్రిటిషుప్రభుత్వంతో చేసుకున్న ఒడంబడికలను, యుద్ధం సమాప్తమయినతర్వాత వీలైనంత త్వరగా పునరాలోచించాలి. హైదరాబాదుకు బ్రిటిషు ప్రభుత్వంతో ఉన్న స్నేహ సంబంధాలను బలపరచుతూ ప్రపంచంలోని ఇతర స్వతంత్ర దేశాలలో సంబంధాలు యేర్పరచుకొనే హక్కు ఉండాలి."

"పూర్వం ఏ యే ఇలాకాలను జిల్లాలను సైనిక లేక ఇతర ఖర్చుల నిమిత్తం హైదరాబాదునుండి తీసుకోబడినవో, భారతదేశానికి అధినివేశ స్వాతంత్ర్యం (Dominion states) దొరికినవెంటనే, హైదరాబాదు సంస్థానానికి తిరిగి యివ్వబడునని విస్పష్ట ప్రకటనగావించాలి. హైదరాబాదు సంస్థానం పూర్వంవలె సముద్ర ప్రాంతంవరకూ వ్యాపించి, సంస్థానం సౌఖ్యసంపదలతో తులతూగేటట్లు చేయడమే పై ప్రాంతాలను తిరిగి యియ్యమని కోరడంలోని ఉద్దేశ్యం" అంటే, బ్రిటిషు ఆంధ్రజిల్లాలు వీరారు తిరిగి నైజాం సంస్థానంలో కలపాలన్నమాట! ఈ కోర్కె అసాధ్యము, అసంభవం. మత అహంకారభావాలు జీర్ణించుకుపోయిన ముస్లిం మతావేశపరులు కొందరు దీనికి ఉబలాటపడతారేమోగాని, చమట ఒడిచి జీవించి ప్రస్తుత విధానంక్రింద బాధపడుతున్న ముస్లిము రైతులు కార్మి

కులు యితర కష్టజీవులు అభివృద్ధి కాముకులు పై కోర్కెను బలపరచరు. ఈ కోర్కెలనుకోరే ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకులు వీటిని యెంత త్వరగా వదలుకొంటే, హైదరాబాదు సంస్థాన ప్రజలు, హిందువులు, ముస్లిములు అందరికీ అంత శ్రేయస్కరం.

పై కోర్కెలు "హైదరాబాదు సంస్థానం తమ పురాతన వైభవం యొక్క చిహ్నం (మహమ్మదీయ రాజ్యం పరిపాలన) అని భావించే 10 కోట్ల బ్రిటిషు ఇండియా ముస్లిములనుగూడ సంతృప్తిపరుస్తాయట!" ఇది అతిశయోక్తి అని వేరేచెప్పాలిసిన అవుసరంలేదు. బ్రిటిషు ఇండియా ముస్లిములు బ్రిటిషు సామ్రాజ్యంనుండి భారతదేశం యెప్పుడు బయట పడుతుందా అని యెదురుచూస్తున్నారు. అటువంటి పరిస్థితులలో ఇతర ప్రాంతాలను కలుపుకోవాలనే యీ సామ్రాజ్యవాద తత్వకోర్కెను ఎన్న టికీ బలపరచరు.

(3) హైదరాబాదు సంస్థానం బ్రిటిషు ఆధిపత్యంక్రిందనుండి తొలగి ప్రత్యేక రాజ్యంగా ఉండాలని ముస్లిం మతతత్వవాదులు కోరు తున్నారంటే, దానిలో ప్రజలకు ప్రజాస్వామ్య హక్కులు యివ్వబడాలని లేదు ఇక్కడ ముస్లిముల "చారిత్రికాధిక్యత" నిరంకుశవిధానం అలాగే ఉండాలట!

ప్రభుత్వం 1939 లో ప్రకటించిన రాజ్యాంగ సంస్కరణలను క్రమక్రమంగా అమలులోకి తీసుకువస్తూవుంది. వీటిని అమలుజరపడంలో సైతం, రాజ్యాంగసంస్కరణల స్కీములో ఉన్న యెన్నికల విధానం సైతం అవలంబించక, నామినేషను పద్ధతి అనుసరించుతోంది. ఈ నిరం కుశ పద్ధతులయెడల ముస్లిము జనసామాన్యంలో చాల అసంతృప్తి ప్రబ లింది. జిల్లా కాన్ఫరెన్సులలో తాలూకాదార్లు తమకు అడుగులకు మడుగు లొత్తేవారిని పిలిచారనీ, నిజమైన ప్రజాప్రతినిధులను పిలువలేదని, కీ. శే. బహద్దుర్ ఖాన్ గారు విమర్శించాలిసివచ్చింది. రాబోయే జిల్లాబోర్డులు మునిసిపలు కమిటీలు గ్రామపంచాయితీల నిర్మాణంలో, యెన్నికపద్ధతికి మారుగా చిత్తంవచ్చినవారిని నియమించడానికి ఇత్తెహాదుల్ ముసిల్మీను అంగీకరించదనిగూడ ఆయన చెప్పాడు. అంతేగాక హైదరాబాదు మున్సి పలు కార్పొరేషను ప్రభుత్వంరద్దుచేయడాన్ని ఆయనవిమర్శిస్తూ, రాజ్యాంగ సంస్కరణలస్కీము ప్రకారం యెన్నికల పద్ధతిమీద దానిని పునర్నిర్మించ మని కోరాడు.

మున్సిపలు కమిటీలు జిల్లాబోర్డులవిషయంలో వరంగల్లు ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభలో చేసిన తీర్మానం చాల ముఖ్యమైనది. మత అహంకార ప్రచారంలో ముస్లిము జనసామాన్యంలోని ప్రజాస్వామ్య భావాలు అంతర్ధానమవలేదనీ, ప్రస్తుత నిరంకుశ విధానంతో వారుగూడ విసుగుచెందారనీ, స్పష్టమవుతుంది.

## రాజ్యాంగ సంస్కరణలు

"రాజ్యాంగ సంస్కరణల ననుసరించి యేర్పాటు చేయబడుచున్న పట్టణ, జిల్లా, గ్రామ కమిటీలను కొన్ని ప్రత్యేక కారణాలవల్ల ప్రభుత్వము, నియామకముద్వారా, యేర్పాటు చేయుటకు పూనుకున్నది. ఈ నియామక విధానము, "స్థానిక పరిపాలనలో ప్రజల బలమైన సహకారం బడయవలయు"నన్న ప్రభుత్వాశయము నెన్నటికిని, నెరవేర్పజాలదు. ప్రతిబంధకములనుండి బయటపడి, ఎన్నికలద్వారా యీ కమిటీలనేర్పాటు చేయుట ఉత్తమ విధానము. ఒకవేళ ప్రతిబంధకములు వాస్తవముగా గడువజాలనివే యైనయెడల యెన్నుకోబడవలసిన ముస్లిముల స్థానాలకు సంబంధించినంతవరకు. మజ్లిస్‌వారు పేర్కొన్నవారినిమాత్రమే తీసికొనవలయునని యీ సభవారు కోరుచున్నారు.

ఒకవేళ యెన్నికలు జరపడానికి దాటరాని ప్రతిబంధకాలు ఉంటే, ముస్లిం స్థానాలకైనా ఇత్తెహాదుల్ ముసిల్మీను పేర్కొన్నవారినిమాత్రమే తీసుకోవాలనే యీ భాగాన్ని, తీసివేయమని అభివృద్ధికోరేవారు సవరణ తెచ్చారు. ఎన్నికల సౌకర్యం ముస్లిములకేగాక హిందువులకుగూడ ఉండాలని వీరి ఉద్దేశం. ఈ సవరణ దీర్ఘచర్చ తర్వాత వీగిపోయింది. ఇత్తెహాదుల్ ముసిల్మీనులో యువకులలోను ఛోటానాయకులతోగూడిన ప్రజాస్వామ్య భావాలుగల పక్షంవుందని ఈ ఘటన రుజువుచేస్తుంది.

(4) ప్రస్తుత బాబేహుకూమత్ సంస్థానాన్ని నేడెదుర్కొన్న ఆహార సమస్య మొదలైన క్లిష్టసమస్యలతో చూపుతున్న అశక్తతవల్ల హిందువులకేగాక ముస్లిములలోగూడ అసంతృప్తి ఉంది. బాబేహుకూమత్‌లో మార్పురావాలనీ, ఇది మహమ్మదీయుల అభిప్రాయమేగాక సంస్థాన ప్రజలందరి అభిప్రాయమనీ, వరంగల్లు మహాసభ తీర్మానించింది.

"హైదరాబాదు ముస్లిములందరి తరపున విన్నవించునదేమనగా, ఐదుసంవత్సరముల మంత్రిత్వకాలం గడచిన మంత్రులను తొలగించాలి.

వారి స్థానంలో దేశసేవాభిలాషులై, ఆసఫియా పీఠం యడల అచంచలభక్తి విశ్వాసములు గలిగి, మంత్రిత్వ బాధ్యతలను నెరవేర్చు సామర్థ్యం గలిగిన, దేశీయుల నమ్మకం చూరగొన్న, ఇతరవ్యక్తుల కవకాశం ఇవ్వవలయునని కోరుచున్నాము. కోర్కె ఒక్క ముస్లిములదేకాదనియూ, దేశీయుల మనో భావములను వ్యక్తపరుస్తున్నదనియూ ప్రకటించుచున్నాము."

(5) ప్రస్తుతం సంస్థానంలో పౌరసత్వహక్కులు లేకపోవడం ముస్లిము జనసామాన్యానికిగూడ కష్టంగానే ఉంది. ఇత్తెహాదుల్ ముసిల్మీనుయొక్క వరంగల్లు జిల్లా సభలో రాష్ట్రేతరుడైన సుబహాన్ గారిని ప్రభుత్వం మాట్లాడనియ్యకపోవడం, హిందూ - ముస్లిము కొట్లాటలు జరుగుతాయనే కారణంతో, లాతూరులో ఇత్తెహాదుల్ ముసిల్మీను వారి వార్షిక సమావేశానికి అనుమతి ఇయ్యకపోవడంజరిగింది. తమకు పౌర సత్వ హక్కులు కావాలని చెప్పక, కీ. శే. బహద్దుర్‌ఖాన్‌గారు ప్రభుత్వం హిందువుల యెడల పక్షపాతం చూపుతోందని తమ అధ్యక్షోపన్యాసంలో వాపోయారు.

(6) ఉస్మానియా విశ్వవిద్యాలయ నిర్వహణలో మార్పులను సూచించడానికి ప్రభుత్వం రెండు కమిషన్‌లను వేసింది. ఇంతవరకూ రెంటి రిపోర్టులను ప్రకటించలేదు. కాని ఆ రిపోర్టులలోని విద్యార్థులలోని విద్యార్థుల శిక్షణకు సంబంధించిన సూచనలు మాత్రం అమలుజరుపబడినవి. విద్యార్థిసంఘం నిర్మించి, విద్యార్థుల కోర్కెలకోసం పాటుబడుతున్న జవాద్ ఓంకార్ గార్లు యూనివర్సిటీనుండి తొలగింపబడ్డారు. విద్యార్థుల భావాలు ప్రబలకుండా చేయడానికి, విద్యార్థులు రాజకీయాల్లో పాల్గొనగూడదని విశ్వవిద్యాలయాధికార్లు శాసించారు. విద్యార్థులను శిక్షించినందుకు కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు విమర్శించారు వరంగల్లులో జరిగిన ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభగూడ నిరశించుతూ, విశ్వవిద్యాలయాన్ని గూర్చిన కమిటీ రిపోర్టును ప్రకటించమని కోరింది.

## ఉస్మానియా విశ్వ విద్యాలయము

ఇత్తెహాదుల్ ముసిల్మీన్‌వారి ఈ మహాసభ ఉస్మానియా విశ్వవిద్యాలయము, దేశభవిష్యత్తును నిర్మించునదిగా గుర్తిస్తుంది. విశ్వవిద్యాలయపు ప్రస్తుత విద్యా, నిగరానీ, పరిస్థితులు, ప్రజలదృష్టిలో ఏమాత్రము సంతృప్తికరంగా లేవని, యీ మహాసభ ఉల్లేంఘించుచున్నది. ఈ అసంతృప్తి

యెన్నియో సంవత్సరములనుండి ప్రబలుచున్నను, ప్రభుత్వం యీ విషయంలో యేమీ శ్రద్ధగైకొనకుండుట మిక్కిలి శోచనీయము.

కొన్ని సంవత్సరముల క్రితము సర్ వెంకటసుబ్బారావుగారి అధ్యక్షతను ఒక కమీషన్ యేర్పాటుచేయబడెను. ఇది ఒకపక్షంగా మాట్లాడునదిగానుండి ప్రస్తుత కమీషనులవలె విఫలమైనది. దీని రిపోర్టు యింతవరకు ప్రజలకు తెలియపరచబడలేదు. మొన్న మొన్న యేర్పాటుచేయబడిన కమీషనుగూడ నిష్ఫలమైనదని యీ మహాసభ యెంచుచున్నది. ఎందుకనగా ఈ కమిషన్ యిచ్చిన రిపోర్టులోని ప్రకటింపబడిన భాగము కొంతమంది విద్యార్థులను శిక్షించు విషయముమాత్రమే ప్రజలకు తెలిపినదికాని అంతకన్న యెక్కువ యేమీ తెలియలేదు. విద్యార్థులను శిక్షించుట యీ మహాసభ నిరసించుచున్నది. ప్రొవైస్ఛాన్సలర్ వల్ల అభయహస్తమివ్వబడిన విద్యార్థులను శిక్షించుట పాపకార్యము. శిక్షించి భయపెట్టుటద్వారా విద్యార్థులతో మంచి సంబంధములేర్పాటు చేసుకొనవచ్చునను కమీషన్వారి అభిప్రాయముతో యీ మహాసభ యేకీభవింపజాలదు. విశ్వవిద్యాలయాభివృద్ధిని, దేశాభివృద్ధిని దృష్టియందుంచుకొని యీ మహాసభ కమీషన్ పూర్తి రిపోర్టు వెంటనే ప్రకటింపబడవలయునని కోరుచున్నది.

ఇంగ్లీషులో విద్య గరపబడే నైజాం కాలేజీని స్కూళ్ళను ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అఫిలియేటుచేసి, వానిలోగూడ ఉర్దూద్వారా విద్యగరపే ఏర్పాట్లను చేయాలని, ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభ తీర్మానించింది. ఇది అన్యాయం. ఇంగ్లీషులో విద్యనేర్చుకొనే అభిలాషగల వారికి ఆ అవకాశం ఉండాలి.

హైదరాబాదు సంస్థానంలో ప్రాథమిక పాఠశాలలోతప్ప మిగతా ఉన్నత విద్యాలయాలలో యెక్కడా తెలుగు, మహారాష్ట్ర, కన్నడభాషల్లో విద్య గరపబడదు. మిడిల్స్కూళ్ళు, హైస్కూళ్లు, కాలేజీలలో ఉర్దూలో విద్యగరపబడుతుంది. ప్రజల మాతృభాషలైన తెలుగు మహారాష్ట్ర కన్నడ భాషలు నిరుత్సాహపరచబడుతూవున్నవి. 100 కి 11 మందికి మాతృభాషయైన ఉర్దూ, మిగతా అందరిపేద రుద్దబడుతోంది. హైస్కూలువరకైనా మాతృభాషలలో విద్యగరపే అవకాశం కల్గింపబడాలని చాలకాలంనుండి ఆందోళన జరుగుతూవుంది. దానిఫలితంగా మిడిల్స్కూలువరకు మాతృభాషలలో విద్యగరపే అవకాశం గల్పించడానికి, ప్రభుత్వం ఆలోచిస్తూవున్నట్లు వార్తలు వస్తూవున్నవి. దీనికి వ్యతిరేకంగా కీ. శే. బహద్దూర్

ఖాన్‌గారు తమ అధ్యక్షోపన్యాసంలో మాట్లాడారు. ఉర్దు హిందూ-ముస్లింల ఇద్దరి సమిష్టిభాష అనీ, మాధ్యమిక పాఠశాలలో సైతం మాతృభాషలలో విద్యగరపడం తాము సహించమనీ, దీనికి వ్యతిరేకంగా తీవ్రాందోళన చేసెదమనీ పలికారు. ఇది శుద్ధ మతతత్వంగాక మరొకటిగాదు. ఉర్దూ భారతీయులందరి సమిష్టి భాషగాదు. అరబికు పర్షియన్ మాటలు సంస్కృత మాటలు కలిసివుండే అటువంటి ఉర్దూ హిందీ మిశితమైన ఉత్తర హిందూస్థానంలో అందరూ అర్థంచేసుకోగలిగిన, హిందూస్తానీ భావిభారతదేశానికి సమిష్టిభాషగా ఉంటుంది. హిందూస్తానీ సమిష్టిభాషగా వున్నా, అది వివిధరాష్ట్రాలకు మధ్య సంబంధా లుంచుకోవడానికి ఇంగ్లీషుకు బదులుగా ఉపయోగింపబడుతుంది.

అంతేగాని ఆయారాష్ట్రాలలో మాతృభాషలను అణచివేసి, విద్యగరపే భాషగాను, కోర్టులలోను ఉపయోగింపబడదు; ఉపయోగింపబడగూడదు కూడా. ఇప్పుడు బ్రిటిషు ప్రభుత్వంసైతం, ఆ యా రాష్ట్రాలలో ఆ యా ప్రజల మాతృభాషలలో హైస్కూలువరకూ విద్యగరపడానికి, క్రింది కోర్టులలో, ప్రభుత్వ ఆఫీసులలో మాతృభాషలలో కార్యనిర్వహణ జరగడానికి అంగీకరించవలసివచ్చింది. బ్రిటిషు ఇండియాలో కొన్ని యూనివర్సిటీలు (అన్నామలై, బనారసు విశ్వవిద్యాలయాలు). కాలేజీలలోగూడ మాతృభాషలలో విద్యగరపడానికి యేర్పాట్లు చేస్తూవున్నవి. ఉర్దూ మాతృభాషగానివారికి విద్య ఉర్దూలోచెప్పినా, ఇంగ్లీషులోచెప్పినా ఒకటే. మాతృభాషలో విద్యగరిపితే, విద్యార్థులకు యెంతో వృథా శ్రమ తగ్గుతుంది. తేలికగా విద్య నేర్చుకోవడం జరుగుతుంది. కనుక వెంటనే కనీసం మిడిల్‌స్కూళ్ళలోనైనా మాతృభాషలలో విద్యగరిపే అవకాశాలు ప్రభుత్వం కల్పించడం అవసరం.

(7) సంస్థానంలో ఆదాయపుపన్ను (Income Tax) ఇంతవరకూ విధించబడలేదు. ప్రభుత్వం ఆదాయాన్ని హెచ్చించుకోడానికి, అప్పుడప్పుడు భూమిశిస్తు హెచ్చించబడుతోంది. దీనివల్ల రైతులమీద పన్నుభారం క్రమంగా యెక్కువ అవుతోంది. ఈ యుద్ధకాలంలోమాత్రం అధిక లాభాలపన్ను (Excess profits Tax) విధించబడింది. ఈపన్నును యుద్ధం అయినతర్వాత ఆదాయపు పన్నుగామార్చి, దీనిని ఇంగ్లండులోని బీవరిడ్జి స్కీములోవలె కష్టజీవుల ఆర్థిక కష్టనివారణకు వినియోగించ

మని కీ. శే. బహద్దురు ఖాన్‌గారు కోరారు. ఇది అందరూ హర్షించదగిన విషయము.

అంతేగాక యుద్ధాంతంవరకూ అగనవుసరం లేకుండానే, వర్తకులకు న్యాయమైన లాభాలు మిగుల్చుతూనే, బ్రిటిషు ఇండియాలోవలె అధిక లాభాల పన్నుతోపాటు ఆదాయపుపన్నుగూడ విధించవచ్చును. ఈ ఆదాయంతో రైతులమీదనున్న శిస్తుభారం కొంత తగ్గించడం, కార్మికులకు సౌకర్యాలు కల్గించడం చేయవచ్చును.

(8) తుంగభద్ర ప్రాజెక్టును నిర్మించి తరచుగావచ్చే క్షామాన్నుండి రాయచూరు జిల్లాను కాపాడమనీ, హైడ్రో ఎలెక్ట్రిక్కు స్టేషన్లు వీలైన చోట గట్టి పారిశ్రామికాభివృద్ధిని గావించమనీ కే. శే. బహద్దుర్ ఖాన్ గారు కోరారు. వీరి ఈ కోర్కెను అందరూ బలపరుచుతారు.

(9) ప్రభుత్వోద్యోగులలోఉన్న లంచగొండితనం మొదలైన అవినీతిని అరికట్టడానికి. అవినీతి వ్యతిరేక డిపార్టుమెంటును (Anti curruption department) ప్రభుత్వం ఏర్పరచింది. ప్రభుత్వంయొక్క ఈ చర్యను సమర్థించుతూ కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు ఈ డిపార్టుమెంటుకు సరియైన అధికారులు లేకపోవడంవల్ల ఏమీ పనిచేయలేకపోయిందనీ చెప్పారు. ఈ డిపార్టుమెంటుకు, ఇతర డిపార్టుమెంటుల అధికార్లు తన ముందుంచిన ఉద్యోగుల కేసులను విచారించే అధికారం మాత్రమే ఉందనీ ఇటువంటి కేసులలో సైతం బంధుత్వం రికమెండేషన్లు అడ్డుపడుతూ ఉండటంవల్ల నిందితులు తప్పించుకుంటున్నారనీ, చెప్పారు. ఒక్క వ్యవసాయ డిపార్టుమెంటు విషయంలో మాత్రం కొంతచర్య తీసుకోబడినదనీ, సర్వసామాన్యంగా డిపార్టుమెంటు అధికార్లు తమడిపార్టు మెంటులో అవినీతి బయటబడితే, తమకు నామోషిగా భావించుతున్నారనీ, అందువల్ల తమక్రింది ఉద్యోగుల అవినీతిని కప్పిపుచ్చుతున్నారనీ, చెప్పారు. అవినీతి వ్యతిరేక డిపార్టుమెంటు ఇతర డిపార్టుమెంటు అధికార్ల అనుమతి లేకుండానే ఏ ఉద్యోగిని గూర్చి అయినా విచారణజరిపే హక్కు ఉండాలనీ, అవినీతితో ప్రవర్తించుతున్నారని రుజువైన ఉద్యోగులను బహిరంగంగా శిక్షించాలనీ, అలా జేస్తేనేగాని ఉద్యోగుల అవినీతిని అరికట్టడం సాధ్యం కాదనీ చెప్పారు. కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారి ఉపన్యాసంలోని ఈ భాగం చదివితే, ఉద్యోగుల అవినీతి ప్రవర్తనతో ముస్లిము జనసామాన్యం ఎంత విసుగుజెంది ఉన్నారో తెలుస్తుంది.

(10) కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు ఆహారసమస్యకు కారణాలు, దాని నివారణకు కొన్ని చక్కని సూచనలిచ్చారు.

"ప్రస్తుతం దేశంలోని ఆహారపరిస్థితికి కారణం దేవుడుగాదు; మానవులే తమచేతులతో ఇట్టి కష్టములను తెచ్చిపెట్టుకొన్నారు. ఆహార సమస్యతో ఒక్క హైదరాబాదు సంస్థానమేగాక ప్రపంచమంతా బాధపడు తుంది" అని చెప్పారు. యుద్ధంవలన బాగాపండే ప్రాంతాలనుండి తక్కువగా పంచే ప్రాంతాలకు రవాణాసౌకర్యములు పోవుటవలన, ఒకచోటికి మరొకచోటికి ధరలలో భేదముండుటచే దురాశాపరులైన వర్తకులు అధిక లాభాలకు ధాన్యాన్ని దాచిపెట్టుటవలన, ఈ ఆహార పరిస్థితి సంభవించిందని చెప్పారు. హైదరాబాదు సంస్థానం ఆహార పంటల విషయంలో కొరత ప్రాంతమనీ, జొన్నలు కావలసినదానికన్న కొంచెం యెక్కువ పండుతాయనీ, 10 వేల టన్నుల బియ్యం, గోధుములు బర్మా పంజాబుల నుండి దిగుమతిచేయడం రివాజుగా ఉండేదనీ, ఈ పరిస్థితిని గమనించకుండా ప్రభుత్వం జొన్నలు యెగుమతి చేయుటచే గత సంవత్సరం క్లిష్ట పరిస్థితి సంభవించినదనీ చెప్పారు. ప్రభుత్వ అసమర్ధతవల్ల కొంత ధాన్యం దొంగచాటుగా వర్తకులు అధిక లాభాలకు సంస్థానంబయటకు చేరవేశారని గూడ చెప్పారు.

ఇత్తెహాదుల్ ముసిల్మీను గత సంవత్సరం ప్రభుత్వానికి ఆహార సమస్యనుగూర్చి యీ క్రింది ముఖ్యమైన సూచనలను చేసింది.

(1) ప్రభుత్వానికి సలహా యియ్యడానికి కొనుగోలుదారులైన ప్రజల ప్రతినిధులతోగూడిన ఒక ఆహారకమిటీని, ఏర్పరచాలి.

(2) కో-ఆపరేటివు సొసయిటీలను విరివిగా యేర్పరచి, ధాన్యాన్ని వాటిద్వారా కొని నిలవజేసి, దొంగమార్కెట్టు విధానాన్ని అరికట్టాలి.

(3) కంట్రోలు దుకాణాలు యేర్పరచి, యీ దుకాణాల వర్తకులు న్యాయమైన లాభం మిగిలేటట్లు ధరలు నిర్ణయించి, వర్తకులచేత ధాన్యం అమ్మించాలి.

(4) జిల్లా ఆహారకమిటీలు యేర్పరచి దానిలో ప్రజాశ్రేయస్సుకు కృషిజేసేవారిని తప్పక తీసుకోవాలి. ఆ కమిటీల నిర్ణయాలను జిల్లా ప్రభుత్వాధికార్లు తప్పక అమలుజరిపేలా చేయాలి.

(5) పశువులకు గడ్డి, నూనె, గింజలు దొరికేలా ప్రభుత్వం చర్య తీసుకోవాలి.

(6) వచ్చేపంట ఎంతపండుతుందో సక్రమమైన అంచనా వేసే వరకూ, జొన్నల ఎగుమతిని ఆపాలి.

## ధా న్య సే క ణ

ధాన్యసేకరణ విధానంలోని లోపాలను గూర్చి కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు ఈవిధంగా చెప్పారు.

ప్రస్తుత ఆహారపరిస్థితి చాల క్లిష్టంగా ఉంది. ప్రభుత్వం ఎగుమతులు నిలిపివేసినంతమాత్రం చేతనే అది పరిష్కారంగాదు. ప్రభుత్వం చాల ఎక్కువధాన్యాన్ని కొని నిలవజేసి, మార్కెట్టులోకి చౌకడిపోలద్వారా నిర్ణీతధరలకు అమ్మించాలి. లేకపోతే ప్రస్తుతం ప్రభుత్వం నిర్ణయించిన ధరలకంట్రోలు దొంగమార్కెట్టువల్ల భగ్నమవుతుంది. ఇప్పుడు ప్రభుత్వం రైతులవద్ద నుండి ధాన్యం సేకరించేవిధానంలో చాల లోపాలు ఉన్నవి.

(1) ఎంతభూమి సాగు అయిందో తేల్చడానికి, పై ఉద్యోగులు జాగ్రత్త వహించకుండా, పటేలు పట్వారీలకు వదలిపెట్టడంవల్ల, వారు లంచాలుగొట్టి తప్పుడు సాగులెఖ్ఖలు వ్రాయడానికి అవకాశం గల్గింది.

(2) లెవీధాన్యం వసూలుకు, సంస్థానం రెండు భాగములుగా విభజింపబడింది. మరాఠ్‌వాడా, తెలింగానా ఇది సరియైనదిగాదు. ఒకే గ్రామంలో అనేకరకాలైన భూమి ఉండటం సహజం. కాన బొంబాయి రాజధానిలోవలె, ఎకరాలనుబట్టిగాక, భూమిశిస్తునుబట్టి లెవీధాన్యం వసూలు చేయబడాలి. రు. 10 గాని, అంతకన్న తక్కువగాని శిస్తు చెల్లించేరైతుల నుండి లెవీధాన్యం వసూలుచేయకూడదు. రైతుకు తాను ఎంత లెవీఇవ్వాలనేది పంటలకు ముందుగానే తెలియపరచాలి.

ఈ సూచనను ప్రభుత్వంచే నియమింపబడిన ఆహారసలహాసంఘం ఆమోదించింది. ప్రభుత్వం గూడ దీనిని గూర్చి ఆలోచించుతోంది.

## రే ష నిం గు

ఈ సంవత్సరం రాళ్ళవాన, అకాలవర్షంవల్ల రబ్బీ (వేసవికాలం మెట్టపంట), ఆబీ (వర్షాకాలపు మాగానిపంట) పంటలు దెబ్బతిన్నాయి. అందుచేత హైదరాబాదు, వరంగల్లు పట్టణాలలోనేగాక, అన్ని పట్టణాలలోనూ పెద్ద గ్రామాలలోనూ రేషనింగు పెట్టాలి.

ముందుపనికి సూచనలు

ప్రభుత్వోద్యోగులు అసమర్థతతోను తమమీద బాధ్యతను గుర్తించకుండాను ఉండుటచేత, తమకు ఆహారపరిస్థితిని జూస్తే భయంవేస్తోందనీ కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు అన్నారు." కాని ప్రజాశ్రేయస్సుకు పాటుబడే వారందరూ, ఆహారసమస్యలో ప్రభుత్వంతో సహకారంజేస్తే, సంస్థానం ప్రస్తుత మెదుర్కొన్న ఆహారప్రమాదంనుండి బయటపడుతుందని నాకు గట్టినమ్మకముంది. "అని గూడ అన్నారు. ఇంతేగాక" ఆహారసమస్యను ఇత్తెహాదల్ ముసిల్మీను ఒక్కమతంవారికి జెందిన communal problem సమస్యగా భావించదు. కులమత విచక్షణ లేక అందరికినీ ఆహారము దొరకు ప్రయత్నం చేయుటకును, దీనినొక జీవకారుణ్య సమస్యగా భావించుటకునూ, ఇత్తెహాదుల్ ముసిల్మీను తన కార్యకర్తలకు కార్యక్రమం యిచ్చింది. ఈ సమస్యకు అన్ని ఇతర సమస్యలకంటే ప్రాముఖ్యత ఇచ్చుటకై నేనీవేదికనుండి ప్రకటించుచున్నాను." అని గూడ చెప్పారు. ఆహారసమస్య విషయంలో కుల మత విచక్షణలేకుండా జీవకారుణ్య దృష్టితో అందరూ కలిసి పనిచేయాలని, కీ. శే. బహద్దురు ఖాన్‌గారు ఉద్బోధించుట చాల అపూర్వవిషయం. వారు ముందుకార్యక్రమానికి ఈక్రింది సూచనలిచ్చారు.

(1) రబ్బీ తానీ పంటల లెవీవసూలు పూర్తిజేసి, సంస్థాన అవుసరాలను అంచనా వేయనిదే, ధాన్యాన్ని సంస్థానం బయటికి ఎగుమతిచేయడం ఆపాలి.

(2) దొంగతనంగా జరిగే ఎగుమతులను శ్రద్ధవహించి ఆపాలి.

(3) బియ్యం గోధుమల దిగుమతికి తీవ్రప్రయత్నాలు చేయాలి.

(4) రైతులనుండి లెవీ వసూలుచేయబడుతూ ఉంది గనుక, ప్రభుత్వం వ్యవసాయాని కవుసరమైన ఇనుపపనిముట్లు ఎద్దులను చవుకగా సప్లయి అయ్యేలా చేయాలి.

(5) వర్తకులను దొంగవ్యాపారం చేయకుండా జాగ్రత్తగా చూస్తూ, ఆహారవస్తువులుతప్ప మిగత జీవితావుసర వస్తువులలో వ్యాపారం సాగించుకునేందుకు అవకాశాలు ప్రభుత్వం కల్పించాలి.

(6) చిన్న ప్రభుత్వోద్యోగులకు అధికధరల అలవెన్సు ఇయ్యాలి.

(7) ఆధికలాభాల పన్నువల్ల వచ్చే ఆదాయంనుండి ఖర్చుపెట్టి అతిపేదలకు తక్కువ ఖరీదులతో జీవితావుసర వస్తువులు సప్లయిచేయాలి.

(8) పట్నాలకోసమని గ్రామాలను బలిఇయ్యగూడదు. స్థానికావుసరాలకు అవుసరమైనంత ధాన్యం గ్రామాలలో మిగల్చాలి. లేకపోతే గ్రామాలనుండి పట్టణాలకు ప్రజలు తండోపతండాలుగా రావడం, బెంగాలులోవలె ప్రజలు చనిపోవడం జరుగుతుంది.

ఆహార సమస్య విషయంలో ముస్లిము జనసామాన్యం ఎంతగా బాధపడుతున్నారో దాన్ని పరిష్కరించడానికి కులమత విచక్షణ పాటించకుండా రాజకీయాభిప్రాయాలను పాటించకుండా, అందరు దేశసేవకులతోనూ పనిచేయడానికి ఎలా సంసిద్ధంగా ఉన్నారో, కీ. శే. బహద్దుర్ ఖాన్ గారి ఉపన్యాసం రుజువుచేస్తుంది. ఇతరసంస్థల దేశసేవకులు మేల్కొంటే ఆహారసమస్యద్వారా హైదరాబాదు సంస్థానంలో హిందూముస్లిము ఐక్యత తీసుకురావడానికి ఎంతో అవకాశం ఉంది. వరంగల్లు ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభలో మొత్తం 150 తీర్మానాలవరకూ ఆహారసమస్యమీదనే తీసుకురాబడినవి. వీటిన్నిటినీ క్రోడీకరించి, భోనగిరి ఆంధ్రమహాసభలోవలె, కార్యకర్తలకు ప్రజలకు మార్గదర్శకమైన తీర్మానంచేయబడలేదు. తగుచర్య తీసుకోడానికి కార్యనిర్వాహక వర్గానికి వదలివేయబడింది, అయినప్పటికీ, ఆహారసమస్య పరిష్కారానికి కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారి సూచనలుచక్కని అవకాశం ఇస్తూఉన్నవి.

(11) హైదరాబాదు సంస్థానంలో జాగీరుదార్లు మక్తేదార్లు మొదలైన జమీందారీవర్గపువారు అన్నివిధాల అభివద్ధికి ఆటంకంగా ఉన్నారు. వారికి్రంది రైతులస్థితి వర్ణనాతీతం. వారిలో సగంమంది ముస్లిం జాగీరుదార్లుగూడ ఉన్నారు. ఇటువంటి పరిస్థితులలో ఇత్తెహాదుల్ ముసిల్మీనువారి దుష్పరిపాలనను మార్చకపోతే ప్రజలిక వారిని సహించరని హెచ్చరిక యివ్వడం, యెంతో ముఖ్యమైన విషయం. ఇత్తెహాదుల్ ముసిల్మీన్ జాగీరు ప్రజల యిబ్బందులనుగూర్చి ప్రసంగించడం యిది మొదటి పర్యాయం. అసలు జాగీర్లే రద్దుగావింపబడాలనే తీర్మానం మహాసభలో అభివృద్ధికాముకులైన యువకులచే తేబడింది. కాని జాగీరుదార్లను హెచ్చరించుతూ యీ క్రింది తీర్మానం చేయబడింది.

## జాగీర్దారువర్గానికి వార్నింగు

జాగీర్దారువర్గానికి వ్యతిరేకంగా ప్రజాసామాన్యంలో యేర్పడిన అభిప్రాయాలను వీరి దృష్టిలోకి తెస్తుంది. వారి దుష్పరిపాలన, సమిష్టి

బాధ్యతలను మరచిపోవడంవలన యీ అభిప్రాయాలు (Sentiments) తీవ్రమౌతున్నవి. సాధ్యమైనంత త్వరలో తమలో మార్పుతెచ్చుకొని, జాతీయావసరములను తీర్చుటలో పాల్గొనక, దేశమునకు, ప్రభుత్వమునకు ఉపయోగకరంగా ఉండే జీవితాన్ని అలవరచుకొనకపోతే, ప్రజాభిప్రాయం జాగీర్దారీవిధానం అంతంచేయాలనేటంత తీవ్రంగా, పరిణమించుతుందని యీ సమావేశం విశ్వసిస్తుంది.

జాగీర్లలో విద్యావిధానం జాగీరుదార్లక్రింద వుంటుంది, వారు పన్నులు వసూలుచేయడంలో శ్రద్ధవహిస్తారుగాని, విద్య వైద్యసౌకర్యాలు వారేమీ శ్రద్ధవహించరు. ఇత్తెహాదుల్ ముసిల్మీను "పాయెగా జాగీర్లు సర్ఫెఖాసు ప్రాంతాలలో విద్యావిధానం సరియైన పద్ధతులమీద లేదు" అనీ, ఇందువలన యీ ప్రాంతాలలోని విద్యావిధానంగూడ ప్రభుత్వ విద్యా డిపార్టుమెంటు క్రిందికి తేవాలని తీర్మానించింది.

(12) వరంగల్లు అజుంజాహి మిల్లు సమ్మె ముస్లిము జనసామాన్యంలో పెద్ద కదలికను తీసుకువచ్చింది. వరంగల్లులో జరిగిన ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభ "కార్మికుల న్యాయమైన హక్కులను రక్షించుటకు ఇత్తెహాదుల్ ముసిల్మీనుసభ సంసిద్ధంగా ఉన్నదనీ, కార్మికుల న్యాయమగు హక్కులను రక్షించుటకు యీ మజ్లిసు ఎల్లప్పటికి సిద్ధముగనున్నదని దేశములోని కార్మికులకు యీ సమావేశము విశ్వాసము గలిగించుచున్నది,

ఆజంజాహి మిల్లు కార్మికుల సమ్మె, సమ్మె తదనంతరం ఉద్భవించిన పరిస్థితులవల్ల దేశమునకెంతో నష్టము కలిగినది. మజ్లిసుయొక్క స్వార్థరహితమగు సభ్యుడు సమద్‌రజ్వీ దినదినము విషమించుచున్న పరిస్థితులను బాగుపరచుటకు ప్రయత్నించుచుండ ప్రభుత్వమువారి కృషిని ప్రశంసించుటకుబదులు వారిపై నిర్బంధము ప్రయోగించి, అశాంతిని ప్రబలజేసినందులకు ఈ మహాసభవారు తమవిచారమును తెలుపుచున్నారు. ఆజంజాహి మిల్లుకార్మికులయెడ న్యాయము కలిగించవలయునని సమద్ రజ్విగారిపైనుండి వెంటనే నిషేధము తొలగించవలయునని ప్రభుత్వం వారిని యీ మహాసభ కోరుచున్నది" అని తీర్మానించింది.

(13) భారత రాజకీయాలనుగూర్చి కీ. శే. బహద్దుర్‌ఖానుగారు యీ క్రిందివిధంగా మాట్లాడారు.

"నేటి రాజకీయ పరిస్థితిని ప్రతిష్టంభన అంటారు. బ్రిటిషువారు దీని బాధ్యత భారతీయులమీద వేస్తారు. భారతీయులు బ్రిటిషువారిమీద వేస్తారు. ఇంకా విపులంగా చెప్పాలంటే, హిందువుల దృష్టిలో ముస్లింలు బ్రిటిషువారి స్నేహితులు, స్వాతంత్ర్య విరోధులు. ముసల్మానులదృష్టిలో హిందువులు బహిరంగంగా స్వాతంత్ర్యమని ప్రకటించుచూ, హృదయములోమాత్రం ఇతరులను బానిసలుగా పాలించుదామనే దురాశగలవారు."

"ఉత్తరదేశంలో 1000 సం॥నుండీ, దక్షిణదేశంలో 1300 సం॥ నుండీ ముసల్మానులు నివసించుతున్నా, ఇంకనూ ముస్లిములను పరదేశస్థులుగా భావించేవారు యీదేశంలో ఉన్నారు. వీరు జర్మనీనుండి యూదులను తరిమినట్లు, యీ దేశంనుండి ముసల్మానులను తరమడానికి సిద్ధంగా ఉన్నారు." హిందూమహాసభవారి మత అహంకార ప్రచారం ముస్లిము జనమాన్యంలో పై అనుమానాన్ని వాస్తవికంగా గలుగజేసింది.

పై అనుమానాన్ని ప్రకటించుతూ, కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు ముస్లిముల దేశభక్తి స్వాతంత్ర్య కాంక్షనుగూర్చి ఈ క్రిందివిధంగా మాట్లాడారు.

"నేనీనాడు ఈ వేదికనుండి, ముసల్మానులు స్వాతంత్ర్య పోరాటంలో ఇతరులకంటె వెనుకబడిఉన్నారనే లజ్జాపూరితమైన నీచమైన ఆరోపణను ఖండించుచున్నాను. పైగా వారిలో స్వాతంత్ర్య కాంక్ష ఇతరులకన్న ఎన్నోరెట్లు ఎక్కువగా వున్నదని ఘంటాపథంగా చెప్పగలను"

భారత ప్రతిష్టంభనను అంతమొందించడానికి ఈ క్రింది సూచనను కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు ఇచ్చారు.

"ఏరాష్ట్రంలో ముస్లిములు అధికసంఖ్యాకులుగా ఉన్నారో, వారికి తప్పక స్వయంనిర్ణయాధికారం ఇవ్వవలెను. భారతదేశ సమస్యాపరిష్కారానికి ఇదితప్ప వేరుమార్గం లేదు. ముస్లిములు ఈ ఖండంలో నాల్గవ భాగం మాత్రమే కోరుచున్నారు. తక్కినమూడుభాగాలు హిందూ సోదరులకు సంతోష పూర్వకముగా ఇస్తారు. హిందూనాయకులు ఈ రోజున పాకిస్థాను సూత్రాన్ని ఒప్పుకున్నట్లయితే, ముసల్మానుల సహకారంతో క్షణమాత్రంలో ఈ ప్రతిష్టంభన అంతమొందుతుంది. జైలుబయటనున్న కాంగ్రెసువాదులు భాయిదే ఆజంతోటి ఎందుకు ఈసమస్యను పరిష్కరించబూనుకోరు? నేడు నాయకుడైన గాంధీగారు జైలుబయటనే ఉన్నారు. వారు ముసల్మానుల న్యాయమైన పై కోర్కెను అంగీకరించడంలో ఏశక్తి

వారిని అడ్డుకోలేదు. ఈ సూత్రాన్ని అంగీకరించి, భారతదేశంయొక్క దాశ్యశృంఖలాలను తెంపివేయడంలో, ఏవిషయం వారిని ఆటంకపరుప జాలదు. ఈ ప్రకారంగా భారతదేశానికి ప్రపంచంలోని ఇతరదేశాలకంటె ఉన్నతమైన స్థానాన్ని సంపాదించవచ్చును. నేను గాంధీజీని త్వరగా ఆరోగ్యం పొందవలెననీ హృదయపూర్వకంగా కోరుతున్నాను. ఆ సుదినం కోసం ఎదురుచూస్తున్నాను."

వరంగల్లు ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభ ఆహారసమస్య, జాగీరుప్రజలు, కార్మికులు, విద్యార్థుల విషయంలో అభివృద్ధికరమైన పంథా త్రొక్కింది. ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలను అమలుజరుప డంలో అవలంబించుతున్న నిరంకుశ విధానాన్ని నిరసించుతూ, ఎన్నికలు జరపమని కోరింది. కొన్ని అభివృద్ధినిరోధక తీర్మానాలు చేయబడినా, ఈ మహాసభ ముస్లిము జనసామాన్యంలో వచ్చిన అభివృద్ధికరమైన మార్పును తేటతెల్లం చేస్తూంది.

# 7. హైద్రాబాద్ దేశశ్రేయోభిలాషులకర్తవ్యం

సోవియటు సైన్యాలు నాజీ ముష్కరులను వెన్నంటి తరుముతూ జర్మను, భూభాగంమీద కాలుపెట్టాయి. బ్రిటిషు, అమెరికా, కెనడా ఫ్రెంచి దళాలు పశ్చిమ దక్షిణ దిశలనుండి జర్మనుసైన్యాలను వెనుకకు నెట్టు కుంటూ వస్తున్నాయి. యుగోస్లావియా, బల్గేరియా, పోలండు, ఫ్రాన్సు నార్వేమొదలైన అన్ని దేశాలలోనూ, బలమైన ఐక్యప్రజాఉద్యమాలు గొరిల్లా దళాలు ఏర్పడి నాజీ సైన్యాలకు ఊపిరి సలుపనీయడంలేదు. నాజీ జర్మనీకి అంత్యదశవచ్చింది. ఫేసిస్టుజపానుతోకలిసి ప్రపంచాన్ని ఫేసిస్టు రాక్షసపరి పాలనక్రిందకు తేవాలన్న, హిట్లరుప్లానులు భగ్నమయ్యాయి. నాజీ జర్మనీ లొంగిపోవడ మనేది కొద్దినెలలపనే.

జర్మను నాజీలపెత్తనం పోతున్నా, దాని స్థానే రాబోయేది గత మహాయుద్ధం తరవాత వలె బ్రిటిషు, అమెరికా, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు మిగతా దేశాలలో వారిని అంటిపెట్టుకొని ఉండేతొత్తుల ప్రభుత్వంగాదు. ఫేసిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న ఈ యుద్ధంలోనే, అన్నిదేశాలలోనూ ప్రజలు చేసిన అసమాన త్యాగంవల్ల, సామ్రాజ్యవాద ప్రపంచం అదృశ్య మవుతోంది. సోవియటుయూనియను నాయకత్వంక్రింద నూతన ప్రజా

ప్రపంచం నిర్మింపబడుతోంది. అన్ని దేశాలలోనూ ఐక్య ప్రజాఉద్యమాలు నిర్మింపబడడంవల్ల, సామ్రాజ్యవాదులు వారి అనుయాయులు అప్రాముఖ్య స్థానాలకు నెట్టబడుతున్నారు. ప్రజాశక్తులు ముందుకు వస్తున్నాయి. యుగోస్లావియాలో ఐక్యప్రజావుద్యమ నాయకుడైన మార్షల్ టిటోను బ్రిటిషు, అమెరికా ప్రభుత్వాలు గుర్తించడం, ఇటలీలో సామ్రాజ్యవాదుల ఆస్థాన్ బడోగ్లియోలు పోయి ప్రజాప్రతినిధులతో గూడిన ప్రభుత్వం ఏర్పడటం, ఫ్రెంచి నేషనల్‌కమిటీలో సామ్రాజ్యవాదుల అనుకూలురైన జీరో వగైరాలు పోయి నిజమైన ప్రజాకమిటీగా తయారవడం, ఫ్రెంచి సామ్రాజ్యం నుండి సిరియా లెబనాన్‌లు స్వాతంత్ర్యాన్ని సంపాదించడం, ఇందుకు నిదర్శనాలు. రాబోయే నూతన ప్రజాప్రపంచానికి గ్యారంటీ ఏమంటే, సోవియటుయూనియను, రెడ్‌ఆర్మీలు ఈ యుద్ధంలో చేసిన అసమాన త్యాగం, వాని బలం, వివిధదేశాలలోని ఐక్యప్రజాఉద్యమాలు, వాని క్రింద పనిచేస్తున్న గొరిల్లాదళాలు.

ఈ నూతన ప్రపంచంలో భారతదేశం తన అర్హస్థానాన్ని ఎంత వరకూ తీసుకుంటుంది. అనే ప్రశ్న ఆసియాలో హిట్లరు సహకారిఅయిన ఫేసిస్టు జపానును ఓడించడానికి ఎంత త్యాగాన్ని చేస్తుంది, అనేదాని మీద ఆధారపడి ఉంటుంది. జపానుకు వ్యతిరేకంగా జరిగే యుద్ధాన్ని త్వరగా ముగించడానికి ఎంతఎక్కువగా తోడ్పడుతుంది అనే దానిమీద ఆధారపడి ఉంటుంది. బర్మారంగంలోనూ పసిఫిక్కు మహాసముద్రరంగంలోనూ జపాను వెనుకకు తగ్గుతున్నా, దాని ఆసలుబలం దెబ్బతినలేదు. యుద్ధం సాధ్యమైనంత కాలం పొడిగించి తనకు అనుకూలమైన రాజీచేసుకోవాలని ప్రయత్నించుతోంది.

భారతదేశం యుద్ధాన్ని త్వరగా ముగించడానికి తన బలాన్నంతా ఉపయోగించాలి. అందుకు కాంగ్రెసు ముస్లిములీగు ఐక్యత సాధించాలి. జాతీయప్రభుత్వాన్ని సంపాధించాలి. కాంగ్రెసులీగులు ఒకదానికొకటి చాల దగ్గరకు వచ్చినవి, గాంధీజీ కాంగ్రెసువాదులు లీగుయొక్క స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించారు ఐక్యతకు ముఖ్యమైన ఆటంకం తొలగిపోయింది. భారతరాజకీయరంగంలో పరిస్థితులు ఆశాజనకంగా ఉన్నవి.

జపానుదాడి భీతి తొలగిపోయినా, భారతదేశానికి మరొక ప్రమాదం వచ్చింది. ఆహారపదార్థాల కొరత తీవ్రముగాఉంది. గత సంవత్సరం బెంగాలులోనే 50 లక్షలమంది చనిపోయారు. ఈ సంవత్సరం ఆహార

సమస్య ఇంకా తీవ్రతరమవుతోంది. హైదరాబాదు సంస్థానంలోగూడ ఆహారపదార్థాల కొరత చాల తీవ్రంగాఉంది. పట్టణాలలోనూ పల్లెటూళ్లలో బీదలకు గింజలు దొరకుట కష్టంగాఉంది. ప్రభుత్వం గ్రామావసరాలను, రైతుల అవసరాలనుగూడ దృష్టియందుంచుకోకుండా ధాన్యసేకరణ విధానం నిర్బంధంగా సాగించుటవలన, గ్రామాల్లో పరిస్థితులు చాల క్లిష్టమైనాయి. ప్రభుత్వం దొంగవ్యాపారులమీద సరియైన చర్యతీసుకోవడంలేదు. ఆహారసమస్యలో హిందువులు మహమ్మదీయులు అందరూ సమానంగానే కష్టపడుతున్నారు. ఈ సమస్యను పరిష్కరించడానికి పట్టణాలలో రేషనింగు అమలుజరుప బడాలి. కొరతగ్రామాలలో చౌకడిపోలు పెట్టాలి. రైతుల వద్దనుండి ధాన్యాన్ని వారికి హానికల్గని సక్రమపద్ధతులమీద సేకరణ చెయ్యాలి. వారికి సక్రమమైన రేట్లు ఇయ్యబడాలి. హైదరాబాదులోఉన్న జలాధారాలు అన్నీ ఉపయోగించియూ, వ్యవసాయంలో ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టియూ, రైతులు అధికపంటను పండించేలా చెయ్యాలి.

దక్షణహిందూదేశంలో ఫ్యాక్టరీలకు రైళ్ళకు బొగ్గు చాలవరకూ సప్లయిచేసే కొత్తగూడెం బొగ్గుగనులలోనూ, సంస్థాన ప్రజలకు గుడ్డ సప్లయిజేసే గుడ్డల మిల్లులలోనూ, కార్మికుల పరిస్థితి దుర్భరంగా ఉండుటచేత, ఉత్పత్తి చాల పడిపోయింది. ఇందువల్ల దేశంలోని ఆర్థికపరిస్థితి ఇంకా క్లిష్టమయింది. కార్మికుల స్థితిగతులను బాగుచేసి, వారిలో దేశభక్తి పూరిత ఉత్సాహాన్ని రగుల్కొలిపి, బట్టలు మొదలైన పారిశ్రామిక వస్తువుల అధికోత్పత్తి సాగించాలి. ప్రజలకు వాటికొరతను తీర్చాలి. కార్మికుల పరిస్థితులనుగూడ బాగుచేయాలి.

హైదరాబాదు సంస్థానం జపాను వ్యతిరేకయుద్ధంలో తన బాధ్యతను నెరవేర్చాలంటేను, ఆహార కరువునుండి సంస్థాన ప్రజలను కాపాడాలంటేను, అధికాహారోత్పత్తిని, అధికోత్పత్తిని సాగించాలంటేను, నేడు ప్రజల నెదుర్కొన్న ఇతర సమస్యలను పరిష్కరించాలంటేనూ, ఏమి చెయ్యాలి ?

ఈ సమస్యలను పరిష్కరించడానికి ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిచుతోంది. ధాన్యం దురాశాపరులైన దొంగవ్యాపారుల చేతుల్లోకి పోకుండా కాపాడటానికి, ధాన్యసేకరణ విధానం పెట్టింది. ప్రజలకు అందుబాటులో ఉండేలాగున జీవితావసర వస్తువులకు ధరల నిర్ణయం చేసింది. పెద్ద పట్టణాలలో రేషనింగు ప్రవేశపెట్టింది. చిన్నపట్టణాలలో

కంట్రోలు డిపోల నేర్పరచింది. అధికాహారోత్పత్తిని సాగించడానికి, ఎరువులు ఇయ్యాలని, బంజరుభూములను సాగులోకి తేవాలనీ ప్రకటించింది. ఇంకా రైతులకు అనుకూలించే శాసనాలను చాల చేసింది. కాని వీటిని అమలుజరిపే నాథులెవరు? ప్రస్తుత ప్రభుత్వోద్యోగులలో పూర్తిగా అవినీతి ప్రబలి ఉండుటచేత, పై ప్రజల కనుకూలమైన శాసనాలుగూడ సరిగా అమలుజరుగుటలేదు. పైగా వీటిద్వారా లంచగొండితనం, అవినీతి ఇంకా ప్రబలింది. ఈ మధ్య ప్రభుత్వం ప్రభుత్వోద్యోగులలో అవినీతిని అరికట్టడానికి, అవినీతి వ్యతిరేకడిపార్టుమెంటు (Anti currption department) ఏర్పరుప బడింది. అవినీతి కారణాలవల్ల వ్యవసాయశాఖలో ముఖ్య ఉద్యోగస్తులు కొందరు బర్తరఫ్ చేయబడ్డారు. కాని ఈ డిపార్టుమెంటు సరిగా పనిచేయకుండా, ఉన్నతఉద్యోగులు అనేక ఆటంకాలు పెడుతున్నారు. ఈ విషయం కీ. శే. బహద్దుర్ ఖాన్‌గారు వరంగల్లు మహాసభయొక్క తమ అధ్యక్షోపన్యాసంలో చెప్పారు. ఇటువంటి ఉద్యోగులతో గూడిన ప్రభుత్వయంత్రం ప్రజా శ్రేయస్కరమైన శాసనాలను సైతం అమలుజరిపి ప్రజలకుసౌఖ్యాన్ని చేకూర్చలేదు. ప్రస్తుత బాబే హుకూమత్ ప్రజల విశ్వాసం చూరగొన్న ప్రభుత్వం కాకపోవుటచేతనూ, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం ప్రబలి ఉండుటచేతనూ, ఆ సమస్యలను పరిష్కరించుటలో ప్రజల సహకారాన్ని తీసుకోక నిర్బంధవిధానాన్ని ప్రయోగించుటచేతనూ, ఈ సమస్యలను పూర్తిగా పరిష్కరించలేదు. అందుచేత ఈ సమస్యలను పూర్తిగా పరిష్కరించడానికి ప్రజల విశ్వాసం చూరగొని, సంస్థానప్రజలందరినీ హిందువులను, మహమ్మదీయులను సమీకరించగలిగిన ప్రజామంత్రివర్గం కావాలి. దేశశ్రేయోభిలాషులు ప్రజామంత్రివర్గం వచ్చేదాకా ఏమీ చేయలేమని చేతులు ముడుచుకు కూర్చోగూడదు. ప్రస్తుతం ప్రభుత్వం చేసిన ప్రజానుకూల శాసనాలను అమలు జరపడానికి పూర్తిగా పనిచేయాలి. రేషనింగు, ధాన్యసేకరణ, అధికాహారోత్పత్తి, అధికోత్పత్తి మొదలైన ముఖ్యసమస్యలలో దేశశ్రేయోభిలాషులందరూ ప్రభుత్వంతో సహకారం చెయ్యాలి. సాధ్యమైనంతవరకూ వాటిలో ప్రజలకు మేలుగలిగేలా చూడాలి. అవి జయప్రదమయ్యేలా చూడాలి. లంచగొండితనంనుండి ప్రజలను కాపాడాలి. ఈవిధంగా చేయుడం ద్వారానే ప్రభుత్వంచేసి ప్రస్తుత ప్రజానుకూల చట్టాలవల్ల, కొంత

వరకూ ప్రజలకు మేలుచేయగల్గుతాం. ప్రజా ఐక్యత ప్రజా ఉద్యమాన్ని నిర్మించగల్గుతాం. ప్రజా మంత్రివర్గంవైపుకు ముందుకు పోతాం.

## రాజ్యాంగ సంస్కరణలు : బాబేహుకూమత్ విస్తరణ

ప్రభుత్వం ప్రజలను ఎదో సంతృప్తిపరచే ఉద్దేశ్యంతో 1939 లో రాజ్యాంగ సంస్కరణలను ప్రకటించింది. ఈసంస్కరణలలో 100కి 95 మంది ప్రజాసామాన్యానికి అసెంబ్లీలోను స్థానికసంస్థలలోను 100కి 25 స్థానాలు, 100కి 5మందిఉన్న జాగీరుదార్లు షాహుకార్లకు100కి 75స్థానాలు ఉన్నవి. పై సంస్థలలో ప్రభుత్వంచే నామినేటు చేయబడేవారు దాదాపు సగం మంది ఉన్నారు. ప్రభుత్వాన్ని నడిపే బాబేహుకూమత్ పూర్తిగా ప్రజా ప్రతినిధులతోగూడి ప్రజలకు బాధ్యత వహించదు. ఈరాజ్యాంగసంస్కరణ లను ప్రభుత్వం క్రమంగా అమలు జరుప బూనుకొంది. ఈసంస్కరణ లలో భాగమైన జిల్లాకాన్ఫరెన్సులు డిపార్టుమెంటల్ అడ్వైజరీ కమిటీలు నిర్మింపబడ్డాయి. ఇటువంటి రాజ్యాంగ సంస్కరణలను ఇత్తెహాదుల్ ముసిల్మీను తప్ప మిగతా ప్రధాన ప్రజాసంస్థలు రాజకీయగ్రూపులు అన్నీ నిరాక రించాయి. ఇటువంటి ప్రజాస్వామ్యసూత్రాలమీద ఆధారపడని రాజ్యాంగ విధానం, హైదరాబాదు సంస్థానప్రజలందరినీ నేడెదుర్కొన్న క్లిష్టసమస్య లను పరిష్కరించడానికి సమీకరించలేవనుట సుస్పష్టం.

ఈమధ్య ప్రభుత్వం కొంతమంది ప్రజావిశ్వాసం చూరగొనని హిందూముస్లిము ప్రముఖులను బాబేహుకూమత్‌లోనికి తీసుకొని, దాన్ని విస్తరించి, ప్రజలను సంతృప్తిపరచ జూచింది. ఇటువంటి విస్తరణవల్ల నేడు ప్రజల నెదుర్కొన్న క్లిష్టసమస్యలు పరిష్కారంగావు. ప్రజల విశ్వాసంగొన్న మంత్రివర్గమే నేడు హైదరాబాదు సంస్థానాన్ని, ఈక్లిష్ట పరిస్థితినుండి రక్షించగలదు.

## ఇత్తెహాదుల్ ముసల్మీను రాజకీయనినాదం

ఇత్తెహాదుల్ ముసిల్మీను, ముస్లిముల ఔన్నత్యచిహ్నమైన ప్రభువు గారి సంపూర్ణాధికారాన్ని ఏవిధంగాను సంకుచితపరచనటువంటి, హైదరా బాదు ముస్లిములకు చారిత్రికంగా లభించిన ఔన్నత్యం హక్కులను సంకు చితపరచనటువంటి, రాజ్యాంగవిధానాన్ని మాత్రమే అంగీకరించుతానని చెపుతుంది. దీని అర్థం ప్రజలకు ప్రాతినిధ్యం లేనటువంటి, ముస్లిములు మిగతా ప్రజలకన్న ఎక్కువ అని అంగీకరించేటటువంటి రాజ్యాంగవిధానం

కావాలి అని, నిరంకుశత్వం మతఅహంకారంమీద ఆధారపడే ఏరాజ్యాంగ విధానం ప్రజలను సమీకరించలేదని వేరే చెప్పాలిసిన అవుసరంలేదు.

జాత్యహంకార సిద్ధాంతాలమీద తమతమ దేశాలలోని ప్రజలను మోసపుచ్చి, హిట్లరు, ముసోలినీ, టోజోలు ప్రపంచాన్ని రక్తసముద్రంలో దింపారు. తమదేశప్రజల రక్తాన్ని, ఇతరదేశప్రజల రక్తాన్ని ఎంతో ప్రవహింప జేశారు. ఎంతోమంది అమాయకప్రజలను, యువకులను, స్త్రీలను, పిల్లలను, పసిపాపలను తమ జాత్యహంకార సిద్ధాంతాలకు బలి జేశారు. తరతరాలనుండీ ప్రపంచ మానవకోటి నిర్మించిన జీవితావుసరాల కవుసరమైన వస్తుసంపదను ఫ్యాక్టరీలు ఆనకట్టలు పెద్ద భవనాలు వంతెనలు మొదలైనవి నాశనంజేసి, ఎంతో మానవశ్రమను మట్టిపాలుజేశారు. మానవసమాజం నేటివరకు సాధించిన సంస్కృతి విజ్ఞానాలను నాశనం జేశారు. ఎన్నో విద్యాలయాలు వస్తుప్రదర్శనశాలలు పుస్తకభాండాగారాలు నాశనంజేశారు. ఎంతోమంది విజ్ఞానవేత్తలను చంపివేశారు. వేయేల మానవసమాజాన్ని అంధకారమయమైన అడవిమనుష్యుల దశకు తీసుకు పోవడానికి ప్రయత్నించారు. జాతి మత అహంకార సిద్ధాంతాలు ఎవరు అనుసరించినప్పటికీ ఈ స్థితికి పోతాయి.

ప్రపంచప్రజలు మేల్కొని, సోవియటుయూనియను వివిధదేశాల కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాన ఈ అడవిజంతువుల సిద్ధాంతానికి వ్యతిరేకంగా పోరాడారు. ఎంతో త్యాగంజేసి, జర్మను జపాను ఇటలీ ఫేసిస్టులను అణగద్రొక్కుతున్నారు. వీరిని పూర్తిగా ఓడించడమనేది కొద్దికాలం పనిమాత్రమే. ఈ యుద్ధంతర్వాత ఇటువంటి జాతి మత కుల అహంకార సిద్ధాంతాలు తిరిగి తలయెత్తకుండా, క్రూకటివేళ్ళతో పెకలించి నాశనం చేయబడుతాయి. అన్నిజాతులు సమామానం, అందరు ప్రజలు సమానం అనే సూత్రాలమీద, సౌఖ్యప్రదమైన నూతన స్వేచ్ఛాప్రపంచం నిర్మింపబడుతుంది.

ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకత్వం ఇకనైనా కండ్లుతెరిచి, ప్రపంచాన్ని చూడాలి, ప్రపంచఘటనలను పరిశీలించాలి. ప్రపంచం ఏవిధమైన జాతి, మత, కుల అహంకారసిద్ధాంతాలను ఇక సహించదని తెలుసుకోవాలి. వారి మత అహంకార సిద్ధాంతాన్ని వదలుకోవాలి. హిందూముస్లిం ఐక్యతలో ప్రస్తుతం హిందూ ముస్లిము ప్రజలను బాధించుతున్న ఆహార సమస్యను పరిష్కరించడానికి ముందుకురావాలి. తమతమ అహంకార

సిద్ధాంతం హిందూమత కలహాలను హెచ్చుజేసి, ప్రస్తుత క్లిష్టసమస్యలను ఇంకా క్లిష్టతరంజేసి, దేశవినాశనానికి దారితీస్తుందని గ్రహించాలి.

## బాధ్యతాయుత ప్రభుత్వం - హిందూ మతతత్వవాదులు

ఇప్పుడు ప్రభువుగారి ఛత్రఛాయక్రింద బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచాలని సంస్థానంలోని జాతీయవాదులు హిందూమతతత్వవాదులు (ఆర్యసమాజీయులు హిందూమహాసభవారు) కోరుతున్నారు. బాధ్యతాయుత ప్రభుత్వం అనే నినాదం ఒకటిగానే ఉన్నంతమాత్రాన, జాతీయవాదులు, హిందూమతతత్వవాదులు కోరేది ఒక్కటే ననుకోగూడదు. వీరు కోరేది మహమ్మదీయులమీద హిందూమతం, సంస్కృతి యొక్క పెత్తనం. వీరి ప్రకారం భారతదేశం హిందువుల మాతృభూమి. మహమ్మదీయులు ఎక్కడనుండో వచ్చారు. కనుక భారతదేశంలో హిందువుల పెత్తనానికి మహమ్మదీయులు లొంగిఉండాలని వీరివాదన. అటువంటిహిందూపెత్తనం తీసుకురావడానికి, హిందూసంస్థానాలు సాధనాలు, కనుక హిందూసంస్థానాధీశులను బాధ్యతాయుత ప్రభుత్వం అనే నినాదం తీసుకువచ్చి బలహీనపరచగూడదు. అలాబలహీనపరచితే మూలాశయమైన హిందూపెత్తనానికే దెబ్బ తగులుతుంది. కనుక బాధ్యతాయుతపరిపాలన అనేనినాదం హిందూరాజులు పరిపాలిస్తున్న సంస్థానాలలో తీసుకురాగూడదు. ముస్లిమురాజులు పరిపాలిస్తున్న సంస్థానాలలో ఆ నినాదం లేవదీయవచ్చును. కనుక హైదరాబాదు సంస్థానంలో హిందూమత తత్వవాదులు బాధ్యతాయుత పరిపాలన అనే నినాదం లేవదీస్తున్నారు. 1944 ఏప్రిల్‌లో మైసూరు సంస్థానంలో షిమోగా అనే పట్నంలో అఖిలభారత సంస్థానప్రజల హిందూమహాసభ జరిగింది. దానికి బి. జి. ఖపర్డేగారు అధ్యక్షత వహించారు. దానికి హిందూమహాసభ నాయకులు సావర్కారు, డాక్టరు మూంజీగార్లు హాజరయ్యారు. ఆ మహాసభలో ప్యాసుచేయబడిన ఈక్రింది తీర్మానం హిందూమహాసభ నాయకుల స్టేటుమెంట్లు, పైన వ్రాయబడినదాన్ని రుజువుచేస్తున్నాయి.

" అఖిలభారత సంస్థానప్రజల మహాసభ బాధ్యతాయుత ప్రభుత్వంలోని మంచిని శ్లాఘిస్తూ, సంస్థానాలలో కావలసిన ప్రభుత్వరూపాలను గూర్చి జనరలుగా పాలసీని నిర్ణయించడాన్ని నిరుత్సాహపరుస్తోంది. దానికి బదులుగా, ఏ ప్రభుత్వాన్నైనా అంగీకరించడానికి గాని నిరాకరించడానికి గాని ఏ ప్రభుత్వంకోసమైనా ఆందోళన చేయడానికిగాని ఒక గీటురాయిని

ఇస్తుంది. జనరలుగా పాలసీలను నిర్ణయించడంవల్ల, పరిస్థితులు లేక ముందే ఉపసమస్యలు ఉత్పవించడం, హిందూసంఘటన (Hindudom) అనైక్యత విచ్ఛిన్నం కల్గడం, జరిగింది: అందువలన హిందూదేశం యొక్క స్వాతంత్ర్యసంఘటన ఎంతో బలహీనపడింది. హిందూసంఘటన యొక్క సాంస్కృతిక ఐక్యతను, జాతీయవర్తకం, పరిశ్రమలు, భాష, చిత్రకళలు, వేదభూమియైన హిందూదేశంయొక్క చారిత్రిక సాంప్రదాయాలను, అభివృద్ధిచేసేటటువంటి: సక్రమమైన మార్గాలద్వారా ఇతర ప్రభుత్వాలచేత పై ఆశయాలను అమలుజరిపించడానికి ఒత్తిడిపెట్టేటటువంటి, ప్రభుత్వాన్ని హిందువులు అంగీకరిస్తారని ఈ మహాసభ తీర్మానించుతోంది. హిందూదేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి ముందు, హిందూసంఘటనలో ఐక్యత తీసుకురావడం అనివార్యం. అందువల్ల, హిందూసంఘటన యొక్క ఐక్యతకు ఆటంకంగా ఉండేటట్టువంటి, లేక హిందూదేశస్వాతంత్ర్యాన్ని ఆచరణలో సాధించడాన్ని (Practical achievement) వాయిదా వేసేటటువంటి, ఉపసమస్యలను లేవదీయవద్దని ఈమహాసభ సంస్థానంలోవి హిందువులకు జ్ఞప్తికితెస్తుంది. జనరలు పాలసీలలో పడిపోయేదానికన్న, ప్రత్యేక కష్టాలను పోగొట్టుకోడానికి ఆందోళనచేయమని ఈమహాసభ సంస్థానాల హిందువులను కోరుతోంది." పై తీర్మానంలో "ఉపసమస్యలు" అనే దానికి అర్థం, బాధ్యతాయుత ప్రభుత్వంకోసం జరిపే ఆందోళనవల్ల హిందూ సంస్థానాధీశులకు ప్రజలకు మధ్యవచ్చే సంఘర్షణ. హిందూమహాసభవారికి అసలుసమస్య ఏమంటే, హిందూపెత్తనాన్ని సాధించడం. పై తీర్మానంలో జాతీయ పరిశ్రమ, భాష వగైరాఅంటే, హిందువుల పరిశ్రమలు, అరబ్బీ పర్షియన్ సంపర్కంలేని సంస్కృత హిందీ, హిందూకళలు వగైరా, హిందూమహాసభవారి దృష్టిలో భారతజాతి అంటే హిందువులేగాని మహమ్మదీయులుగాదు. జాతీయవాదులు కాంగ్రెసుచెప్పేది, భారతజాతి అనే దాంట్లో హిందువులు, మహమ్మదీయులు, క్రిస్టియనులు అంతాఉన్నారు. అఖిలభారత సంస్థానప్రజల హిందూమహాసభ చెప్పేది ఏమంటే. హిందూ సంస్థానాలలో బాధ్యతాయుత ప్రభుత్వవినాదం లేవదీయవద్దనీ, ప్రత్యేక కష్టాలను తొలగించుకోడానికి ఆందోళనచేయమనీ. హిందూమహాసభ అధ్యక్షుడు సావర్కారుగారు షిమోగాలోనే అసోసియేటెడ్‌ప్రెస్సు విలేఖరికి ఈక్రిందివిధంగా చెప్పారు." సంస్థానాలు ముఖ్యంగా, హిందూ సంస్థానాలు, అభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయనే అభిప్రాయం సర్వసాధార

ణంగా ఉంది. ఈ ప్రస్తుతపరిస్థితులలో ఆ అభిప్రాయం పూర్తిగా తప్పనీ హానికరమనీ, నా అభిప్రాయం. హిందూసంస్థానాలు, హిందూసంఘటన యొక్క అధికారకేంద్రాలు, రేపు భారతదేశంలో బ్రిటిషుఅధికారం దెబ్బ తిన్నదనుకోండి. అప్పుడు బలంగాఉన్న హిందూసంస్థానాలు శాంతిని కాపాడటానికి ముందుకు వస్తాయి." (11 వ ఏప్రిల్ 1944, హిందూపత్రిక)

హిందూమహాసభ ప్రముఖనాయకుడు డాక్టరు మూంజీ షిమోగా కాన్ఫరెన్సు సందర్భంలోనే మాట్లాడుతూ, హిందూ సంఘటనయొక్క స్తంభాలైన హిందూసంస్థానాధీశుల అధికారం తగ్గించడమే బాధ్యతాయుత ప్రభుత్వ నినాదంయొక్క అర్థమయితే, దాన్ని ప్రస్తుతం అడగవద్దని సంస్థాన హిందూజనసామాన్యాన్ని కోరతానని చెప్పాడు.

హిందూమహాసభయొక్క ఆశయమైన హిందూ పెత్తనాన్ని భారత దేశంమీద స్థాపించడానికి, హిందూమహాసభ పన్నుతున్న వ్యూహంలో సంస్థానాధీశులు ఎటువంటి ప్రధానపాత్ర వహించుతున్నారో చూచాం. హిందూమహాసభయొక్క ఆశయం సిద్ధించేదాకా హిందూసంస్థాన ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వాన్ని కోరగూడదు. అసలు ఆశయం విషయమే పరిశీలించుదాం. భారతదేశంలో ముస్లింలమీద పెత్తనంచేసే విధానం సాధ్యమవుతుందా? హిందూ ముస్లిం ఐక్యత లేనిదే బ్రిటిషు సామ్రాజ్య వాదులు ఎలా భారతదేశాన్ని విడచిపెట్టి పోతారు? అంటే బ్రిటిషు సామ్రాజ్య వాదుల పెత్తనాన్ని అంగీకరించడమేగదా? 1943 జనవరిలో గాంధీ ఉపవాసంలో ప్రాణప్రమాదం ఉన్నప్పుడు సైతం, వైస్రాయి కార్యవర్గంలోవి హిందూమహాసభవారు తమపదవులను పట్టుకువ్రేళ్ళాడారు. ఇప్పుడు గాంధీజీ ముస్లింలీగుతో రాజీపడి బ్రిటిషుసామ్రాజ్యవాదులనువంచ డానికి స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించితే, దానికి వ్యతిరేకంగా హిందూమహాసభ నాయకులు దుమారం లేవదీస్తున్నారు; ఈ విధంగా సామ్రాజ్యవాదులకు సాకుగల్పిస్తున్నారు. ఈ సంవత్సరం కేంద్రఅసెంబ్లీ బడ్జెటు సమావేశంలో ముస్లింలీగ్ - కాంగ్రెసు ఏకమై, ప్రజలకు హాని కరంగా ఉండే పన్నులను వ్యతిరేకించుతోంటే, హిందూమహాసభ శాసన సభ్యులు ప్రభుత్వానికి సపోర్టుచేశారు. ఆఖరుకు హిందూమహాసభ నాయ కులు సావర్కారు మూంజీగార్లు, జీవకారుణ్యపనులకు ఏర్పడ్డ కస్తూరిబాయి నిధికి డబ్బు ఇవ్వవద్దనిగూడ ప్రకటించారు ఇదంతా హిందూమహాసభ

నాయకులు బ్రిటిషు సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాలకు ప్రాకులాడేవారిని రుజువుజేస్తుంది.

స్వదేశ సంస్థానాధీశులు హిందువులైనా ముస్లింలైనా నిరంకుశాధికార్లే; హిందువులను, మహమ్మదీయులను పీడించుకుతినే బ్రిటిషుసామ్రాజ్యవాదుల సైనికబలంమీద ఆధారపడి ఉన్నవారే; భారత స్వాతంత్ర్యసాధనకు అభివృద్ధికి హిందూ-ముస్లిం సంస్థానాధీశులు అందరూ ఆటంకమే.

హైదరాబాదు సంస్థానంలోగూడ వీరు సాధించే బాధ్యయుత ప్రభుత్వం, హిందూ పెత్తనానికి హిందూమతోద్ధరణకు పాటుబడేదిగా ఉంటుంది. అంటే ముస్లింలను అణచివేసేదిగా ఉంటుంది. హిందూ ముస్లిం ఐక్యతలేనిదే భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించలేదు. హిందూ-ముస్లిం ఐక్యతలేనిదే హైదరాబాదుసంస్థానంలో అభివృద్ధిమార్గాన ఒక్క అడుగుగూడ ముందుకువేయలేం.

ఇక హిందూమహాసభవాదులు కోరే బాధ్యతాయుత ప్రభుత్వంలో, హిందూ ప్రజాసామాన్యానికైనా పెత్తనముంటుందనే అపోహలోపడవద్దు. ఒకదేశంలో ప్రజల్లో ఒకభాగం అణచివేయబడుతుంటే, మిగతావారు స్వేఛ్ఛాస్వాతంత్ర్యాలను అనుభవించడం చరిత్రలో కనివిని యెరుగం. ఒకభాగమైన ప్రజాసామాన్యాన్ని అణచివేసే యంత్రం, మిగతా ప్రజాసామాన్యాన్ని అణచకుండా ఉంచడం అసంభవం. అలాగే ముస్లింలను వారి నాగరికత, సంస్కృతిని అణచివేసే ప్రభుత్వం, హిందూ జనసామాన్యానికి సౌఖ్యం చేకూర్చలేదు. ప్రస్తుతం హిందూమహాసభ నాయకులు చెప్పేది చూస్తే. తాము చెప్పే హిందూ స్వాతంత్ర్య ప్రభుత్వంలో ప్రజలకు ఏమీ పెత్తన ముండదనీ, జమీందార్లు, సంస్థానాధీశులు, షాహుకార్ల నిరుంకుశత్వం సాగుతుందనీ స్పష్టమవుతుంది. హైదరాబాదు సంస్థానంలో హిందూమహాసభకోరే బాధ్యతాయుత ప్రభుత్వంలో, హిందూ జాగీరుదార్లు జమీందార్లు, దేశముఖులు, దేశపాండ్యాలు, వర్తకులు, షాహుకార్ల పెత్తన ముంటుంది; హిందూ ప్రజాసామాన్యానికి సైతం ఏమీ అధికారంఉండదు.

## బాధ్యతాయుత ప్రభుత్వం - జాతీయవాదులు

జాతీయవాదుల దృష్టిలో ప్రభువుగారి ఛత్రఛాయక్రింద బాధ్యతాయుత ప్రభుత్వమంటే, సంస్థానంలోని ప్రజలందరు హిందువులు ముస్లిములు క్రైస్తవులు ఇతరులచేత ఎన్నుకోబడిన శాసనసభ, దానికి బాధ్యత

వహించే కార్యనిర్వాహకవర్గం (బాబే హుకూమత్) పరిపాలనను సాగించడం ప్రభువుగారి ఛత్రఛాయక్రింద ప్రభుత్వం సాగుతుంది. ప్రభువుగారు శాసనబద్ధమైన పరిపాలకులుగా ఉంటారు.

బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని హైదరాబాదు సంస్థానంలో నినాదం 1937 లో లేవదీసింది జాతీయవాదులు. తదువాత 1938 లో దీన్ని సాధించడానికి స్టేటుకాంగ్రెసు పెట్టి, ప్రభుత్వం నిషేధించుటచే సత్యాగ్రహోద్యమాన్ని నడిపారు. స్టేటుకాంగ్రెసు 1938 ఆగస్టులో ఇచ్చిన మొదటి ప్రకటనలో ఈ రాష్ట్రంలో నివసించే వివిధ మతాల ప్రజలమధ్య ఐక్యత పరస్పర సహకారం ఉంటేనేగాని, సాంఘిక ఆర్థిక రాజకీయ అభివృద్ధిని సాధించలేము అని స్పష్టీకరించింది. సంస్థానంలో ప్రజలు వివిధమతతత్వవాదులు సాగించే మత అహంకార ప్రచారానికి బలిఅవుతున్నారనీ, ప్రజలను మతతత్వ ప్రచారంనుండి కాపాడి వారి ఉత్సాహాన్ని దేశభక్తి మార్గాలకు మరల్చాలనీ, గూడ ప్రకటించింది.

అంతేగాక "ఏ బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతిలోనైనా అధికసంఖ్యాకులకు అల్పసంఖ్యాకులకు రెంటికీ కొన్ని బాధ్యతలుంటాయి; అధిక సంఖ్యాకులమీద అల్పసంఖ్యాకులయొక్క మత, సాంస్కృతిక, భాషా సంబంధమైన, ఆర్థికహక్కుల రక్షణకు తగిన నమ్మకాన్ని అల్పసంఖ్యాకులలో కల్గించాలిసిన బాధ్యతఉంది. అలాగే అల్పసంఖ్యాకులకు అధిక సంఖ్యాకులతో సహకారం చేయాలిసిన బాధ్యత ఉంది."

స్టేటుకాంగ్రెసు తన మూడవ ప్రకటనలో బాధ్యతాయుత ప్రభుత్వ వివరణలో, 10 సంవత్సరాలపాటు అల్పసంఖ్యాకులకు కొన్నిసీట్లు శాసన సభలో ప్రత్యేకింపబడాలనీ, అల్పసంఖ్యాకుల సాంస్కృతిక మత విద్యా హక్కులు రక్షింపబడాలనీ ప్రకటించింది.

పై ప్రకటనలనుబట్టి చూస్తే హిందూమతతత్వ వాదులు కోరే బాధ్యతాయుత ప్రభుత్వానికి, జాతీయవాదులు కోరే బాధ్యతాయుత ప్రభుత్వానికి చాల తేడాఉంది, హిందూమత తత్వవాదుల బాధ్యతాయుత ప్రభుత్వం మిగతా మతాలవారిమీద హిందూపెత్తనం చేయటంపై ఆధారపడి ఉంటుంది. జాతీయవాదుల బాధ్యతాయుత ప్రభుత్వం, వివిధమతాల ప్రజల ఐక్యత, అల్పసంఖ్యాకుల మత సాంస్కృతిక విద్యా సంబంధమైన హక్కుల రక్షణ మీద ఆధారపడిఉంది,

అయినప్పటికీ జాతీయవాదులు కోరే బాధ్యతాయుత ప్రభుత్వ నినాదాన్నిగూడ, హైదరాబాదు సంస్థాన మహమ్మదీయులు వ్యతిరేకించారు. ఆర్యసమాజీయులు హిందూమహాసభవారు చేసే మతతత్వ ప్రచారంవల్ల, బాధ్యతాయుత ప్రభుత్వంలో హిందూ మెజారిటీ తమ్ము అణచివేస్తుందని ముస్లింలు భయపడ్డారు. తాము ఉద్యోగాలలోను ఇతర విధాలగాను ప్రస్తుతం అనుభవిస్తున్న ఆధిక్యత పోతుందని భయపడ్డారు. ఈభయాన్ని పోగొట్టగలిగిన సూచనలు జాతీయవాదులు చేయలేకపోయారు. గనుక ముస్లిం ప్రజా సామాన్యం ముస్లిం మతతత్వవాదుల ప్రచారంలోబడి. అసలు బాధ్యతాయుత ప్రభుత్వ నినాదానికే విరుద్ధమయ్యారు. బాధ్యతాయుత ప్రభుత్వ నినాదం ప్రస్తుత పరిస్థితుల్లో హిందూముస్లిం ఐక్యతను సాధించడానికి, హైదరాబాదు ప్రజలు ప్రస్తుతము వెనుకబడి ఉన్న పరిస్థితులలో వారిని సమీకరించడము సాధ్యపడదు. బాధ్యతాయుతప్రభుత్వం భవిష్యత్ ఆశయంగా ఉంచుకున్నా, ప్రస్తుత పరిస్థితుల్లో సంస్థాన మెదుర్కొన్న క్లిష్టసమస్యలను పరిష్కరించుటకు ప్రజలను సమీకరించడానికి ముస్లింల భయం పోగొట్టడానికి అవుసరమైన తక్షణ రాజకీయ నినాదం ఒకటి అవుసరం.

## ప్రజా మంత్రివర్గం

ప్రస్తుతం హైదరాబాదు సంస్థానంలో ప్రజల నెదుర్కొన్న క్లిష్ట సమస్యలను పరిష్కరించడానికి, హిందూ - ముస్లిము ఐక్యత సాధించడానికి, భువనగిరిలో జరిగిన 11 వ ఆంధ్రమహాసభ ప్రజామంత్రివర్గ నినాదాన్ని ఇచ్చింది.

## హైధరాబాదు పరిస్థితులు

"గత సంవత్సరములో మన నిజాంరాష్ట్రములోని పరిస్థితులుగూడ భీషణస్వరూపము దాల్చినవి. ఆహారసమస్య మరీ తీవ్రమయింది. కాని ఆహారసమస్య యొక్క ప్రతిదశలో తగుచర్య తీసుకొని పరిస్థితులు విషమించకుండ ప్రభుత్వము చేయలేకపోయిన తన అధికాహారోత్పత్తి విధానమువలన ప్రభుత్వ మేమీ సాధించలేను. నేడు మనరాష్ట్రం కొన్ని ధాన్యములలో కొరతపడినది.

## కార్మికుల కష్టాలు

కార్మికుల విషయములో ప్రాథమిక ట్రేడ్‌యూనియన్ హక్కుల నివ్వక, కనీస కరువుభత్యమైన యేర్పరచకపోవుటచే సమ్మెలు రావటం, ఉత్పత్తులు కుంటుపడటం జరుగుచున్నవి. దేశరక్షణ కత్యవసరమైన బొగ్గు ఉత్పత్తి యెంతో పడిపోయింది.

## ప్రాథమిక పౌరసత్వాలు

ప్రభుత్వం ప్రజల ప్రాధమిక పౌరసత్వములనివ్వ నిరాకరించినది. ప్రజాస్వామిక సిద్ధాంతములపై నడుపబడుచున్న జాతీయసంస్థలన్నియు నిరాకరించినట్టియు, దేశీయులలో అత్యధికసంఖ్యాకులైన ప్రజాసామాన్యము నకు ప్రాతినిధ్యము లభించకుండజేయు, ఫాసిస్టుసిద్ధాంతమైన కార్పొరేటెడ్ స్టేటు సూత్రముపై నేర్పరుపబడినట్టియు, దేశీయుల కనీసపౌరసత్వముల నైననూ ఇవ్వనిరాకరించినట్టియు, అసంతృప్తికరమైనట్టియు, నిరాశాజనక మైనట్టియు, దేశపు భావి అభివృద్ధికి హానికరమైనట్టియు, నేటి పరిస్థితులలో దేశాన్ని యెదుర్కొనుచున్న సమస్యలను ఎంతమాత్రము పరిష్కరింప జాలనట్టియు, రాజ్యాంగసంస్కరణముల ప్రభుత్వము ప్రవేశపెట్టుచున్నది. ఇట్టి ప్రభుత్వవైఖరిని నిరసించుచు, ఈ మహాసభ సంస్కరణలను పూర్తిగా నిరాకరించుచున్నది. ఈ సంస్కరణల నిజత్వము జిల్లామహాసభ లెట్లు జరుగుచున్నది గ్రహించిన స్పష్టమవుతుంది.

ప్రభుత్వం తన విధానమువలన ప్రజలందరి సానుభూతి కోల్పోయి రాజకీయ అసంతృప్తిని అధికం జేయుటయేగాక ప్రజలకు ప్రభుత్వం యెడల వ్యతిరేకం ఎన్నడూలేనంత హెచ్చుగా చేసినది. ప్రభుత్వ మెంత గట్టి ప్రయత్నము జేసినను రాష్ట్రప్రజల నెదుర్కొంటున్న క్లిష్టసమస్యలను పరిష్కరించలేక పోవుచున్నది. ఇందులకు కారణం ప్రస్తుతమున్న ప్రభుత్వం ప్రజలతో సంబంధములేని నిరంకుశాధికారవర్గ మగుటయే.

## బాబేహుకూమత్ అసమర్ధత

ప్రజలను మభ్యపెట్టుటకై ప్రభుత్వం తలపెట్టిన తరువాత మాను కొన్న "బాబేహుకూమత్" విస్తరణవల్ల నేడు మనరాష్ట్రము నెదుర్కొను చున్న సమస్య ఏమాత్రము పరిష్కరించబడదని ఈ సభ ప్రకటిస్తున్నది. ప్రస్తుతపు బాభేహుకూమతును పూర్తిగా మార్చివేసి, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక మహాసభలయొక్కయు, మజ్లిసు అంజుమనె ఇత్తెహాదుల్ ముస్లి

మీన్ యొక్కయు ప్రతినిధులుగల ప్రజాప్రభుత్వము ఏర్పరచి దైనిక పరిపాలనకు సంబంధించిన అన్నివిషయాలలో అధికారాన్ని ఈ ప్రభుత్వమునకిచ్చిననే నేడు యీ తీవ్రసమస్య పరిష్కరించుటగాని, దేశరక్షణను జయప్రదము చేయుటగాని సాధ్యముగాదు. అట్టి ప్రజాప్రభుత్వాన్ని వెంటనే ఏర్పరచవలసినదిగా ప్రభుత్వాన్ని యీ మహాసభ కోరుచున్నది.

## ప్రభుత్వకర్తవ్యం

ఇట్టి ప్రజాప్రభుత్వాన్ని రెండు ప్రధానకర్తవ్యాల నెరవేర్చుట ద్వారానే సాధించగలమని ప్రజలకు మహాసభ హెచ్చరించుచున్నది. ఇందులో మొదటికర్తవ్యం ఆహారసమస్య అధికాహారోత్పత్తి. దేశరక్షణల పరిష్కరించుటకై ప్రజలను ఐక్యపరచుట. ఈవిధంగానే ఒకవైపున దేశరక్షణను బలపర్చి, ఇంకొకవైపున ప్రజాసమస్యల తీర్చుతూ ప్రజాఉద్యమాన్ని నిర్మించగలుగుతాము. వట్టి వ్యతిరేకపంథావలనగాక ఇట్టి ప్రజాసమస్యల తీర్చుతూ దేశరక్షణల బలపరచే మార్గాన్నే ప్రజాప్రభుత్వాన్ని సాధించగలమని తెలుసుకోవలసిందిగా దేశభక్తులకు ఈ మహాసభ విన్నవిస్తున్నది.

రెండవ కర్తవ్యము మన రాష్ట్రములో ప్రధాన తెగలైన హిందు ముస్లింలమధ్య సఖ్యతాయైక్యతను చేకూర్చుట, అట్టి ఐక్యత ప్రజాప్రభుత్వ స్థాపనకవసరమని ఈసభ అభిప్రాయపడుచున్నది. పైన వివరించిన కార్యక్రమముపై ప్రజలందరిని ఐక్యపరచుట ప్రస్తుతము హిందూముస్లిం ప్రజల మధ్య యున్న అనుమానాలు తొలగించుటవల్ల అట్టి బలమైన హిందూ ముస్లింల కలయికను సాధించగలము

అట్టి ఐక్యతయొక్కయు, ప్రజావుద్యమబలము యొక్కయు ఆధారంగా ప్రజాప్రభుత్వమును ఏర్పరచగలుగుదుము. ఇట్టి ప్రజాప్రభుత్వస్థాపన ద్వారా మన ప్రధాన ఆశయమైన బాధ్యతాయుత పరిపాలనను సాధించగలుగుతాము. కనుక పైన వివరించిన కర్తవ్యములను నెరవేర్చి ఆంధ్ర మహాసభను బలపరచి స్వతంత్ర భారతదేశములో ప్రజాస్వామిక హైద్రాబాదును నిర్మించుటకు ముందుకు రావలసిందని దేశీయులను మహాసభ కోరుచున్నది."

పై తీర్మానంలో ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర పరిషత్తు, కర్ణాటక పరిషత్తు, ఇత్తెహాదుల్ ముసల్మీను ప్రతినిధులతోగూడిన ప్రజామంత్రి

వర్గాన్ని ఏర్పరచాలని మాత్రమే ఉంది. ఆ మంత్రివర్గంలో ఇత్తెహాదుల్ ముసిల్మీనుకు ఎన్నిస్థాలు ఉండాలి అనేది స్పష్టపరచబడలేదు. ఆంధ్రమహాసభ అధ్యక్షుడు తన అధ్యక్షోపన్యాసంలో దాన్ని స్పష్టపరిచాడు.

"ముస్లిముప్రజల అనుమానాలను తొలగించి మతస్వాతంత్ర్యాన్ని రక్షించవలెను ముస్లింప్రజల ఈ అనుమానాలను తొలగించి హిందూ-ముస్లిం సఖ్యత కుదుర్చుట అత్యవసరమని నా అభిప్రాయం. ఇట్టి ఐక్యతను సాధించుటకై నేను ఒక ప్రాతిపదికను సూచించుచున్నాను.

1. ప్రజాప్రభుత్వంలో సగముసభ్యులు ఆంధ్ర,మహారాష్ట్ర,కర్ణాటక మహాసభల ప్రతినిధులును, మిగతా సగము సభ్యులు అంజుమన్ ఇత్తేహాదుల్ ముసిల్మీన్ ప్రతినిధులు అయి ఉండవలయును.

2. ప్రస్తుతమున్న ప్రభుత్వోద్యోగులు వారి స్థానములలో వుండవలయును. ఇత్తెహాదుల్ ముసిల్మీన్, మూడు మహాసభలు ఒప్పుకున్న విధానంప్రకారము నూతన ఉద్యోగులను తీసుకొనవలయును."

3. "ప్రతిపౌరుని మత స్వాతంత్ర్యాన్ని రక్షించవలయును."

ఆంధ్రమహాసభ తీర్మానం, అధ్యక్షోపన్యాసంలోని సూచనలు హిందూ ముస్లిము ఐక్యతను సాధించడానికి ప్రాతిపదికగా ఉండగలవు.

అయితే పైనాలుగు సంస్థలకే మంత్రివర్గంలో ప్రాతినిధ్య ముండట మేమి? ఆర్యసమాజం హిందూమహాసభ నిమ్నజాతులు మొదలైన వాటికి ఎందుకు ప్రాతినిధ్యం ఉండగూడదు? అనే ప్రశ్నరావచ్చును. పైనాలుగు సంస్థలు మొత్తం హైదరాబాదులోని హిందు ముస్లిము జనసామాన్యానికంతకూ ప్రాతినిధ్యం వహిస్తున్నవి అవి వారి రాజకీయ, ఆర్థిక ఇతర అన్ని హక్కులకోసం పాటుబడుతున్నవి. ఆంధ్రమహాసభ మహారాష్ట్ర, కర్నాటక పరిషత్తులు, సంస్థానంలోని ఆంధ్రమహారాష్ట్ర కర్ణాటక భాషలు మాట్లాడే మూడు ప్రాంతాలలోని పై మూడుభాషలు మాట్లాడే ప్రజలందరి సంస్థలు ఆ మహాసభలలో జాతీయవాదులు కమ్యూనిస్టులు హిందూమహాసభవాదులు మొదలైన అన్ని రాజకీయ గ్రూపులవారు ఉన్నారు. ఇత్తేహాదుల్ ముసిల్మీను సంస్థానంలోని 14 లక్షల ముస్లిములకు ప్రాతినిధ్యం వహిస్తోందనుట నిర్వివాదాంశం. వారి రాజకీయభావాలను అది ప్రతిబింబిస్తుంది. హిందూమహాసభ 1938 లో సంస్థానం బయటనుంచి వాలంటీర్లను దింపి, సత్యాగ్రహం చేయించింది. దానికి సంస్థానంలో ప్రత్యేక పలుకుబడి ఏమీలేదు. కొద్దికాలంక్రిందనే హైదరాబాదు స్టేటు

హిందూ ప్రజామండలి అనే పేరుతో, ఒక నామమాత్రమైన సంస్థ నిర్మింప బడింది. హిందూమహాసభ అభిప్రాయాలు కలవారు ఆయాప్రాంతీయ మహాసభల్లో ఉన్నారు గనుక, ప్రజామంత్రివర్గంలో ఆ ప్రాంతీయ సభల ద్వారా వారికి ప్రాతినిధ్యం దొరుకుతుంది. హిందూమహాసభకు సంస్థానంలో ప్రత్యేక పలుకుబడి ఏమీలేదు గనుక దానికి మంత్రివర్గంలో స్థానం అవసరంలేదు.

ఆర్యసమాజానికి హైదరాబాదు సంస్థానంలో గమనింపదగిన పలుకు బడి ఉంది. కాని ఇది రాజకీయ పలుకుబడిగాదు. ఆర్యసమాజం భారత దేశం మొత్తంమీద చూచుకున్నా, హైదరాబాదు సంస్థానంలో చూచినా హిందూమతంలో ఉన్న లోపాలను సంస్కరించడం దాని ప్రధానకార్య క్రమం. అది మతసంబంధమైన కార్యక్రమంతోనే పనిచేసింది. ఆర్య సమాజీయులకు ఒక ప్రత్యేక రాజకీయ కార్యక్రమంలేదు. మతసంస్కర ణల విషయంలో అందరికీ ఒకేఅభిప్రాయమున్నా, రాజకీయ విషయాలలో ఏకాభిప్రాయంలేదు. ఆర్యసమాజీయులలో కొందరు జాతీయవాదులున్నారు: మరికొందరు హిందూమహాసభ వాదులున్నారు హైదరాబాదు సంస్థానంలో గూడ ఆర్యసమాజం దేవాలయాలు బాగుచేయించుకొనుట, హోమగుండాలు కట్టించుకొనుట మతసభలు జరుపుకొనుట మొదలైన మతహక్కుల కోసం పాటుబడింది. వాటి విషయంలోనే ప్రభుత్వంతో రాజీపడి. కొన్ని హక్కులను గూడ సంపాదించింది. ఆర్యసమాజీయులలో అనేక రాజకీ యాభిప్రాయాలు కలవారున్నారు పైమూడు మహాసభలలోగూడ ఉన్నారు. ఆర్యసమాజం ఈ సంవత్సరం మహాసభలో బాధ్యతాయుత పరిపాలన కావా లనే తీర్మానం పాసుచేసినా, ఇతర మతసంస్థలు, వైజ్ఞానికసంస్థలు రాజ కీయ తీర్మానాన్ని పాసుచేసినట్లుగానే పాసుచేసిందిగాని, అది ఒకరాజకీయ కార్యక్రమంతో ప్రజలను సమీకరించుటలేదు. ఆర్యసమాజానికి గమనింప దగిన పలుకుబడేఉన్నా, అది మతసంబంధమైనదే కనుకనూ, ఆర్యసమా జం రాజకీయ కార్యక్రమంతో పనిచేయుటలేదు కనుకనూ, రాజకీయసంస్థ కాదు కనుకనూ, వారు పై మూడుసంస్థలలో ఉన్నారు కనుకనూ, దానికి ప్రత్యేకంగా మంత్రివర్గంలో స్థానాలు అవసరంలేదు.

అయితే ఇత్తెహాదుల్ ముసిల్మీనుగూడ మతసంస్థయేగదా అని అన వచ్చును. ఇత్తెహాదులు ముసిల్మీను, ముస్లిముల మతహక్కులకోసం పాటుబడుతున్నా, అది వారి రాజకీయ ఆర్థికభావాలను వెల్లడించుతోంది.

అది ముస్లిములలో ఒక రాజకీయ, ఆర్థిక కార్యక్రమంతో పనిచేస్తోంది. ముస్లిము ప్రజాసామాన్యంలో చాల పలుకుబడిని గలిగిఉంది. దానికి మంత్రివర్గంలో స్థానం లేకపోవడమంటే, 14 లక్షల మహమ్మదీయులకు ప్రాతినిధ్యం లేదన్నమాట. బాధ్యతాయుత ప్రభుత్వ నినాదం వదలివేసి, దానిస్థానే ప్రజామంత్రివర్గం అనే నినాదాన్ని తీసుకువచ్చి పెడుతున్నామా, అనే అనుమానం రావచ్చు. అలాగాదు. భారతదేశాన్ని నేడెదుర్కొన్న కరువునుండి కాపాడటానికి, ఫాసిస్టువ్యతిరేక యుద్ధంలో భారతదేశం యొక్క బలాన్నంతా సమీకరించి పాల్గోడానికి, బ్రిటిషు ఇండియాలోని కాంగ్రెసువాదులు, ముస్లింలీగువాదులు, కమ్యూనిస్టులు, ఇతరులు జాతీయ ప్రభుత్వాన్ని ప్రస్తుత నినాదంగా కోరుతున్నారు. దీని అర్థం వారు సంపూర్ణ స్వాతంత్ర్య నినాదాన్ని వదలుకొన్నారని గాదు. బ్రిటిషుప్రభుత్వం తన అధికారాన్ని ఏమీ వదలుకోడానికి ఇష్టపడలేదు. మొదట అమెరీగారి 'ఆగస్టు ఆఫరు' తరువాత క్రిప్సుగారి ప్రతిపాదనలు చేసింది. వీనిని కాంగ్రెసు, ముస్లిములీగు, కమ్యూనిస్టులు అంగీకరించలేదు. రాజకీయ ప్రతిష్టంభన అంతమొందించి, సంపూర్ణ స్వాతంత్ర్యం వైపుకు ముందుకు పోవాలంటే, సంపూర్ణస్వాతంత్ర్యం అనే నినాదం పట్టుకు వ్రేళ్ళాడితే ప్రయోజనంలేదు. ఈ యుద్ధ పరిస్థితులలో సంపూర్ణ స్వాతంత్ర్యమనే నినాదం ఇచ్చి, దానికి బ్రిటిషు అమెరికను ప్రజల సహకారాన్ని సంపాదించలేం. అందుచే ఆ ప్రజలసహాయంతో బ్రిటిషు సామ్రాజ్యవాదులను వంచడానికి జాతీయప్రభుత్వమనే తాత్కాలిక నినాదం యివ్వబడింది. ఈ జాతీయప్రభుత్వ నినాదం రాజకీయప్రతిష్టంభనను అంతమొందించి, సంపూర్ణస్వాతంత్ర్యం వైపుకు భారతదేశాన్ని ముందుకు తీసుకుపోవడానికి, ఆయుధంగా ఉపయోగపడుతుంది.

అలాగే హైదరాబాదు సంస్థానంలో ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలను ప్రకటించింది. దీనిని ఇత్తేహాదుల్ ముసిల్మీన్ తప్ప మిగతా ముఖ్య ప్రజాసంస్థలు నిరాకరించాయి. సంస్థానంలో భారతదేశం అంతటిలో వలెనే ఆహారసమస్యతీవ్రతరమై, సంస్థాన ప్రజలను హిందువులను ముస్లింలను అందరినీ ఆకలిజ్వాలలో దగ్ధంచేసే పరిస్థితులు యేర్పడినవి. ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో ప్రభుత్వం సంస్థానంయొక్క అర్థ అంగబాలాన్నంతటినీ సమీకరించలేకుండా ఉంది బాధ్యతాయుత ప్రభుత్వమంటే హిందూ మెజారిటీ పరిపాలన అనీ, అదివస్తే తమ ఆర్థిక సాంస్కృతిక హక్కు

లకు భంగం కలుగుతుందనే అనుమానం ముస్లిం ప్రజాసామాన్యంలో నాటుకొనిపోయి ఉంది. ఇత్తెహాదుల్ ముసిల్మీను బాధ్యతాయుత ప్రభుత్వ నినాదాన్ని వ్యతిరేకించుతోంది. హైదరాబాదు సంస్థానంలో ఏర్పడిన ఈ రాజకీయ ప్రతిష్టంభనను అంతమొందించాలంటే, బాధ్యతాయుత ప్రభుత్వం ఇప్పుడే కావాలనే నినాదాన్ని పట్టుకు వ్రేళ్లాడి ప్రయోజనంలేదు. దీన్ని దూరపు ఆశయంగా పెట్టుకొని, ఈ ప్రతిష్టంభనను అంతమొందించి ఆ ఆశయం వైపుకు ముందుకుపోవడానికి, ప్రజామంత్రివర్గం ఆయుధ మని గ్రహించాలి. అయితే ముస్లింలను బాధ్యతాయుత ప్రభుత్వంలోకి లాగడానికి, ప్రజామంత్రివర్గం ఒక ఉచ్చుగా భావించగూడదు. యుద్ధం జరిగే అంతకాలం ప్రజా మంత్రివర్గంలో ఉంటామని, యుద్ధం పూర్తి అయిన వెంటనే 100 కి 50 సీట్లు మహమ్మదీయుల కుండాలనే సూత్రాన్ని విడనాడి, తిరిగి పూర్వపు బాధ్యతాయుత ప్రభుత్వ నినాదం తీసుకుంటా మని భావించగూడదు. ఈవిధంగా ప్రజామంత్రివర్గ నినాదానికి అర్థం చెబితే, దీన్ని ముస్లింలు ఉచ్చుగానే భావించుతారు. ఈ నినాదాన్నిగూడ తోసిపుచ్చుతారు. పూర్వంవలెగాక ఇప్పుడు బాధ్యతాయుత ప్రభుత్వం హిందూ ముస్లింల అంగీకారంమీదనే ఏర్పడుతుందని స్పష్టపరచాలి; బాధ్యతాయుత ప్రభుత్వమంటే సర్వసాధారణంగా మైనారిటీ వెళ్ళినవారం దరి వోట్లమీద ఎన్నుకోబడిన శాసనసభలో, హిందూమెజారిటీ పెత్తనం క్రింద ఉండటంగాదని స్పష్టపరచాలి. యుద్ధమయిన తర్వాత బాధ్యతా యుత ప్రభుత్వం ముస్లింల అంగీకారమైన రాజ్యాంగవిధానం మీదనే ఏర్పడుతుందని చెప్పాలి. ఎంత త్వరగా బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పడు తుందనేది—హిందువులు ఎంత త్వరగా ముస్లింలలోని అనుమానాలను పోగొట్టి, ఐక్యత సాధించి, ప్రజా మంత్రివర్గాన్ని సాధించుతారో; ఈ ఐక్యతను ఎంత త్వరగా ముందుకు తీసుకుపోతారో; అనేదానిమీద ఆధారపడి ఉంటుంది.

ముస్లిములీగు సంపూర్ణ స్వాతంత్ర్యాశయాన్ని అంగీకరిస్తుంది గనుక, కాంగ్రెసు ముస్లిములీగుకు రాజీపడటానికి ఒక ప్రాతిపదిక ఉందనీ కాని హైదరాబాదు సంస్థానంలో ఇత్తెహాదుల్ ముసిల్మీను అసలు బాధ్యతా యుత ప్రభుత్వం అనే ఆశయాన్ని అంగీకరించనప్పుడు, ప్రజామంత్రివర్గం కోసం రాజీపడటం ఎలా అని కొంతమంది జాతీయవాదులు అభిప్రాయం తెల్పుతున్నారు. ప్రకృతిలో పోల్చబడే వస్తువులు ఎక్కడా ఒకదానితో

మరొకటి పూర్తిగా పోలికుండదు. భారతదేశంలోని ప్రస్తుత సామ్రాజ్య వాద ప్రభుత్వాన్ని ముస్లిములీగు తన ప్రభుత్వం అనుకోదు. అందుచేత భావిభారత దేశంయొక్క రాజ్యాంగవిధానం విషయంలో కాంగ్రెసుతో భేదాభిప్రాయాలు ఉన్నా, ముస్లిములీగు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని కోరుతోంది. కాని హైదరాబాదు సంస్థానంలోని పరిస్థితులు వేరు. అక్కడ ప్రభువు ఇస్లాం మతస్థుడు. ముస్లిములు మైనారిటీ. అందుచే రాజకీయావసరాలకోసం ముస్లింలకు ఉద్యోగాలియ్యడం వగైరాలలో పక్షపాతం చూపబడుతోంది. జాతీయవాదులు బాధ్యతాయుత ప్రభుత్వం, ముస్లిము జనసామాన్యంయొక్క అంగీకారంమీదనే ఏర్పడుతుందనే విశ్వాసం వారిలో కల్గించలేకపోయారు. అందుచే బాధ్యతాయుత ప్రభుత్వమంటే హిందూ పెత్తనమనే భావం, ముస్లిము ప్రజాసామాన్యంలో కల్గజేయడానికి ముస్లిము మతతత్వవాదులకు అవకాశం గల్గింది. ఈ పరిస్థితులలో ముస్లిములు బాధ్యతాయుత ప్రభుత్వాశయాన్ని అంగీకరిస్తేనేగాని, ప్రజామంత్రి వర్గ నినాదంమీద రాజీపడటానికి నిరాకరించడం, "పెండ్లిపిచ్చి" సామెతకు సమానమవుతుంది.

ప్రజామంత్రివర్గం ఒక శాసనసభకు బాధ్యతవహించి ఉండకపోతే, ఈ మంత్రివర్గం ప్రజాస్వామ్యంమీద ఆధారపడనట్లేగదా ? అనే ప్రశ్న కొందరు లేవదీస్తున్నారు. బాధ్యతాయుత ప్రభుత్వమనే నినాదము యొక్క మరొకరూపమే పైప్రశ్న. శాసనసభకు బాధ్యతవహించే మంత్రివర్గమంటే, బాధ్యతాయుత ప్రభుత్వమేగదా ? అయితే శాసనసభ లేకపోయినంత మాత్రాన, ప్రజామంత్రివర్గం ప్రజాస్వామ్య సూత్రాల మీద ఆధారపడలేదనడం పొరపాటు. శాసనసభ రూపంలో ప్రజాస్వామ్యం ఒక నిర్మాణ స్వరూపంలో లేకపోయినా, ప్రజామంత్రివర్గం ప్రజలయొక్క అభీష్టంమీదనే ఆధారపడి ఉంటుంది. నాలుగు ముఖ్యమైన ప్రజాసంస్థల ప్రతినిధులతో గూడిన మంత్రివర్గమంటే, వాస్తవికమైన ప్రజాస్వామ్యంగాక మరేమిటి ? బాబేహుకూమత్‌కీ దీనికీ తేడా యేమంటే, బాబేహుకూమత్‌లో ప్రజా ప్రతినిధులెవ్వరూ లేరు. కాని ప్రజామంత్రి వర్గంలో ఉండేవారు ప్రజాప్రతినిధులు. ప్రజామంత్రివర్గ నిర్ణయాలలో ప్రత్యేక పరిస్థితులలో, జాతీయ ప్రభుత్వంమీద వైస్రాయికివలెనే, ప్రభువుగారికి జోక్యం కలిగించుకోడానికి అధికారం ఉంటుంది. కాని ఈ జోక్యం ఎంత తక్కువగా ఉంటుంది అనేది, హిందూ ముస్లింలమధ్య ఐక్యత ఎంత గాఢంగా

ఉంటుంది అనేదానిమీద ఆధారపడుతుంది. అంతేగాని ప్రభువుగారికి మంత్రివర్గానికి ఉండే సంబంధాన్నిగూర్చి స్పష్టంగా చెప్పడానికి సాధ్యం గాదు.

సంస్థానంలో ముస్లింలు 100 కి 14 మంది ఉన్నప్పుడు, ప్రజా మంత్రివర్గంలో వారికి సగం స్థానాలు, 100 కి 86 మందిగా ఉన్న ఇతరులకు సగం స్థానాలు; అనేది మామూలు ధోరణిలో ఆలోచించితే ఇది సబబుగా కన్పించకపోవచ్చు. కాని ఇది మామూలు విషయం గాదు. హైదరాబాదు సంస్థానాన్ని ప్రస్తుతం ఆకలిమంటలనుండి కాపాడే సమస్య, సంస్థాన అభివృద్ధికి, భవిష్యత్తుకు సంబంధించిన సమస్య. సంస్థానంలో హిందూ ముస్లిము ఐక్యత లేనిది, సాంఘికంగా ఆర్థికంగా రాజకీయంగా ఒక్క అడుగుగూడ ముందుకు వేయలేమని స్టేటుకాంగ్రెసు అంగీకరించింది. దీన్ని అంగీకరించితే, ఇటువంటి ఐక్యత సాధించడానికి మనం ఏమైనా త్యాగం చేయాలిసిందే. భారతదేశం ఏకఖండంగా ఉండాలని విశ్వసించిన మన నాయకుడు గాంధీజీ, వివరాలలో భేదమున్నా ముస్లింలీగు కోరిన స్వయంనిర్ణయ సూత్రాన్ని అంగీకరించలేదా? భారత దేశ స్వాతంత్ర్య రక్షణకోసం, ముస్లిముజాతుల స్వయంనిర్ణయహక్కు ఎలా గుర్తించబడిందో, అలాగే హిందూ - ముస్లిము ఐక్యతకోసం సంస్థానంలో మనం ప్రజామంత్రివర్గంలో సగం స్థానాలు ఇత్తెహాదుల్ ముసిల్మీనులకు మిగతా సగం స్థానాలు మూడుమహాసభలకు, అనే నినాదాన్ని అంగీకరించాలి. భారతదేశానికంతకు ముస్లిముజాతుల స్వయం నిర్ణయ హక్కును గుర్తించి గాంధీజీ మనకు మార్గంచూపాడు. మనం సంస్థానాలలో ఆయాపరిస్థితులనుబట్టి హిందూ - ముస్లిము ఐక్యతకు కార్యక్రమం అవలంబించాలి. పై సూత్రాన్ని అంగీకరించకపోతే, సంస్థానంలోని రాజకీయప్రతిష్టంభన ఇలాగే కొనసాగుతుంది. ఆహారసమస్య తీవ్రతరమవుతుంది. ఆకలిజ్వాలలు ప్రజలను, హిందూ - ముస్లిములను దగ్ధం చేస్తాయి. ఇప్పటి నిరంకుశవిధానం ఇంకా తీవ్రతరమవుతుంది. పై సూత్రాన్ని అంగీకరించితే, హిందూ - ముస్లిము ఐక్యత, ప్రజామంత్రి వర్గం, హిందువులకు, ముస్లిములకు ఆహారం, రైతులకు పన్నుభారం తగ్గడం, కార్మికులకు హక్కులు, తగిన జీతాలు, వసతులు, చివరకు సంస్థానప్రజల హృదయాలలో గాఢంగా నాటుకుపోయిన బాధ్యతాయుత ప్రభుత్వం. కనుక మనం చూడాలిసింది, ముస్లిములు 100 కి 14 మంది

ఉంటే, ప్రజామంత్రివర్గంలో సగం స్థానాలు ఇస్తున్నామనిగాదు. దీనివల్ల మనం ప్రజాస్వామ్యాశయం వైపుకు ఒక అడుగు ముందుకువేస్తున్నామా, లేదా అనిమాత్రమే।

గ్రామోద్యోగులను మినహాయించితే, మిగతా ప్రభుత్వోద్యోగులలో ముస్లిముల జనాభాతో పోల్చి చూచితే, చాల ఎక్కువమంది ఉన్నారు. బాధ్యతాయుత ప్రభుత్వం వస్తే, తమ్మ ఉద్యోగాలనుండి తీసివేసి, హిందువులను ఎక్కిస్తారనే భయం ముస్లిములకుంది. దీనికి కారణం ముఖ్యంగా హిందూమత తత్వవాదుల ప్రచారం. స్టేటుకాంగ్రెసు, ఉద్యోగాలు అల్ప సంఖ్యాకులకు ప్రత్యేకించబడవని ప్రకటించింది. ప్రజామంత్రివర్గం ఇప్పుడు ముస్లిములు అనుభవించుతున్న ఉద్యోగాలను గ్యారంటీ చేయాలి. ఇక ముందు, మూడు మహాసభలు, ఇత్తెహాదుల్ ముసిల్మీన్ అంగీకరించిన ప్రకారం ఉద్యోగుల నిష్పత్తిని ఏర్పరచాలి. అప్పుడే ప్రజామంత్రివర్గ నినాదానికి మనం ముస్లిము మధ్యతరగతివారి సహకారాన్ని పొంద గలుగుతాం.

చివరివిషయం మతం సంస్కృతి భాష వగైరా. అన్ని అల్పసంఖ్యాక ముఠాల మతసంస్కృతి భాష రక్షింపబడతాయనిగూడ హామీ ఇయ్యాలి.

హైదరాబాదు సంస్థానం ముస్లిము రాజ్యమనీ, ముస్లిములు పాలక జాతి అనీ, ముస్లిములకు చారిత్రికంగా లభించిన ఔన్నత్యాన్ని సంకుచిత పరచడానికి యిష్టపడమనీ, ప్రభుపుగారు ముస్లిమ్ ఔన్నత్య చిహ్నమవడం వలన ఆయన సంపూర్ణాధికారాన్ని ఏకొద్దిగానైనా సంకుచితపరచడానికి తామంగీకరింపజాలమనీ. తీవ్రంగా ప్రచారంజేసిన ఇత్తెహాదుల్ ముసిల్మీను ముస్లిములు ప్రజామంత్రివర్గంలో, సగం స్థానాలు అనే సూత్రంమీదనైనా కలిసివస్తారా అనే అనుమానం జాతీయవాదులు వెలిబుచ్చుతున్నారు. పై విధంగా ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకత్వం పూర్వం అన్నమాట నిజమే. ఈ భావాలు ముస్లిము ప్రజాసామాన్యంలోగూడ వ్యాపించినమాట గూడ నిజమే. ఈ విధంగా ఒకప్పుడు అన్నారుగనుక కలిసిరారు అని అనడం సరియైనదికాదు. ఏ పరిస్థితులలో ఈవిధంగా అన్నారో తెలుసు కొంటే, మనం ఇప్పుడు ఇస్తున్న ప్రజామంత్రివర్గ నినాదానికి ఇత్తెహాదుల్ ముసిల్మీను కలిసివస్తుందో లేదో తెలుస్తుంది. కనుక మనం కొంచం పాత చరిత్ర త్రవ్వడం అవుసరం.

షుమారు 1900 సంవత్సరంనుండీ హైదరాబాదులో ఆర్యసమాజం పనిచేస్తూఉంది. ఆర్యసమాజం మొదట ప్రధానంగా హిందూమత సంస్కరణకోసం పనిచేస్తున్నా, క్రమంగా దాని కార్యకలాపంలో ఇతరమతాల ముఖ్యంగా ఇస్లామును దూషించడం, అన్నిమతాలకన్న హిందూమతం గొప్పదని వాదించడం ప్రధానభాగమయింది. 1921 లో భారతదేశమంతటా రేగిన సత్యాగ్రహోద్యమంవల్ల, హైదరాబాదు హిందువులలో కల్గిన సంచలనాన్ని, మరేజాతీయసంస్థ లేకపోడంవల్ల, ఆర్యసమాజం తన మతతత్వ ప్రచారానికి వినియోగించింది. 1921 సత్యాగ్రహోద్యమం తర్వాత కాంగ్రెసు ఖిలాఫతు మధ్య చీలికలు భారతదేశమంతటా ఎడతెగకుండా సాగించిన హిందూ ముస్లిము కొట్లాటలు కారణంగా ముస్లిములలో ఏర్పడిన సంచలనంవల్ల, హైదరాబాదు సంస్థానంలో ఇత్తెహాదుల్ ముసిల్మీను 1928 లో ఏర్పడింది. ఉద్యమం ప్రథమస్థాయిలో ఉన్నప్పుడు ప్రజల్లో విప్లవ చైతన్యం లేనప్పుడు కాంగ్రెసు ఎలాగైతే రాజభక్తి తీర్మానాలు చేసిందో, అలాగే ఉత్తెహాదుల్ ముసిల్మీనుగూడ తన ఆశయాలలో రాజభక్తిని ఒక హంశంగా పెట్టుకొంది. సైమన్ కమీషన్ భారతదేశం రావడం, దాన్ని బహిష్కరించడంలో భారతదేశం చూపిన సాహసం, అందరి సంస్థానాధీశులవలే హైదరాబాదు సంస్థానాధీశునిగూడ కదిల్చింది. హైదరాబాదు సంస్థానంలో ముస్లింలు మైనారిటీ ప్రభువు ఇస్లాం మతస్తుడు. ఇంక కావలసినదేముంది. రాబోయే ప్రజా వెల్లువ నుండి తమ్ము రక్షించుకోడానికి నిరంకుశ పాలకులు ఎప్పుడూ మైనారిటీ మీదనే ఆధారపడతారు. బ్రిటిషు సామ్రాజ్యవాదుల ఎత్తుగడ అదే. తమ గురువులవద్దనుండి సంస్థానాధీశులు ఆపాఠం నేర్చుకోవడంలో ఆశ్చర్యమేముంది. హైదరాబాదు సంస్థానంలో పైగా సంస్థానాధీశునికి మైనారిటీకి మత సంబంధంగూడ ఉంది (ఇలాగే కాశ్మీరులో హిందువులు మైనారిటీ ప్రభువు హిందువు. హిందువులు ప్రజాస్వామ్య ఉద్యమానికి వ్యతిరేకులు) హిందువులలో జాతీయ సంస్థ పనిచేయడంలేదు. ఆర్యసమాజం మతతత్వ ప్రచారం చేస్తోంది. ఈ పరిస్థితులలో ముస్లిం మతతత్వవాదులు ముస్లింలను పెడమార్గాన పట్టించడానికి అవకాశం గల్గింది. తరువాత మతతత్వ వాదంలో ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయకులు ఆర్యసమాజీయులను పోటీచేశారు. 1936 లో తబ్లీగ్ (ముస్లిం మతంలో చేర్చుకోవడం) ప్రారంభించారు. 1938 లో జరిగిన సత్యాగ్రహోద్యమానికి

వ్యతిరేకంగాగూడ ముస్లిం ప్రజాసామాన్యాన్ని ముందుకు తీసుకువచ్చారు. ఇందుకు ప్రధాన కారణం స్టేటుకాంగ్రెసు ముస్లింలలో ప్రజాస్వామ్య మంటేను, బాధ్యతాయుత ప్రభుత్వమంటేను కల్పింపబడిన అపోహలను తొలగించే కార్యక్రమం ఇవ్వకపోవడం; రాజకీయరంగంలో జాతీయ వాదులు ప్రధానశక్తిగాలేక, ఆర్యసమాజీయులు ప్రధానశక్తిగా ఉండడం. మొదట ఇత్తెహాదుల్ ముసిల్మీను నాయత్వం తమకు చారిత్రిక ఆధిక్యత ఉందనీ, ప్రభువుయొక్క సంపూర్ణాధికారాన్ని సంకుచిత పరచడం తమ ఆధిక్యతకు దెబ్బకొట్టడమని ప్రచారం జేశారు. 1940లో ఫ్రాన్సు పడి పోయిన తర్వాత, బ్రిటిషు సామ్రాజ్యవాదం ఏమవుతుందో అనే అనుమా నాలు ప్రబలినప్పుడు, ఇత్తెహాదుల్ ముసిల్మీన్ మతఅహంకారాన్ని ఒక మెట్టు పైకి తీసుకుపోయింది. ముస్లింలు పాలకజాతి అనే సిద్ధాంతాన్ని లేవదీసింది. కాని ఇప్పుడు ఆసిద్ధాంతాన్ని ప్రచారంచేయడం మానివేసింది. ఈమధ్య తమ ఉపన్యాసాలలో కే॥ శే॥ బహద్దరు యార్ జంగుగారు తాము బాధ్యతాయుత పరిపాలనకు సూత్రప్రాయంగా వ్యతిరేకులం కామనీ, హిందూముస్లిం ఐక్యతకావాలని అనాలిసి వచ్చింది. పాలకజాతి అని ఎంతగా ప్రచారం చేస్తున్నా, అసలు ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని సూత్ర ప్రాయంగా ఎన్నడూ వ్యతిరేకించలేము. 1940 లో (ఇత్తెహాదుల్ ముసి ల్మీను మత అహంకార ప్రచారం జోరుగా సాగించుచున్నప్పుడే) 70,000 మంది ముస్లిం ప్రజాసామాన్యం ముందు ఇత్తెహాదుల్ ముసిల్మీను కాన్ఫ రెన్సులో ఉపన్యసిస్తూ ఈక్రిందివిధంగా చెప్పాడు :

" ప్రజాస్వామ్యమంటే ఓట్లు లెక్కపెట్టడమని మాత్రమే ఊహింప బడుతోంది. ఈవిధంగా భారతదేశంలో చులకనగా ముస్లిములను మైనారిటీ అని, ప్రజాస్వామ్యంపేర వారి హక్కులను నాశనం చేయవచ్చు. నేడు రాజును పూజించే హిందువులు ప్రజాస్వామ్యం కావాలని కోరడానికి కారణం ఇదితప్ప మరేమీగాదు. ముస్లిములీగు, ఇత్తెహాదుల్ ముసిల్మీను తర్వాత ఎన్నో సంవత్సరాలకు, పై సూత్రప్రాయమైన ప్రజాస్వామ్యం భారతదేశానికి పనికిరాదనే సత్యాన్ని, గ్రహించింది. మనము ప్రజా స్వామ్యానికి వ్యతిరేకులమనే నేరాన్ని కొందరు మోపుతున్నారు. నేను ఈ రోజు మరల ఈ బాధ్యతగల వేదికనుండి ప్రకటించేదేమంటే, ముస్లి ములు సహజంగానే ప్రజాస్వామ్యభావాలు, స్వతంత్ర ఊహలు కలవారు. ఇస్లాం ప్రజాస్వామ్యం తర్వాత ఎంతో కాలానికి ప్రస్తుత ప్రజాస్వామ్యం

వచ్చింది. అయినప్పటికీ ఇంకా ప్రజాస్వామ్యం ఇస్లాం నిర్మాణంలోనే ఇమిడీ ఉంది. నేను పర్షియా, ఇరాకు మొదలైన దేశాలలో ఉంటే, నా నినాదం ప్రజాస్వామ్యమనే ఉంగేదని మరొకసారి చెబుతున్నాను. కాని మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసిల్మీను, నేడు ముస్లిములీగు చెప్పుతున్న విషయాన్ని ఎన్నో ఏండ్లక్రితమే చెప్పింది. అదేమంటే భారతదేశంలో ఉన్న ప్రత్యేక వాతావరణం పరిస్థితులవల్ల, అవి తొలగనంతవరకూ ప్రజాస్వామ్యం ఈ దేశంలో నిజమైన రాజ్యాంగపద్ధతి కాజాలదు. ప్రపంచంలో ఒకే సంతతికిచెందిన ఒకే నాగరికత గల్గిన ప్రజలుగల జాతికి మాత్రమే ప్రజాస్వామ్య ముపయోగపడుతుంది. మత సామాజిక ఆశయాలలోనేగాక ఆర్థిక, రాజకీయ కోర్కెలలోగూడ ఏకత్వము కలిగి ఉన్న స్వాభావికమైన ఐక్యజాతిలో మాత్రమే, రాజకీయ భేదాభిప్రాయాలతో, మెజారిటీ మైనారిటీలు కలిసిపోగలుగుతాయి. ఏ పార్టీ అయితే తన ఆర్థిక కార్యక్రమం ద్వారా అధిక సంఖ్యను కలిగిఉంటుంటో, ఆ పార్టీ అధికారానికి వస్తుంది. ఈ విధంగా కల్గించబడిన మెజారిటీ, మైనారిటీలు తమ ఆర్థిక, రాజకీయ కార్యక్రమంద్వారా మారుతూ ఉంటాయి. అదే నిజమైన ప్రజాస్వామ్య సూత్రం. ఉదాహరణకు ఇంగ్లండు దేశంలో సామాన్యంగా సంతతి, నాగరికత, మతం, వైజ్ఞానిక దృష్టిలో ఒక జాతిగా మాత్రం కన్పించుతున్నా, రాజకీయంగా ఇది లేబరు, లిబరల్ కన్సర్వేటివు అనే మూడు భాగాలను చేసింది. దీనిలో అధికసంఖ్యాకులకు ప్రాతినిధ్యం వహించే పార్టీకి రాజ్యాధికారం వస్తుంది. ఒక్క ఇంగ్లండునందేగాక, యూరపు నందలి ఇతరదేశములలోగూడ, ఈ విధంగా మెజారిటీ, మైనారిటీ మార్పులద్వారా ఇలాంటి ప్రజాస్వామ్యం జయప్రదమవుట కానవచ్చుచున్నది. కాని భారతదేశంలో అనేకజాతులు ఉండుటవల్ల, ఇక్కడపై ప్రజాస్వామ్యం పనికిరాదు. హిందువులు ఇచ్చుచున్న మెజారిటీ, మైనారిటీ నిర్వచనాలను ఒప్పుకొనుటకు వీలులేదు. ఎందువల్లననగా ఇక్కడ ప్రత్యేక స్థానాన్ని గలిగిన చిన్నపెద్దజాతులను కలుపుకుంటూ మెజారిటీ మైనారిటీ హద్దులు నిర్ణయించబడుతున్నవి. హిందువులకు విరుద్ధంగా తదితర మతాలు, తెగలువారందరూ శాశ్వత మైనారిటీలుగా ఉంటారు. వీరు ఎన్నడు మెజారిటీ అవడానికి అవకాశంలేదు. అందువల్ల ఈ తప్పుడు నిర్వచనం మూలంగా నిర్మింపబడ్డ రాజ్యంలో మైనారిటీ, హిందూ మెజారిటీక్రింద శాశ్వత బానిసత్వంలో మునిగి ఉంగాల్సివస్తుంది. ఇవి సిద్ధాం

తాలు మాత్రమేగావు. గత సంవత్సరం ఆరుమాసాలనుండీ భారతదేశంలో పై రకమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాలు (రాష్ట్రశాసనసభలు) పనిచేయడం మన కండ్లారా చూస్తున్నాం. ప్రతిరాష్ట్రంలోనూ, మైనారిటీలు మెజారిటీ రాజ్యాంగానికి విరుద్ధంగా గోలపెడుతూ ఉన్నవి అస్పృశ్యులు ఒకవైపు గోలపెడుతున్నారు. ముస్లిములు మరొకవైపు అరుస్తున్నారు. ముస్లిముల రాష్ట్రాలలో హిందువులు తమహక్కులు నాశనమవుతున్నవని అంటున్నారు."

"నేను ఇరాకు పర్షియా మొదలైన దేశాలలో ఉంటే, నానినాదం ప్రజాస్వామ్యమయి ఉండేది" అనీ "ప్రజాస్వామ్యమంటే తలకాయలు లెక్కపెట్టడం భారతదేశంలో ముస్లిముల హక్కును ప్రజాస్వామ్యం పేరిట నాశనం చేయవచ్చు." అనీ అనడంలో అర్థమేమిటి? ఇంగ్లండు ఫ్రాన్సు మొదలైన దేశాలలోని ప్రజలు ఒకేజాతికి చెందినవారనీ అందుచేత అక్కడ ప్రజాస్వామ్యం పనికివస్తుందనీ: భారతదేశంలోని ప్రజలందరూ ఒకేజాతివారు కాదనీ, అనేక జాతులున్నాయనీ, ఆ పరిస్థితులలో ఇంగ్లండు లోవలెనే 'మెకానికలుగా' ప్రజాసామ్యాన్ని భారతదేశంలో అమలుజరిపితే మైనారిటీపేర ముస్లిములు అణచివేయబడుతారనీ. కీ శే. బహద్దుర్ యారు జంగుగారు వాదిస్తున్నారు. మనం ముస్లిము ప్రజాసామాన్యంలో,

ప్రజాస్వామ్యమంటే తలకాయలు లెక్కబెట్టడం మాత్రమేగాదనీ, హిందూ ముస్లిములకు అంగీకృతమైన ప్రజాస్వామ్య రాజ్యాంగ విధానాన్ని ఏర్పరచుకోవడమనే అభిప్రాయం గలుగజేస్తే, మతతత్వవాదులకు ముస్లిము జనసామాన్యాన్ని పెడత్రోవ బట్టించడానికి అవకాశముండేది కాదు. ముస్లింలలోఉన్న అనుమానాలను ప్రజామంత్రివర్గ నినాదం పోగొట్ట గలుగుతుంది. వారిని ప్రజాస్వామ్యంవైపుకు తీసుకురాగలుగుతుంది.

అంతేగాక ఇప్పుడు కమ్యూనిస్టుపార్టీ ముస్లిము యువకులను ఆకర్షించుతోంది. ప్రఖ్యాతకవి మ. గ్దూం మొయ్యద్దీన్. .జవాద్, సయ్యద్ ఇబ్రహీంలాంటి ముస్లిము యువకులు కమ్యూనిస్టులు. వీరిబలం కృషిగూడ హిందూ ముస్లిము ఐక్యత సాధించటానికి ఎంతో తోడ్పడుతుంది.

హైదరాబాదు సంస్థానంలోఉన్న 14 లక్షల ముస్లిములు ప్రభుత్వోద్యోగులుగాని జాగీరుదార్లుకాదు. వారిలో అత్యధికసంఖ్యాకులు కార్మికులు, రైతులు, పట్టణాలలో, టాంగాబళ్ళు తోలుకునేవాళ్ళు, చిన్నదుకాణాదార్లు మొదలైన కాయకష్టం చేసేవారు. రైతులమీదఉండే పన్నుభారంక్రింద, హిందూరైతుతో సమానంగా వారు నలిగిపోతున్నారు. జాగీర్లలో హిందూ

ప్రజలతోపాటు వారుగూడ జాగీరుదార్ల నిర్బంధవిధానాన్ని అనుభ విస్తున్నారు. కార్మికచట్టాలు లేకపోవుటవలన కలిగే ఇడుములను హిందూ కార్మికులతో సమానంగా వారు అనుభవిస్తున్నారు ఇప్పుడు హైదరాబాదు సంస్థానంలో ఆహారకొరతవల్ల ఏర్పడ్డ చిక్కులలో ముస్లిము ప్రజా సామాన్యం అందరితోపాటు వారుగూడ బాధపడుతున్నారు. ఇటువంటి పరిస్థితులలో ముస్లిము ప్రజాసామాన్యంలోఉన్న అనుమానాలను తొలగిం చితే, వారు ప్రజామంత్రివర్గానికి ఎందుకు అంగీకరించరు ? ఐక్యత వస్తుం దని రాజకీయంగా రుజువుచేయడమేగాదు. కొన్నిచోట్ల ఆచరణలో వచ్చింది. మచ్చుకు రెండు ఉదహరణలు చెబుతాను. కొలనుపాక ముస్లిము జాగీరుగ్రామం. అక్కడ జాగీరుదారు సాలీనా రు. 10,000 అక్రమశిస్తు వసూలు చేస్తూవుండేవాడు. కమ్యూనిస్టులు అక్కడ హిందూ ముస్లిము రైతుల ఐకమత్యం సాధించి, ఆ అక్రమశిస్తును కొంతవరకు రద్దుచేయిం చారు. ఈ ఐక్యతసాధించడానికి పైన వివరించబడిన ప్రజామంత్రివర్గ నినాదం ఎంతో తోడ్పడింది.

వరంగల్లులో ఆజంజాహిమిల్లులో 4000 మంది హిందుమహమ్మ దీయ కార్మికులున్నారు. ఇదివరలో వరంగల్లులో జరిగిన హిందూముస్లిం కలహంలో ఈ కార్మికులు ప్రాముఖ్యత వహించారు. దీని ఫలితంగా ముస్లిం, హిందూకార్మికులమధ్య తీవ్రవిభేదాలు, వైషమ్యాలు ఏర్పడినవి. కమ్యూనిస్టులు వారికష్టాలతోపాటు హిందూ - ముస్లిం ఐక్యతానినాదాన్ని ప్రచారంజేసి, ఐక్యత సాధించి యూనియను పెట్టారు. దాని కార్యవర్గం లోనికి సగంమంది హిందువులు, సగంమంది ముస్లిములు ఎన్నుకోబడేలా చేశారు. 1944 ఫిబ్రవరిలో బోనసు సమస్యమీద వచ్చిన సమ్మెను 23 రోజులు అఖండ ఐక్యతతో సాగించారు. హిందూ - ముస్లిం కలతలు పెట్టి, సమ్మెను పోగొట్టశానికి జరిగిన ప్రయత్నాలను భగ్నంచేశారు. చివరకు పోలీసు లాఠీచార్జీలు నిర్బందవిధానం మాత్రమే సమ్మెను భగ్నం చేయగలిగాయి. సమ్మెకుముందు జరిగిన యూనియను కార్యనిర్వాహక వర్గ ఎన్నికలలో కమ్యూనిస్టులు, సగంమంది ముస్లిములుండాలని సూచిం చితే, ముస్లిము కార్మికులే ఇది అవుసరం లేదని చెప్పి, కార్యనిర్వాహక వర్గంలో ఎక్కువమందిని హిందువులను ఎన్నుకొన్నారు. హిందూ-ముస్లిం ఐక్యత సాధ్యమవడమేగాక, వారి అనుమానాలు తొలిగితే ముస్లిములు

100 కి 50 స్థానాల సూత్రానికిగూడ పట్టుబట్టరని చెప్పడానికి, ఇంకేమి రుజువుకావాలి ?

గతసంవత్సరం ఆంధ్రమహాసభ సాగించిన ఆహారసమస్యను గూర్చిన రేషనింగు చౌకడిపోల కార్యక్రమంలో, పట్టణాలలోని ముస్లిము ప్రజాసామాన్యం సహకారం చేసింది. ఇత్తెహాదుల్ ముసిల్మీను కార్యదర్శి, కమ్యూనిస్టులతో ఆహారసమస్యలో కలిసి పనిజేయమని స్థానిక ఇత్తెహాదుల్ ముసిల్మీను సంస్థలకు సర్క్యులరు పంపడంగూడ జరిగింది ఈ సంవత్సరం మేనెలలో వరంగల్లులో జరిగిన ఇత్తెహాదుల్ ముసిల్మీను కాన్ఫరెన్సులో ఆహారసమస్యమీద స్థానికసంస్థలనుండి షుమారు 150 తీర్మానాలు వచ్చినవి. ఆహారసమస్య ముస్లిము ప్రజాసామాన్యాన్ని ఎంతగా కదిల్చిందో దాన్నిబట్టే తెలుసుకోవచ్చు. ముస్లిము ప్రజాసామాన్యంలో ప్రస్తుత క్లిష్టపరిస్థితులనుబట్టి కమ్యూనిస్టుల కృషివలన, పెద్దమార్పు వచ్చింది ఈమార్పే ఇత్తెహాదుల్ ముసిల్మీనులో ప్రతిబింబించింది. ఈ సంవత్సరం జరిగిన వరంగల్లు మహాసభ ఇందుకు నిదర్శనం. ఆహార సమస్యమీద 150 తీర్మానాలు రావడమేగాక, జాగీరుదార్లనుగూర్చి ఒక తీర్మానం చేయబడింది. దానిలో జాగీరుదార్లు తమ నిర్బంధవిధానాన్ని విడచి, జాగీరు రైతులను దయతో చూడాలని లేకపోతే జాగీరువిధానమే అంతమొందుతుందని తీర్మానించబడింది.

విద్యార్థిఉద్యమంలో పాల్గొన్నందుకు యూనివర్సిటీనుండి విద్యార్థులు కొందరిని తీసివేయడాన్ని ఖండించింది. ఆజంజాహి సమ్మెలో ప్రభుత్వం అవలంబించిన నిర్బంధవిధానాన్ని ఖండించింది. ప్రభుత్వం మున్సిపలు కమిటీలలోనూ జిల్లాబోర్డులలోనూ నామినేషన్‌పద్ధతిని అవలంబించగూడదనీ, ఎన్నికలపద్ధతినే ప్రతినిధులను తీసుకోవాలనీ తీర్మానించింది. ప్రస్తుత బాబేహుకూమత్‌లో అసమర్థులను తొలగించి, ప్రజావిశ్వాసం పొందిన వారిని మంత్రులుగా నియమించాలని కోరింది.

ఈసారి కీ॥ శే॥ బహద్దూర్ ఖాన్‌గారి ఉపన్యాసంలో కొన్ని అభివృద్ధికరమైన విషయాలనుఉన్నవి. ముఖ్యంగా ఆహారసమస్యవిషయంలో వారు చక్కని సూచనల నిచ్చారు. ఈ ఆహారపదార్థాల కరువు దైవికం గాదనీ, మానవులే తెచ్చిపెట్టారనీ అన్నారు. ఈ సమస్యలో అందరూ కులమత వివక్షణలు లేకుండా కలిసిపనిచేయాలని చెప్పారు. ఇత్తెహాదుల్ ముసిల్మీను కులమత వివక్ష లేకుండా జీవకారుణ్యదృష్టితో అందరికీ

ఈ సమస్యలో సహాయం చేస్తుందని చెప్పారు. పండించేరైతులకు అవసరమైనంత ధాన్యాన్ని ఉంచి మిగతాదానినే ప్రభుత్వం తీసుకోవాలనీ, వారికి చౌకగా వ్యవసాయపనిముట్లు నగైరా ఇవ్వాలనీచెప్పారు. అవినీతి వ్యతిరేక డిపార్టుమెంటు సరిగా పనిచేయడానికి అవకాశాలు కల్పించడం లేదనీ, అందుచే లంచగొండులైన ఉద్యోగులను పట్టుకోలేకుండా ఉందనీ, ఈ డిపార్టుమెంటు ఏ ఉద్యోగినిగూర్చి అయినా విచారణచేయడానికి అధికారముండాలనీ; లంచగొండులని తేలినవారిని బహిరంగంగా శిక్షించాలనీ, కోరారు. వ్యవసాయడిపార్టుమెంటులోని లంచగొండి ఉద్యోగులను శిక్షించినందుకు ప్రభుత్వాన్ని అభినందించారు.

వరంగల్లులో జరిగిన ఇత్తెహాదుల్ ముసిల్మీను మహాసభ చరిత్రాత్మకమైనది ఇత్తెహాదుల్ ముసిల్మీను అభివృద్ధికమైన నూతన పంథా త్రొక్కింది. ముస్లిము జనసామాన్యంయొక్క కోర్కెలనేగాక, సంస్థాన ప్రజలందరి శ్రేయస్సునుగోరే కొన్ని ముఖ్యతీర్మానాలు చేసింది. ముస్లిము జనసామాన్యంలో వచ్చిన ఈ మార్పు హిందూ-ముస్లిము ఐక్యతవైపుకు ముందుకు తీసుకుపోవాలి.

ఇత్తెహాదుల్ ముసిల్మీనులో ఒక అభివృద్ధిపక్షం బయలుదేరుతోంది ఈ పక్షం బహిరంగంగా ప్రజాప్రభుత్వం కావాలని కోరడానికి ఇప్పుడు ముందుకు రాలేకపోయినా, ప్రజాప్రభుత్వానికి అనుకూలంగాఉంది. ప్రభువుగారు ఇత్తెహాదుల్ ముసిల్మీనునుండి మంత్రివర్గంలోకి ఒకరిని తీసుకోవడానికి ప్రయత్నించితే, ఇత్తెహాదుల్ ముసిల్మీను ప్రతినిధిని తీసుకోవాలనీ, అతడు బాబేహుకూమత్‌లో ఉన్నా ఇత్తెహాదుల్ ముసిల్మీను ప్రతినిధిగానే ఉండాలనీ, ముస్లిముయువకులు ఆందోళన చేశారు. అసలు మంత్రివర్గంలోకి ఎవ్వరూ తీసుకోబడలేదు. యువకులలో ఇత్తెహాదుల్ ముసిల్మీను ప్రభుత్వానికి బంటుగా ఉండటం ఇష్టంలేదని తేలుతుంది. ముస్లిము యువకులలోని ఈ ప్రజాస్వామ్య మొలలకు, ముస్లిములలోని అనుమాలు పోగొట్టి, పెంచితే అభివృద్ధి అవుతుంది. ముస్లిము విద్యాధికులమీద ప్రపంచ పరిస్థితుల ప్రభావం పడుతోంది. వారు సంస్థానంలోని ప్యూడలు విధానం, దాని దుష్ఫలితాలతో అసంతృప్తి చెందిఉన్నారు. ప్రభుత్వం ముస్లిము విద్యాధికులందరికీ ఉద్యోగాలిచ్చేస్థితిలో లేదు. ముస్లిములలో ఉన్న పై అభివృద్ధిపోకడలు ఎంతత్వరగా అభివృద్ధిఅయి, హిందూముస్లిం ఐక్యత ఎంతత్వరగా సాధింపబడుతుంది? అనేది జాతీయవాదులు ఎంత

త్వరగా సంస్థానంలోని పరిస్థితుల ననుసరించి వారిదృక్పథాన్ని మార్చు కొంటారు అనేదానిమీద ఆధారపడుతుంది.

ఆంధ్రమహాసభ ఈ ప్రతిష్టంభనను అంతమొందించడానికి ప్రజా మంత్రివర్గ సూచనతో ముందుకు వచ్చింది. జాతీయవాదులు తీవ్రంగా వ్యతిరేకించుటవలన, ఆంధ్రమహాసభలో ఐక్యత కాపాడటానికి, కమ్యూనిస్టులు ప్రజామంత్రివర్గంలో ఇత్తెహాదుల్ ముసిల్మీనుకు సగం స్థానాలు అనే సూచనను తీర్మానంలో చేర్చలేదు. అయినా అందుకు తీవ్రంగా ప్రచారం చేస్తున్నారు. జాతీయైక్యతావారంలో (ఆగస్టు రెండవవారం) కమ్యూనిస్టుల ఈ సూచనను తీవ్రంగా ప్రచారంచేశారు, అన్నిచోట్ల ఈప్రచారంలో ముస్లిము యువకులు, ప్రజాసామాన్యం ఉత్సాహాన్ని చూపారు, హైదరాబాదులో హాలులోపెట్టిన సభకు సైతం 2,000 మంది ప్రజలు వచ్చారు. అందులోచాలమంది మహమ్మదీయులున్నారు. ఇత్తెహాదుల్ ముసిల్మీను కార్యకర్తలు, మహారాష్ట్ర జాతీయవాదులు కొందరు గూడ వచ్చారు. కామ్రేడ్ మగ్దూం, ఆంధ్రమహాసభ అధ్యక్షులు, ప్రజామంత్రివర్గం మీద ఇచ్చిన ఉపన్యాసాలు హిందూ - ముస్లిము జనసామాన్యాన్ని ఆకర్షించాయి. ఆంధ్ర జాతీయవాదులు మేల్కోవాలి. ఆంధ్రమహాసభలో కమ్యూనిస్టులు చాచుతున్న సహకార హస్తాన్ని అందుకోవాలి. ప్రజామంత్రివర్గ నినాదాన్ని పూర్తిగా వారుగూడ అంగీకరించి, ఆంధ్రమహాసభను హైదరాబాదు రాజకీయాలలో నాయకురాలుగా తనస్థానాన్ని ఆక్రమించే గౌరవం దక్కించుకొనేలా చేయాలి.

మహారాష్ట్ర పరిషత్తులోని జాతీయవాదులు మెజారిటీగా ఉన్నారు. ఇంకనూ వారు ఆహారసమస్య మొదలైన విషయాలలో నెగిటివ్ పంథానే, అనుసరిస్తున్నారు, బాధ్యతాయుతప్రభుత్వ నినాదమే ఇస్తున్నారు. వారు ప్రజామంత్రివర్గ నినాదాన్ని అంగీకరించి, హిందూ - ముస్లిము ఐక్యత తీసుకురావడానికి తమ పూర్తి శక్తిని వినియోగించాలి

కర్నాటకపరిషత్తు ఇంకనూ మితవాదుల రాజకీయాలనుండి బయటబడలేదు. జాతీయశక్తులు ఇప్పుడిప్పుడే ముందుకు వస్తున్నాయి. ఆంధ్ర మహాసభ, మహరాష్ట్రపరిషత్తులు సోదరసంస్థలు ముందుకు రావడానికి తోడ్పడాలి.

అభివృద్ధిని గోరే ముస్లిము యువకులమీద పెద్ద బాధ్యత ఉంది. ముస్లిములలో "చారిత్రిక అధిక్యత" "పాలకజాతి" మొదలైన మత

అహంకారభావాలను పూర్తిగా పోగొట్టాలి. వారిలో గిడసబారిఉన్న ప్రజా స్వామ్యభావాలను పెంచి, పోషించాలి. ఆహారం అధికోత్పత్తి మొదలైన సమస్యలలో సోదర హిందువులతో కలిసి పనిచేసేలా చెయ్యాలి. ఈ విధంగా చేస్తేనే, ముస్లిములు ప్రజాస్వామ్య విరోధులనీ, ప్రభుత్వ బంటులనీ హిందువులలో ఉన్న అనుమానాలుపోయి, ప్రజామంత్రివర్గ నినాదాన్ని అంగీకరించుతారని వారికి నచ్చజెప్పాలి. ప్రజామంత్రివర్గం వారి ప్రస్తుతకష్టాలను ఎలా పోగొడుతుందో తెల్పాలి.

వరంగల్లు కార్మికులు తమ ఐక్యతద్వారా హైదరాబాదు సంస్థాన ప్రజలకు మార్గదర్శకులయ్యారు. ప్రపంచంలో ప్రతిదేశంలోనూ కార్మిక వర్గమే ఫాసిస్టులకు వ్యతిరేకంగా ముందు నిలబడి ప్రజాసామాన్యాన్ని సమీకరించుతోంది. భారతదేశంలో గూడ జాతీయైక్యతకు ఎడతెగని కృషి చేసింది. హైదరాబాదు సంస్థానంలోని కార్మిక యూనియనులలో ముందు హిందూ - ముస్లిం ఐక్యత సాధించి, ఈ ఐక్యతా ఉద్యమాన్ని దరిజేర్చ డానికి తమశక్తినంతా ధారబోయాలి.

సంఘంలో 100 కి 50 మందిగాఉన్న స్త్రీలు మేల్కొననిదే, ఐక్యత సాధించడం దుర్లభం. సంస్థానంలోని మహిళాసంఘాలు మహిళలను మేల్కొల్పి, ఐక్యతా ఉద్యమానికి వారి బలాన్నికూడా చేకూర్చాలి. కంట్రోలు, రేషనింగు, అధికోత్పత్తి మొదలైన సమస్యల పరిష్కారానికి మహిళలు పూనుకొనేలా చేయాలి.

భారత రాజకీయాలలో విద్యార్థులు ఎప్పుడు ముందే నిలబడి ఉంటారు. హైదరాబాదు విద్యార్థులు భారతవిద్యార్థిలోకం సాంప్రదాయాన్ని నిలపాలి. విద్యార్థికోర్కెలమీద హిందూముస్లిం ఐక్య విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించి, రాజకీయ ప్రతిష్టంభనను అంతమొందించదానికి, విద్యార్థి సంఘాలు తమవంతు నెరవేర్చాలి.

హైదరాబాదు హిందూ ముస్లిం సోదరులందరూ ఏకమవ్వాలి. ప్రస్తుత రాజకీయ ప్రతిష్టంభన అంతమొందించాలి. ప్రజా మంత్రి వర్గాన్ని సంపాదించాలి. ప్రజలను ప్రస్తుత మెదుర్కొన్న ఆహారసమస్యను పరిష్కరించాలి. నూతన స్వేచ్ఛా ప్రపంచంలో హైదరాబాదు సంస్థానం తన స్థానాన్ని తీసుకోడానికి ముందుకుపోవాలి. భారతదేశం నుండి బ్రిటిషువారు వెళ్ళిపోవాలిసివస్తే, హైదరాబాదు సంస్థానం స్వతంత్ర రాజ్యంగా ఉండాలని (ఆజాద్ హైదరాబాదు) ఇత్తైహాదుల్ ముసిల్మీన్ ఇదివరకు కోరి

ఉంది. హైద్రాబాదు స్వతంత్ర భారతదేశంలో కలసి ఉంటుందా ? అని కొంతమంది ప్రశ్నించవచ్చు. ఈ విషయం ఇప్పుడు చర్చించడం అసంభవం. ఈ సమస్య భారత సంస్థానాల కన్నిటికీ సంబంధించినది. యుద్ధమైన తర్వాత స్వతంత్ర భారత దేశంలో సంస్థానాలు ఏవిధంగా ఉంటవి అనేది ఇప్పుడు చర్చించుతూ కూర్చోడం, ప్రస్తుత కర్తవ్యాన్ని మరచి పోవడమే అవుతుంది. స్వతంత్రభారతదేశంతో, హైదరాబాదుసంస్థానం ఎటువంటి సంబంధాన్ని కల్గిఉటుంది అనేది, హైదరాబాదు ప్రజలు హిందువులు ముస్లింలు ఇతరులు నిర్ణయిస్తారు.

## ప్రజాఉద్యమబలంవల్లనే ప్రజామంత్రివర్గం సిద్ధిస్తుంది

పై ప్రజామంత్రివర్గం ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర, కన్నడ పరిషత్తులు, యిత్తెహాదుల్ ముసిల్మీను, నాయకులు ఒకచోట జేరి సంప్రదించుకున్నంతమాత్రాన్నే లభించదు. అది బ్రహ్మాండమైన హిందూ ముస్లిము ఐక్య ప్రజాఉద్యమం యొక్క ఫలితంగా మాత్రమే సిద్ధి చుతుంది. ఈ హిందూ - ముస్లిము ఐక్యప్రజాఉద్యమం ఒక్కనాడు నిర్మించేదిగాదు. ప్రస్తుతం ప్రజలను బాధించుతున్న సమస్యలను పరిష్కరించడానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి, ప్రజామంత్రివర్గం ఎలా సాధనమో, హిందూ ముస్లిము జనసామాన్యంలో రైతులలో, కూలీలలో, కార్మికులలో, స్త్రీలలో, విద్యార్థులలో ప్రచారం చేయ్యాలి. నేడు జనసామాన్యాన్ని ముఖ్యంగా పీడించుతున్న ఆహారసమస్యలో రేషనింగు, ధాన్యసేకరణలలో, ప్రజల దైనందిన కష్టాలమీద హిందూ ముస్లిములను సమీకరించి ఐక్యపరచి ఆ కష్టాలను తీర్చాలి. రైతులను అధికాహారోత్పత్తి కార్యక్రమం మీద సమీకరించి అధికోత్పత్తి సాగించాలి. వారి దైనందిన కోర్కెలను తీర్చాలి. కార్మికులను అధికోత్పత్తి కార్యక్రమం మీద సమీకరించి, వారికి అధిక ధరల అలవెన్సు ఇతరకోర్కెలను సాధించాలి విద్యార్థులను మహిళలను వారి వారి కోర్కెలమీద సమీకరించాలి. ఈ విధంగా క్రమక్రమంగా ప్రజా ఐక్యతను హిందూ ముస్లిము ఐక్యతను రైతులు, కార్మికులు, విదార్థులు మహిళలు. అందరిలోనూ గ్రామ గ్రామాలలోను ప్రతిపట్టణలలోనూ నిర్మించాలి. హిందువుల, ముస్లిముల మధ్యఉన్న అనుమానాలను పోగొట్టాలి. ప్రజలకు వారి ఐక్యబలంలో ఉన్న శక్తిని ప్రత్యక్షంగా చూపి, ఆత్మవిశ్వాసం గలుగజేయాలి. ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్తులు, ఇత్తెహాదుల్ ముసిల్మీన్‌లు పైవిధంగా ప్రజాకార్యక్రమం

తీసుకు పనిచెయ్యడంద్వారా. ప్రజా ఐక్యత నిర్మించడం ద్వారా బ్రహ్మాండమైన ప్రజా సంస్థలుగా తయారు గావాలి. ప్రజా మంత్రివర్గాన్ని గూర్చి ప్రచారం చేయడంద్వారాను, ప్రజలందరి దైనందిన సమస్యలను తీసుకొని పనిచేసి ప్రజా ఐక్యత నిర్మించడంద్వారాను, హిందూ ముస్లిం ఐక్యత సాధించబడుతుంది. ఈ క్రింది కనీస కార్యక్రమం మీద హిందూ ముస్లిం ఐక్యత సాధ్యమవుతుంది. ప్రజామంత్రివర్గం హిందూ ముస్లిం ఐక్య ప్రజాఉద్యమబలంతో ఈక్రింది కార్యక్రమాన్ని పూర్తిగా అమలు జరపడమంటే. హైదరాబాదు సంస్థానంలో ఎంత అభివృద్ధి కరమైన మార్పు వస్తుందో అందరూ గ్రహించవచ్చును. ఇప్పటి పరిస్థితులకు అప్పటి పరిస్థితులకు ఎంత తేడాఉంటుందో చూడండి.

# ప్రజామంత్రివర్గ కార్యక్రమం

## రాజకీయం

1. ఆంధ్ర, మహారాష్ట్ర. కర్నాటక మహాసభలు. ఇత్తిహాదుల్ ముస్లిమీన్ ప్రతినిధులతో ప్రజామంత్రివర్గాన్ని ఏర్పరచాలి. దీనిలో పై మూడుసభలకు సగం ప్రాతినిధ్యం, ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌కి సగం ప్రాతినిధ్యముండాలి.

2. వివిధమతాల తెగల ప్రజల మత, విద్యా. భాష, సాంస్కృతిక హక్కులకు పూర్తి రక్షణలుండాలి.

3. ప్రభుత్వ ఉద్యోగీయులలో ప్రస్తుత మున్నవారిని స్థిరపపరచి, ముందు మూడుమహాసభలు, ఇత్తెహాదుల్ ముస్లిమీన్ అంగీకారానికి వచ్చిన పద్ధతినిబట్టి ఉద్యోగులు నియమించబడాలి.

4. బహిరంగసభలు, మతసభలు, ఉత్సవాలు, అఖాడాలగురించిన నియమాలు రద్దుకావాలి. వాక్సమావేశ, సంఘ, పత్రికా, ముద్రణ ఆత్మ స్వాతంత్ర్యములపై ఎట్టి ఆటంకాలు ఉండరాదు.

## ఆహారసమస్య

1. రైతుల కుటుంబ, వ్యవసాయ అవసరాలు పోను మిగిలున్న ధాన్యాన్ని ప్రభుత్వంకొనాలి. గ్రామావసరాల కవసరమైనది. గ్రామంలోనే

నిల్వచేసి, మిగతాది తరుగుప్రాంతాలకు పంపాలి. రైతు కెప్పటికప్పుడు జీవిత వ్యయపరిస్థితులబట్టి, న్యాయమైన ధర యివ్వాలి.

2. పట్టణము లన్నిటిలోను, కొరతప్రాంతములలోనూ రేషనింగు నేర్పరచాలి.

3. అన్ని గ్రామాలలో చేతివృత్తులమీద జీవించేవారికి, ధాన్యం తోలి పేదరైతులకు ధాన్యం కంట్రోలు డిపోలలో చిన్నవర్తకులద్వారా అమ్మించాలి.

4. ఆహారధాన్యముల ధరలన్నిటిని కంట్రోలుచేసి, ప్రజల కందు బాటులో నున్నధరలకు ధాన్యం అందునట్లుచేసి, బ్లాకు మార్కెటును నాశనంచేయాలి. గుడ్డలు, కిరసనాయిలు వగైరా ఇతర జీవితావసరవస్తువు లన్నిటిమీద ధరలకంట్రోలు తీవ్రంగా అమలుజరిపి, అవి వారికందునట్లు చూడాలి.

5. నిల్వవ్యాపారస్తులను బయల్పరచి, నిల్వవ్యాపారాన్ని అణచి వేయుటకు, లంచగొండితనాన్ని రూపుమాపుటకు తీవ్రగా ప్రయత్నించాలి.

6. ప్రజాప్రతినిధులుగల ప్రజాఆహారకమిటీల సహకారంతో రేష నింగు, ధాన్యసేకరణను జయప్రదం చేయాలి.

7. సాధ్యమైనంతవరకు, వర్తక మార్గాలను, ముఖ్యంగా చిన్న వర్తకులను, ఆహారసమస్యను పరిష్కరించు విషయంలో కమిషన్‌పద్ధతిపై ఉపయోగించాలి.

## రైతుల కోర్కెలు

రైతులు పన్నులభారంతోను, రుణభారంతోనూ నానాటికీ కృంగిపో తున్నారు. తరీభూములకు, కొన్నిరకాలైన బావులక్రింద భూములకు సైతం, యకరానికి రు. 23 ల వరకూ శిస్తు ఉంది. శాసనవిరుద్ధంగా హెచ్చు వడ్డీలు తీసుకోవడం మామూలు. అంతేగాక బస్తా ధాన్యానికి 6 నెలకు బస్తాన్నర ఇచ్చే నాముపద్ధతిగూడ ఉంది. అంటే నెలకు 100 కి రు. 6 ల చిల్లర వడ్డీ అన్నమాట. దీ కి ప్రభుత్వోద్యోగుల లంచ గొండితనం తోడయింది. అందువల్ల రైతుల అప్పులు నానాటికి పెరగడం, భూమి వ్యవసాయం చేయనివారి చేతుల్లోకి పోవడం, రైతులు కౌలుదార్లుగా మారిపోవడం జరుగుతోంది. అందుచేత రైతులు భూములను మరమ్మతు చేసుకొనేస్థితి తగ్గిపోయి, భూములు సారవిహీనమవడం జరుగుతోంది.

రైతులమీద పన్ను రుణభారం తగ్గించనిదే, భూమి బాగుపడదు; రైతుల జీవితపరిమాణం పెరగదు; విద్య, విజ్ఞానం వారిలో ప్రబలవు. గ్రామసీమ లను ప్రస్తుత అంధకారంనుండి బయటికి తీయాలంటే, అధికపంటలు పండించి కరువును పోగొట్టాలంటే రైతులమీద ప్రస్తుతమున్న పన్ను, రుణభారాన్ని తగ్గించాలి.

## వరిపన్ను విధానం

నిజాంరాష్ట్రమంతా ఆచరణలోనున్నతరి పన్ను విధానము చాల లోపభూయిష్టంగాను కఠినముగా నున్నది. దిలావరు పడావాలు, పివా యెజమాబందీలను గ్రామోద్యోగులు, గిర్దావరులు మొదలగు ఉద్యోగులు రైతులపై కసితీర్చుకొనుట కుపయోగిస్తున్నారు. కనుక తరీపన్ను విధా నంలో ఈ క్రింది ప్రధానమార్పులు తేవాలి.

(అ) మనరాష్ట్రంలో భూములు పరిసర బ్రిటిషు ప్రాంతముల భూములకన్న సారవిహీనమైనను, పన్నుమాత్రము హెచ్చుగా ఉండుటచే, తరీపన్ను కనీసం సగంవరకు తగ్గింపబడాలి. ఎట్టిభూమిపైనను, ఏ పరిస్థితి లోను ఎక్కువలో ఎక్కువ ఎకరానికి రు. 8 లకు మించరాదు.

(ఆ) పాత, కొత్త, భావి, అందరూన్, బెరూన్ అయకట్టు, ముస్తరికా, జరియా మొదలగు విభేదముల తీసివేసి, బావులక్రింద సేద్య మగు తరీ, బాగాయితీ భూములపైనను, కోలు, బుడ్కీ, యాతం, బొంద, మొత్త, వాగు, కాల్వ దుబ్బుకాలువ, పర్రెకాలువ, బోలు మొదలగు కాయకష్టంచేత నీటి పారకంకాబడు భూములపైనను, పరిసరపు ఖుష్కీ ధారానే తీసుకొనవలయును.

పై భూములకు ప్రస్తుతం ప్రభుత్వం మాఫీ యిస్తున్నా, యింకా చెల్లించవలసిన రెట్లు ఖుష్కీరేటుకి షుమారు రెండు రెట్లు అధికంగా ఉన్నవి కనుక పైవిధంగా మార్పుచేయాలి.

(ఇ) చెరువులు ప్రాజెక్టు పారకం భూములకు నిర్బంధంగా తరీ సేద్యం చేయుటకు పునర్వసు కార్తెగా నిర్ణయించి, తర్వాత నీరు వచ్చి నచో అకారణముగా పదావా వున్నదను నెపంతో పన్ను విధించరాదు.

(ఈ) రైతులు తమ భూములలో కుంటలు, చెరువులు, కాలవలు, మొదలగు నీటివసతులు ప్రభుత్వం అనుజ్ఞ బొందవలయునను నిర్బంధం లేకుండానే, తయారు చేసుకొనుటకు హక్కుండవలయును. (కాని ఈ

పనులవల్ల సేద్యమయ్యే ఇతర భూములకు వెళ్ళే నీటిపారుదలకు నిరోధం కలుగజేయరాదు) వాటిక్రింద సేద్యమయ్యే భూములపై ఖుష్కీ పన్నులనే తీసుకొనవలయును.

(ఉ) ఒకసారి నిండిన ఫసలీ మొత్తమునకానీరు సరిపోజాలని కుంటలక్రింది పారకం భూములకు రైతు ఇష్టం వచ్చిన (పారకంవల్ల గాని లేక కుంటలక్రింద గాని) సేద్యము చేయవచ్చును. సేద్యము చేయనిచో తరీపన్ను విధించగూడదు. పరిసరపు ఖుష్కీధారనే తీసుకోవాలి.

(ఊ) జేరుపారకం భూములలో అవసరమయినప్పుడు బావిలేక యితర కాయకష్టపు నీటిసేద్యము చేయు రైతులకు నెల రోజులవరకు అట్టి నీటితో సేద్యం చేయవలసి వచ్చునేని, పారకంనీరు తీసుకున్నా, అతనికి సగం పన్ను తగ్గించవలయును. అదేస్థితిలో మూడు నెలలవరకు రైతు అట్టి నీరు తీసుకొనవలసిన అవసరము గలిగినేని, మిగిలిన దినములకై పారకంనీరు తీసుకొన్నా అతనినుండి ఖుష్కీధారా మాత్రమే తీసుకొనవలయును.

2. ఖుష్కీ భూములు చాలభాగం సారవిహీనమైనను పన్ను భారమధికంగా నున్నందున, ప్రస్తుత మున్న పన్నులలో మూడవభాగం తగ్గించవలయును.

3. పైన సూచించిన విధంగా తరీ, ఖుష్కీ భూమిపన్ను విధానంలో మార్పుల గావించి, శాశ్వత బందోబస్తు నేర్పరచవలయును.

4. తరీ, ఖుష్కీ భూములపై పన్నుల తగ్గించుటవల్ల ప్రభుత్వ ఆదాయంలో వచ్చే కొరతను ఆదాయపుపన్నును (Income tax) యితర వృత్తుల పన్నును విధించుటద్వారా ప్రభుత్వం పూర్తిచేసుకోవలయును.

5. తలఫ్‌మల్; పంటలు చెడిపోయినప్పుడు, భూములలో 0-4-0 పంట మాత్రమే పండిన పూర్తిగాను, 0-8-0 లోపల పండిన సగం వరకూ మినహాయింపు యివ్వాలి.

6. పట్టాభూములను రైతు ఇతరులకు అమ్మడంలేక దానం ఇయ్యడం జేసినచో, రిజిష్ట్రారు ఆఫీసునుండి వెంటనే తహసీల్‌దారుగారికి ఈ విషయమై తెలియజేసి, దానిపైననే భూమి తీసుకున్నవానికి పట్టాముంతఖిలి ఎట్టి సర్వీలేకుండా చేయవలయును.

7. పట్టా భూములలో వుండే అడవుల పైనను, పూర్వపు ఫల వృక్షముల పైనను రైతుకు సంపూర్ణ అధికారముండవలయును. ఆప్కారీ చెట్లనుండి కల్లు, సారాయి తీయించుకొను అధికారం తప్ప, చెట్లను పెంచుటకు, కొట్టివేయుటకు సర్వాధికారములు రైతుకుండవలయును.

8. వ్యవసాయ పనిముట్ల కవసరమగు ప్రతివస్తువు అడవులనుండి రైతుల కుచితంగా లభించవలయును. బీద రైతుకు గృహనిర్మాణమునకు వలయు కలపగూడా ఉచితంగా లభించవలయును. అడవులలో నుండే కంచెలు (పచ్చిక బైళ్లు) వేలమువేయుటకుమారు రైతు పశువులకై ఉచితంగా వదలివేయవలయును.

9. ఇంతవరకూ ఉన్న బరాయిందా భూమిశిస్తును మాఫీచేయాలి.

10. ఉర్దు తర్జుమాలు జతపడవలసిన అవసరము లేకయే తెలుగు, మరాఠీ, కన్నడ భాషలలో దస్తావేజులను రిజిష్టరు చేయుటకు వీలుండునట్లు రిజిష్ట్రీ నియమములను మార్చవలయును. ఆదాలయ, మున్సిఫి, తహశ్శీలు తదితర సర్కారీ యిత్తివాయిక చిహరలచర్యలను, ఆంధ్ర మరట్వాడా కర్నాటక ప్రాంతములలో ఆయా ప్రాంతీయ ప్రజాభాషలలో జరుపుటకు వీలగునట్లు చేయవలయును.

11. ప్రస్తుతమున్న పోస్టలు సౌకర్యాలను వృద్ధిజేసి, ప్రతి గ్రామానికి వారానికి కనీసం రెండుసార్లు ఉత్తరములందజేయుటకు సౌకర్యముల కలిగించవలయును.

12. గ్రామాలలో వసూలుచేయబడే లోకల్ఫండ్ పన్ను కనీసం సగమైనను ఆయా గ్రామాలలోనే ఖర్చుపెట్టాలి.

13. రైతుల ఋణబాధ.

(1) ప్రస్తుతము రైతులివ్వవలసిన అప్పులన్నియు యుద్ధానంతరం వరకు చెల్లించేనిర్బంధం లేదని ప్రభుత్వం ప్రకటించవలయును.

(2) ప్రస్తుతమున్న అప్పులను ఈక్రింది సూత్రాలప్రకారం పరిష్కరించుటకు ప్రభుత్వం చర్యతీసుకొనవలయును.

(అ) అసలు, ఆపైన, అసలులో నాల్గవవంతును చెల్లించి దాగినచో అట్టి అప్పులన్నియు పూర్తి రద్దయినట్లుగా భావించవలయును.

(ఆ) అట్లు రద్దుకానివాటిని పై నియమం ప్రకారం తగ్గించి, 10 సంవత్సరములకాలంలో కొన్ని నియమితవాయిదాలలో రైతు చెల్లించుటకేర్పాట్లు చేయవలయును.

(3) ఋణములపరిష్కారార్థమై, ప్రజాసంస్థల ప్రతినిధులు గల ప్రత్యేక కమిటీల నేర్పరచాలి. ఈ కమిటీల వ్యవహారములు కోర్టుఫీజు అవసరం లేకుండా జరగాలి.

(4) ప్రభుత్వము భూమితనఖా బ్యాంకులనేర్పరచి, దీర్ఘ కాలి వాయిదాలమీద రైతుల కప్పులివ్వాలి. సహకార సంఘములద్వారా వ్యవసాయ అవసరాలకై కొద్దికాలాని కవసరమయిన అప్పులివ్వాలి.

(5) ఇకముందు అప్పులన్నిటిపైన వందరూపాయలకు, నెలకు రు. 6 కంటె హెచ్చువడ్డీ తీసుకోబడరాదు.

(6) పై నియమముల వ్యతిరేకించిన వడ్డీ వ్యాపారస్తులు పీనలు కోడుక్రింద శిక్షింపవలయును.

14. రైతులు ఆహారధాన్యములను అధికంగా ఉత్పత్తిచేసేలాగున ప్రోత్సహించుటకై ఈక్రింది సౌకర్యాలను ప్రభుత్వం కలుగజేయవలయును.

(1) ప్రభుత్వ బీడుభూములను (waste lands) 5 సంవత్సరముల వరకు శిస్తులేకుండా సాగుచేయుట కిచ్చి, 5 సంవత్సరముల తర్వాత పట్టా యిచ్చి, శిస్తు తీసుకోవాలి. ఇట్టి భూములను స్వయంగా వ్యవసాయం చేయని రైతుల కెవరికి ఇయ్యకుండా, ప్రధానంగా గ్రామాలలోని పేద రైతులకు, వ్యవసాయ కూలీలకు యివ్వాలి.

(2) చిన్నప్రాజెక్టులు, చెరువులు, బావులను నిర్మించుటకు, చెడిపోయిన వాటిని బాగుచేయించుటకు ప్రభుత్వం పూనుకోవాలి. జాగీర్లలో ఈ నిబంధనను నిర్బంధముగా అమలుపర్చాలి.

(3) కరువుప్రాంతములలో తుంగభద్ర ప్రాజెక్టు మొదలైన పెద్ద వాటిని గూడ ప్రారంభించాలి. వానికి డబ్బు అవసరమయితే ప్రజలనుండి అప్పులను (Public loans) తీసుకోవాలి.

(4) ఎరువులు, విత్తనాలు, వ్యవసాయ పరికరాలు, పశుసంపద మొదలగు విషయములలో ప్రత్యేక కృషిని చేసి, నూతన వ్యవసాయపద్ధతుల ప్రవేశపెట్టాలి.

## ఖౌలుదార్లు

పెద్దపెద్ద దేశముఖులు దేశపాండ్యాలకు, వతందార్లకు, వడ్డీవ్యాపారస్తులకు, వేలకొలదీ యకరాలభూమి ఉంది. లక్షపైన యకరాలుగల దేశముఖులుగూడ ఉన్నారు. వీరి భూములు కౌలుకు తీసుకొని అనేకసంవత్స

రాలనుండీ సాగుజేస్తూ జీవించుతున్న రైతులున్నారు, దాదాపు పండిన పంటఅంతా కౌలుక్రిందనే పోతుంది. కౌలుదార్ల యింట్లో ఎప్పుడూ నిల్వ ధాన్యం ఉండదు. ఎప్పుడూ నాగుధాన్యంమీదనే బ్రతుకుతారు. ఒకే భూమి కౌలుకుతీసుకొని దానిలోనే తాతతండ్రులనుండిజీ వించుతున్నా. వారికి ఆ భూమిలో జిరాయితీహక్కు ఏర్పడుటలేదు. ప్రభుత్వం 20 సంవత్సరాలు ఖబ్జాగల కౌలుదారుకు ఆ భూమిలో జిరాయితీహక్కు కలిగే శాసనంచేసినా, పెద్ద భూస్వాములుఅ మాయకులైన ఖౌలుదార్లను మోసపుచ్చి ఖబ్జానుండి తొలగించుతున్నారు.

అంతేగాక ఖౌళ్లు చాల ఎక్కువగా ఉన్నవి. దాదాపు ఏమీ ఖౌలు దారుకి మిగలదు, ఆవులను గేదెలను, గొర్రెలను, మేకలను, పెంచి, వాటిని భూస్వాములకు అప్పులక్రింద కడుతూ ఉంటారు. ఖౌలుదార్లమీద ఇతర విధములైన అనేక దౌర్జన్యాలు ఖౌలుదార్లు చేస్తూవుంటారు.

1. గత 20 సంవత్సరాలలో ఏవిధంగానైనను ఒకభూమిపై ఖౌలు దారు కబ్జా కలిగివున్న, ఆస్థికి శాశ్వత కబ్జాహక్కు ఏర్పడుతుంది.

2. పై నియమము అమలులోనికిరావటంతోపాటు, ప్రతిభూస్వామి తనభూమిని 10 సంవత్సరములకంటె తక్కువగాని కాలానికి కౌలుకివ్వాలె. ఈ నియమం రు. 100 వరకూ మొత్తం రకం చెల్లించేరైతులకు వర్తించదు

3. శాశ్వతకబ్జాహక్కు కలిగే కౌలుదార్లు, ఖుష్కీ భూములపై ప్రభుత్వమునకిచ్చే ఖుషీరకంపై సగం హెచ్చుగా మునాఫా భూస్వామికి చెల్లించాలి. 10 సంవత్సరాలు, ఆపైన కౌలుకు తీసుకోబడే భూములపై ఖుష్కీధారాకు రెట్టింపు మునఫా భూస్వామికి ఇవ్వాలి. తరీపారకం భూములలో పంటలో మూడవవంతును చేరు బావులక్రింది భూములపై పంటలో ఆరవ వంతును చెల్లించాలి. భూమిరకంను పట్టేదారే కట్టుకోవాలి.

1. పై నియమాల ఆచరణలో పెట్టే సందర్భంలో వచ్చే తగాదాలను, ప్రజాప్రతినిధులుగల ప్రత్యేక తాలూకాకమిటీలు పరిష్కరించాలి. ఈకమిటీ పనిచేయువిధానం సులభంగాను, కోర్టుపీజు లేకుండాను ఉండాలి.

5. సహకార సంఘములద్వాగా, కౌలుదార్లకు వ్యవసాయఖర్చుల కవసరమైన అప్పులను యిప్పించుటకు ప్రభుత్వం పూనుకోవాలి.

## జాగీరు రైతులు

హైదరాబాదు సంస్థానం మొత్తం వైశాల్యంలో 100 కి 41½ భాగం జాగీర్లు, పాయగాలు, సంస్థానాలు, సర్ఫెఖాసు అగ్రహారాలు, మక్తాలు వగై

రాలకు చెందుతుంది. మొత్తం సంస్థానంలోని 22500 గ్రామాలలో 6000 గ్రామాలు జాగీర్లు పాయగాలు వగైరాలలో ఉన్నవి. ఈ జాగీర్లు, పాయగాలు మొదలైన వాటిలో కొన్ని బందోబస్తు అయినవి. కొన్నిటిలో కాలేదు. బందోబస్తు అయినవాటిలో సైతం అనేక అక్రమపన్నులు అమలులోవున్నవి. బందోబస్తు కానివాటిలో రైతులస్థితి చాల హీనంగావుంది. అక్కడ రైతులకు పట్టాలులేవు. ఉజ్జాయింపుగా విస్తీర్ణాన్ని బట్టిగాని నాగలికింత అనిగాని, పన్ను విధించబడుతుంది. చాకళ్ళకు, మంగళ్ళకు, సాలీలకు అనేకరకాలైన వృత్తిపన్నులు విధించబడుతున్నవి.

కొన్ని జాగీర్లకు పోలీసు, జైళ్లు, కోర్టులుగూడ ఉన్నవి. ఈజాగీర్లలో ప్రజలస్థితి చెప్పనేఅవసరంలేదు.

జాగీర్లలో విద్య, వైద్య, రోడ్డు సౌకర్యాలు నామమాత్రంగా ఉన్నవి. కొన్నిటిలో అసలేలేవు. ఇవేగాక జాగీరుదార్లవల్ల ఇతర అనేకమైన అవమానాలు జరుగుతూవుంటవి. జాగీరుప్రజలను మధ్యయుగంనాటి బానిసలతో పోల్చవచ్చును. జాగీర్లు సంస్థాన అభివృద్ధికి ఒక పెద్ద ఆటంకం.

1. బందోబస్తు నేడు అనేక జాగీర్లలో బందోబస్తు ఇంకనూ కానందున అనేకవిధాల పన్నులు హెచ్చించబడుచున్నవి. ఇదిగూడ, ఎకరాని కింత అని గాక, రైతుకున్న భూమి ఉజ్జాయింపు విస్తీర్ణాన్ని బట్టీ, లేక నాగలికింత అనీ, పన్ను విదించబడుచున్నది. కనుక రాష్ట్రంలోని అన్ని ప్రాంతములలోని భూములను పూర్తిగా బందోబస్తు గావించవలయును. ఇందుల కగు ఖర్చులను జాగీరుదారే భరించాలి.

బందోబస్తు గావించినతర్వాత, రైతుల ఆధీనమందున్న భూములన్నిటికి పట్టాలివ్వాలి. ముందు రైతులివ్వవలసినరకం, ఖాల్సాలోని వివిధ భూములపై రైతులిచ్చే రకాలనే యిచ్చునట్లు నిర్ణయించి, శాశ్వత బందోబస్తు గావించవలను. ఖాల్సాలో రైతులకున్న మాఫీ మొదలగు సౌకర్యములన్నియు జాగీరురైతులకు సంక్రమించాలి.

2. చట్టప్రకారం ఇవ్వవలయునని గావించిన పన్నులుగాక, మరే యితర అక్రమ పన్నులయినను వసూలుచేసిన జాగీర్లను ప్రభుత్వం వశంచేసుకోవాలి. అట్టి జాగీర్లను మరల తిరిగి యివ్వకుండా, పరిపాలన కగు ఖర్చుల మినహాయించి మిగిలిన ఆదాయాన్ని జాగీరుదార్లకివ్వాలి.

3. పోలీసు, న్యాయ, మాల్ (శిస్తును వసూలుచేసుకునే హక్కు-తప్ప) శాఖలను పూర్తిగా ఖాల్సా ప్రభుత్వమే తీసుకొని నిర్వహించాలి.

4. జాగీర్లలో విద్య, వ్యవసాయాభివృద్ధి, రోడ్లు, వైద్య, ఆరోగ్యశాఖలు మొదలగు ప్రజాశ్రేయస్సుకు అవసరమైన వాటినన్నిటినీ ఖాల్సా ప్రభుత్వమే నిర్వహిస్తూ, వీటికవసరమైన ఖర్చులనన్నిటిని జాగీర్ల ఆదాయాన్నుండి తీసుకోవాలి.

పై నియమాలు జాగీర్లు, మక్తాలు, సంస్థానాలు, పాయిదాలు, సరఫ్‌ఖాసుకి వర్తించాలి.

## గ్రామ పేదలు

గ్రామాలలోని పేదలు చాలవరకు ఆర్థికంగా, సాంఘికంగా రాజకీయంగా వెనుకబడి ఉన్న కులాలకు చెందినవారు. వీరిలో చాలమందికి అసలు భూములే ఉండవు. రెక్కలకష్టంమీద ఆధారపడవలసిందే. గ్రామాలలో కూలి చాలతక్కువగా ఉంటుంది. ఉన్నతకులాలవారమని చెప్పుకొనేవారు, గ్రామ సమిష్టి సౌకర్యములకొరకు ఏర్పడినస్కూళ్ళు, ఆసుపత్రులు మొదలైన వాటిని, పై వెనుకబడి ఉన్న కులాలవారు ఉపయోగించుకోవడంలో ఆటంకాలు పెడుతారు. అంతేగాక ప్రభుత్వోద్యోగులు గ్రామోద్యోగులు వీరినుండి శాసనవిరుద్ధంగా వెట్టిచాకిరిని గూడ చేయించుకుంటూ ఉంటారు. గ్రామంలో గమనింపదగిన సంఖ్యలో ఉన్న ఈ వెనుకబడిన కులాలవారిని ఉద్ధరించనిదే, గ్రామసీమలు అభివృద్ధి చెందవు.

1. గ్రామములలో కూలిపనిచేయువా రందరికి, న్యాయమైన కూలిని రైతులివ్వాలి.

రైతుకు పంటను పండించడంలో సహాయం చేస్తున్న కూలీకి న్యాయమైన కూలి ఇయ్యడం అన్నదాత అయిన రైతు కర్తవ్యం. అంతేగాక ఈ రోజున రైతులకున్న అసంఖ్యాకమైన కష్టాలు తీరాలంటే. రైతు-కూలీ ఐక్యత అవసరం. రైతు - కూలీ ఐక్యత గ్రామైక్యతకు పునాది. గ్రామైక్యతే సాధించితేనేగాని గ్రామ సౌభాగ్యం గలుగదు. రైతులు కూలీలను మానవులవలె చూడాలి.

2. గ్రామప్రజలందరి ఉపయోగార్థమై ఏర్పరచబడిన స్కూళ్లు, ఆసుపత్రులు, సమిష్టిభూములు మొదలగువాటిని, గ్రామప్రజలందరితోపాటు, నిమ్నజాతులు ఉపయోగించుకొనుటకు హక్కుండాలి.

3. గ్రామములలోని బీడుభూములను ప్రత్యేకంగా నిమ్నజాతుల వారికి, పేదరైతులతోపాటు యివ్వాలి.

4. నిమ్నజాతులు, ఇతర వెనుకబడి ఉన్నవారి విద్యాభివృద్ధికి, ఆరోగ్య సౌకర్యములకు, ఉద్యోగముల విషయంలో ప్రభుత్వం ప్రత్యేక సౌకర్యాలు కలుగజేయాలి. వీరికి ఆరోగ్యకరమైన గృహనిర్మాణం విషయంలో ప్రభుత్వం సహాయం చేయాలి.

5. గ్రామాలలోని మాల, మాదిగ, చాకలి, కుమ్మరి, వడ్రంగి మొదలగువారిచేత గ్రామోద్యోగులు, దేశముఖు, దేశపాండ్యాలు, దొరాకు వచ్చే ఉద్యోగులు మొదలైనవారు చేయించుకొనే వెట్టి ప్రభుత్వంతీవ్రంగా అణచివేయాలి. ప్రతిఫలమిచ్చి, నిర్బంధంగా చాకిరిచేయాలనే పద్ధతిని గూడ రద్దుచేయాలి.

## కార్మికులు

హైదరాబాదు సంస్థానంలో క్రమక్రమంగా పరిశ్రమలు అభివృద్ధి అవుతూవున్నవి. కాని పరిశ్రమల అభివృద్ధితోబాటు, బ్రిటిషు ఇండియాలోవలె కార్మికుల స్థితి ఏమీ బాగుపడుటలేదు. ఇంతవరకూ సంఘాలు పెట్టుకునేహక్కు గలిగిన ట్రేడ్‌యూనియన్ చట్టంలేదు. కార్మికసంఘాలు కొన్ని ఫ్యాక్టరీలలో లేకపోవుటవలన, ఉన్నసంఘాలుసైతం యజమానుల నిర్బంధాన్నుండి న్యాయశాస్త్ర రక్షణ లేకపోవుటవలన ట్రేడ్‌డిస్ప్యూట్సు మెటర్నిటీ బెనిఫిట్ చట్టాలు ఫ్యాక్టరీ ఆక్టులో కార్మికుల శ్రేయస్కరమైన రూల్సుగూడ అమలుజరుగుటలేదు. అందుచే కార్మికులస్థితి చాల హీనంగా వుంది. పరిశ్రమలలో ఉత్పత్తి ఆధునికపద్ధతులమీద జరుగుతున్నా, దోపిడీ విధానపద్ధతులు పురాతనపద్ధతులలో జరుగుతున్నవి. సంస్థానంలోని కార్మికులకు బానిసలకు తేడాలేదు.

1. సక్రమ పద్ధతులపైన ట్రేడ్‌యూనియను చట్టాన్ని ఏర్పరచి, కార్మికులు సంఘములు పెట్టుకొని సమిష్టిగా తమకోర్కెలను తీర్చుకునే హక్కును గుర్తించాలె. ట్రేడుయూనియన్లను యజమానులు నిర్బంధంగా గుర్తించేటట్లు చేయాలె.

2. ప్రతి కార్మికునికి, కనీసజీవిత పరిమాణానికి అవసరమైన రు. 30 వేతనం ఏర్పరచాలి. ధరల పెరుగుదలనుబట్టి ఈ వేతనంపై కరువుభత్యం యివ్వాలి.

3. ప్రస్తుతమున్న కార్మికచట్టాలను, అవసరమైన సవరణలతో ఆచరణలో పెట్టించుటకు తీవ్రంగా పూనుకోవాలె.

4. గనులలో స్త్రీలు, పిల్లలు పనిచేయుట నిషేధించబడాలె.

5. యజమానుల ఖర్చుమీద ఆరోగ్యకరమైన, శుభ్రమైనఇండ్లను కట్టించి, చౌక అద్దెలకు కార్మికుల కిప్పించాలి.

6. అవసరమైన వైద్య, విద్య సౌకర్యముల నేర్పరచాలె.

## విద్యావిధానం - విద్యార్థులు

1. ప్రతిగ్రామంలోనూ పట్టణంలోని ప్రతి మొహల్లాలోనూ కనీసం ఒక ప్రాథమిక పాఠశాల అయినా ఏర్పరచాలె.

2. మిడిల్, హైస్కూళ్లు, కాలేజీల సంఖ్యను పెంచాలి. ఇప్పుడున్న వాటిని పూర్తిగా విస్తరింపజేసి, ఎక్కువమంది విద్యార్థులను చేర్చుకోవాలె. జిల్లాలలోగూడ ఫస్టుగ్రేడ్ కాలేజీల నేర్పరచాలె.

3. ప్రయివేటుగా మిడిల్ హైస్కూళ్ళను, కాలేజీలను ఏర్పరచుటకు అవకాశముండాలె,

4. మెట్రికు వరకూ ఉర్దూ, తెలుగు, మరాఠీ, కన్నడ భాషలలో విద్య గరపుట కేర్పాట్లు చేయాలి.

5. ఉస్మానియా యూనివర్సిటీ పరిపాలన ప్రజా ప్రతినిధుల చేతుల్లో నుండాలి.

6. రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికిగాను టెక్నికల్ విద్యను వృద్ధి గావించాలి.

7. విద్యార్థులు విద్యాలయాలలో బయట సంఘములు పెట్టుకొని, ఇతర ప్రజా సంస్థలలోచేరి, ప్రజాహిత జీవనంలో పాల్గొంటూ తమ మానసిక, రాజకీయ అభివృద్ధిని పెంపొందింకొనుచుటకు హక్కుండాలి.

8. విద్యాలయాలలో విద్యార్థులకు వాక్స్వాతంత్ర్య ముండాలి.

## స్త్రీలు

1. అన్నదమ్ములతోపాటు, ఎట్టి భేదంలేక స్త్రీలకు ఆస్తి హక్కు ఉండాలి. భర్త ఆస్తిలోగూడ ఇల్లే భాగముండాలి,

2. యువకులకు 18 సం॥ లోపల, స్త్రీలకు 14 సం॥ రం లోపల బాల్యవివాహములను పూర్తిగా నిషేదించాలి. మైనారిటీ వెళ్ళిన స్త్రీ, పురుషులకు రిజిస్ట్రేషన్ ద్వారా వివాహం చేసుకునే హక్కుఉండాలి. వితంతు వివాహాలకున్న అడ్డంకులు తొలగించాలి. ప్రత్యేక పరిస్థితులలో విడాకు లిచ్చుటకుగూడ అవకాసముండాలి,

3. స్త్రీల విద్యాభివృద్ధికై ప్రత్యేక విద్యాసౌకర్యముల, వృత్తి విద్యల నేర్పుట కేర్పాట్లను ప్రభుత్వం కలుగజేయాలి.

4. గర్భిణీతో నున్న కార్మిక స్త్రీలకు, ప్రసవించక ముందు 6 వారాలు, ప్రసవించిన తర్వాత 6 వారాలు, పూర్తివేతనంతో సెలవులు ఇవ్వబడాలి. స్త్రీలకు ప్రసవించడానికి ఆధునిక తర్ఫీదుపొందిన మంత్రసాని సౌకర్యాలు గ్రామాలలోను, పట్టణాలలోనూ కల్పించాలి. పట్టణాల ఆస్పత్రులలో గర్భిణీస్త్రీల వార్డులను పెంచాలి.

5. స్త్రీలకు ఉద్యోగము లిచ్చుటలో ఉన్న నిర్బంధముల తొలగించాలి. ఒకే కాలంలో చేసిన, ఒకేరకపు పనికి పురుషులతోపాటు సమానమైన వేతనమివ్వాలి.

## పరిశ్రమలు - వర్తకులు

1. ప్రజల జీవితపరిమాణాన్ని వృద్ధిచేయుటకై పారిశ్రామికాభివృద్ధిని చేయాలని తీవ్రంగా ప్రభుత్వంమీద వత్తిడిచేయాలి. ముఖ్యంగా హైడ్రో ఎలక్ట్రిక్, ఉక్కు, మెషినరీ, ఆయిల్, బట్టల పరిశ్రమలను నిర్మించాలి.

2. దొరాసర్పరాహీ సందర్భంలో ఉద్యోగులు, వర్తకులనుండి డబ్బు గుంజకుండా, లేక తక్కువధరలకు సరకులను బలవంతంగా తీసుకొనే పద్ధతిని రద్దుచేయాలి. అట్టి ఉద్యోగులను ప్రభుత్వం శిక్షించాలి.

## పట్టణ మధ్యతరగతి ప్రజలు

ప్రజామంత్రివర్గ మేర్పడి, నేడు ప్రజలబాధిస్తున్న ఆర్థిక, రాజకీయ, సాంఘిక కష్టములను చాలవరకు తొలగించుటవల్ల పట్టణ మధ్యతరగతి చేతిపనివారలకు, పట్టణ పేదలకు వారి ఆర్థికజీవనం వృద్ధిచేసుకోవటానికి తగిన పరిస్థితులను కలుగజేస్తాయి. ప్రజాప్రభుత్వం ప్రత్యేకంగా ఈ క్రింది సౌకర్యాలను కలుగజేయాలి.

1. సహకారసంఘాలు, ప్రభుత్వం సహాయంద్వారా, చేతిపనివారల వృత్తులకు సాహాయంచేసి, పెద్దవర్తకుల వత్తిడినుండి కాపాడబడాలి.

2. ఆదాయపు పన్ను విధించి, పట్టణమధ్య తరగతిప్రజల బాధించే ఇండ్లుపన్ను, నీటిపన్ను మొదలగు పన్నులు తగ్గించబడాలి. ఇండ్ల అద్దెలు కంట్రోలు చేయబడాలి.

3. పరిశ్రమల అభివృద్ధి, విద్యాసౌకర్యముల అభివృద్ధి మొదలగు వాటిద్వారా, చదువుకున్నవారి నిరుద్యోగ సమస్య పరిష్కరించుటకు ప్రయత్నములు చేయబడాలి.

## ఉద్యోగులు

1. కనీస జీవితావసరాలకు సరిపోయేటట్లు ఉద్యోగుల జీతములీ క్రిందివిధంగా పెంచబడాలి :

రు. 50 లోపల వచ్చే వారికి 50% పెంచుట.

రు. 50 పైన వచ్చే వారికి 25% పెంచుట.

ధరల పెంపుదల ననుసరించి, కరువుభత్యమును ఇవ్వాలి.

2. రు. 500 ల పైన తీసుకొనే వేతనములలో క్రమేపీ హెచ్చగు విధంగా (Progressive redution) తగ్గించాలి.

3. గ్రామోద్యోగుల జీతాలీక్రింది విధంగా పెంచాలి :

సేతుసిందీలు, నీరగీలు : కనీసం రు. 10

పటేలు, పట్వారీలు : ,, రు. 15

4. లంచగొండి తనాన్ని అణచివేయుటకు ప్రజల సహకారంతో తీవ్రంగా పూనుకోవాలి. అప్పుడప్పుడు ఉద్యోగస్తుల ఆస్తుల పరిశీలించి, లంచగొండితనంద్వారా సంపాదించిన ఆస్తిని ప్రభుత్వం వశంజేసుకొని, కఠినంగా శిక్షించాలి. ప్రస్తుతం ప్రభుత్వంచే ఏర్పరుపబడిన అవినీతి వ్యతిరేక డిపార్టుమెంటుకు ఏ ఉద్యోగిగూర్చి అయినా విచారించడానికి సర్వాధికారాలు ఉండాలి. అవినీతిపరులని తేలిన ఉద్యోగులను బహిరంగంగా శిక్షించాలి.

# హైదరాబాదు కర్ణాటక కాన్ఫరెన్సు క్లుప్తమైన చరిత్ర

హైద్రాబాదురాష్ట్రములో మూడుజిల్లాలలో (రాయచూరు, గుల్బర్గా, బీదరు) కన్నడభాష మాట్లాడే ప్రజలుంటారు. వీరి జనసంఖ్య ఇంచుమించుగా 15 లక్షలు.

1914–18 యుద్ధానంతరం భారతదేశంలో వచ్చిన బ్రంహ్మాండమైన జాతీయ సంచలనం, చైతన్యం, రాష్ట్రంలోని ఇతరులతోబాటు కర్ణాటకులనుకూడా కదలించింది. కొందరు విద్యావంతులలో కన్నడ జాతీయ చైతన్యం కలిగింది. వీరుభాషా సాంస్కృతిక కార్యక్రమముజేయ నారంభించారు. గణేశ్‌చౌతి, నాడహబ్బా ఉత్సవాలు, వైజ్ఞానిక సాంస్కృతిక దృష్టితో జరిపారు. ఉపన్యాసాలు, కవిసమ్మేళనములు ఈ సందర్భాలలో ఏర్పాటు చేయబడేవి. సుమారు 20గ్రంధాలయాలుగూడా నెలకొల్పబడినవి. కన్నభాషపై ప్రేమ దానిని అభివృద్ధి పరచే కాంక్ష జనించింది. కొన్ని చిన్నచిన్న వైజ్ఞానిక, చిన్నకథల పుస్తకాలు, హైదరాబాదు, గుల్బర్గా, రాయచూరు, పట్టణాలయందు ప్రకటింపబడినవి.

పై ఉద్యమం పూర్తిగా విద్యావంతులలో కొలది మందికి మాత్రమే సంబంధించిందిగాని, జనసామాన్యానికి, దీనితో ఏమియు సంబంధంలేదు. ఈజరిగే స్వల్ప కార్యక్రమాన్నైనా కేంద్రీకరించి. ఒక ఉద్యమంగా నడిపించే ప్రయత్నం జరుగలేదు.

## కర్ణాటక కాన్ఫరెన్సు పుట్టుక

బ్రిటిషుఇండియాలో 1935 రాజ్యాంగచట్టం ప్రకారం ఎన్నికల ఫలితంగా, కాంగ్రెసుకు కలిగిన అఖండవిజయం, దేశీయసంస్థాన ప్రజలలోగూడా ఆశాజ్యోతిని వెలిగించింది. కొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు స్థాపించబడి, సంస్థానప్రజలలో గలిగిన చైతన్యమును వృద్ధిచేసినవి ఇట్టి పరిస్థితులలో కర్ణాటక ప్రాంతములలోని విద్యావంతులు, ఆంధ్రమహాసభ వంటిది, తమ కర్ణాటకుల సర్వతోముఖాభివృద్ధికి ప్రయత్నించు ఒక సంస్థ అవసరమని గుర్తించినారు. కర్ణాటక కాన్ఫరెన్సు 1937 లో హైద్రా

బాదు పట్టణమునందు శ్రీ పి. కిషన్‌రావు (హైకోర్టు వకీలు రాయచూరు) గారి అధ్యక్షతను జరిగింది. దీనికై ప్రయత్నించిన వారిలో అంతవరకే ఆంధ్రమహాసభలో భాగముగైకొనుచు అనుభవముసంపాదించిన శ్రీ కృష్ణ శర్మగారును, శ్రీ జనార్ధన్‌రావు దేశాయిగారలు ముఖ్యులు.

ఈ మొదటి మహాసభయందే నియమావళి అంగీకరింపబడినది. ఇది గూడా అప్పటి ఆంధ్రమహాసభ నియమావళివలెనే గాఢమైన ప్రజాస్వామిక సూత్రాలపై ఆధారపడిలేదు. ప్రాధమిక సభ్యులు జేర్పించు అవకాశమున్న ప్పటికి వారికిని మహాసభపాలసీని నిర్ణయించు ప్రతినిధులకు, ఎట్టి సంబంధ మునులేదు. మహాసభసందర్భమున ఒకరూపాయి చెల్లించిప్రతినిధిటిక్కటు కొన్నవారందరును ప్రతినిధులుగా భావింపబడు ఏర్పాటు గావింపబడినిది.

విషయనిర్ణయ, స్థాయి సంఘసభ్యులకుగూడా ప్రాధమిక సభ్యులతో ఏలాటి సంబంధము లేకుండా చేయబడింది. అధ్యక్షుని ఎన్నికగూడాఇంతే.

ఈమహాసభయందు అభివృద్ధికరమగు రాజకీయ తీర్మానం అంగీక రింపబడలేదు. బీహారురాష్ట్రం హైద్రాబాదు ప్రభుత్వంవారికి తిరిగి వచ్చి నందులకు ప్రభుత్వాన్ని అభినందిస్తూ తీర్మానం చేయబడింది.

రాష్ట్రంలోని కర్ణాటకప్రాంతాన్ని నిర్ణయించుటకు ప్రభుత్వము రాష్ట్రములో తెలంగానా, మరట్వాడా అను రెండు భాగాలకుబదులు, తెలంగానా, మరట్వాడా, కర్ణాటక అను మూడుభాగాలుగా రాష్ట్రాలన్నీ విభ జింపవలయుననియు, వయోజనవిద్య, నిర్బంధ ప్రాధమిక విద్యావిధానం పాఠశాలలలో మెట్రికువరకు మాతృభాషలో విద్య, స్త్రీలకు మాతృభాషలో విద్య, బాల్యవివాహ నిషేధచట్టం, గృహపరిశ్రమల అభివృద్ధి, తుంగభద్రా ప్రాజెక్టు నిర్మాణం, మొదలగు తీర్మానములు అంగీకరింపబడినవి

దీనియందు ప్రధానపాత్ర మితవాదులు వహించినారు. ప్రథమ కర్నాటక కాన్ఫరెన్సు తదుపరి బ్రిటిషు ఇండియా కాంగ్రెసు ఉద్యమ ఫలి తంగా రాష్ట్రప్రజలయందుద్భవించిన ప్రజాస్వామిక చైతన్యం దినదినాభి వృద్ధి జెందింది. మితవాద నాయకులచే సమావేశపరచబడిన పీపుల్సు కన్వెన్షన్‌యందు కర్ణాటకకాన్ఫరెన్సు నాయకులు గూడా పాల్గొన్నారు. అటుపిదప ప్రారంభించబడిన స్టేటుకాంగ్రెసు సత్యాగ్రహమునందు మొదటి జట్టులో కర్ణాటక ప్రతినిధిగా శ్రీ జనార్దన్‌రావు దేశాయిగారు పాల్గొన్నారు. సత్యాగ్రహోద్యమమునందు సుమారు 30 మంది కర్ణాటక యువకులు పాల్గొన్నారు. కర్ణాటకకాన్ఫరెన్సు కార్యక్రమం ఈ కాలంలో

యేస్తు జరుగలేదు. దీని నొక ప్రజాసంస్థగా జేయు ప్రయత్నం జేయబడ లేదు. నిర్మాణరీత్యా జిల్లాకమీటీలు గూడా స్థాపించబడలేదు.

రెండో కర్ణాటకకాన్ఫరెన్సు 1939 సం॥రములో బీదరు పట్టణము నందు జరిగిరది. దీనికి స్టేటుకాంగ్రెసు సత్యాగ్రిహములో పాల్గొని జైలు శిక్ష అనుభవించిన శ్రీ జనార్దన్‌రావు దేశాయిగారు అధ్యక్షత వహించి నారు. దీనియందు ప్రభుత్వసంస్కరణలు నిరాకరిస్తూ, హిందూ-ముస్లిం ఐక్యత కోరుతూ, ఇత్తెహాదుల్ ముసల్మీన్‌వారి అనల్‌మలిక్ సిద్ధాంతాన్ని ఖండిస్తూ, జాగీరుపరిపాలనా విధానంలో సంస్కరణ కోరుతూ, భూపరా ధన చట్టములోని కులవిభజనను వ్యతిరేకించుతూ, పౌరసత్వములు కోరుతూ, విద్యార్థిమహాసభను నిషేధించినందునకు ప్రభుత్వచర్యను ఖం డిస్తూ, ఆంధ్రమహారాష్ట్ర, కర్నాటకమహాసభల కేంద్రీకరణను కోరుతూ తీర్మానాలు అంగీకరించబడినవి.

స్టేటుకాంగ్రెసు నాయకులలో నొకరగు శ్రీజనార్దన్‌రావు దేశాయి గారి అధ్యక్షతతో జరిగినప్పటికి మహాసభ తర్వాత కర్నాటకకాన్ఫరెన్సు కార్యక్రమ విధానమునందు పెద్ద మార్పేమియు రాలేదు. తుంగభద్రా ప్రాజెక్టు నిర్మాణముకొరకై ఒక మెమొరాండము ప్రభుత్వంకుపంపించడం రాయచూరు, గుల్బర్గా, జిల్లాలలోని కరువుప్రాతాలలో పర్యటనజేయుట, గుర్మట్కల్ తాలూకాలో ఒక తాలూకామహాసభ జరపడం, మూడు జిల్లా కమిటీలు, 25 తాలూకాకమిటీలు, 25 గ్రామకమిటీలు స్థాపించుట జరిగినప్ప టికిని, కర్ణాటకమహాసభ ప్రజాసంస్థగా అభివృద్ధిగాలేదు. కమిటీలన్నియు కాగితపుకమిటీలుగానేఉన్నవి, ప్రజలదైనికసమస్యలపైపనిజేసి, వారినిసమీక రించుటకుప్రయత్నం జరుగలేదు. ఇదేకాలమున రాష్ట్రమునందు జరిగిన హిందూ-ముస్లింల పోరాటాలు, కర్ణాటకప్రాంతాన విపరీతంగాచెలరేగినవి. బీదరు, జౌరాం, షాజహాన, గుర్మట్కార్, యాదరు అను నాలుగుస్థలాలలో పోరాటాలు జరిగినవి. ఇవి మతతత్వవాదులు రాష్ట్రంలో అభివృద్ధిచెందు తున్న ప్రజాఉద్యమవ్యాప్తిని నిరోధించుటకై జేసిన ప్రయత్నాలు. కర్ణా టకమహాసభ గూడా వీనిని నిరోధించుటకు, ప్రజలకు పోరాటాల నిజ స్వభావం తెలిపి, ఇవి జరుగకుండా నుడుటకై సరియైన కార్యక్రమం ప్రజలకివ్వలేదు. కులతత్వఉద్యమాలతో తనకేమి సంబంధంలేనట్లు స్పష్టంగా ప్రవర్తించలేదు.

మూడో మహాసభ 1941 మే మాసములో శ్రీ అన్నారావుగారి అధ్యక్షతన గుల్బర్గాయందు జరిగినది. శ్రీ అన్నారావుగారు లింగాయతులు కర్ణాటక మహాసభ కార్యకర్తలందరు బ్రాహ్మణులగుటచే కర్ణాటక ప్రాంతాన వ్యవసాయముపై ఆధారపడు ముఖ్యులగు లింగాయతులకు, కర్ణాటక మహాసభపై అసంతృప్తి గలుగుటచే శ్రీ అన్నారావుగారిని అధ్యక్షులుగా తీసుకొని అసంతృప్తిని పోగొట్ట ప్రయత్నింపబడినది. రైతులలోగల అసంతృప్తి ఒక రైతుకుటుంబమునుండి వచ్చిన వకీలును అధ్యక్షునిగాచేయుటచే పోజాలదు. రైతు దైనిక జీవితమునందు కలుగు కష్టాలను తీసుకొని పరిష్కరించు ప్రయత్నం చేయాలి. ఈ మహాసభ తీర్మానములందు ప్రత్యేకత ఏమీలేదు. ప్రభుత్వ యుద్ధప్రయత్నాలకు స్వాగతమిస్తూ తీర్మానించ బడినది. మిగతా తీర్మానాలన్నియు రెండో మహాసభయందు జేయబడిన విషయాలపైననే జరిగినవి. ఈ మహాసభ తర్వాతగూడా కర్ణాటక మహాసభను ప్రజాసంస్థగా అభివృద్ధిజేయ ప్రయత్నము జరుగలేదు. కమిటీలన్నియు కాగితపు కమిటీలుగానే వుండిపోయినవి. నాయకత్వము మితవాదులదగుటయు అభివృద్ధిశక్తులు బలహీనముగా నుండుటయు దీనికి కారణము.

మూడో మహాసభ తదుపరి, 9 ఆగస్టు 1942 తర్వాత జరిగిన సంఘటనలలో కొందరు కర్ణాటకయువకులు పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. వీనిలో ముఖ్యులు శ్రీ పాణేశాబారి, శ్రీ రంఘనాధ కుల్కర్ణిగారలు.

నాలుగో మహాసభ రాయచూరుయందు 1944 మే, మాసములో జరిగింది. అధ్యక్షులు శ్రీ కాకూరి హనుమంతరావు (హైకోర్టువకీలు) గారు. దీనియందు, ఒక స్పష్టమైన అతివాదముతా ఏర్పడి, మహాసభ నియమావళి ప్రజాస్వామికముగా జేయుటకు ప్రయత్నించింది: ఈ ప్రయత్నంలో శ్రీ రంగనాథ కుల్కర్ణీగారును, మరికొందరు బీదరు యువకులు పాల్గొన్నారు. వీరు స్వామిరామానందతీర్థగారి అభిప్రాయములతో ప్రభావితులై పనిజేసినారు శ్రీ స్వామీరామానందతీర్థగారు వారు జైలునుండి (నాలుగో మహాసభ కొలది మాసములకు ముందు) విడుదల అయినతర్వాత కర్ణాటక మహాసభ నియమావళి ప్రజాస్వామిక సూత్రాలకు అనుగుణ్యంగా లేదనియు దానిని మార్చవలయునని ఒక పత్రికా ప్రకటన జేసియుండిరి. పై అతివాదముతాకు జెందిన యువకులు సామ్యవాద అభిప్రాయములుగల ఫాసిస్టు వ్యతిరేకులు - కాన్ఫరెన్సుకుముందే వీరు యువకులను నియమావళి మార్పులకై సమీకరించారు.

వీరు సూచించిన ఈక్రింది రెండు ప్రధానమార్పులు నిరాకరించ బడినవి.

1. వర్కింగుకమిటీ స్థాయిసంఘముచే ఎన్నుకోబడవలయును.

2. మహాసభోద్దేశ్యాలలో 'రైతు కార్మికుల అభివద్ధికై పాటు బడుట' అను మాటలు స్పష్టముగా వుండవలయును.

కాని వీరి కృషిఫలితంగా మహాసభ నియమావళిలో క్రింది ముఖ్య మైన మార్పులు జరిగినవి.

1. మహాసభ రాజకీయసంస్థగాదను అభిప్రాయము పూర్తిగా తొలగించి, ఉద్దేశాలలో "హైదరాబాదు కన్నడుల రాజకీయాభివృద్ధి" అనేది కూడా చేర్చబడినది.

2. ప్రాధమిక సభ్యులచే మహాసభకు ప్రతినిధులు, వారిచే స్థాయి సంఘసభ్యులు ఎన్నుకోబడు ఏర్పాటు గావించబడినది.

మహాసభలో స్టేటుకాంగ్రెసుపై నిషేధము తొలగించుటకు బాధ్యతా యుత ప్రభుత్వము నెలకొల్పుటకు. రాజకీయ ఖైదీలకు సౌకర్యములు కలిగించుటకు ప్రభుత్వమును కోరుతూ తీర్మానములు చేయబడినవి. ఆహార సమస్య పరిష్కారతీర్మానమునందు అభివృద్ధి కోరికలగు రేషవింగుధరల కంట్రోలు కావాలని తీర్మానించబడింది. కాని స్టాకులను బైటికిలాగి దొంగ వ్యాపారాన్ని అరికట్టే చర్యలకు వ్యతిరేకత చూపబడినది.

మహాసభ తర్వాత జిల్లాలలో కొంతవరకు పని జరుగుచున్నది. కొందరు పూర్తిగా సమయమిచ్చి పనిచేసేఆర్గనైజర్లుగా పనిచేయుచున్నారు దైనిక సమస్యలను తీసుకొని ప్రజలను సమీకరించు ప్రయత్నము జరుగు చున్నది. కేంద్రము కొంతపరకు పనిచేయుచు జిల్లాల కార్యక్రమముతో సంబంధము కలిగియున్నది. కాని కర్నాటకమహాసభను ప్రజాసంస్థగా చేయుటకిప్రయత్నాలు ప్రాతిపదిక మాత్రమే. అతివాదకక్షకు చెందినయువ కులు, జాతీయవాదులు, సంఘటితంగా నేటి పరిస్థితుల కనుగుణ్యమైన కార్యక్రమాన్ని ఏర్పరచుకొని, పనిచేయుట పైననే, కర్ణాటకమహాసభ ప్రజా సంస్థగా అభివృద్ధిఅయి నిజాంరాష్ట్ర ప్రజాఉద్యమాభివృద్ధికై తనవంతు కర్తవ్యాన్ని నిర్వహించుటమీదనే ఆధారపడియున్నది.

# మహారాష్ట్ర పరిషత్తు - క్లుప్తచరిత్ర

ఇరువదో శతాబ్దారంభ దశయందు, బ్రిటిషు మహారాష్ట్రప్రాంతాన నడచిన ఉద్యమాలు, నిజాంరాష్ట్ర మహారాష్ట్రప్రాంతంలోని పట్టణ మేధావులలో కొంత చైతన్యం కలుగజేసినవి. లోకమాన్య బాలగంగాధర తిలకు సంపాదకత్వమున నడిచిన "కేసరి" పత్రిక నిజాం మహారాష్ట్ర ప్రాంతమందు చదువబడుచుండేది. తిలక్‌గారిచే బ్రిటిషు మహారాష్ట్ర ప్రాంతమందు జరుపబడిన గణేశ ఉత్సవాలు, శివాజి ఉత్సవాలు ఇచ్చట మహారాష్ట్రప్రాంతమునందు గూడ జరుపబడినవి. ఈ ఉత్సవాలయందు సాంఘిక, సాంస్కృతిక సమస్యలతో పాటు రాజకీయ సమస్యలపై గూడ ఉపన్యాసములు జరిగేవి.

బెంగాలు విభజన వ్యతిరేకఉద్యమం, దానితోపాటు జరిగిన బ్రిటిషు వస్తు బహిష్కరణ ఉద్యమం, రాష్ట్రములోని మహారాష్ట్ర విద్యార్థులలో చలనం కల్గించినవి. ఔరంగాబాదుజిల్లాలో, నాందేడు, పర్భనీపట్టణములలో స్వదేశీ బట్టలదుకాణాలు తెరువబడినవి. 1905, 1906 ప్రాంతాలలో "నిజాం వైభవపత్రిక", "భాగ్యేపవిజై", "గుల్బర్గాసమాచార్" మొదలైన మహారాష్ట్ర వారపత్రికలు బయలుదేరినవి. 1907 లో హైద్రాబాదు పట్టణమందు వివేకవర్ధనీ పాఠశాల ప్రారంభించబడి, మహారాష్ట్రప్రజల సేవ నేటికీ చేయుచున్నది.

పై ఉద్యమాలు పట్టణ మేధావులనే కదలించినవి గాని, జనసామాన్యం యందేమియు చలనము కలుగజేయలేదు. జనసామాన్యములో ఈవుద్యమంతో ఎట్టిసంబంధం లేకుండెను.

1908 లో బాలగంగాధర్‌తిలక్ గారికి బ్రిటిషుప్రభుత్వం 6 సంవత్సరాల శిక్ష విధించినది. దీనిలో బ్రిటిషు మహారాష్ట్రమునందలి ఉద్యమం స్తంభించినది. దానితోపాటు రాష్ట్రమునందుగూడా అదేపరిస్థితి ఏర్పడినది.

నాంధేడు జిల్లాలో 1918, 1919, 1920 లలో వరుసగా మూడు సాంఘికసభలు జరుపబడినవి. అచ్చటచ్చట కొన్ని గ్రంథాలయాలు, పాఠశాలలు (మోమినాబాద్ పాఠశాల మొ॥నవి) స్థాపించబడినవి. 1920 లో "నిజాం విజై" అను వారపత్రిక ఆరంభించబడినది గాని, దీనికి గూడా

పెద్దవ్యాప్తిలేదు. ఈ కాలమున మహారాష్ట్ర జాతీయనాయకులగు శ్రీవామన్ నాయకుగారు కొన్ని రాజకీయ, సాంఘిక సంస్థలు స్థాపించిరిగాని, వాని శాఖలు మహారాష్ట్రజిల్లాలలో స్థాపించుటకు ప్రయత్నాలు జరుగలేదు. 1930 సత్యాగ్రహ ఉద్యమంలో కొందరుయువకులు రాష్ట్రం వెలుపలికి బోయి పాల్గొని కారాగారవాసశిక్ష ననుభవించిరి.

తరువాత చాలకాలానికి తెలింగానాయందు ఆంధ్రమహాసభ జేయు చున్న కేంద్రీకృత ప్రయత్నాలచే ప్రభావితులై, మహారాష్ట్ర ప్రాంతం నందు గూడా ఒక సంస్థను నెలకొల్పుటకు అప్పటి మహారాష్ట్ర మితవాద నాయకులు నిశ్చయించినారు. ఈ నిశ్చయఫలితమే మహారాష్ట్రపరిషత్తు.

దీని ప్రథమసమావేశం, పర్తూరుయందు 1937 లో జరిగింది. అధ్యక్షుడు శ్రీ గోవిందరావునానల్‌గారు - ప్రథమపర్యాయం మహారాష్ట్ర మందున్న కార్యకర్తలందరు, ఒక కేంద్రసంస్థరూపంగా సమావేశమవుటయే ఈమహాసభయొక్క ప్రాముఖ్యత. మహాసభయందు పూర్తిగా ఆధిక్యత మహారాష్ట్ర మితవాదనాయకులది. మహారాష్ట్ర జిల్లాలలో వివిధ ప్రాంతాల నుండి ప్రతినిధులు పాల్గొన్నారు. ఈ ప్రథమమహాసభయందే అతివాద, మితవాదులకు, పౌరసత్వముల తీర్మానాలపై అభిప్రాయ భేదాలువచ్చినవి. రైతులపై ఋణబాధ తగ్గించుటకు, కొన్ని సవరణలతో భూమి పరాధీన చట్టముకు స్వాగతమిస్తూ, తీర్మానాలు అంగీకరింపబడినవి. సుప్రసిద్ధ జాతీయనాయకులు అగు శ్రీ స్వామీ రామనందతీర్థగారు కాన్ఫరెన్సు యందు పాల్గొన్నారు. మహారాష్ట్ర పరిషత్తుకీసమావేశంచే ఒక స్వరూప మొచ్చినప్పటికి, నిర్మాణరీత్యా ఇది ఆరంభదశయనియే చెప్పవచ్చును. నియమావళి అంగీకరింపబడలేదు.

ఈ మహాసభ జరిగినపిదప భారతదేశ రాజకీయాలలో గొప్పమా ర్పులు గలిగినవి. ఎన్నికలలో కాంగ్రెసుకు గలిగిన అఖండవిజయం ఫలి తంగా, వివిధ భారతరాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు స్థాపించబడినవి భారత సంస్థాన ప్రజలలోగూడా సంచలనం కలిగింది. ప్రజాస్వామిక హక్కులకై వివిధ సంస్థానాలలో పోరాటాలు ఆరంభమైనవి. హైద్రా బాదు రాష్ట్రం ఈపరివర్తనతో దూరంగా ఉండజాలుతుందా ?

నిజాం మహారాష్ట్ర ప్రాంతము వారియందుగూడా అఖిలభారత పరిస్థితుల ప్రభావము గనిపించినది. పూనాయందు నెలకొల్పబడిన శ్రీ వాఘ్మారేగారి "మరత్వాడా" పత్రిక చలనం గలుగజేసినది.

ఇదే సమయంలో హైదరాబాదు సంస్థానంలో హిందూమహమ్మ పోరాటాలు తీవ్రంగా చెలరేగినవి. హైద్రాబాదుయందు ధూలుపేటపోరాటం ఈ సమయమందు జరిగేదే, హిందూముస్లిం తగాదాలలో ఆర్యసమాజం హిందువులను సమీకరిస్తూ సంస్థానంలోని మహారాష్ట్ర ప్రాంతంలో బాగా బలపడింది.

మొదటిమహాసభ తదుపరి నిర్మాణరీత్యా మహారాష్ట్ర పరిషత్తు కార్య క్రమం, కొంత సభ్యత్వం జేర్పించుటదప్ప ఏమియు జరుగలేదు. అతి వాదులు ఐక్యమయ్యారు.

రెండోమహాసభ, 1938సవత్సరం జూన్‌మాసములో ఉస్మానాబాద్ జిల్లాలో లాతూరుయందు జరిగింది. ఆర్యసమాజమువారి సహాయముతో శ్రీ బారిష్టర్ శర్మగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. హిందూమహాసభ ఆర్యసమాజమువారు బలమైన సంఖ్యలో కాన్ఫరెన్సుకు హాజరైనారు.

ప్రభుత్వం ఈమహాసభకు ఆటంకాలు కలిగించింది. అధ్యక్షోపన్యాసం నుండి కొన్నిభాగాలు తొలగింప బడవలసివచ్చినది. ధూల్‌పేట అల్లరుల గురించి ఒక కమిటీవేసి. విచారణ జనిపించమను తీర్మానానికితాలూకాదారు అనుమతి ఇవ్వలేదు. అసమ్మతి ప్రకటించుటకు మహాసభ కార్యకర్తలు, మహావభను జరుపుటమాని వేశారు - విషయ నిర్ణయమహాసభ మాత్రం సమావేశమైంది. ఈసమావేశమునందు పరిషత్తునియమావళి అంగీకరింప బడింది. రైతుకార్మికుల అభివృద్ధికై ప్రయత్నించుటగూడా, పరిషత్తు ఆశ యాలలో ఒకటిగా నియమావళిలో అంగీకరింపబడినది. పౌరసత్వములు పొందుటకై సత్యాగ్రహము అరంభించవలయునని తీర్మానించబడినది. సత్యాగ్రహానికి వాలంటీర్లు, పరిషత్తుకు 15000 మంది ప్రాధమిక సభ్యులు, జేర్పించుటకుగూడా తీర్మానించబడినది.

ఈ సంఘటనల తదుపరి రెండుమూడు మాసములవరకు. స్థాయి సంఘమునందు జేసిన తీర్మానాలను అమలు జరుపుటకై పరిషత్తు కార్య కర్తలు బాగుగా కృషిచేశారు.

హైద్రాబాదు పట్టణమునందు మితవాదనాయకులచే ఆరంభింపబడిన స్టేటుకాంగ్రెసు సంస్థ తరఫుననే పౌరసత్వములకొరకై సత్యాగ్రహం ఆరంభించుటకు అంగీకరింపబడుటచే, మహారాష్ట్రపరిషత్తుద్వారా సత్యా గ్రహం జేయుట విరమించి, స్టేటుకాంగ్రెసుద్వారానే, సత్యాగ్రహము నడిపించబడింది, ఈ సత్యాగ్రహ ఉద్యమమునందు మహారాష్ట్రయువకులు

ప్రముఖపాత్రను వహించిరి. కాని పాల్గొన్న యువకులందరు పట్టణమధ్య తరగతికి చెందిన వారగుటచే, సత్యాగ్రహఉద్యమం గ్రామవాసులగు రైతులను కదిలించలేదు.

సత్యాగ్రహం ఆపబడిన తదుపరి ప్రభుత్వం స్టేటుకాంగ్రెసుసంస్థపై నిషేధము తొలగింపనిరాకరించి నప్పటికీ, కార్యకర్తలు తిరిగి మహారాష్ట్రపరిషత్తును పునరుద్ధరించి, దానిద్వారా పనిచేయలేదు. "విధాయక సమితి" అనుసంస్థ ను స్థాపించి, వానిద్వారా స్టేటుకాంగ్రెసు నిర్మాణ కార్యక్రమం జరిపారు.

యుద్ధప్రారంభమయిన కొంతకాలానికి మహారాష్ట్ర ప్రాంతమునందలి కార్యకర్తలలో ముఖ్యులగు ఔరంగాబాదు గ్రూపువారిని ప్రభుత్వం డెటిన్యూలుగా నిర్బంధించింది - వ్యక్తిగత సత్యాగ్రహ సందర్భమున శ్రీ స్వామీరామానంద తీర్థగారుకూడా నిర్బంధింపబడ్డాడు. ఏడుగురు మాత్రమే రాష్ట్రమునందు వ్యక్తిగత సత్యాగ్రహమునందు పాల్గొనుటకు గాంధీజీఅనుజ్ఞనిచ్చారు. ఈఏడుగురిలో ఐదుగురు మహారాష్ట్రప్రాంతంవారు.

స్వామీరామానందతీర్థగారు ఔరంగబాదుగ్రూపువారు నిర్బంధములో ఉన్న సమయములో, మహారాష్ట్ర పరిషత్తు మూడోమహాసభ శ్రీ కాశీనాధరావువైద్యగారి అధ్యక్షతన, నాందేడుజిల్లాలో ఉమ్రియందు 1941 మే మాసమువందు సమావేశమైనది - అధ్యక్షోపన్యాసమునందు బాధ్యతాయుత ప్రభుత్వం కోరబడింది. తీర్మానాలలో సంస్కరణలను నిరాకరిస్తూ జేసిన తీర్మానం, పౌరసత్వములు కోరుతూ అంగీకరించిన తీర్మానం ముఖ్యమైనవి. హిందూమహాసభగ్రూపువారు సంస్కరణల అంగీకరించుటకై వాదించిరిగాని, వారివాదన మహాసభచే త్రోసివేయబడినది. స్టేటుకాంగ్రెసుపై నిషేధం తొలగించుటకు, రైతుకార్మికుల కష్టాలు తొలగించుటకు తీర్మానాలు అంగీకరించబడినవి. ఈమహాసభయందు కమ్యూనిస్టులు వ్యక్తిగతంగా ఆహ్వానసంఘ కార్యక్రమమునందును, మహాసభయందును పాల్గొన్నారు. మహాసభతర్వాత కార్యక్రమము ఆర్గనైజర్లు లేకపోవుటచే సక్రమంగా జరుగలేదు. కొన్ని స్థానికకమిటీలు స్థాపింపబడినవిగాని, అవికాగితముపై కమిటీలుగానే ఉండిపోయినవి.

1940 డిశంబరుమాసమున స్వామి రామానందతీర్థగారు విడుదల గావింపబడిరి. వీరు మహారాష్ట్రప్రాంతమునందు పర్యటనచేసి, పరిస్థితులను

గ్రహించుచు, కార్యకర్తలకు ఉద్బోధించారు. స్టేటుకాంగ్రెసు కార్యకర్తలకు మహారాష్ట్ర పరిషత్తుయందు పనిచేయుటకు సలహాయిచ్చారు. కాని ప్రపంచప్రజలు నాజీరాక్షసి బారినుండి ప్రపంచాన్ని రక్షించడానికి పాటుబడుతున్నప్పుడు ఫాసిస్టుజపాను భారతదేశ సరిహద్దుమీద పొంచికూర్చున్నప్పుడు సైతం, యుద్ధవ్యతిరేకత చూపడంవల్ల ఆగస్టు 1942 సంఘటనలలో స్వామి రామానందతీర్థగారు మహారాష్ట్ర జాతీయపక్షమువారందరు అరెస్టుగావింపబడ్డారు. అదివరకే విడుదలగావింపబడిన ఔరంగాబాదు గ్రూపువారు రంగమునందున్నప్పటికి అట్టి తీవ్రపరిస్థితులయం దేమియు కార్యక్రమం సాగింపజాలలేదు. పరిస్థితుల తీవ్రతతగ్గినతదుపరి కొంతపని జరిగినప్పటికీ మహారాష్ట్ర పరిషత్తు నిర్మాణరీత్యా అభివృద్ధిజెందలేదు.

1943 వేసవికాలమున ఔరంగాబాదుయందు పరిషత్తు నాల్గోమహాసభ జరిగినది. అధ్యక్షులు శ్రీ శ్రీధరునాయకుగారు మహాసభయందు మొదటి పర్యాయం పరిషత్తు నియమావళి అంగీకరింపబడినది. అంతవరకు అమలుయందున్నదానికంటె ఎక్కువ ప్రజాస్వామిక పునాదులపై నియమావళి తయారుచేయబడింది. నియమావళిలోని క్రిందిసూత్రములు ముఖ్యమైనవి:

(1) ప్రాథమిక సభ్యత్వరుసుము నాలుగణాలు.

(2) ప్రతినిధులు ప్రాథమికసభ్యులచే ప్రత్యక్షముగా ఎన్నుకోబడుట.

(3) అధ్యక్షుడు, స్థాయిసంఘం ప్రతినిధులచేత నెన్నుకోబడుట.

(4) కార్యకారిణీసంఘం స్థాయిసంఘముచేత నెన్నుకోబడుట.

మహాసభయందు అంగీకరింపబడిన తీర్మానాలలో, బాధ్యతాయుత ప్రభుత్వం కోరుచు; ఆహారసమస్య పరిష్కారం గురించియు, హైద్రాబాదు ప్రజలు భావిభారతదేశముతో తమకుగల సంబంధం నిశ్చయించుకొనే హక్కుగలిగి యుండవలయుననియు, ప్రజలచే నిరాకరింపబడిన సంస్కరణలను బలవంతముగా అమలుబెట్టుచున్నందులకు నిరసనతెలపుచు, జేసిన తీర్మానాలు ముఖ్యమైనవి. మహాసభ తన ఫాసిస్టువ్యతిరేకవైఖరి, దేశరక్షణ అవశ్యకతను తీర్మానాలద్వారా స్పష్టపరిచింది.

ఈమహాసభతర్వాత, మహారాష్ట్రపరిషత్తు నిర్మాణరీత్యా బలపడింది. జిల్లాలన్నిటియందును పూర్తిగా సమయాన్నిచ్చి పనిజేయు ఆర్గనైజర్లు

నియమింపబడ్డారు. ప్రజల దైనికసమస్యలు, ముఖ్యముగా ఆహారసమస్యను గురించి, తీసుక పనిజేయుటచే పరిషత్తు కొంతవరకు రైతాంగముయొక్క దృష్టి నాకర్షించింది. పని అంతయు లెవీవసూళ్ళ సందర్భముననే జరిగింది. ఈ కార్యక్రమఫలితంగా పరిషత్తు సభ్యత్వం. 17000 వరకు పెరిగింది. కమ్యూనిస్టులు ఆర్గనైజర్లుగా ఉండి, జాతీయవాదులతోపాటు బాగుగా పనిజేసినారు.

మహారాష్ట్ర పరిషత్తులో కార్యకర్తలలో అధికసంఖ్యాకులు జాతీయవాదులు. హైదరాబాదు సంస్థానంలో ఆహారసమస్య తీవ్రతరమవుతూ ఉంది. దీన్ని పరిష్కరించడానికి ప్రభుత్వం తననిరంకుశ పద్ధతులలోనైనా పట్టణాలలో చౌకడిపోలు రేషనింగుపెట్టుట, రైతులకు అధికోత్పత్తికి బంజర్లు అప్పులు ఇచ్చుట, రైతులనుండి లెవీధాన్యం వసూలుచేయుట, మొదలైన పనులను ప్రారంభించింది. ప్రజాసహకారంతో పైకార్యక్రమం ప్రభుత్వోద్యోగులు సక్రమంగా అమలుజరిపేలా చేయడానికిబదులు, మహారాష్ట్ర పరిషత్తు కార్యకర్తలు ప్రభుత్వాన్ని విమర్శించడంలోనే ప్రొద్దుబుచ్చారు. అట్లుగాక ఆంధ్రమహాసభ కార్యకర్తలు ప్రభుత్వంచేసిన శాసనాలలోనే ప్రజల కనుకూలమైనవాటిని, ప్రజాసమీకరణద్వారా అమలు జరిపించేలా చేశారు. ఆచరణసాధ్యమైన సూచనలిస్తూ, ఆహారసమస్యను పరిష్కరించడంలో తమబాధ్యతను నెరవేర్చారు. ప్రభుత్వంమీఁగ శుష్కవిమర్శనలతో ప్రొద్దుబుచ్చలేదు. అందుచే ఆంధ్రమహాసభ అభివృద్ధి అవడం ప్రభుత్వానికి ఇష్టంలేకపోయినా, ఆంధ్రమహాసభమీద తీవ్ర నిర్బంధవిధానం ప్రయోగించలేకపోయింది. స్థానికాధికారులు కొంతమంది కార్యకర్తలమీద కేసులుపెట్టి జైలుకుపంపారు. కొన్ని కేసులు కోర్టులో కొట్టివేయబడినవి, కాని మహారాష్ట్ర పరిషత్తు కార్యకర్తలు పైవివరింపబడిన 'నెగిటివు' పంధాను అవలంబించుటచే, అభివృద్ధి చెందుతున్న మహారాష్ట్ర పరిషత్తుపై దెబ్బ కొట్టుటకు ప్రభుత్వానికి అవకాశం లభించింది. ఐదోమహాసభకై ఎన్నుకోబడిన అధ్యక్షులగు శ్రీమాన్ చందుపహాడేగారిని, ప్రధానకార్యదర్శియగు శ్రీ గోవిందదాసు ష్రాఫును, ముఖ్యకార్యకర్తలగు ఎనమండుగురిని, వారుండు పట్టణాలలోనుండి బయటికి వెళ్ళకుండా ప్రభుత్వం నిషేధించింది.

1944 వేసవిలో జరుగబోయిన మహాసభ ఐదోసమావేశముగూడా ప్రభుత్వం నిషేధించింది.

మహాసభ నిషేధింపబడినప్పటికిని, స్థాయిసంఘం సమావేశమై, పరిషత్తు కార్యక్రమం సాగించుటకై నిశ్చయించింది. స్థాయిసంఘంచే అంగీకరింపబడిన తీర్మానాలలో ఆహారసమస్యపై గావింపపడిన తీర్మానం పరిషత్తుపై కార్యకర్తలపై పెట్టిన నిషేధానికి వ్యతిరేకంగా అసమ్మతి దెలుపుచు జేసిన తీర్మానాలు పేర్కొనదగినివి.

## నేటి పరిస్థితి

ముఖ్యమైన ఆర్గనైజర్లు దిగ్బంధమునందుంచబడుటచే, ప్రస్తుతం కార్యక్రమం కొంత కుంటుబడినది. నిషేధాలకు వ్యతిరేకంగా ఏమియు ఆందోళన జరుగలేదు.

మహారాష్ట్ర పరిషత్తుయందు నేడు ప్రధానముగా జాతీయవాదులు, కమ్యూనిస్టులు పనిచేస్తున్నారు జాతీయవాదులు బలంగాఉన్నారు. ఇంత వరకు మహారాష్ట్ర పరిషత్తు గొప్ప ప్రజాఉద్యమంగా అభివృద్ధిజెందలేదు. ఇందుకు రెండు ప్రధానమైన కారణాలున్నాయి.

(1) పరిషత్తు కార్యకర్తలందరు పట్టణవాసులగు మధ్యతరగతి కార్యకర్తలు - వీరికి సాంఘికంగా రైతులతో సంబంధంలేదు. మహారాష్ట్ర ప్రాంతంనందు రైతాంగమగు మరాఠాకులంనుండి కార్యకర్త లెవ్వరును దీనియందు లేకపోవుటచే. పరిషత్తుకు రైతాంగంతోగల సంబంధం దృఢంగాలేకుండా పోవుచున్నది. మహారాష్ట్రపరిషత్తుయొక్క నేటి కార్యకర్తలు ప్రయత్నంచేసి, మరాఠా యువకులను పరిషత్తులోకి ఆకర్షించాలి.

(2) జాతీయవాదులు, హిందూ ముస్లిం ఐక్యత ప్రాధాన్యతను గుర్తించలేదు - రాష్ట్రంలో మరాఠ్వాడాయందు ముస్లింలు ఎక్కువ సంఖ్యలో నున్నారు. హిందూముస్లిం ఐక్యత ప్రాధాన్యత గురించక పోవుటచే కార్యక్రమంనందు నెగెటివుపంథా అవలంబించబడుచున్నది. ఈ బలహీనతల అండగా తీసుకొని ప్రభుత్వం పరిషత్తు అభివృద్ధి జెందకుండా దెబ్బకొట్టుచున్నది.

పై నుదహరింపబడిన రెండు బలహీనతలను దూరముజేసినచో మహారాష్ట్ర పరిషత్తు బ్రహ్మాండమైన ప్రజాసంస్థగా అభివృద్ధిజెందే అవకాశ మున్నది.

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ నెం. | | లైను నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | క్రి | 9 | అటలీ | అటవీ |
| 2 | పై | 10 | వీనిరో శిస్తువసూలు ప్రభుత్వో ద్యోగులు | వీనిలో ప్రభుత్వోద్యోగులు |
| 13 | క్రి | 6 | అనధికారసభ్యులు తమమద్దతు | అనధికారసభ్యులు తమముద్దతు |
| 15 | క్రి | 6 | అందువల్ల విదేశ.... | అందువల్ల ఏ దేశ.... |
| 16 | పై | 7 | ప్రజాసామాన్యాన్ని.... | (ఈమాట తీసివేయాలి) |
| 23 | పై | 7 | జట్లుగూడ | ఓట్లుగూడ |
| 45 | పై | 8,9 | మైనారిటీగానే ఉంటారు | మైనారిటీగానే ఉంచుతారు |
| 50 | క్రి | 14 | స్టేటు ప్రతినిధిసభకు | స్టేటు ఆర్య ప్రతినిధిసభకు |
| 51 | పై | 8 | అరవమూడు | అరవముదు |
| 61 | పై | 17 | స్థానిక సంస్థలకు.... | (ఈమాట తీసివేయాలి) |
| 68 | క్రి | 8 | సమ్మె చేయించారు | సమ్మె చేయించడానికి |
| 75 | పై | 13 | తీసుకురాబడింది | కల్పించబడింది |
| 76 | పై | 8 | ప్రభువు రాజ్యాంగ | ప్రస్తుత రాజ్యాంగ |
| 79 | పై | 14 | అయ్యంగారు సూచించింది | అయ్యంగారుకమిటీ సూచించింది |
| 90 | క్రి | 10 | 5 3 నిష్పత్తి ఉండాలి | 5:3 నిష్పత్తి ఉండాలి |
| 91 | క్రి | 10 | వచ్చిన పిచ్చివాళ్ళను | పిచ్చివచ్చినవాళ్ళను |
| 103 | పై | 14 | ఇవి సంస్థానం.... | (ఇవి అనే మాట తీసివేయాలి) |
| 108 | పై | 14 | (సిటీ కాలేజీ ప్రొఫెసరు) | (సిటీ కాలేజీ మాజీ ప్రొఫెసరు) |
| 111 | పై | 2 | పనిచేయగలవనే.... | పనిచేయగలమనే.... |
| 118 | పై | 16 | జపాను దాడినుండి దేకోన్ని | జపాను దాడినుండి దేశాన్ని |
| 123 | క్రి | 14 | ఆంధ్రమహాసభలు ప్యాసుచేస్తున్న.... | (ప్యాసుచేస్తున్న అనేమాట తీసివేయాలి) |
| 147 | క్రి | 10 | ఈ సవరణ దీర్ఘచర్య | ఈ సవరణ దీర్ఘచర్చ |
| 150 | క్రి | 9 | మిడిల్‌స్కూళ్ళలోనైనా | హైస్కూలు వరకైనా |
| 154 | క్రి | 14 | రచ్చీతానీ | రబ్బీతాబీ |
| 190 | పై | 6 | తోలి పేదరైతులకు | లేని పేదరైతులకు |
| 197 | పై | 7 | పాయిదాలు | పాయెగాలు |

("పై" అంటే పేజీ పైనుంచి. "క్రి" అంటే క్రిందనుంచి లెక్కపెట్టాలి)

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ — 1944 సెప్టెంబరు.

214

# నేటి సోవియట్ యూనియన్

"సోవియట్ రష్యాపై ఇదివరకు వెలువడ్డ పుస్తకాలన్నిటికంటె యీ పుస్తకంలో రష్యాను గురించి సాకల్యంగానూ, సమగ్రంగామా వివరించబడింది.

"విప్లవానికి పూర్వపు రోజుల్లో జారుకాలంనాటి పరిస్థితులను చి[illegible] బోల్షివిక్కులు అధికారంచేపట్టిన ఘట్టంతో గ్రంథాన్ని పూర్తిచేసే మామూలు పాతపంథాను గ్రంథకర్త స్వస్తిచెప్పాడు. చరిత్రలోకల్లా మహోన్నతమైన మానవసమస్యను గురించి రచించటంలో గ్రంథకర్త సరికొత్త పంథా నవలంబించాడు.

"గ్రంథకర్త తన పుస్తకాన్ని 1 నూతన వ్యవస్థ 2 నూతన సంస్కృతి 3 నూతన జాతీయత అనే మూడు విభాగాలుగా విభజించాడు తర్వాత నూతన రాజ్యాంగ విధానమూ, పంచవర్ష ప్రణాళికలూ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలూ, సమిష్టి సంపదలు అనే విషయాలను గురించి వ్రాయబడింది. రెడార్మీని గురించి ప్రత్యేకంగా ఒక అధ్యాయం ఉంది. తుది భాగంలో సోవియట్ యూనియన్‌లో వివిధజాతుల క్షేమాలు, స్వయంనిర్ణయహక్కు ఎలా పరిష్కరింపబడ్డవో వివరించబడింది.

"అందరికీ అర్థమయ్యే సులభశైలిలో భాష బహు చక్కగా ఉంది."

"ఇండియన్ ఎక్స్‌ప్రెస్"

వెల 2—0—0

ప్రజాశక్తి కార్యాలయం బెజవాడ

ప్రజాశక్తి ప్రెస్, బెజవాడ.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPROICHHS | Date | 05/04/23 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | 215 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Mounika | Cutting By | Mouni |
| Scanned By | p-pragathi | Pages | 221 |
| Quality Checking | prathyu. | | |